శ్రీరామ శ్శరణం మమ

# ఆశ్చర్య రామాయణము

## అరణ్యకాణ్డము

### ఆంధ్రతాత్పర్యసహితము

ఇత్యాది

శ్రీరామకథావైచిత్ర్యములఁ దెలిసికొనఁ గోరువారల
కత్యంతోపయుక్తమగునట్టుల

పామఱ్ఱు గ్రామనివాసులును తెనాలి హిందూహైస్కూలులో
ప్రధాన సంస్కృతాధ్యాపకులును, రామాయణ కేసరీత్యాది
బిరుదాంకితులును నగు బ్రహ్మశ్రీ
లక్కావఝ్ఝుల వేంకటకృష్ణశాస్త్రిచే

నానావిధ రామాయణములనుండి సమకూర్పఁబడి పండితులచేఁ
పరిష్కృతమై గ్రంథకర్తచేఁ బ్రకటింపఁ బడినది.

కాపీరైటు రిజిష్టర్డు] ౧-౫-౧౯౪౦ [వెల రు ౨-౦-౦



రామాయణకేసరీత్యాది బిరుదాంకితులగు

బ్రహ్మశ్రీ లక్కావఝ్ఝుల వేంకటకృష్ణశాస్త్రిగారు

గ్రంథరచయితలు:

# కృతిసమర్పణమ్



శ్లో॥ శ్రీమద్భద్రగిరౌ నివాస మకరో చ్ఛ్రీరామచంద్రప్రభు
సీతాలక్ష్మణసంయుత శ్శ్రితజనా న్సంతారయ న్యోఽవనౌ
దాసోఽహం తు సమర్పయామి చరణద్వంద్వే శుభే తస్య వై
శ్రేయస్కమనయా సుమాంజలినిభం గ్రంథం మదీయం త్విమం

# విజ్ఞప్తిః

భో భో మహాశయాః మామకీనా మిమాం విజ్ఞప్తి మవధత్తే
త్యభ్యర్థయే.

ఇతఃపురా సంపుటచతుష్టయం ముద్రాప్య ప్రకాశ్యం
నీత మితి తత్రభవద్భి ర్విదిత మేవ. అధునా శ్రీరామకర్తృ
కారణ్యప్రవేశకథారంభక పంపాసరోభిగమనపర్యంతకథాసంవ
లిత మరణ్యకాండాత్మకం పంచమం సంపుటం చ ముద్రాప్య
భక్తజనసమక్షే సమర్ప్య చాహ మద్యాత్మానం కృతా
ర్థతా మనయ మితి వక్తు మవకాశసంభవేన మహా నానంద
స్సమజని - అవశిష్టభాగా అపి ద్రుతం ముద్రాపితా భవేయుః,
అంతరేఽంతరే త్వనిర్వచనీయకారణై రేతద్భాగముద్రాపణే
కాలవిలంబోఽభూ దితివక్తు మహమేవ లజ్జితో భవామి. అస్మి
న్సంపుటేపి ప్రయోజనీయా న్కథావిశేషా ననేకా న్సంగ్ర
థ్యాంధ్రతాత్పర్యంచ విలిఖ్య విశేషత స్స్వయంకృతా
న్కాంశ్చి దేవాన్యకృతాన్ శ్లోకా నుపనిబధ్య సులభయా
శైల్యా సంగ్రథితోఽయం గ్రంథ స్సర్వేషా మాదరణీయో
భవే దిత్యభిప్రైమి. అస్మిన్గ్రంథే ముద్రణప్రమాదా న్స్వప్ర
మాదాద్వా యది దోషా దృశ్యేరన్, గుణదోషతత్త్వావలోక
నేన తా న్విధాయ శుద్ధాన్, సంపఠ్యచ, మామకీనాపరాధం
క్షమధ్వ మిత్యభ్యర్థయే - ఏతద్గ్రంథముద్రాపణార్థం హస్తావలం
బనప్రదానాం చతుర్విధపోషకపదాశ్రితానాం శ్రీరామచంద్ర
స్సకలశ్రేయాంసి వితీర్య సర్వదా తా న్రక్షతా దితి సప్ర
శ్రయం శ్రీరామచంద్రం సంప్రార్థ్య మయా విరమ్యతే.

ఇత్థం గ్రంథరచయితా,

లక్కావఝ్ఝుల వేంకటకృష్ణశాస్త్రీ.

# విజ్ఞప్తి

ఓ మహాశయులారా! నాదు విజ్ఞప్తి నాలకింపుఁడని ప్రార్థించెదను.

ఇంతకుఁ బూర్వము నాలుగు సంపుటములను ముద్రించి ప్రకటింపఁబడినది యనువిషయము మీకుఁ దెలిసియే యున్నది. శ్రీరామచంద్రమూర్తి దండకారణ్యమును బ్రవేశించినది మొదలు పంపాసరోవరమునకు వెడలుట వరకు గల యరణ్యకాండ రూపమగు నైదవసంపుటము నిప్పుడు ముద్రింపించి భక్తజన సముఖమున సమర్పించి నేను కృతార్థుఁడ నైతినని చెప్పుట కవకాశము సంభవించుటచే గొప్పయానందము కలిగెను. శేషించిన భాగములుకూడ శీఘ్రముగ ముద్రింపఁ బడగలవు. మధ్యమధ్య ననిర్వచనీయకారణాంతరముల వలన నీభాగము ముద్రించుటలో నాలస్యము సంభవించె నని చెప్పుకొనుటకు నేనే లజ్జించుచుంటిని. ఈ సంపుటము నందును బ్రయోజనీయములైన యనేక కథావిశేషములను సమకూర్చియు నాంధ్రతాత్పర్యమును వ్రాసియు నెక్కుడుగ స్వయంకృతములగు శ్లోకములను, స్వల్పముగ నితరశ్లోకములను సమకూర్చి సులభశైలిలోఁ గూర్పఁబడిన యీ గ్రంథ మందరకు నాదరణీయము గాఁగలదని యభిప్రాయపడుచుంటిని. ఈ గ్రంథమున ముద్రాప్రమాదమువలనఁ గాని నాప్రమాదము వలనఁగాని యేమైన దోషములు కన్పించినచో గుణదోషపత్రికను (తప్పొప్పులపట్టికను) జూచి సవరించుకొని చదువుకొని నా యపరాధమును క్షమింప వేడెదను.

ఈ గ్రంథముద్రణమునకై నాకుఁ జేయూత నొసగిన చతుర్వేద పోషకులకు శ్రీ రామచంద్రమూర్తి సకల శ్రేయస్సులను గలుగఁజేసి వారల నెల్లప్పుడు రక్షించు గాక యని శ్రీ రామచంద్ర మూర్తిని ప్రార్థించుచు విరమించుచుంటిని.

ఇట్లు, గ్రంథరచయిత,

లక్కావఝ్ఝుల వేంకట కృష్ణశాస్త్రి

# కృతజ్ఞత

## మహారాజ రాజశ్రీ దివాన్ బహద్దూర్
## నంబూరు గోపాలకృష్ణారావు
### బి. ఏ., బి. యల్., రిటైర్డు డిస్ట్రిక్టు అండ్ సెషన్సు జడ్జీగారు. బెజవాడ.

### మహారాజపోషకులు, రు 116—0—0

వీరలు కృష్ణామండల వాసులైనను చిరకాలమునుండి వీరలు జిల్లాజడ్జీ పదవియందుండి యనేక మండలములయందు ప్రధాన న్యాయాధిపతిగా (జిల్లా జడ్జీగా) నుండుటచే మద్రాసు ప్రెసిడెన్సీలో వీరి నెరుగని వారలుండరనుట యతిశయోక్తి కానేరదు. వీరలు న్యాయవాద పరీక్షయందు తీర్ణులైన వెంటనే మేలూరులో 6 సంవత్సరములు న్యాయవాదిగానుండి ప్రభుగౌరవమును ప్రజాదరమును సంపాదించుటయేకాక మునిసిపల్ కౌన్సిలర్, డెలిగేటు చేర్మనుగాకూడ నుండి పరోపకారమునకుకూడ బాలుపడిన మహాపురుషులైయుండిరి. పిమ్మట నప్రయత్నముగ ప్రభుత్వమువారిచే కోర్టు మునసబుగా నియమింపబడి నిరంకుశ ప్రతిభావిశేషముచే నా కాలమున వీరలు పోన్నపల్లి యగ్రహారమునుగూర్చి యిచ్చిన తీర్పు ప్రివీకౌన్సిల్ లో శ్లాఘింపబడుటయేకాక వీరిశక్తిసామర్థ్యములు దశదిశల వ్యాపింపజేయగలిగె. పిమ్మట నచిరకాలముననే వీరలు సబ్ జడ్జీగా ప్రభుత్వమువారిచే నియమితులై కొలది కాలమా పదవియందుండి వీరి సుగుణసంపదచే నచిరకాలముననే ప్రభుత్వమువారిచే వీరలు జిల్లాజడ్జీగా నియమితులై తంజావూరు, కడప,

గుంటూరు మండలములయందు (జిల్లాలలో) జిల్లాజడ్జీపని చేయుచు ప్రభుగౌరవము ప్రజాదరము సంపాదించి రిటైరైరి. పిమ్మటగూడ ప్రభుత్వమువారు దివానుబహాద్దూరు బిరుదుచే వీరిని భూషించుటయేకాక గవర్నమెంటు స్పెషల్ ట్రిబ్యూనల్‌లో ఒకరినిగా నియమించికూడ గౌరవించిరి. ఇంక వీరికి వైదికమునందలి శ్రద్ధాభక్తి విశేషములు వర్ణింప నశక్యములు. భాష్యశ్రవణముచేసి యెల్లప్పుడు మననముచేయువారలై యుండిరి. ఇట్టి వీరలు తమ కుమారులు హైకోర్టులో న్యాయవాదులుగా నున్నందున మద్రాసులో దఱచుగానుండినను సొంతభవనము బెజవాడలో నుండుటచే నిచ్చటికి వచ్చినపుడు వారికి నేను రచించిన యీ యాశ్చర్య రామాయణమును నచ్చటచ్చట వినిపింప చాల సంతసించి వారి సదభిప్రాయము వ్రాసి యిచ్చుటయేకాక మహారాజపోషకులుగా నుండి తమ యుదార స్వభావమును వెల్లడించిన దాతలుకూడనై యుండిరి. ఇట్టి సుగుణభూషితులగు వీరిని, వీరి కుటుంబమును శ్రీరామచంద్రమూర్తి సకల శ్రేయోభివృద్ధుల నొసంగుచు సర్వదా రక్షించుగాత యని కోరుచున్నాడను.

ఇట్లు గ్రంథరచయిత,

లక్కావఝ్ఝుల వేంకటకృష్ణశాస్త్రి.

# కృతజ్ఞత

## మ॥ రా॥ శ్రీ మానూరు వెంకట కృష్ణారావుగారు

భూస్వాములు, సంపన్నులు, నందివెలుగు.

మహారాజపోషకులు, రు 116—0—0

వీరలు గుంటూరుజిల్లా తెనాలి తాలూకా నందివెలుగు గ్రామవాసులును, గొప్ప శ్రీమంతులును, గొప్ప భూస్వాములును, నిగర్వ శిరోమణులును, దేవబ్రాహ్మణ భక్తిపరులును నై యుండిరి.

వీరి యైశ్వర్యమునకుఁ దగిన యౌదార్యము వీరికి భూషణమై యుండెను. వీరియైశ్వర్యము వీరి దత్తతతండ్రిగారయిన మానూరు కృష్ణారావు పంతులుగారి నాటినుండియు నున్నందున వీర లాగర్భశ్రీమంతులని చెప్పదగియుండిరి. వీరలు బంధుజన పోషకులునుగూడ నైయుండిరి. మఱియు, విచిత్ర సౌధాదులను నిర్మించియు, ఆరామములను వృద్ధిచేసియు, నింకి నెన్నియో యైహిక భోగముల ననుభవించుటయే కాక యాముష్మిక కార్యములకుఁగూడ దోడ్పడు వారలయియుండిరి. వీరి ధర్మపత్ని సుగుణభూషితురాలును, జ్ఞానభక్తి వైరాగ్య సంపన్నురాలు నగుటచే వీరుచేయు ధర్మములకు సహాయకారిణియై యుండెను. ఇంతియేకాక వీరి దత్తపుత్రుఁడును

పిత్రాజ్ఞాపరిపాలకుఁ డగుటచే వీరికి శోభాయమానముగా నుండెను.

ఇట్టి వీరలు నేను రచించిన యీ యాశ్చర్యరామాయణమునకు నూట పదారు రూప్యములను విరాళము నిచ్చి మహారాజపోషకులుగా నుండి తమ యుదారస్వభావమును వెల్లడించిన దాతలు. ఇట్టి వీరిని వీరి కుటుంబమును శ్రీరామచంద్రమూర్తి సకల శ్రేయోభివృద్ధుల నొసంగి సర్వదా రక్షించుగాత యని కోరుచున్నాఁడను.

ఇట్లు గ్రంథరచయిత,
లక్కావఝ్ఝుల వేంకటకృష్ణశాస్త్రి.

---

# ఆశ్చర్యరామాయణమున అరణ్యకాండపోషకులవివరము

## మహారాజపోషకులు

మ॥రా॥శ్రీ చెరువు శ్రీరామశాస్త్రిగారు, అగ్రహారికులు -
గ్రామాధికారులు, కలవపూడి అగ్రహారం. 58-0-0
,, బచ్చు శ్రీరాములుగారు, క్లాతుమర్చంట్సు బెజవాడ. 30-0-0
,, పప్పు వెంకయ్యగారు, సపన్నులు మర్చంట్సు బెజవాడ. 25-0-0
,, పచ్చా పాపయ్యగారు, కంట్రాక్టరు,
Honarary Bench Magistrate, Bezwada 25—0—0
,, ఇరుగంటి రామచంద్రరావుగారు,
అగ్రహారీకులు - దుద్దుపూడి అగ్రహారం, 30-0-0
,, రావినూతుల వెంకట సుబ్బయ్యగారు, మహాభక్తులు-సత్ర
దేవాలయాదినిర్మాతలు, అన్నప్రదాతలు-అంగలకుదురు. 20-0-0
,, బొబ్బా సుబ్బయ్యగారు, రామభక్తులు
పరమాత్మాశ్రమం - పెనమలూరు. 20-0-0
,, మిట్టపల్లి కోటయ్యగారి కుమారుడు వీరయ్యగారు,
రామభక్తులు - పల్లెపాడు - నైజాం. 20-0-0

## రాజపోషకులు (రు 15-0-0)

మ॥రా॥శ్రీ గొల్లపూడి నరసింహారావుగారు.
First class Bench Magistrate, Bezwada.
,, చివుకుల శ్రీరామ శర్మగారు, సంపన్నులు - ఒంగోలు.
,, విష్ణుభట్ల రామయ్యగారు, సంపన్నులు - బందరు.
,, వెన్నపాల లక్ష్మీ నరసింహంగారు, సంపన్నులు - గుంటూరు.
,, అడుసుమిల్లి వెంకటనారయ్యగారు, భూస్వాములు - నెప్పల్లె.
,, పెద్దిరాజు వెంకటకృష్ణయ్యగారు, సంపన్నులు - ఈమని
,, తిమ్మరాజు వెంకటరావుగారు, సబుకోర్టునాజరు - బెజవాడ.
,, గునుపూడి సుబ్బారావుగారు, మెడికల్ షాపు - బెజవాడ.
,, కంచర్ల రామబ్రహ్మంగారు, సపన్నులు - విశాఖపట్టణము.
,, సూరంపల్లి విజయరామయ్యగారు, Bank Secretary విజయనగరం.
,, మాజేటి సతయ్యగారు, రిటైర్డు షరాబుగారు - నందిగామ.
,, జయంతి ప్రకాశంగారు, జగ్గాపురం - అగ్రహారం.

## ప్రధానపోషకులు (రు 10-0-0)

మ॥రా॥శ్రీ పెనుగంచిప్రోలు దేవస్థానంవారు. పెనుగంచిప్రోలు.

,, నారాయణం వెంకటాచార్యులుగారు, జాగర్లమూడి.

,, ఊరా శ్రీరాములు శెట్టిగారు, క్లాతుమర్చంటు – మద్రాసు.

## శా శ్వ త పో ష కు లు

| | | |
|---|---|---|
| చోడవరపు దేవశాస్త్రి పంతులుగారు, | సంపన్నులు – | బెజవాడ |
| ములుకట్ల లక్ష్మీనరసింహంగారు, | బాంకుక్యాషియరు | ,, |
| దశిక సూర్యనారాయణగారు | స్లాబుకంపెని | ,, |
| యల్లరావ,మామహేశ్వరరావుగారు | ప్రొప్రయిటర్ | ,, |
| వోగంటి వెంకటరత్నంగారు | సంపన్నులు | ,, |
| కసిలంక వెంకటప్పగారు | స్లాలుకంపెని | ,, |
| మాజేటి హనుమంతరావుగారు | సంపన్నులు | గుంటూరు |
| ఏకా ఆంజనేయులు గారు | ,, | ,, |
| గొల్లపూడి సుబ్బారావు గారు | ,, | ,, |
| వేమూరి శివావధానులు గారు | ,, | ,, |
| కుదురవల్లి సూర్యరామలక్ష్మయ్యగారు | ,, | నిమ్మకూరు |
| బొమ్మిరెడ్డి సుబ్బారెడ్డిగారు | ,, | పామర్రు |
| పుల్లకంటి సత్యనారాయణగారు | ,, | మధిర |
| శివరాజు వీరభద్రరావుగారు | ,, | మడిపల్లి |
| దేవూరి కేశవరావుగారు | ,, | జేడుగుపాడు |
| బొమ్మకంటి రంగారావుగారు | ,, | బొమ్మగిల్లు |
| కొండపల్లి సీతారామారావుగారు | ,, | ,, |
| శ్రీధర రంగారావుగారు | ,, | ఖమ్మంమెట్టు |
| ఆమూరి చలపతిరావుగారు | ప్రొప్రయిటర్ | పొన్నూరు |
| మేళ్ళచెరువు పుండరీకాక్షుడుగారు | ,, | ,, |
| గుగిలాల రామచంద్రరావుగారు | భూస్వాములు | తెల్లాప |
| మంత్రిప్రగడ రాఘవరావుగారు | జమీందారు | లింగగిరి |

పై పోషక మహాశయులు విరాళముల నిచ్చి నాయుద్యమమునకుఁ దోడ్పడుచున్నారు గాత యని కోరుచున్నాడను.

---

# విద్వత్ప్రభువుల యాశయము

రామాయణకేసరీత్యాది బిరుదాంకితు లగు బ్రహ్మశ్రీ లక్కావఝ్ఝుల వేంకటకృష్ణశాస్త్రిగారిని సుమారు నెలదినముల నుంచి మాత్ర మెఱుగుదును. నేను యీ బెజవాడగ్రామములో మూడుమాసములనుండి యుండుట తటస్థించుటచే యిచ్చట నున్న విద్వాంసులను, పండితులను, విచారించినంతలో వీరిని వీరియొక్క విద్యామహిమమును శాస్త్రజ్ఞానమును గురించియు యెక్కువగా చెప్పిరి. తదుపరి వారివలన వారు వ్రాసిన ఆశ్చర్యరామాయణములోని అచ్చటచ్చట కొన్ని భాగములను వినుభాగ్యము తటస్థించినది. నేను వినినంతవరకు వీరు వ్రాసి ప్రచురపఱచుచున్న రామాయణములోని విషయములు అపూర్వమైనవిగా నుండుటయేకాక భక్తిజ్ఞానవైరాగ్య ధర్మ బోధకములుగాను, మనస్సుకు ఆహ్లాదము కలుగచేయునవిగా నున్నవి. శ్రీమద్వాల్మీకి రామాయణములో వ్రాయబడని అనేక పూర్వగాధలు ఉపనిషదంతర్గతములైన శ్రీరామనామ గత రహస్యార్థములు, వేదాంతసంబంధమైన తత్త్వవిచారణ మొదలుగా గల యిహపరసాధకములైన, అనేక విషయములు సంస్కృతశ్లోక రూపముగాను, అందుకు తెలుగుతాత్పర్య సహితముగాను వ్రాయబడినవి. కేవల విద్వాంసులకే కాక యే మాత్రము తెలుగు చదువుటయందు శక్తిగల ప్రతి స్త్రీ పురుషులు, బాల బాలికలు చదివి అర్థము చేసుకొని మన

సంతోషమును బొందదగినటుల వ్రాయబడినవి. ఈ గ్రంథము సకల జనాహ్లాదకరమై సకల శ్రేయోదాయక మగుననుటకు సందేహము లేదు. ఇట్టి గ్రంథమును వ్రాయుటలో బ్రహ్మశ్రీ కృష్ణశాస్త్రిగారి యొక్క పాండిత్య శక్తి సామర్థ్యములు శ్రద్ధ శ్రమ మిగుల శ్లాఘనీయములు. సకలజనులు ఈ గ్రంథమును జదివి సకలశ్రేయస్సులను పొందుదురుగాక. 9 భాగములుగా అచ్చుకాబడవలసినట్టి యీ యుద్గ్రంథము 5 సంపుటములు మాత్రము ఇప్పటికి ముద్రితములైనవి. శేషించిన 4 సంపుటముల ముద్రణమునకు ఆస్తికవరేణ్యులు పూర్ణమైన ద్రవ్య సహాయముచేసి శీఘ్రములో యావద్గ్రంథము వెలువడుటకు ప్రయత్నించెద రని నమ్ముచున్నాను.

దివాన్ బహద్దూర్,
వంటూరు గోపాలకృష్ణారావు,
బి. ఏ. బి. ఎల్.,
డిస్ట్రిక్టు అండ్ సెషన్సుజడ్జి,
(రిటైర్డు).

బెజవాడ
12-5-40.

# విద్వదాశయః

బ్రహ్మశ్రీ లక్కావఝ్ఝుల వేంకటకృష్ణశాస్త్రిభిర్విరచితో౽యం గ్రంథస్సారార్థక నామధేయ ఇతి గ్రన్థదర్శనేనైవ స్ఫుట మవసీయతే. తత్ర తత్పాత్ర పూర్వజన్మవృత్తాంతాదికం ప్రమాణపూర్వకం నిరూపితం. సకల రామాయణ ప్రదర్శిత రామచరితం సర్వం సమాకలయ్య, ఏకత్ర నివేశనేన సర్వరామాయణసార సంగ్రహ ఇత్యపి వక్తుం శక్యతే. ఏతాదృశవిశేష విరాజమానో౽యం గ్రంథరాజో మద్దృష్టి గోచరీభూతః. గ్రంథేస్మింస్తత్ర తత్ర పాత్ర పూర్వజన్మాదివృత్తాంత విలోకనేన మహానానందస్సముజాయత. గ్రంథస్యాస్య పఠనేన గ్రంథకర్తుర్యాదృశః ప్రయాసో౽నుభూత స్తత్ప్రయాసం వర్ణితుం న కో౽పి సమర్థ ఇత్యత్ర న కశ్చిదతిశయః. గ్రంథశ్శైలీచ మృదుమధురపదలాలిత్యవతీ తత్తద్రస పరిస్ఫుటానురూపశబ్ద యోజనేన శ్రోతౄణాం తాదాత్మ్యకరణే సమర్థా చ,

ఏతాదృశవిశేషవిరాజితస్యాస్య గ్రంథస్య ముద్రణ కార్యం దేశీయ మహోదయాయత్తం. అతో దేశీయ మహోదయాశ్చాస్య ముద్రణార్థం సాహాయ్యం శీఘ్రం కుర్వంత్వితి ప్రార్థ్యంతే. తదైవ గ్రంథకర్తుః ప్రయాసః దేశీయ మహోదయాశ్చ ధన్యా భవంతి.

గ్రంథో౽య మారచయితా చ శ్రీరామచంద్ర ప్రసాదేన చిరం జీయాస్తా మిత్యభ్యర్థ్యతే.

ఇతి,

శ్రీపాద వేంకటరమణ దైవజ్ఞశర్మా,
వేగాయమ్మపేట సంస్థాన సిద్ధాంతీ.

---

# విద్వదాశయము

బ్రహ్మశ్రీ లక్కావఝ్ఝుల వెంకటకృష్ణశాస్త్రిగారిచే రచింపబడిన యీ యాశ్చర్యరామాయణము సార్థక నామధేయము గలదని గ్రంథమును జూచుటలోననే స్పష్టముగా గలదు. ఆయా పాత్రల పూర్వజన్మ వృత్తాంతములు మొదలగునవి ప్రమాణపూర్వకముగ నిరూపింపబడినవి. సకల రామాయణములలో గల్గు రామచరిత్రలను నన్నిటి నొక్కచోట సమకూర్చుటచే నిది సర్వరామాయణ సారసంగ్రహమని చెప్ప శక్యమగును. ఇట్టి విశేషములచే నొప్పుచున్న యీ గ్రంథరాజము నాకు దృష్టిగోచర మయ్యెను. ఈ గ్రంథమున నచ్చటచ్చట పాత్రల పూర్వజన్మాది వృత్తాంతములను జూచుటచే గొప్ప యానందము గలిగెను. ఈ గ్రంథమును గూర్చుటలో శాస్త్రిగారు పడిన శ్రమను వర్ణించుటకును గూడ నెవ్వడును సమర్థుడు కాడని చెప్పుటలో నతిశయోక్తి యేమియు లేదు. గ్రంథశైలి మృదుమధురపదలాలిత్యము గలదై యున్నది. ఆయా రసముల ప్రస్తావమునకుం దగిన శబ్దయోజనము చేయుటచే శ్రోతలకు బ్రహ్మానందైక్యమును గూర్ప సమర్థమై యున్నది. ఇట్టి విశేషములచే నొప్పుచున్న యీ గ్రంథ ముద్రణకార్యము శ్రీయుత మహోదయాధీనమై యున్నందున వారల నీ గ్రంథ ముద్రణమునకై శీఘ్రముగ సాహాయ్యము చేయుటకై ప్రార్థించుచుంటిని. అప్పుడే గ్రంథకర్తగారి ప్రయాసము, శ్రీయుత మహోదయులు ధన్యులు గాగలరు.

ఈ గ్రంథము గ్రంథరచయితయు శ్రీరామానుగ్రహముచే చిరంజీవులై వర్ధిల్లుదురుగాక యని ప్రార్థించుచుంటిని,

ఇట్లు,

శ్రీపాద వేంకటరమణ దైవజ్ఞశర్మ.

వేగాయమ్మపేట సంస్థాన సిద్ధాంతి

ది 26—12—39

# పండితాశయః

---

బ్రహ్మశ్రీ లక్కావఝ్ఝల వేంకటకృష్ణశాస్త్రి కవివరై ర్విరచితోఽయ మాశ్చర్యరామాయణాఖ్యో గ్రంథో మయా గ్రంథకర్తృముఖా త్తత్రతత్ర అశ్రావి. అతీవాఽనందమకార్షీత్, ఏతద్గ్రంథపఠన శ్రవణాదిభి ర్జనానాం విచిత్ర కథాదిజ్ఞానమ్, నీతిశాస్త్ర ధర్మశాస్త్ర మంత్రశాస్త్రాది రహస్య జ్ఞానంచ భవే దిత్యత్ర నకోపి విశయః. తస్మా దేతద్గ్రంథ స్సర్వై రభ్యసనీయ ఇతి మమాశయః.

## అనువాదము

బ్రహ్మశ్రీ లక్కావఝ్ఝల వేంకటకృష్ణశాస్త్రి కవివరులచే రచింపఁబడిన యీ యాశ్చర్య రామాయణ గ్రంథము నచ్చటచ్చట భాగములు గ్రంధకర్తగారి ముఖమునుండి నేను విని మిక్కిలి యానందము నొందితిని. ఈ గ్రంథమును పఠించుట వలనను వినుట మొదలగువానివలనను జనులకు విచిత్ర కథావిజ్ఞానము నీతి ధర్మ మంత్ర శాస్త్రాది రహస్య విజ్ఞానము కలుగు ననుటకు సంశయములేదు. ఆ కారణమువలన నీ గ్రంథము సర్వజనులచేఁ జదువఁదగిన దని నా యాశయము.

ఇట్లు వ్యాకరణాధ్యాపక,
జయంతి భగీరథశాస్త్రి,
పుట్టకొండ సంస్కృత పాఠశాలా ప్రధానపండితుఁడు.

భట్నవిల్లి,
ది 27-12-39.

---

# అరణ్యకాండ

## విషయానుక్రమణిక



౫ శ్రీరాము డగస్త్యాశ్రమములో బ్రవేశించుట. శ్రీరాముని నగస్త్యుడు స్తవముచేయుట, దేవతాస్థానములను శ్రీరామునకుఁ జూపించుట.

౬ అనంతర మగస్త్యుడు శ్రీరామునకు వైష్ణవధనువు దివ్యాస్త్రముల నిచ్చి రావణాది సంహారముచేసి భూభారమును బాపుమని విన్నవించుట, రావణ కుంభకర్ణ విభీషణాదుల జన్మకర్మవృత్తాంతము నగస్త్యుడు చెప్పుట, మఱియు దేవకార్యనిర్వాహమునకై పంచవటి యందు నివాసము నేర్పఱచుకొనుమని యగస్త్యుడు రామునకు బోధింప శ్రీరాముడు సీతాలక్ష్మణసమేతుడై పంచవటికిఁ బయనమగుట,

౭ మధ్యమార్గమున సీతారాములకు ఫలముల సమర్పించి రెండు వృక్షములు శాపవిముక్తము లగుట, వాని పూర్వజన్మ వృత్తాంతము, జటాయు సమాగమము, జటాయు స్తుతి, పంచవటిని సీతారామలక్ష్మణులు ప్రవేశించుట, లక్ష్మణుడు పర్ణశాల నిర్మించుట, పర్ణశాలా ప్రవేశము, లక్ష్మణునకు శ్రీరామచంద్రమూర్తి భక్తిజ్ఞాన మార్గములను బోధించుట.

౮ హేమంతఋతువర్ణనము, లక్ష్మణుడు సాంబుడను రాక్షసునిజంపుట, శూర్పణఖ రాముని జూచి మోహించుట, శూర్పణఖా రామచంద్రుల సంభాషణము, రామచంద్రమూర్తి శూర్పణఖను లక్ష్మణుని సమీపమునకుఁ బంపుట.

౯ శూర్పణఖా లక్ష్మణుల సంభాషణము, శూర్పణఖా విరూపకరణము శూర్పణఖా పూర్వజన్మవృత్తాంతము, శూర్పణఖ ఖరాదులతోఁ దన పరాభవమును జెప్పుకొనుట.

౧౦ ఖరదూషణ త్రిశిరులు పదునాలుగువేల రాక్షసులతో వచ్చి రామునితో యుద్ధముచేసి హతులగుట, దేవర్షులస్తోత్రము, రామచంద్రమూర్తి సీతాలక్ష్మణులతో దిరిగి పర్ణశాలలో గలియుట, అకంపనుడు ఖరదూషణాదుల మరణవృత్తాంతమును రావణునకు జెప్పుట, సీత నపహరింపుమని బోధించుట,

౧౧ రావణుఁడు మారీచాశ్రమమున కేఁగి రాక్షస వధవృత్తాంతమును జెప్పి సీత నపహరించుటకుఁ దనకు సహాయముగా రమ్మని మారీచుని గోరుట, మారీచుఁడు రాముఁడు పరాక్రముఁడనియు, వానితో విరోధము పెట్టుకొనక యింటికేఁగుమనియు బోధించి రావణుని లంకకు బంపివేయుట, శూర్పణఖ రావణునితో దనకు గలిగిన పరాభవము చెప్పుకొని రావణుని నిందించుట, రామపత్ని నపహరింపుమని శూర్పణఖచే బోధింపఁబడి రావణుఁడు మారీచాశ్రమమునకు వచ్చి మారీచుని నిర్బంధించి తనకు సహాయునిగా జేసికొని పర్ణశాలకుఁ బ్రయాణమగుట.

౧౨ రామచంద్రమూర్తి తనకుఁ గలిగిన దుశ్శకునములను సీతకుఁ జెప్పి యామెను నగ్నిలో దాచి మాయాసీతను పర్ణశాలలో నుంచుట. మారీచుఁడు లేడిరూపముతో పర్ణశాలా సమీపమున సంచరించుట. ఆ బంగరులేడిని తనకుఁ బట్టుకొనివచ్చి యిప్పింపుమని రాముని బ్రేరేపించి సీత పంపుట. మారీచుఁడు రాముని దూరముగ నాకర్షించి తీసికొనిపోవుట. రామచంద్రమూర్తి మారీచుని వధించుట. హా లక్ష్మణా యని మారీచుఁడు రాముఁడు పిలిచినట్లు పిలచి ప్రాణములను విడుచుట. సీత యా యార్తనాదమును విని లక్ష్మణుని రామసన్నిధికిఁ బంపుట.

౧౩ రావణుఁడు సన్యాసివేషముతో సీతను సమీపించుట. సీతారావణుల సంభాషణము. రావణుఁడు నిజరూపమును జూపి సీత నపహరించుట. సీతా విలాపము. జటాయువు రావణుని రథమును నిరోధించి యుద్ధముచేసి రావణుని రథమును సారథిని గుఱ్ఱములను హతముచేసి తీవ్రముగ యుద్ధము చేయుచుండ రావణుఁడు చంద్రహాసముతో నతని రెక్కలను నఱికి సీతను లంకకు గొనిపోవుట. రావణుని పూర్వశాపముల వివరణము.

౧౪ రామచంద్రమూర్తి పర్ణశాలకుఁ దిరిగి వచ్చుచుండ లక్ష్మణుఁడు కలియుట. వారిద్దరు పర్ణశాలను సమీపింప సీత కన్పడకపోవుట, రామవిలాపము, సీతాన్వేషణము, జటాయువు కన్పడుట, జటాయువు

సీతను రావణు డపహరించెనని చెప్పి ప్రాణములను వదలుట. జటాయు దహన సంస్కారము, జటాయువునకు మోక్షము నొసగుట, జటాయు పూర్వజన్మవృత్తాంతము.

౧౫ పార్వతి రామతత్త్వమును బరీక్షించుటకై సీతావేషమును ధరించి రామునిసమీపమునకేగుట. రాముడు నీవు పార్వతివి సీతవుకావు, నీకీ వేషముతగదని పార్వతిని బంపివేయుట, తిరిగి పార్వతి పరమేశుని గలియుట, రామచంద్రమూర్తి లక్ష్మణసమేతుఁడై కృష్ణానదినిదాటి సంగమేశ్వర క్షేత్రమునకు వచ్చి సంగమేశుని బూజించి వరముల నొందుట, సంగమేశ్వర క్షేత్రమాహాత్మ్యము. అచటనుండి పశ్చిమముగా రామచంద్రమూర్తి లక్ష్మణునితో నేగుట, కబంధవధ, కబంధ పూర్వజన్మవృత్తాంతము.

౧౬ శబరి పూర్వవృత్తాంతము, రామచంద్రమూర్తి శబరి యాశ్రమమునకు వచ్చుట, శబరి యాతిథ్యమును రామచంద్రమూర్తి స్వీకరించుట, శబరీస్తవము శబరి శరీరమును విడుచుట. శబరికి మోక్షమొసగుట. శ్రీరామచంద్రమూర్తి శబరీప్రబోధముచే లక్ష్మణసమేతుఁడై పంపాసరోవరమునకు వచ్చుట.

అరణ్యకాండ విషయానుక్రమణిక

సమాప్తము.

—। శ్రీః ।—





# ఆశ్చర్యరామాయణే,

## అరణ్యకాండప్రారమ్భః.



శ్రీరస్తు.

శుభమస్తు — అవిఘ్నమస్తు.

శ్రీరామచన్ద్రపరబ్రహ్మణేనమః

# ఆశ్చర్యరామాయణే

## అరణ్యకాండప్రారమ్భః.

### ప్రథమస్సర్గః.

శ్లో॥ శ్రీభద్రాచలరామాయ కరుణామూర్తయే నమః,
1 దీనావనరతాయాస్తు భక్తముక్తిప్రదాయినే ॥ ౧॥

వ్యా॥ పూర్వకాండే పితృవాక్యపరిపాలన, పుత్రమిత్ర రాజభ్రాతృధర్మాదయ స్సామాన్యధర్మా నిరూపితాః। అస్మి న్కాండే "పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్" ఇత్యవతారప్రయోజనీభూతం శిష్టరక్షణాంగం దుష్టశిక్షణరూపం ప్రయోజనం ప్రతిపాద్యతే। "మంగళాదీని మంగళమధ్యా నీత్యాదిశాస్త్రానుసారేణ స్వేష్టదేవతానమస్కారాత్మకం మంగళం శ్రీభద్రాచలేత్యాదినా గ్రంథాదౌ క్రియతే। కరుణామూర్తయ ఇత్యనేన "ఏవం సంసృతిచక్రస్థే భ్రామ్యమాణే స్వకర్మభిః, జీవే దుఃఖాకులే విష్ణోః కృపా కా ప్యుపజాయతే" ఇతి వాక్యానుసారేణ సంసారచక్రే భ్రామ్యమాణా న్జనా న్దృష్ట్వా భగవతః కృపా జాయత ఇతి — నను తస్య కరు

1 సర్గసమాప్తిపర్యంతం కవికృతశ్లోకా ఏవ ॥

శ్రీరస్తు.

శ్రీరామ శ్శరణం మమ.

శుభమస్తు — అవిఘ్నమస్తు.

# ఆశ్చర్యరామాయణమున,

## అరణ్యకాండప్రారంభము.

### ప్రథమసర్గ.

---

దయామయుఁడును, దీనపరిరక్షకుఁడును భక్తజనులకు ముక్తినొసఁగు వాఁడునగు శ్రీభద్రాచలరామునికొఱకు నమస్కారముగఁగాక —

---

పూర్వకాండమునఁ బితృవాక్యపరిపాలన రూపధర్మము, పుత్రధర్మము, భ్రాతృధర్మము, మిత్రధర్మము, రాజధర్మము, మొదలగు సామాన్యధర్మములు నిరూపింపఁబడినవి. "శిష్టరక్షణ దుష్టశిక్షణములకై నేనవతరించెద" నను భగవద్వాక్యము ననుసరించి శిష్టరక్షణమున కంగమగు దుష్టశిక్షణరూపప్రయోజనము ఈయరణ్యకాండమునఁ జెప్పఁబడుచున్నది. "గ్రంథాదియందుఁ గాని, మధ్యయందుఁ గాని, అంతమందు గాని, మంగళము చేయవలయునను" శాస్త్రము ననుసరించి యిష్టదేవతానమస్కారరూపమగు మంగళమాదియందుఁ జేయఁబడుచున్నది. "దయామయుఁడగుటచే సంసారచక్రములో స్వకర్మవశమునఁ దిరుగుచు దుఃఖితులైయున్న జీవులయందు భగవానునకు దయకలుగునను" శాస్త్రము ననుసరించి దయామయుఁడని యిచ్చట చెప్పఁబడినది. భగవానుఁడు దయామయుఁడైనందులకుఁ బ్రయోజనమేమని

ణామయత్యే కిం ప్రయోజన మిత్యాశంకాయాం దీనావసర తా మేతి ।

నను సర్వేషాం బాధారాహిత్యకరణ మేవ సర్వసమస్య తస్యోత్తమః పక్షః దీనజనమాత్రావనేన తస్య వైషమ్యం సం భవే దితి చేన్న । శీతబాధానివృత్తికరణే సర్వదా సంసిద్ధ ఏవ వైశ్వానరః । తథాపి య స్త్వంతిక మాగచ్ఛతి తస్యైవ శీత బాధాం నివారయతి ప్రీతిమాత్రో నాన్యస్య । తథైవ భగ వానపి య స్స్వాకృష్యమాణ స్స్వచరణాంబుజానాం సమీపమాగ తే తస్యైవ దీనస్య సంసృతిబాధాం నివారయే న్నాన్యస్యేతి జ్ఞాయతే ॥

కథం రక్షతీత్యాశంకాయాం భక్తముక్తిప్రదాయేతి అనేన స్వాశ్రితా యథా జననమరణప్రవాహే న పతేయుస్త థాఽపవర్గం వితీర్య భగవాన్ స్తా న్రక్షతీతి సూచ్యతే । న న్వస్యలోకసంస్థితస్య భగవత స్సమాశ్రయః కథం సంఘటత ఇత్యాశంకాయాం శ్రీభద్రాచలరామాయేతి। అత్రైవ సాక్షా త్ప్రాప్తాయేతి భావః। సూచ్యార్థసూచన మప్యస్మిన్ప్రాంచిత్యం సూచ్యతే। కరుణామూర్తయ ఇత్యనేన ఆర్తరక్షార్థం దండకా రణ్యాగమనం, దీనావసరతా మేత్యనేన దీనమునిజనరక్షణప్రతిశ్రు తిః భక్తముక్తిప్రదాయినేత్యనేన జటాయుప్రముఖానాం మోక్ష ప్రదానంచ వ్యజ్యతే ।

శ్లో॥ తత స్సూతం మహాభాగం శౌనకాద్యా మహర్షయః ।
ప్రాహు రేతే త్సుమనసో వచనం వినయాన్వితాః ॥ ౨॥
భవతా మహతా సూత! కథితా రామసత్కథా ।
శ్రుత్వాఽ భూమ వయం ధన్యా నాలం బుద్ధిర్యతోఽ స్తినః ॥౩॥
అనంతరీం తత్కథాం త్వ ముక్త్వాఽఽనందయ న స్తతః ।
ఇత్యుక్తోఽ నంతరకథాం వ్యాసశిష్యోఽ వద న్మునే ॥౪॥

దుర్నిరోద్గారసమాయాం, వైశాఖే కృష్ణపక్షపంచమ్యామ్ ।
విశతి స్మ దండకవనం, శ్రీరామో లక్ష్మణేన జానక్యా ॥౫॥

సీతాలక్ష్మణసంయుతో రఘుపతి శ్శ్రీమాం ప్రవిశ్యాటవీం
రమ్యైర్యూథమిరుస్త్రైర్విచిత్రవిహగైర్వ్యాప్తంపవిత్రం క్వచిత్
వేదాధ్యాపననిర్గతశ్రుతిరవై ర్ఘోషితం సర్వత
శ్రీమున్యాశ్రమమండలం శమధనోఽపశ్యద్ర్వజం స్తద్వనే॥౬

సద్యోరామవిభు స్తదాశ్రమమృగాభీతిం విధాతుం ధను,
స్స్వీయం నిర్గుణ మాచర న్నవినయం తత్రావిశ త్తాపసాః ।
సీతాలక్ష్మణసంయుతం రఘుపతిం జ్ఞాత్వా రమేశం తుత,
త్సానా ద్దర్శనభాగ్యజాఽధికముదో నిన్యు స్స్వకీయాశ్రమాన్ ॥౭॥

౨॥ ఇట్లు శౌనకాదిమహర్షులు పౌరాణికాగ్రేసరుఁడైన సూతునిం
గూర్చి వినయముట్టిపడ నిట్లు పలికిరి.

౩ ౪॥ మహాత్మా! సూతపుంగవా! మాకీ రామకథామృతము నుచిచూపి
తివి. దీనిని మేము చెవులారఁగ్రోలి ధన్యులమైతిమి. ఎంతవిన్నను
మాకుఁ దృప్తిజనింపదు.

కావునఁ దరువాతి కథనుగూడ మాకువిస్తరించిచెప్పి మమ్మానందింపఁ
జేయుము. ఇట్లు శౌనకాదు లడుగుటతడవుగా వ్యాసునిశిష్యుఁడగు
సూతుఁడా మునిపుంగవులకు నుత్తరకథనిట్లు చెప్పఁదొడఁగెను.

౫॥ ఋషీశ్వరులారా! వినుండు. శ్రీరామచంద్రుఁడు, సీతయు, లక్ష్మ
ణుఁడునుఁ దనవెంటనడచిరాగా రుధిరోద్గారిసంవత్సరమునందలి
వైశాఖబహుళపంచమిదినమున దండకారణ్యముం బ్రవేశించెను.

౬॥ అభయంకరమగునరణ్యమందు అందచందములకుఁ బుట్టినిండ్లైన వృ
క్షలతాగుల్మాదులచేతను, చిత్రవిచిత్రవర్ణములతో ముద్దులుగులుకు శ
కుంతసంతానములచేతను కన్నులపండువై కన్పించునదియు, నలుది
క్కులనుండి వెల్వడు ఋషిశిష్యుల వేదాధ్యయన ఘోషములచే న
తిపవిత్రమైనదియు, నగు నొకఋష్యాశ్రమమండలమును సీతాలక్ష్మ
ణసమేతుఁడైన రాముఁడు దర్శించెను.

౭॥ ఆయాశ్రమపదమును దర్శించినవెంటనే యాశ్రమమృగములకు భ
యముకలుగకుండుటకు తనధనస్సునకున్న వెట్టుతప్పించి వినయవిధే
యతలుమెరయ నందుఁ బ్రవేశించెను. సీతాలక్ష్మణసమేతుఁడై యే
గుదెంచు శ్రీరామచంద్రుని రమేశుఁడని యెంచుకొనుచు నాఋషు
లు తద్దర్శనభాగ్యమున కుప్పొంగుచు వారికెదురువచ్చి తమయాశ్రమ
ములకుఁ గొంపోయిరి,

1* ఉద్యచ్చంద్ర మివ స్థితం రఘుపతిం తత్రైవినం లక్ష్మణం,
సీతాంచాఽపి యశస్వినీంచ మునయోఽవేక్ష్యైకవారంతతః
సంతృప్త్యా రహితాః పునః పునరలం సంవీక్ష్యమాణాశ్చతా,
2 దృగ్దోషోపశమాయ। మంగళవచాం స్యాహు స్తథాచ్చై
స్స్వరాః ॥౭॥

---

1* ఉద్యచ్చంద్రమితి— ఉద్యంతం సోమమివ ప్రియదర్శన మితి "తస్మాత్సోమరాజానో బ్రాహ్మణా" ఇతి శ్రుతేః యద్వా స్వకులరక్షకం చంద్రమివ స్వరక్షకం ధర్మచారిణంరామ మితి.

యద్వా ఉద్యచ్చంద్రోపమానేన యథా చంద్రోదయే సర్వత్ర తమోనాశ స్తథా రామచంద్రోదయే సర్వరాక్షసనాశో భవతీతి సూచ్యతే।

2। మంగళవచాంసీతి—నహి కేవలం దృష్టిదోషోపశమాయైవ మంగళవచనాని కింతు రామస్య సౌందర్యసౌకుమార్యాదికందృష్ట్వా రక్షోభూయిష్ఠేఽస్మిన్వనే కింభవిష్యతీతి వ్యాకులహృదయతయా తస్మిన్ విరోధినిరసనవచనా నీతి వేద్యమ్॥

తా॥1. అప్పుడప్పుడే* యుదయించు చంద్రునిం బోలియున్న యా రామచంద్రుని, వానివెన్నంటి నదీప్తతారంపగిది సేవకుండై యుపచరించు లక్ష్మణుని, చంద్రికయుంబోలె రామునితో నైక్యభావము నొందు సీతనుం జూచి చూచి తృప్తిం గనంపక మఱిమఱి చూచి దృష్టిదోష మేమాయ
2. నుకోయని మంగళవాక్యంబుల నుచ్చరించుచు వారికి రక్ష పెట్టిరి.

---

1* ఉదయించుచున్న చంద్రునివలె ననుటచే రాముఁడు ప్రియదర్శనుఁడనునర్థము. "బ్రాహ్మణులు సోముఁడు రాజుగాఁగలవారు" అను శ్రుతివలన లేక "తమకులమును రక్షించునట్టి చంద్రునివలె తమకు రక్షకుఁడైన రామచంద్రుని జూచిరనియు" లేక ఉదయచంద్రుని యుపమానముచేత చంద్రోదయ మెట్లు చీకటిని నశింపఁజేయుచున్నదో యట్లే రామోదయముగూడ రాక్షసనాశనమును గల్పించఁగలదని సూచింపఁబడుచున్నది.

2. మంగళవాక్యంబులనుచ్చరించుచు రక్షపెట్టిరి యను వాక్యమునకు వివరణము — కేవలము దృష్టిదోషపరిహారమునకే మహర్షులు మంగళవాక్యముల నుచ్చరింపలేదు. ఇక నేమనఁగా, రాముని సౌందర్యసౌకుమార్యాదులనుజూచి రాక్షసభూయిష్ఠమయిన యీవనమునం దేమిజరుగునో యనుభయముచే వ్యాకులహృదయులై సీతారామలక్ష్మణులకు శత్రుభయము లేకుండఁగూడ మంగళవాక్యములను మహర్షులు ప్రయోగించిరని తెలియఁదగును.

సాక్షాదేవ రమాపతిం భగవతిం స్వీయై శ్చయై రర్చితుం,
భాగ్యం న స్సమభూదితి ప్రముదితా స్స్వాంతేషు తేతాపసాః।
1. పాద్యార్ఘ్యాసన*కందమూలసుఫలైస్సంపూజ్య భక్త్యాన్వితా
స్సీతారాఘవలక్ష్మణా నపి తతః పారిహార్య్యంచ స్సాదరం॥౯॥
శ్రీరామచంద్ర భగవ న్నవితుంచ సాధూన్,
దుష్టాంశ్చ హంతు మవితుం భువిధర్మసంస్థాం।
ప్రాప్తోఽవతార మవనౌతు భవా నితి త్వా,
మస్మాభి రాప్య విదితోఽసి పురైవనూనం॥౧౦॥
బ్రహ్మాదయోఽపి రఘుపుంగవ యస్య రూపం,
సత్యం విదంతి సదస న్నహి తేఽమరాద్యై
తంత్వా మిమం మితధియోద్య కథం వయంతు,
సంస్తోతు మద్య భగవ న్ప్రభ వేమ నూనం॥౧౧॥
యద్రూపంహృదియోగినః ప్రతిదినం,త్వర్చంతినిష్కల్మషాః
ధ్యానాద్యాత్మసుమైర్నిరుధ్యతుచలద్బాహ్యేంద్రియగ్రాఘుంనిజం,
తద్రూపం తవ రామచంద్రనవయం,స్తోతుం సమర్థాధ్రువం
ధ్యాతుంనప్రభవేమకేవలకృపా దృష్ట్యాభవాన్పాతునః॥౧౨॥

---

1* కందమూలమితి —"యదాహారో భవే త్తేన పూజయేత్పి
తృదేవతాః, తేనైవ పూజయే న్నిత్య మతిథింసముపాగత"
మితి శంఖస్మృతివచనేన స్వీయాహారేణైవాతిథ మపి పూ
జయే దితి ధర్మ స్సూచితః ॥

౯ మఱియు సాక్షాత్తుగ లక్ష్మీనారాయణులను తమహస్తములచే నర్చిం
చుభాగ్యము తమకు లభించెనని యాతాపసులు హృదయములనుప్పొం
గుచు నాసీతారాములకాసనమిచ్చి, పాద్యమొసంగి, యర్ఘ్యమంది
1. చ్చి కందమూలములు మొదలగునాహారముల నర్పించి భక్తితోఁ బూ
జించి రామచంద్రునితో నిట్లుపలికిరి.

౧౦ షడ్గుణైశ్వర్యసంపన్నుఁడవగు నో రామభద్రా! నీవీలోకంబున సాధు
సంరక్షణకొఱకును, దుష్టశిక్షణముకొఱకును, ధర్మసంరక్షణముకొఱ
కు నవతరించితివని నిన్నెవరకే, తెలిసికొంటిమి. ఇది నిశ్చయము.

౧౧ ఓరఘుపుంగవా! బ్రహ్మమొదలగు వేల్పులు, ఏనీయొక్క సద్
రూపమును సత్యముగా తెలిసికొనకుండిరో అట్టి నిన్ను నల్ప
జ్ఞులమగు మేము నుతింప నెట్లు సమర్థులమయ్యెదము!

౧౨ ఓరామచంద్రా! ఏనీదివ్యరూపమును నిష్కల్మషులగు యోగిపుం
గవులు చంచలములగు బాహ్యేంద్రియములనెల్ల స్తంభింపఁజేసి
ధ్యానము మొదలయినవి యనెడిపుష్పములచేఁ బూజించుచున్నారో
అట్టినీరూపమును నుతించుటకును, ధ్యానించుటకును, మేము నిశ్చ
యముగ నసమర్థులము, దుర్బలులమగు మమ్ము కేవల కృపాదృష్టిచే
రక్షింపుము.

---

1. "కందమూలములు" అనుదానికి వ్యాఖ్యానము.—తమకెయ్యదియా
హారమో దానిచేతనే పితృదేవతలను, అతిథులను నిత్యము పూజించ
వలయునను శంఖస్మృతివచనమునుఁ బట్టి తమయాహారపదార్థములచే
తనే అతిథులను సత్కరింపవలయును" అను ధర్మమిచట సూచింప
బడుచున్నది.

నహి ధర్మవిదో రామ! వయం త్వాత్మవిదో నహి,
న వయం భక్తిమంతశ్చ శరణం త్వాం గతా వయమ్ ॥౧౩॥

రక్ష్యా హ్యథవా నవా వయ మమీ
త్యేవం న చింత్యం త్వయా,
నిష్ప్రష్టా వయ మాశ్రితరక్షణే
త్వాలాపితుం న క్షమాః।
దీనత్వే దపి న స్తు హాతికరుణా
శాంత్యత్సాస్త్ర,
స్వామి న్రక్షసి నో యది త్వ మనఘ
స్యాత్తే ప్రతిజ్ఞాచ్యుతా ॥౧౪॥

1* పురస్థితో వనస్థానాం సమర్థో హ్యవితుం తు నః,
యత్ర కుత్ర స్థితస్యాపి నహి తేస్త్యశక్తతా ॥౧౫॥

---

1* నను రక్షణప్రదేశస్థితో రక్షణావకాశ స్సమ్భవేత్ కథ ము
త్ర తేదవకాశ ఇత్యాశంకాయాం పురస్థితో వనస్థావేత్యుచ్యతే
తిస్యాయ మాశయః— ఇతరే మూర్ధాభిషిక్తాః బుద్ధిబలేన స్థా
నబలేనచ తురంగబలేనచ స్వరాజ్యమాత్రరక్షణే సమర్థా భ
వంతి। సకలలోకరక్షణధురంధరస్య అసహాయశూరస్య తవనగ
రవాసే కిం? బల ముపచీయతే, స్వాభావికనిత్యనిరతిశయజ్ఞానశ
క్తిసంపన్నస్య తవ వనవాసే కిం? బల మపచీయతే, అతోఽయ
త్రకుత్ర స్థితస్యాపి తవాసాధ్యం కిమపి నాస్తీతి భావః! ॥

మనుష్యభావేనతు రాఘవాస్మాన్
విమోహితుం త్వద్విషయస్థితాం స్త్వమ్,
త్వత్పాలనాకాంక్షిజనాన్యదీచ్ఛే
1 స్త్వం రక్షణే నో* భవితా తవాఘమ్॥ ౧౬॥

కించత్వం నృపపుత్ర! కోష్టదిగీశాంశాన్వితోఽభూర్యతః,
త్వత్త స్స్వత్వపరిపాలనం రఘుపతే త్వయ్యేవ సంస్థం ధ్రువమ్
నృణాం పాలనహేతునా నృపపదం సార్థం భవేద్రాఘవ!
2.) త్వద్దేశస్థితికారణేన విధినా పాతుం త్వమర్హోఽసి నః ॥౧౭॥

---

1.* భవితా తవాఘమితి— మహాభారతే ప్యేవం ప్రతిపాదితమ్— తథాహి, శ్లో॥ అగోప్తారశ్చ రాజానో బలిషడ్భాగతస్కరాః, సమర్థాశ్చాప్యదాతారస్తే వై నిరయగామిన ఇతి॥

2.) త్వద్దేశస్థితికారణేనేతి తస్యాయమాశయః—భవద్విషయవాసిత్వమేవ భవద్రక్ష్యత్వే ఽప్రమాదో హేతుః। నోపాసనాదికం తత్ర ప్రమాదాదిసమ్భవాత్। దేశవాసిత్వే తదభావాదిభావః। నచోత్తరత్ర కరిష్యమాణేనాత్మీయరక్షాభారసమర్పణే నైవ ప్రయోజనసిద్ధేర్విషయవాసిత్వకథనం వ్యర్థమితి శఙ్క్యమ్। రక్షకే వశ్యతి తత్సన్నిధానే రక్ష్యవినాశస్య దోషభూయస్త్వకథనార్థత్వాత్। విషయవాసిత్వస్య నిరపేక్షహేతుత్వనిర్బన్ధేఽపి మోక్షవ్యతిరిక్తరక్షణోపాయస్యావిరోధాత్। నహ్యత్ర మోక్షాపేక్షయా ఉపాయానుష్ఠానం చక్రుః। కింతు దుష్టరాక్షసనిరసనాపేక్షయేతి।

౧౮ నీదాస్యమునకుంబడి నీపాలనమునకు లోనైయున్న మమ్ములను నా
1· స్వభావమున మోహపెట్టి రక్షింపుట మానెదవేని నీకుఁ బాపము సంభవించును.

౧౯ మఱియు రాజు అష్టదిక్పతుల యంశములతో నుద్భవించుటఁ గాన మా రక్షణభారము నిశ్చయముగ నీయందే యున్నది. రాజు నరులను రక్షి
2. క్షించువాఁడు కావుననే నృపుఁడని పిల్వఁబడుచున్నాఁడు. *నీదేశమందుండు ప్రజల మగుటచే నీవు మమ్ములను తప్పక పాలింపవలసి యుంటివి.

---

1· 'నీకుఁ బాపము సంభవించును' అనుదానికి వివరణము మహాభారతమునందుగూడ నిట్లే చెప్పబడినది. పండిన పంటలో నారవపాలు దీసికొని ప్రజలను రక్షింపని రాజులును, సమర్థులైయుండియు దానమీయని భాగ్యవంతులును నరకమునకుఁ బోవుదురు.

2 నీదేశమునందుండు ప్రజలమగుటచే విధిగ రక్షింపవలయుననుదాని వివరణము—ఓ రామచంద్రా! నీదేశమునందుండుట నీచే నవశ్యము రక్షింపదగుటలో నిష్ప్రమాదమగు హేతువైయున్నది. నిన్ను పాసించుట మొదలగునవి ప్రమాదములేని కారణములుకావు వానిలో ప్రమాదమున్నదని భావము ఇందుపైనొక్క యాశంక కలుగును. మునులు తమరక్షాభారమును రాముని యందు పెట్టబోవుచు నిచ్చట మీదేశవాసులమని చెప్పుట వ్యర్థమను నాశంకకు సమాధానమేమనగా. రక్షకుడవైననీవు చూచుచుండగా రక్షణీయుల వినాశదోషబాహుళ్యము గలదని చెప్పుటకని తెలియదగును. దేశవాసులమని చెప్పుట మోక్షకారణము కాకపోయినను మోక్షవ్యతిరిక్తములైన వానికి కారణమగుటకు నిరోధము లేదు. కాన నిచ్చట మోక్షాపేక్షచే శరణు పొందియుండలేదు ఇక నేమనను దుష్టరాక్షసభయనివారణమునకు గాన దేశవాసులమను హేతువుచెప్పుకొనుట సమంజసమేయగునని భావము.

శ్రీరామాత్ర వసత్సు తాపసజనే ష్వార్యద్విజాః క్షత్రియాః
వైశ్యా శ్చాపి వసంతి నానావిధా సర్వే స్వకీయేఽక్షమాః,
కింతు స్వీయతపోవినాశనకియా సర్వే భవంతం విభుం
రక్షాదీక్షిత మద్యరాక్షసభయాద్యాచంతిసంరక్షకమ్ ॥౧౮॥
కింబ్రూమో రక్షసాం బాధాం నహి సోఢుం వయం క్షమాః,
మునీనామస్థిసంచయం పశ్య రక్షః ప్రకల్పితమ్ ॥౧౯॥
ఇత్యుక్త్వా దర్శయిత్వా చ మునీనా మస్థిసంచయమ్,
సంస్థాప్య రాఘవే స్వీయరక్షాభారం స్థితాస్తు తే ॥౨౦॥
శ్రీరామోఽపి విచార్య తన్మునిచయే విన్యస్య బహ్వీంకృపాం
భక్త్యా తత్రచితాల్పగౌరవమలం మత్వా త్వనల్పం తతః,
తేషాంరక్షణ మాత్మసాదితి తదా తూక్త్వా ప్రతిజ్ఞాయవై
భూయో వ్యాహ మునీ న్విశాలహృదయో రక్షోజనైః పీడితాన్ ॥౨౧॥
మా నాజ్ఞాపయితుం త్వర్హా నహి విజ్ఞాపితుం క్షమాః,
యుష్మదాజ్ఞాప్రకారేణ ప్రవర్తితు మహం స్థితః ॥౨౨॥
రక్షో వినాశనం కృత్వా నిరపాయా నహాంతు వః,
కరిష్యామ్యసురాన్హంతు మహం కానన మాగతః ॥౨౩॥
ఇత్యుక్త్వా మునిభి స్తదానతిగతో రామస్ససీతానుజ
స్సింహవ్యాఘ్రవరాహకాసరముఖై ర్భీమైర్మృగై స్సంయుతం
కైశ్చి చ్చిత్రవిచిత్రపక్షినివహై స్సంకూజితం భీకరమ్,
నిర్ఝరం విపినం ప్రవిశ్య తుయదా కుర్వ న్ధనుష్టంకృతిం ॥౨౪॥

౧౮ రాకుమారా ! ఇచ్చట నివసించు తాపసులలో బ్రహ్మ, క్షత్రియ, వైశ్యులను మూఁడుజాతులవారు నుండిరి. వారుతమను తాము రక్షించుకొనుటకు సామర్థ్యము లేనివారుకారు. కాని తపోభంగ భయమొకవంకను, రాక్షసభయ మొకవంకనుపీడింపఁ బ్రభువవైననిన్ను శరణము వేడినాము.

౧౯ రామా! ఈరక్కసుల బాధను నీకేమనిచెప్పుదుము. మేము భరింపఁజాలకున్నాము. అదిగో రాక్షసగణముచే భక్షింపఁబడిన మునిపుంగవుల బొమికలగుట్టలు వానిని పరికింపుము.

౨౦ ఇట్లుచెప్పి రామునకా బొమికలగుట్టలను చూపుచు మారక్షణభారమిక నీయదియేయని విన్నవించుకొనిరి.

౨౧ రామచంద్రుఁడును ఋషిపుంగవులయెడఁ గృపఁబూని భక్తితో వారొనర్చిన యల్పగౌరవమునే యనంతముగఁ దలంచుచు నేను మిమ్ములను తప్పక రక్షించెదనని యభయమిచ్చి ప్రతిజ్ఞచేసి యారక్షోజనపీడితులై యున్న మునిజనులతో నిట్లుచెప్పెను.

౨౨ మహాత్ములారా ! మీరు నన్నాజ్ఞాపింపఁ దగినవారలుకాని, నాకు విన్నవింపఁదగినవారలుకారు తమయాజ్ఞ ననుసరించిప్రవర్తించుటకునేను సంసిద్ధుఁడనై యున్నాఁడను.

౨౩ ఈరాక్షసబృందమునెల్ల రూపుమాపి మిమ్ముల నపాయమునుండి రక్షించెదను. నేను రాక్షస సంహారణమునకే యరణ్యమునకువచ్చితిని.

౨౪ ఇట్లు మునుల కభయమొసంగి వారిపూజోక్తులునందికొని రఘురాముడు సీతాలక్ష్మణ సమేతముగ నచ్చటినుండి పయనమై సింహములు, బెబ్బులులు, ఏదుపందులు, అడవిదున్నలు మొదలగు భయంకరమృగములచే నిండియున్నదియు, పలురకముల వృక్షలయొక్కయు, చిత్రవిచిత్రములైన పక్షినివహముయొక్కయు కూతలచేత భయముగొల్పునదియు నిర్జలమునగు నయ్యరణ్యమునఁ బ్రవేశించి ధనుష్టంకారమొనర్చుచుఁ బోవుచుండెను.

ఏవం భీమగకాననం రఘుపతి స్సంవిశ్య గచ్ఛ న్వనే,
తత్రాన్తేఽనుజ మబ్రవీ త్త్వరమితో యత్నేన గమ్యంవనం ।
అగ్రేఽహంతుచరేయనాగ్రజధనుర్ధృత్వాంతుపశ్చాత్తుసా,
సీతామధ్యగతావయోశ్చభవితామామేవజీవాత్మనోః ౨౫

దృష్టిం లక్ష్మణ! చారయ త్వ మభితో రక్షో భయం వర్తతే,
ఇత్యుక్త్వా ప్రియయానుజేన సహితో గత్వా సుదూరంతునః!
తత్రాగా ద్విమలోదకం సుకమలం యత్రాస్తి రమ్యంసరః,
గత్వా తేచ సరో నిపీయచ జలంస్థిత్వా క్షణం నిర్గతాః॥ ౨౬

వై దేహీ రఘురామపాదయుగళన్యాసప్రదేశాదృతే,
మందం సంచరతి స్మ కాననతలే పశ్చాత్తుమిత్రాసుతః ।
సీతారాఘవయుగ్మపాదకమలన్యాసప్రదేశస్య వై,
భక్త్యాలంగమనేప్రదక్షిణతయామందంచచారాన్వితః ॥ ౨౭
శ్రీరామస్య పదారవిందయుగళస్పర్శా దితీడ్యామహీ,
స్వాంతేఽమన్యత తస్య దర్శనవశా ద్రామస్య వన్యామృగాః।
తత్రత్యాశ్చఖగా ముదంహ్యుపగతా దేవ్యశ్చవన్యా స్తథా,
సర్వే రాఘవదర్శనా న్నిజజనిం ధన్యాం తు సంమేనిరే॥ ౨౮

౨౫ ఇట్లు రఘురాముఁడా భయంకరాటవిని బోవుచు లక్ష్మణునితో నిట్లనెను. తమ్ముఁడా! ఇకముందీవనమున మనము ప్రయత్నపూర్వకముగ నడువవలయును. కాన నేనుముందు నడచెదను. నీవు ధనుర్ధారివై జాగ్రతగ వెనుక నడువుము. జీవునకును, పరమాత్మకును మధ్యయుండు మాయవలె మనకిర్వురకును సీత మధ్యనుండగలదు.

౨౬ లక్ష్మణా! ఏమరుపాటులేక నలుదిక్కులఁగలయఁబరికించుచు నడువుము. ఇచ్చట రాక్షసభయము మెండు. అని పలుకుచు రఘురాముఁడు సీతా లక్ష్మణులతోఁగూడి కొంతదూరమేగి సర్వలోకమనోహ్లాదకరమై పరిమళవంతమై పరమపావనమగు నోడఁగూర్చు పద్మముల చేవ్యాప్తమై బహురమ్యమై కన్పట్టునొక ప్రసరోవరమును దర్శించి, దానిజలంబుఁగ్రోలి యొక్కింత కాలమ్ము తత్తీరమ్మున విశ్రమించి తిరిగి పయనమయ్యెను.

౨౭ రాముఁడుముందు నడచుచుండ జానకి భర్తయడుగుమోపినతావులను తొలంగి వానివెంట నడచుచుండెను. లక్ష్మణుఁడు సీతారాములకు వెనుకభాగమున నడచుచు వారియిర్వురియడుగుజాడలకుఁ బ్రదక్షిణముగ భక్తియుక్తుఁడై యయ్యరణ్యమునఁబోవుచుండెను.

౨౮ శ్రీరామునియడుగుఁదామరల సోకుడువలన భూదేవి ధన్యురాలనని యాత్మలో నుప్పొంగెను. వానిదర్శనమువలన నవ్వనమునందలి మృగములును, పక్షులును, క్రిమికీటకములును, వనదేవతలును, ఆనందమనుభవించినవి. రాఘవదర్శనమున తమజన్మములు ధన్యములని యందరుఁదలంచిరి.

రామోభూమిసుతామథాహవచనందూరశ్రమోపేయుషీం,
ప్రేయస్యేహి శనైర్మదీయ కర మప్యాలంబ్య హస్తేన తే,
మాగచ్ఛ స్ఖలనం శిలాసుపతతి త్వం పశ్య నిమ్నోన్నతే
పశ్యంతీకుశకంటకాన్వనభువి త్వందూర మేహిప్రియే॥౨౯

తత్రార్తే పతిమాహ భూమితనయా నాథ క్వ శస్త్రంధను,
ర్వ్యాసప్రస్థమిదం వ్రతం క్వచవినా వైరంసతే న్యస్యయుత్ ।
త్రీణ్యేవ వ్యసనాని సంతి భువనే తేష్వాదిమిథ్యావచ,
స్త్వన్యస్త్రీనిరతి ర్ద్వితీయ మపరం నిర్వైరయుద్ధం పరైః॥౩౦

నాథ త్వం రాక్షసాన్హంతుం వినా వైరం కిమిచ్ఛసి ?
త్వామహంస్మారయేయం తేనాహంబోధయితుంక్షమా॥౩౧

తచ్ఛ్రుత్వా హసతీం రఘూత్తమవిభుర్దేవి త్వయోక్తంవచ,
స్సత్యం శాపథసంస్థ దుర్జనవధే ధార్యం ధను ర్బాహుభిః ।
రక్షఃపీడితమౌనిభి స్త్వహమలం విజ్ఞాపితో రాక్షసాన్,
హంతుంమౌనిజనార్తికేతుకృతవాన్దేవిప్రతిజ్ఞాంధ్రువం॥౩౨॥

ప్రతిశ్రుతి మహంత్యక్తుం నేచ్ఛేయం చ కదాచన ।
ఇదం మమ వ్రతంవిద్ధి మా త్వం భావయ చాన్యథా ॥33॥

౨౯ పిమ్మట రాముడు మార్గాయాసమున బడలియున్న సీతవంక జూచి యిట్లనెను. ప్రేయసీ! నా భుజము నాధారము జేసికొని నడచెదవు గాని యిటురమ్ము. ఈ నిమ్నోన్నత ప్రదేశములను జూచి నడువుము. శిలలయందు తొట్రుపాటుపడకుము. అదిగో ఆ ప్రదేశమున కొంచము జాగ్రతగ నడువుము. ఇవిగో ముండ్లు. వీటిని తప్పించుకొని దూరముగ నడుగు పెట్టుము. అని రామచంద్రమూర్తి సీతను హెచ్చరించుచు పోవుచుండెను.

౩౦ పిమ్మట సీత రామునితో నిట్లనెను. నాథా! వానప్రస్థవ్రతమున నీ యస్త్రశస్త్రధారణమే యయుక్తము. అందునను అన్యులతో వైరము లేకయే కయ్యమునకు గాలుద్రువ్వుచుంటివా! లోకమందు అసత్యమాడుట, పరస్త్రీరతుడై యుండుట, వైరము లేకుండ పరులతో యుద్ధమునకు సిద్ధపడుట అను నీ మూడే కదా! క్షత్రియులకు మహావ్యసనములని పెద్దలనుచుందురు!

౩౧ నాథా! నీవు వైరము లేకుండ రాక్షసులను సంహరింప నేల తలంచెదవు? ఈ విషయము నీకు జ్ఞాపకము చేసితిని గాని బోధించుటకు నేను సమర్థురాలను గాను.

౩౨ అన విని రఘురాముడు సీతతో నిట్లనెను. దేవీ! నీవు వచించినది సత్యమే కాని దుర్మార్గులను వధించుటకు రాజులెల్లప్పుడును ధనుస్సును ధరించియుండవలయును. రాక్షసపీడితులైన మునిజనులు తమ బాధలను నివర్తించుమని విన్నవించుకొనిరి. నేను నివారించెదనని వారియెదుట దృఢముగ బ్రతిజ్ఞ గూడ జేసియుంటిని.

౩౩ ప్రతిజ్ఞాభంగము చేసికొనుటకు నేను ఎన్నడు నిష్టపడను. ఇది నా స్థిరమైన వ్రతము. ప్రియా! నీవు మఱియొకలాగున దలంపబోకుము.

ఇత్యుక్త్వా ప్రియయానుజేన సహితో రామో వ్రజన్ కాననే,
శూలాగ్రగ్రథితేభమస్తకవృకవ్యాఘ్రం మనుష్యాదినమ్।
సవ్యాసృగ్ధరసిక్తరక్తిమయుతాసద్వ్యాఘ్రచర్మాంబరం,
నిమ్నాక్షంతుతకన్యశర్వతనిభం క్రూరం విరాధాసురం ॥ 34॥

సీతారాఘవలక్ష్మణానపి సురద్వేషీ విరాధాభిధో,
దృష్ట్వాటోపయుతః ప్రకోపితరుషా కాలాగ్నివత్ ప్రజ్వలన్
1 సంధావ్యాశుచ తాం స్తనౌ జనకజాం * ధృత్వా నిజాంకే చ
తాముద్వీక్ష్య,
హా రఘూత్తమ మా ప్రతి తదా సర్భిక మేత ద్వచః ॥ 35॥

---

1* అంకే ధృత్వేతి— అత్ర విరాధేన సీతాగ్రహణం స్వాఘౌఘ పరిహారార్థమేవ స తు దారబుద్ధ్యా తదుక్తం స్కాందే— షోపితాం జానకీం దృష్ట్వా శీఘ్రం సంజాతవిభ్రమః। ఇయం ప రామపాశక్తి స్స్వయం స్వర్గస్య కారణం ॥ అస్యా విబోధో మే మోక్షేపి కారణం బంధనేపి చ। తస్మాదిమాం భజిష్యామి దిష్ట్యా ప్రాప్తం హి దర్శనం॥ ఇతి దర్శనమాత్రేణ విముక్తాఘౌఘ పంజరః। భక్తియుక్తో జహారైనాం సీతాం చైతన్యరూపిణీం॥ ఇతి కేచిద్వర్ణయామాసుః ॥

౩౪ ఇట్లు తనప్రియసితోఁ గూడి రాముఁడు భార్యాసోదరసమేతుఁడై
యాభయంకరమైన దండకారణ్యమునం బోవుచుండ నొకచో
నొక యేనుగతలయు, ఒకతోడేలును, యొక పెద్దపులిని శూలము
నకు గ్రుచ్చి భుజముపైఁ బెట్టుకొని యొకచేతిలో మనుజునొకని
భక్షించుచు క్రొత్తరక్తము చేఁదడిసి యెఱ్ఱనై నయపవిత్రమగు పెద్ద
పులితోలును ప్రట్టముగ ధరించి నడబావులవలె లోతైనకండ్లతోఁ బ
ర్వతసమానమైన యాకారముతో నున్న యొక విరాధుఁడను రాక్ష
సుని జూచెను.

౩౫ రాక్షసాధముఁడగు నావిరాధుఁడును నిర్భయముగఁ దన యెదుట
సంచరించుచున్న సీతారామలక్ష్మణులనుజూచి యుత్సాహియై కో
పముచేఁ గాలాగ్నిరుద్రునివలె మండిపడుచు వారిమిన్నంట పరుగిడి
1 జానకిని చేతఁ జిక్కించుకొని * నిజాంకమందుఁ జేర్చి ఓమ్మట రా
మలక్ష్మణులతో నిర్భయముగ నిట్లనెను.

---

1* విరాధుడు తనయంకతలమున సీతను జేర్చినదాని నీక్రిందివిధముగ
గాండరు తాత్పర్యమును తెప్పుదురు.
విరాధుఁడు సీతనుగ్రహించుట తనపాపపుంజమును బోగొట్టుకొను
టకేకాని యితరములతో గాదని స్కాందపురాణమున నీక్రిందివిధ
ముగఁ జెప్పబడినది. "విరాధుడు సీతనుజూచిఁ యీమెపరాశక్తియ
నియు, స్వర్గమునకుఁ గారణమనియు, ఈపరాశక్తివిజ్ఞానము వలన
మోక్ష ప్రాప్తి కలుగుననియు, నవిజ్ఞానము వలన
బంధము సంభవించుననియు నందుకలన నీమెను నేనుభజించెదన
నియు, నీమెదర్శనము దైవవశము చే గలిగెననియు, దర్శనమాత్రము
చేతనే సమస్తపాపసంజరము వలన విముక్తుఁడ నైతిననియుఁ దలచి భక్తి
తోఁగూడినవాఁడై చైతన్యస్వరూపిణి యగు సీతను గ్రహించెనని"

దృశ్యేతే సజటౌ సచీరవసనౌ కింత్వౌ భవంతౌ మునీ,
తౌచేద్వాం నికటే శరాసన మియం నారీ కిమర్థం స్థితే।
కిం స్వస్మిన్విపినేతు భీకరమృగోపేతే చరంతౌ యువాం,
1దృష్టేవాంచరితే యువాం*మునియశఃప్రధ్వంసినౌ వాస్థితౌ ౩॥

---

* మునియశః ప్రధ్వంసినా ఇతి —

నన్వత్ర రామలక్ష్మణయో ర్విరుద్ధాచరణం కిమితి రక్షసా తథా నిందితం ?

నహి నిందాయాం కంచిదపి హేతుం పశ్యామః— తత్రహేతు రస్తీతి చేత్।

1 సదారత్వం తత్రహేతురితి వా ?

2 ఉత ధనుర్బాణధారిత్వం ?

నాద్యః— మహర్షీణా మపి సదారత్వదర్శనాత్।

న ద్వితీయః— అగస్త్యజామదగ్న్యాదీనా మపి ధనుర్ధారిత్వదర్శనాత్।

ఇతిచేన్న—

సదారాఅపిమహర్షయోబహిర్నిర్గమనేస్వజాయాస్స్వాశ్రమేష్వేవ నిక్షిప్య స్వయ మేకాకినో గచ్ఛేయుః, నహ్యత్ర తథా దృశ్యత ఇతి। కిం న ద్వయోర్నికటేత్వేకనారీస్థితి రపి విరుద్ధాచరణమిత రక్షసోద్యోతిత మిత్యూహ్యం—

3౭ మీరిద్దరును జటలను, నారచీరలను ధరించియున్నారు; మీరేమి
మునులా? మునులైన మీకీబాణములును, వనితయు నెందులకు?
1 ఈభయంకరాటవిని స్త్రీతోగూడ। మునిజనుల యశస్సును నశింపఁ
జేయుదొంగమునులవలె గన్పించుచున్నారు.

---

1 । మునిజనులయశస్సును నాశనముచేయు దొంగమునులవలెనున్నారు. అనుదానికివివరణము—ఇచ్చట రామలక్ష్మణులు మునిజనవిరుద్ధధర్మమేమి యాచరించినారని రాక్షసుఁడు రామలక్ష్మణులను దొంగమునులని తిట్టినాడు? ఇచ్చట రాక్షసకృతమైన నిందయందు హేతువేదియుఁగానము. ఒకవేళ హేతువేదైన నున్నదన్న భార్యాసహితత్వము గాని, ధనుస్సులను ధరించియుండుట గాని హేతువులు కావలెను. కానిమహర్షులుగూడ భార్యాసహితులైయుండుట సర్వసామాన్యమైనదిగాన మొదటిదానియందు సందర్భమేమియులేదు. అగస్త్యజామదగ్న్యాదులుగూడ ధనుర్ధారులై సంచరించునట్లు వినుచుందుముగాన రెండవదికాదు. అనునాశంకకు సమాధానమేమన--సభార్యులైనను మహర్షులు ప్రయాణసమయములందు తమభార్యల నాశ్రమపదమందుంచి తామొంటరిగ సంచరించుచుందురు. రామలక్ష్మణులువనితతోగూడ సంచరించుచుండుటయు, ఇద్దరితోడను ఒక్కవనితయే వచ్చుటంబట్టియు, లోకవిరుద్ధముగ రాక్షసునిచే దూషింపఁబడెనని యూహింపఁదగియున్నది.

ముక్త్వా త్వా ఫలతాపసా వన మిదం సంత్యజ్య దూరం గతాః,
త్వం మాం వేత్సి న వా విరాధమసురం ఖ్యాతం త్రిలోకత్రయే ।
లోకే యే బలినో వసంతి నితరాం తేషూత్తమో వై ఖరః,
తస్మాదప్యధికోఽహమేవ బలవాన్ తుల్యోఽస్తి మే నాపరః ॥ ౩౭
లోకే జీవితుమీప్సితం యది వసేద్వాం భూమిజాం తుం ద్రుతం,
సంత్యజ్య శుభలాయానం తు కురుతెం దూరం యువాం బాలకౌ ।
1* భార్యా మే భవితేయమన్యవనితే వేయం సదృశ్యా మయా,
2 గచ్ఛేతం యది నో యువామిహ తు వా రక్తం పిబేయం జలం తేర
రక్షసోఽఙ్కే వేపమానాం విలపంతీం తు భూమిజాం ।
3* పశ్య న్విలాపకృద్రామః ప్రాహేద మనుజం వచః ॥ ౩౮ ॥

---

1* విశేషార్థః-భార్యాభయాశాంత్యా ఆర్యాపూజ్యా ఇయం సీ
తా, అన్యవనితేవ సామాన్యవనితేవ మయా సదృశ్యా భ
2 వితా కింతు లోకమాతృబుద్ధ్యా దృశ్యత ఇతి భావః। ॥ రక్తం
పిబేయం జలమిత్యత్రాపి విశేషార్థో గ్రాహ్యః। రక్తమనుర
క్తం యథా తథా పాంజలం యుష్మత్పాద ప్రక్షాళనజలం
పిబేయమిత్యర్థః। యువాం నగచ్ఛేతం యది కించిత్కాల
మత్రయువా మగత్యాస్థితౌ యది యుష్మత్పాదప్రక్షాళనం
కృత్వా పాదజలం శిరసిధృత్వా సర్వపాపనిరాసామర్థ్యమం
తః పిబేయ మితి పర్యవసితోఽర్థః।
3* పశ్య న్విలాపకృ ద్రామ ఇతి---
నన్వనేన రాఘవేణ విలాపః కృత ఇత్యవగమ్యతే న హి తత్ర కించిదపి

౩౭ ఓమానవులారా! నాయందలి భయమున ఋషులెల్లరును నివ్వనము నుండి పారిపోయిరి. ఎఱుగరా! నన్ను. ముల్లోకముల విఖ్యాతిగడించిన యీవిరాధుడు మీకెఱుకపడను వినరాలేదా? లోకమున బలవంతులమని విఱ్ఱవీగుబలశాలురలోనెల్ల ఖరుడుదిట్టయని మీరెఱిగియే యుందురు. వానికంటెను మించిన బలవంతుడను నేను. నన్ను మించిన బలశాలి యీజగత్త్రయమునందుగూడ లేడు.

౩౮ ఈభూమియందు మీరు బ్రతుకనిచ్చగింతురేని ఈసన్నెలాడిని విడిచి యిక్కడనుండి కాలికిబుద్ధిచెప్పుడు. నాకీకలుకులకొలికి పర
1 స్త్రీ కాదుగాక 1 భార్య కాఁగలదు. మీరిచ్చటనుండి వెడలకున్న
మిమ్ములను తెలకురంట్లకలెక్కసేసి నవతీక్ష్ణహానకముత్రావినట్లు మీ
2 రక్తమును ద్రావెదను. జాగ్రత! పొండు. పొండు.

౩౯ రాక్షసునిఱొమ్ములో, కసాయివాని చేతిలో మేకవలె గడగడ
3 వణంకుచు విలపించుచున్న వైదేహినిగాంచి 3 విలాపముఁజేయుచు రాముఁడు తనతమ్మునితో నిట్లనెను.

---

1 ఇటువిశేషార్థము:— భార్యా- భా+అర్యా అనునపుడు కాంతిచేఁ బ్రకాశింపదగినయీసీత, ఇతరస్త్రీవలె నాచే భావింపఁదగినది కాదు. ఇంక నేమనగా, సర్వజగజ్జననిగా భావించఁదగినదని భావము.

2 “రక్తం పిబేయం జలం” అనుచోట విశేషార్థము;-- రామాయణమును విడి చెల్లక కొంతకాలముండినచో సర్వపాపనోదకంబగు తమపాదపవిత్రోదకజలంబు నత్యంతానురక్తితో శిరమునదాల్చి పానము చేసెదనని భావము;

3 రామచంద్రుఁడు విలాపము సేయుచు అని చెప్పుటచే రాముఁడు విలపించినట్లు స్పష్టమగుచున్నది. “ఆపదలందు ధైర్యము సజ్జనలక్ష

హేతుం జానీమః। యేన విపది ధైర్యస్య సజ్జనలక్షణతయా శాస్త్రే కథితత్వేన సర్వజ్ఞేన మహతా సతా శ్రీరామచంద్రేణ విలాపః కృతః తత్ర హేతు రస్తీతిచే ద్భవాన్ప్రష్టవ్యః।

1 తాపసధర్మావలంబినో మమ ర[illegible]హానసమూపదోషస్సమాపతే దితి వా?

2 ఉత సాపత్న్యమాతృకామనా ఫలితేతివా?

3 యద్వా నిశాచరవశంగతా సీతా మహతీం కదృశీ మవస్థామాప్స్యతీతివా?

4 ఆహోస్విత్ స్వజాయాయా రక్షసాపహృతతయా నహీతః పరం జాయాసుఖం సంభవే దితివా?

5 అథవా స్వజాయాయా రక్షసా సంస్పృష్టతయా సంహృతేపి తస్మిన్ రక్షసి నహి సా పునర్జాయాత్వేన స్వీకర్తు మర్హేతివా?

1 నాద్యః। వానప్రస్థధర్మావలంబినామగస్త్య, జామదగ్న్యాదీనాంహింసాకర్మదర్శనాత్ । కించ "అహింసాఽసాధుహింసేతి శ్రేయాన్ ధర్మపరిగ్రహః" ఇతిమహాభారతేఽసాధుహింసాయా అహింసాత్మకత్వేన కంఠరవేణో క్తత్వాచ్చ.

యమునిశాస్త్రము ఘోషించుచుండె సజ్జనుడును మహాత్ముడునగు
రామచంద్రుడు విలపించుటలో కారణము కన్పడదు. ఒకవేళ
కారణమున్నదనిన నీక్రిందికారణములలో నేకారణమో యుం
డవలసి యున్నది

1 తాపసధర్మము నవలంబించినవానికి రాక్షసుని సంహరింపవలసివచ్చె
ననియు వంపునవలన హింసాదోషము సంభవించుననియు రాముని వి
లాపమా!

2 లేక వనవాసక్లేశము నోర్వలేననియా!

3 లేక రాక్షసునివశమయిన సీత యెట్టి కష్టము పడునోనని యా విలాపము

4 లేక తనభార్య రాక్షసునిచే నపహరింపఁబడినందున దనకుసాంసా
రిక స్త్రీ సౌఖ్యము పోయెననియా విలాపము!

5 లేక, తనభార్యను రాక్షసుడు స్పృశించినందున వానిని చంపినను
తిరిగియామెను భార్యనుగా స్వీకరింప నసమర్థుడాలనియా?

1 మొదటి కారణము కాదు. వానప్రస్థధర్మమునవలంబించిన యగస్త్య
జామదగ్న్యాదులుసైతము వాతాపిమొదలగు రాక్షసులను సంహ
రించినట్లు (హింసాకర్మనుచేసినట్లు) కన్పడును. కావునను, మఱి
యు దుర్మార్గులను హింసించుట హింసకాదని భారతమున కంఠ
రవముగఁ జెప్పఁబడినది. కావున మొదటిది గాదు.

2 నాపిద్వితీయః, తథాత్వే చతుర్దశసమానంతరికప్రథమదివసే ధ్రువ మహం సాకేత మావ్రజేయ మితి రామోక్తే రసంగతత్వాత్.

3 నాపితృతీయః, నహి నిశాచర స్తత్కాముకో జానకీం ప్రహర్తుం యతిష్యతీతి విజ్ఞానాత్.

4 నాపిచతుర్థః, వనవాసకాలేసీతారామయో స్స్వయం బ్రహ్మచర్యదీక్షావహత్వేన వనయాత్రాసహకారిణీమాత్రతయా తస్యాః పరిగ్రహీతు స్తత్సుఖానపేక్షిత్వేన తదర్థకవిలాపాసంభవాత్।

5 నాపిపంచమః, స్వజాయాయాం తేన సంస్పృష్టాయామపి స్వసంతుష్టిస్థితాయా మనుమానలేశావకాశాసంభవాత్, స్పర్శమాత్రేణ దోషాభావాచ్చ.

అతః తద్విలాపోఽసంగతఇతి చే దత్రోచ్యతే "వ్యసనేషు మనుష్యాణాంభృశంభవతిదుఃఖితః" ఇతి పూర్వోక్తరీత్యా రామస్య పరదుఃఖాసహిష్ణుత్వేన సీతాదుఃఖసందర్శనజన్యదుఃఖమేవరామస్య సతు స్వాభావికం కించమార్దవగుణోచితస్య వ్యక్తీక్రియత ఇతి నగోపశంకాస్పద స్తద్విలాప ఇతి వేద్యం.

(2) రెండవదికాదు! సవతితల్లికోరిక సఫలమైనదిగదా యని విలపించిన చోఁ బదునాలుగు సంవత్సరములు వెళ్లినమరుదినమున నిశ్చయముగ నేనయోధ్యకు వచ్చెదనని రాముఁడు దశరథునితో చెప్పెనది యసంగతమగును.

(3) మూడవదికాదు! సీతను కోరుచున్న విరాధుడు సీతను జంపుటకు యత్నింపడని రామునకుఁ దెలిసియేయుండుటవలన.

(4) నాల్గవదికాదు. వనవాసకాలములో సీతారాములు సమముగా బ్రహ్మచర్యదీక్ష జరుపుచున్నందున వనమాత్రపు సహచారిణిగా మాత్రముండునని సీతను వెంటబెట్టుకొని వచ్చినందునను తత్సుఖము నపేక్షింపనివాడగుటచే తత్సౌఖ్యము పోయెనని యు విలపించుటయు ననది యసంగతము.

(5) అయిదవకారణముకాదు. సీత రాక్షసునిచే స్పృశింపబడినను తన సమక్షమునందే యున్నందున నామెవిషయమై సందేహమున కవకాశమే లేకపోవుటవలనను, స్పృశించినంతమాత్రమున పాతివ్రత్య భంగము లేదుకావునను.

పై హేతువులవల్ల రామునివిలాపము సంగతముగ లేదని యొడి యాశంకకు సమాధానమేమనగా, "ఇతరులకష్టమును జూచి రాముడు మరింత దుఃఖపడును" అను పూర్వోక్తవచనముచే రాముఁడు పరదుఃఖమును సహింపలేనివాడగుటచే ప్రకృతమున సీతయొక్క దుఃఖమును జూచి రాముడు సహింపలేక విలపించుటే కాని వేరుకాదుకనుకను ఇందువలన రాముని పరదుఃఖాసహిష్ణుతారూపమగు మార్దవగుణము వ్యక్తమగుచుండుటవలనను గుణమే కాని రామునివిలాపము దోషాకరము కానేరదని తెలియదగును.

జాతా త్తాతమృతిశ్రుతే రనుజ మే రాజ్యచ్యుతే రప్యలం,
దుఃఖాద్దుఃఖ మిదం మహత్తర మభూ త్సీతాన్యసంస్పర్శజం।
1* యత్ప్రేమేసతు కైకయీ వనమిదం సంప్రేషయామాస మాం
తత్ప్రేమ స్సకలోరమేవ కుమతే స్సాపత్న్య మాతు స్త్వ
భూత్ ౪౦

---

1* యత్ప్రేమేనేతి। తస్యా యమాశయః—
సర్వజనప్రియే రామభద్రే సతి సాకేతవాసిని నహి స్వాత్మ
జస్య రాజ్యం సుస్థిరం భవేత్. కించ పౌరజానపదాశ్చ న
హి స్వపుత్రస్య వశంగతా భవేయుః, అపిచ తే రామభద్ర
ఏవ నిర్వ్యాజప్రేమాతిరేకతో భరతేన వివదేయుః, ఇత్యాలో
చ్య రామభద్రే వనం ప్రేషితే సతి తదా సతీ భూమిజా రా
మనుసృత్య వనంగమిష్యతి, తతో యేన కేనాపి రక్షసాపహృ
తా భవేత్, తత స్తద్వియోగాన్నహి రామోపి జీవితుమిచ్ఛే
త్, తతో మదాత్మజస్య రాజ్యం స్థిరీకృతం భవేదిత్యేతావ
దాలోచ్యైవ కైకేయీ కేవలం స్వాత్మజస్య రాజ్యమేవ
నాపృచ్ఛ్య రామస్య వనవాస మపి వృతవ త్యభూత్। తదీ
యమనోరథ స్త్వచిర మేవ ఫలిత ఇతి రామస్యాశయః।
ననుపూర్వోక్త చిత్రకూటచరితేన కైకయీసద్భావస్యస్వయ
మేవరామేణవిదితత్వేన భూయోప్యత్ర రామేణ కైకయీ
దూషణం నసంగచ్ఛత ఇతిచేదత్రోచ్యతే. నహి కైకేయీ
సద్భావేనచిత్రకూటే రాఘవం ప్రతి తస్యోక్తవతీ కింతు స్వపు

౪౦ లక్ష్మణా! ఇప్పుడీకష్టము ఈయన్యపూరుషుఁడు సీతను స్పృశించు టవలనఁ గలిగినంతటి దుఃఖమును కైక రాజ్యభ్రష్టతను గూర్చిన నాఁడును, తండ్రి చావువిన్న నాఁడునుఁ గూడ నొందియుండలేదు. ఇది
1 దుఃఖములలో నెల్ల కఠినదుఃఖము గదా! నా సవతితల్లి కైక యేకోరిక తో నన్ను వనములకు వెడలచిపనినదో యా కోరిక నేఁడు సఫల మైనది.

---

1) ఏకోరికచేత కైక నన్ను అడవికిఁ బంపెనో యనుదాని యాశయమేమనఁగా — సర్వజనప్రియుఁడైన రామచంద్రుఁడయోధ్యలో నుండినపక్షమున తనపుత్రునకు రాజ్యము స్థిరముగా నుండదనియు, పురజనులు తనపుత్రునకు వశులుగా నుండక పోవుటయే కాక ప్రజలు రామునియందు నిరూఢమైన ప్రేమగలవారగుటచే భరతునితోఁ గలహించుదురనియు నాలోచించి తానెవిధముగనైనను రాముని అడవికి బంపినచోఁ బతివ్రతయైన సీత రాముని దప్పక వెంబడించుననియు, నచ్చట నేరక్కసుఁడైన సీతనపహరించుననియు, పిమ్మట సీతావియోగముచే రాముఁడుగూడ జీవింపఁడనియు, అప్పుడు తనపుత్రునకు రాజ్యము స్థిరపడుననియు నింతదనుక నాలోచించియే తనపుత్రునకు రాజ్యము మాత్రమే కాక కైక రాముని వనవాసముఁ గూడఁ గోరెను. కైక కోరిక నేఁడు సఫలమయ్యెనని రాముని యాశయము. ఇందుపై నొక యాశంక కలుగును. (ఏమన) పూర్వము చిత్రకూటచరిత్రమును విచారించినచోఁ కైక సద్భావముతో నున్నట్లు రాముఁడు స్వయముగ గ్రహించినందున తిరిగి యిచ్చట కైకను రామచంద్రమూర్తి దూషించుట సంగతముగా లేదను నాశంకకు సమాధానమేమనగా —
అంతంతపనులు చేసిన కైక తిరిగి సద్భావముతో రాముని గూర్చి చిత్రకూటములోఁ దన తప్పును మన్నింపవలసినదని చెప్పినదని విశ్వసిం

ఇత్యేవం కథయంతం తం రాఘవం వీక్ష్య లక్ష్మణః,
క్రుద్ధోఽబ్రవీదిదం వాక్యం జ్వలన్నివ హుతాశనః ॥౪౧॥

సమర్థోఽపి కిమర్థం త్వం తిష్ఠసి ప్రాకృతో యథా,
జహ్యేన మసురం త్వం వా హంతు మాజ్ఞాపయాథవా ౪౨

అలం విలంబేన రఘూత్తమాద్య
శరం త్వరం ముంచ నిశాచరేస్మిన్,
ఇతి ప్రకోపేనతు లక్ష్మణేన
ప్రోత్సాహితః క్రోధగతోఽభవత్సః ॥౪౩॥

పశ్చాచ్చాపమనుత్తమం రఘుపతిః సజ్యం విధాయద్రుతం,
సన్ధాయాసుర మాజఘాన నిశితాన్ప్రాణాపహారాన్శరాన్,
విద్ధస్సన్నసురో విదేహతనయాం విన్యస్య భూమౌ కృథా
రామం సానుజ మాశు హంతుమనసా దుద్రావ శూలాన్వితః ॥౪౪॥

---

ప్రాకృతజనపదదూషణాభియా బహిస్తథా ప్రవర్తయామాసే
తి వా వక్తుం శక్యతే ।

యద్వా, సతిసంప్రాప్తే కష్టకాలే పరాపకృతివిస్మరణ
శీలానామపి పూర్వాపకృతిః స్మృతిపథాగతా భవేదితివా స
మాధేయమ్ ॥

౪౧ రాముడిట్లు పలుకఁగావిని లక్ష్మణుడు ప్రచండాగ్నివలె మండిపడుచు నిట్లనెను.

౪౨ అన్నా! సర్వసమర్థుడవైన నీవుగూడ యిట్లు సామాన్యజనులవలె నుపేక్షించెదరేల? యీదుష్టరాక్షసుని వెంటనే ఖండింపుము. లేదా! నాకనుజ్ఞనిమ్ము. వీనిని తెగటార్చెదను.

౪౩ రఘూత్తమా! ఆలసింపక యీదుష్టదానవుని శరవర్షమున ముంచివేయుము. అని లక్ష్మణుఁడు ప్రోత్సహింప శ్రీరాముఁడు సన్నద్ధుఁడయ్యెను.

౪౪ పిమ్మట రామచంద్రుఁడు తనయుత్తమోత్తమమైన చాపమునెక్కుపెట్టి బాణమును సంధించి ప్రాణములను దొంగిలించుబాణములచే నయ్యసురునిం గొట్టెను. ఆ రామబాణములచేఁ బీడితుఁడై విరాధుడు వైదేహినచ్చట భూమియందు దిగవిడచి మహాకోపమున రామలక్ష్మణులను సంహరించునావేశముతో శూలమొండు హస్తమునఁ బూని వారివైపునకు బరుగిడెను.

---

పగవాడను. ఇక నేమన తనపుత్రుడు, ప్రజలుదూషించెదరని దూషణభయముచే చెప్పినవిషయముగాని అంతశ్శుద్ధితోఁ జెప్పినది కాదనవచ్చును. లేక ఇతరులుచేసిన యుపకారమును మరచిపోవుస్వభావముకలవారికిని కష్టకాలము ప్రాప్తించినపుడు పూర్వము తమకుచేసిన యుపకారముస్మరణకువచ్చుననికూడ సమాధానము చెప్పఁగానవచ్చును.

తస్మి న్నక్షసి వర్షతిస్మ నితరాం రామశ్శరాసారకం,
శూలం తు ప్రయుయోజ రాక్షసవర స్తస్మిం స్తతో రాఘవే।
తచ్ఛూలం తు శరద్వయేన నితరాం చిచ్ఛేద రామ స్తతః,
సౌమిత్రిశ్చ వవర్ష బాణవితతిం తత్రాంతరే రాక్షసే ॥౪౬॥

తస్మి న్విరాధే తరసైకవారం
విజృంభమాణే సతి రాఘవాభ్యాం।
స్వాంగే ప్రయుక్తం శరజాల మాస్రీ,
దృహోర్గతం చిత్ర మలంప్రతీకాత్ ॥౪౭॥

తౌ వారోప్య భుజద్వయే తు తరసా రక్షోధిపే రాఘవౌ,
ఘోరారావ మలం విధాయ విపినంత్వభ్యాదరివ త్యాశునై।
తద్రక్షోవశరాఘవౌ జనకజా సంవీక్ష్య దుఃఖాన్వితా,
స్వోరస్తాడనపూర్వకం విలపతి స్మోచ్చై స్సముద్దిశ్యతౌ ॥౪౮॥

శ్రుత్వా భూమిసుతావిలాప మసురం హంతుంసముద్దిశ్యతం,
సౌమిత్రి ర్దనుజాంసగో సురపతే శ్ఛిచ్ఛేద వామం భుజమ్।
రామోదక్షిణబాహు మచ్ఛిన దరంతస్యాసురస్య క్రుధా,
తౌ ద్వా రాక్షసబాహుభంగవశతస్సంపేతతుశ్చావనౌ

వజ్రచ్ఛిన్న ఇవాచల స్సురవర స్సంభగ్న బాహుర్భువి,
స్పష్టం వైపతతిస్మ తంతుపతితం ముష్టిప్రహారై స్తథా।
పాదై ర్జానుభి రప్యరం రఘువరౌ తౌ సూదయంతౌ పునః,
ఖడ్గాభ్యాం చ పరిక్షతం వ్యతనుతాం శస్త్రైశ్చ తం రాక్షసమ్.॥౪౯॥

౪౫ రాముని శరపరంపరలు మేనునఁదాకుచున్నను దున్నపోతు వర్షపు జడినోర్చినట్లోర్చుచుఁ బోయిపోయి విరాధుడు రామునిపై శూలము బ్రయోగించెను. రాముఁడు నా రాక్షసుని శూలమును రెండు ముక్కలుచేసి వ్రయ్యలొనర్చెను. లక్ష్మణుఁడు నింతలోఁ దనచేతితీట దీరునట్లు వానిపై బాణవర్షము గురిపించెను.

౪౬ ఆరాక్షసుఁడు రామలక్ష్మణులతోఁ బోరి యలసిపోవుచుఁ దనశరీరమందు నాటినశరసమూహమును ఒక్కసారిగా దులించి బహిర్గతమొనర్చెను. ఆరాక్షసునిచర్య రామలక్ష్మణుల కాశ్చర్యకరమయ్యెను.

౪౭ ఇట్లు రామలక్ష్మణులపైఁ గినిసి విరాధుఁడు వారినిద్దరను రెండు భుజములనుం దుకొని కౌర్న్యనార్చుచు నవ్వనమ్మునఁబడి పోవుచుండఁ దననాథుడును, మఱందియు రాక్షసవశులౌటఁజూచి సీతగుండె బాదుకొనుచు వారినుద్దేశించి బిగ్గరగ నేడువ సాగెను.

౪౮ ఆరోదనమును విని లక్ష్మణుడు రాక్షసుని యసువులఁ బాపనెంచి వానిభుజమందుండియే వానియెడమచేతిని గత్తిచేఁ దెగనఱికెను. ఇంతలో రాముఁడుగూడ నతిక్రుద్ధుఁడై రక్కసుని కుడిచేతినిఁ గూడనఱికివైచెను. ఇట్లు తమచేతనఱకఁబడిన రక్కసుని బాహువులతోపాటు రామలక్ష్మణులుగూడ భూమియందుఁబడిరి.

౪౯ అప్పుడా దానవుఁడు వజ్రముచే రెక్కలునఱకఁబడిన పర్వతరాజుఁ బోలె భగ్నబాహుఁడై గుభేలున నేలపైఁబడెను. ఆక్రిందపడిన యసురుని శరీరమును, పిడిగ్రుద్దులచేత, పాదతాడనములచేతను, మోకాలిపోటులచేతను రామలక్ష్మణులు మర్దించిమర్దించి ఖడ్గముచే దెగనఱికిరి.

నిష్పిష్టో౽పి స నైకధా నహి మృతిం సంప్రాప్తవాన్ రాక్షసః
జ్ఞాత్వా౽వధ్య మముం నిశాచరవరం రామో౽బ్రవీల్లక్ష్మణం,
నాయం రాత్రిచరో వినా తు నిఖనా ద్ధంతుం న శక్యో౽పరైః
తచ్ఛ్రుత్వా రఘునాయకస్య వచనం ప్రాహాసుర స్తం వచః॥౧౦

1* నజ్ఞాతో౽సి పురా మయాద్య భగవ న్నానామ్యహం త్వాం మహిం,
పూర్వం తుంబురునామకో౽హ మభవం గంధర్వరాజో విభో।
రంభా ల్యవశా ద్విభో ర్ధనపతే ర్నాగా న్మహాం సంసదం,
తస్మాత్క్రోధ ముపేయివా న్ధనపతి ర్మాం శప్తవాన్రాక్షసం ॥౧౧॥

పశ్చా ద్రాఘవ మా మిదం ధనపతిః ప్రాహ ప్రసన్నీకృతో,
రామో దాశరథి ర్వధిష్యతి యదా త్వాం సానుజస్సంయుగే,
భూయ స్త్వం ప్రకృతిం గతో౽వనితలం త్యక్త్వా దివం ప్రాప్స్యసి,
త్వం తావద్భువి తిష్ఠ రాక్షసతనుం లబ్ధ్వా శుచం మాగమః॥౧౨
పశ్చా ద్రాక్షసకాయనిర్గతమహాదివ్యాకృతిః పూరుషః,
అత్యర్కేణ సుతేజసా రవి రివ ప్రద్యోతయ న్సర్వ దిశః।
ఆరుహ్యాశు విమాన మంబరతలే భక్త్యాన్విత స్సన్నతో,
నత్వా రాఘవమేవమాహ వచనం సానందముచ్చైస్స్వరః ॥౧౩

*! నజ్ఞాతో౽సి పురేతి — తవ సచ్చిదానంద జగన్మోహన శ్రీమూర్తిసంస్పర్శభాగధేయాత్పూర్వం నిరవధికకరుణయా మదీయ శాపవిమోచనాయావిర్భూత శ్రీరామ స్త్వమితి మయా నజ్ఞాత ఇత్యర్థః।—

౫౦ ఇట్లు ఖండింపఁబడియు కబంధుఁడు మృతినందఁడయ్యెను. పిమ్మట రాముఁడాతని నిట్లరధ్యునిగాఁ దలంచి లక్ష్మణునితో నిట్లనెను. లక్ష్మణా! ఈతడు భూమియందు ఖననమొనర్చఁగాని చచ్చున ట్లులేడు. అప్పలుకులు వినంబడిన వెంటనే రక్కసుఁడు రాముని తోనిట్లనెను.

1 ౫౧ రామా! ¹ఇంతకుమున్ను నిన్ను సాక్షాత్తువిష్ణుమూర్తిగ గుర్తింపనైతిని. ఇప్పుడు నిన్నెఱింగితిని. నాకథఁజెప్పెద నాలకింపుము. పూర్వము నేను తుంబురుఁడను గంధర్వనాయకుడను. నేనొక్కమారు రంభయందలి మోహముచే కుబేరునిసభకు హాజరుకానైతిని. అందు మూలమున నాపైఁగినిసి యాకుబేరుడు నన్ను రాక్షసునిగా శపించెను.

౫౨ పిమ్మట నేనాతనిప్రార్థించితిని దానఁబ్రసన్నుఁడై కుబేరుఁడు నాతో నిట్లనెను! దశరథపుత్రుఁడైన రాముఁడనుజునిగూడి యుద్ధమందెప్పుడు నిన్నువధించునో యప్పుడు నీవుమరల నీస్వరూపమును బొంది స్వర్గమును జేరగలవు. అంతవఱకుఁబోయి భూమియందు రాక్షసరూపుడవై వసింపుము దుఃఖింపకుమనెను.

౫౩ అనంతరము రాక్షసశరీరమునుండి యొక్కదివ్యస్వరూపుఁడగు పురుషుడు బయల్వెడలి తనశరీరకాంతిచే నలుదిక్కులు మాఱ్యనింపగిది వెలుగుచు విమానారూఢుడై రామునిభక్తితో నమస్కరించి యిట్లు పలికెను.

---

1 ఇంతకుమున్నునేను గుర్తెఱుగకపోతిని. యనుదానికి వివరణము:- ఓరామచంద్రా! నీయొక్క సచ్చిదానంద జగన్మంగళ దివ్యదేహ స్పర్శభాగ్యము నాకుగలుగకపూర్వము నీదపారకృపారసముచే నా శాపవిమోచనమునకై యవతరించిన శ్రీరామచంద్రమూర్తివి యని నేను నిన్నుగుర్తించకపోతినని భావము.

ఽక్షిప్తాస్తు భవంతియేఽవటతటే ప్రాప్స్యంతి తే సద్గతిం,
ధర్మోఽయం హి సనాతనో వ్యపగతానూనాంభవేదృక్షసాం।
తస్మాత్త్వం త్వవటే మదంగమనఘ ప్రక్షిప్య వశ్యాచ్ఛ్రుతం,
గచ్ఛేత శ్శరభంగదర్శనకృతే శ్రేయస్తతస్తే భవేత్ ౫౪
శ్రీరామచంద్ర! భవదీయకృపాకటాక్షా
న్ముక్తో వ్రజామి నిజలోక మహంతు శాపాత్।
భక్తిస్సదాస్తు చరణాబ్జయుగే త్వదీయే,
మా విస్మృతిర్భవతు మేత్వయిరామచంద్ర!౫౫
త్వయి చావనిజాయాం చ యత్కృతం దురితం మయా।
క్షమస్వ రామచంద్ర! త్వం తదజ్ఞానాత్కృతంమయా౫౬
రామేతఃపర మన్యసంస్మృతి మరం త్యక్త్వా మనో మే సదా,
త్వత్పాదాబ్జరతం సదాస్తు భవతాద్వాణీభవత్కీర్తనే।
శ్రోత్రం త్వచ్చరితశ్రుతౌ భవతుమే పాణిశ్చ తే స్వర్చనే,
నిత్యం తేపదకంజయుగ్మనమనేచాస్తూత్తమాంగంమమ॥౫౭॥
ఇతి స్తువ న్రాఘవం తం తదనుజ్ఞా మవాప్యసః
విమానేన జగామాశు దివ్యరూపధరో దివమ్ ॥౫౮॥
రాఘవోఽపి తతః కృత్వా రక్షసో క్తంతు సానుజః।
సంప్రాప్య భూమిజాం తస్యై గతముక్త్వా త్వనందయత్॥
ఇత్యాశ్చర్యరామాయణే,
అరణ్యకాండే ప్రథమస్సర్గ స్సమాప్తః.



౫౪ రామా! ఎవరు గోతిలో పాతిపెట్టబడుదురో వారలు స్వర్గము నొందెదరు. ఇది విగత జీవులగు రాక్షసులకు సనాతన ధర్మమై యున్నది. అందువలన నీవు నాశరీరమును గోతియందుఁ బాతిపెట్టి యనంతరము శరభంగాశ్రమమున కేగుము అందువలన నీకు శ్రేయస్సు కలుగగలదు.

౫౫ ఓ రామచంద్రా! నీ కృపాకటాక్షమువలన నేను శాపముక్తుడనై నిజలోకమున కేగుచుంటిని. నీ పాదారవిందములయందు నిశ్చలమైన భక్తిభావ మెల్లప్పుడు నా కుండునట్లు నీవనుగ్రహింపుము. నీ పాదారవిందములయందు విస్మృతి లేకుండగఁ జేయుము.

౫౬ ఓ రామచంద్రా! నేను నీ విషయమై సీత విషయమై యింతదనుక చేసిన దుష్కృత్యము తెలియక చేసినదిగాన క్షమింపుము.

౫౭ ఓరామచంద్రా! ఇటుపిమ్మట నితరచింతమాని నా మనస్సు నీ పాదారవింద సంసక్తమై యుండునట్లును, నావాక్కు నిన్నుఁ గీర్తించుటయం దాసక్తమై యుండునట్లును, నా శ్రోత్రము నీదు చరిత్రను వినుటయందే లగ్నమగు నట్లును, నా హస్తము నిన్నుఁ బూజించుట యందే యాసక్తమై యుండునట్లును, నా శిరము నీ పాదపద్మములను నమస్కరించుట యం దాసక్తమై యుండు నట్లును నీ వనుగ్రహింపుము.

౫౮ ఇవ్విధముగ విరాధుడు రాముని స్తుతించి యనుజ్ఞనొంది దివ్యరూపముతో విమానారూఢుడై స్వర్గమున కేగెను.

౫౯ పిమ్మట రామచంద్రమూర్తియును రాక్షసుడు చెప్పిన విధముననే యతని శరీరమును గోతియందుఁ బూడ్చిపెట్టి సీతయొద్ద కేగి గతవృత్తాంతమును జెప్పి యామెను సంతోషపెట్టెను.

ఆశ్చర్యరామాయణమున అరణ్యకాండమున
ప్రథమ సర్గము సమాప్తము.

## ద్వితీయస్సర్గః.



*స్వర్గస్థే సతి రాక్షసే రఘుపతి స్సీతానుజాభ్యాం యుతః,
పశ్చాద్వై శరభంగతాపసవర స్యాగాత్తమా దాశ్రమమ్,
నేతుం స్వం దివ మాగతేన త్రిదివాధీశేన శక్రేణ వై
తత్కాలే శరభంగయోగ్యపి ముదా జల్పన్నభూ దాశ్రమే॥ ౧

శక్రం త్వంబరసంస్థితం రఘుపతి ర్వీక్ష్యానుజం ప్రాహ కిం
సౌమిత్రే ఽవని మస్పృశంత మతులం పశ్యాంబరస్థం రథమ్,
తత్ప్రీత్యా ప్రియదర్శనా న్సురవరా న్నాకాధిపం పశ్యతా,
చ్ఛక్రోపీక్షితుమాగతో మునివరం త్వేవంమయామన్యతే ॥ ౨

వైదేహ్యా త్వ మిహా క్షణం నివసతా ద్ద్రష్టుం రథస్థం ధ్రువం,
గచ్ఛామీతి నిగద్య తేన సహసాఽఽయాంతం మునేరాశ్రమమ్
రామం వీక్ష్య సురేశ్వరో ఽవదదిదం వాక్యం మునీంద్రం ప్రతి
త్వాం రామ స్సము పైతి వీక్షితుమతో యుక్తా న మేఽత్ర స్థితిః॥ 3

ఇత్యుక్త్వా తు గతే మరుత్వతి దివం రామ స్ససీతానుజః,
సంప్రాప్యాశ్రమ మగ్నిసేవనకృతం సంవీక్ష్య తం తాపసమ్,
నత్వా తేన సుపూజిత శ్చ వసతిం కృత్వా మునిం రాఘవః
పప్రచ్ఛ త్రిదశేశ్వరాగతి మథ ప్రాహైవ మేతం మునిః॥ ౪

---

1 కవిః

## రెండవసర్గ ప్రారంభము.



౧ విరాధుడు స్వర్గస్థుడైన పిమ్మట రామచంద్రమూర్తి సీతాలక్ష్మణ సంయుతుఁడై బయలువెడలి క్రమముగ శరభంగాశ్రమమునకు వచ్చెను. ఆ సమయమున శరభంగి మహర్షియును తనను దేవలోకమునకుఁ దీసికొని పోవుటకు వచ్చిన దేవేంద్రునితో సంభాషించుచుండెను.

౨ అప్పుడు రామచంద్రమూర్తి లక్ష్మణునితో నిట్లు పలికెను. లక్ష్మణా! భూమిని స్పృశింపకుండఁ గొంచె మెత్తులో నాకాశమునందున్న యీ రథమును, ఆ రథమునందున్న ప్రియదర్శనులగు దేవతలను, వారి నడుమనున్న నాకాధిపతిని జూడుము. ఆ దేవేంద్రుడు శరభంగమునిని సందర్శించుటకు వచ్చె నని యూహించెదను.

3 సోదరా! నేను వెళ్ళి యీ రథారూఢునిఁ దెలిసికొని వచ్చువఱకు సీతయును నీవును నిచ్చట నుండు డని చెప్పి ఋష్యాశ్రమములోనికి వచ్చుచున్న యీ రామచంద్రుని దేవేంద్రుడు చూచి యమ్మునితో నిట్లుఁ బలికెను. ఓ మునీంద్రా! శ్రీరామచంద్రమూర్తి నన్ను జూచుటకు వచ్చుచుండెను కాన నే నిప్పు డిచ్చట నుండుట సమంజసము కాదు. (రావణవధ జరుగువరకు తనతో సంభాషింపకుండు నట్లు మహావిష్ణువు దేవతల నాజ్ఞాపించె నని తెలియ దగును.)

౪ ఇట్లు దేవేంద్రుఁడు స్వర్గమున కేగఁగా రామచంద్రుఁడు తిరిగి సీతాలక్ష్మణులతో గలిసి శరభంగమహాముని యాశ్రమములోని కేగి యచ్చట నగ్నికార్యమును జేసికొనుచున్న యమ్మహర్షిని జూచి యమ్మునిచేఁ బూజితులై యచ్చట నివసించి యిష్టాగోష్ఠి మాట్లాడుచు దేవేంద్రుని రాకకు గారణ మేమని యమ్మహర్షి నడుగఁగా రామచంద్రునితో శరభంగముని యిట్లు చెప్పెను.

శ్రీరామ! త్రిదశేశ్వ రోఽవనితలా న్మాం నేతు మాగా ద్దివమ్
దేవ త్వాం త్వవిదూరసంస్థిత మహం జ్ఞాత్వాఽనవేక్ష్య ప్రభుమ్
రామ త్వాం ప్రియదర్శనంచ సుచిరా దాకాంక్షితం చాతిథిం
గంతుం నే శతవా నహం తవ విభో ర్దృష్టేఃకృతార్థోఽభవమ్.౫

పశ్చా త్త్రీ నపి త స్సుమనసా పాద్యార్ఘ్యమూలాదిభి
స్సంపూజ్యాహ రఘూత్తమం ప్రతివచో భక్త్యాన్విత స్సాంజలిః
త్వాం జానామిహరిం త్వదాగమనశా ద్ధన్యోఽభవందుష్కృతాం
నాశాయాక్ష్య వినిర్గత స్త్వమితి వై జానా మ్యహం రాఘవ!౬

పశ్చా ద్రాఘవ మంబుజాక్ష మనఘం దూర్వాంకురశ్యామలం
సీతాలక్ష్మణసంయుతం నిఖిలవ్యాప్త్సంస్థం చ దివ్యాకృతిమ్;
కోదండాశుగధారిణం మునివర శ్చీరాంబరేణాన్వితం
సుస్నిగ్ధేన జటాచయేన సహితం ధ్యాత్వా క్షణం ప్రాహ తమ్.౭

*లోకే నాస్తి మమాపరం ప్రియతమం కార్యం భవద్దర్శనా
దక్షయ్యా శ్చ మయార్జితా రఘుపతే త్వన్నామ సంకీర్తనాత్
కర్తవ్యం మమ నాస్తి చాప్యమపి మే నాస్తిక్షితౌ యామ్యహం
లోకంత్వాత్మభువ స్త్వదాగమకృతే త్వేతావ దత్రావసమ్.౮

---

*వ్యా:—లోకం త్వాత్మభువ ఇతి, తస్యాయ మాశయః.
నిత్యనిరతిశయనిర్మలానందస్వరూపస్య భక్తపారిజాతస్య తవ
దర్శనానందం విహాయ మమ బ్రహ్మలోకేపి కిమపి కర్తవ్యం
నాస్తి. తథాపి స్వబలప్రారబ్ధకర్మాధీనో బ్రహ్మలోకం గమి

౫ ఓ రామచంద్రా! దేవేంద్రుఁడు భూలోకమునుండి నన్ను దేవలోకమునకు తీసికొని పోఁదలచి యిచ్చటకు వచ్చెను. ఓ ప్రభువర్యా! నీవు సమీపమునకు వచ్చితి వని తెలిసికొని చిరకాలమునుండి వాంఛింపఁ బడునట్టియు, ప్రియదర్శనుఁడ వైన నీదర్శనము చేయకుండఁగ వెళ్లుట కిష్టము లేక వెళ్లకుంటిని. నీ దర్శనముచేఁ గృతార్థుఁడ నైతి నని చెప్పెను.

౬ ఆనంతరము శరభంగమహర్షి సీతారామలక్ష్మణులను సుమనస్సుతో నర్ఘ్యపాద్యాదివిధులచేఁ బూజించి పిమ్మట భక్తియుక్తుఁడై యంజలి ఘటించి రామచంద్రునితో నిట్లుఁ బలికెను. రామచంద్రా! నీవు శ్రీహరివనియు, దుష్టసంహారణమునకై బయలుదేరితి వనియుఁ గూడ నెఱుఁగుదును.

౭ ఆనంతరము పుండరీకాక్షుఁడును దూర్వాదళమువలె శ్యామ (పట్లన) నొప్పువాఁడును, సీతాలక్ష్మణసహితుఁడును, సకలహృదీకుఁడు రనిమియును, దివ్యమంగళవిగ్రహుఁడును, కోదండపాణియు, లోకమునకు నారచీరలను ధరించినవాఁడును, జటామండలమండితుఁడును నైన రామచంద్రుని శరభంగమహర్షి తనహృదయపుండరీకమున కొంత కాలము ధ్యానించి యా కౌసల్యానందనునితో నిట్లుఁ బలికెను.

౮ *రామచంద్రా! నీదర్శనము కంటె వేఱుగఁ బ్రియమైనది యేదియు నాకీలోకమున లేదు. నీ నామసంకీర్తనముచే నేను శాశ్వతమైన లోకములను సంపాదింపఁ గల్గితిని. ఇంక నాకు భూమియందు జేయదగినదియుఁ బొందఁ దగినదియు నేదియు లేదు. ఇంక నేను శాశ్వత బ్రహ్మలోకమున కేగెదను. నీరాకకై నే నింతదనుక వేచియుంటిని.

---

* నేను శాశ్వతబ్రహ్మలోకమున కేగెదను. నీరాకకై యింతదనుక వేచియుంటిని, అనుదాని వివరణము.

వేచియుండుట యేలననగా నిత్యనిరతిశయ నిర్మలానందస్వరూపుఁడును, భక్తకల్పద్రుమమునగు శ్రీరామచంద్రుని దర్శనముకంటె బ్రహ్మలోకమునఁ జేయదగినదియుఁ బొందదగినదియు లేక పోయి

త్వత్తోఽన్యో భువి వర్తతే రఘుపతే కో వా దయాళుః ప్రభో
భక్తాభీష్టవరప్రద స్త్వితి చిరాత్త్వామేవ సేవే త్వహమ్
సంత్యజ్యాద్య తనుం దివం జిగమిషో ర్మే రామ! సంకర్షణం,
దత్త్వా త్వం శ్రితవత్సలత్వ మవనా వావిష్కరోషి ప్రభో! ౯

---

ష్యామీత్యేవ వక్తవ్య మితి; అత్ర బ్రహ్మలోకశబ్దేన సగుణ బ్రహ్మలోక ఏవ గ్రాహ్యః, నతు చతుర్ముఖబ్రహ్మలోకః, ఉపా నానాం సగుణ బ్రహ్మలోకవాసస్యైవ నిమిత్త కథితత్వాత్.

శ్రుతిః — తేఽర్చిషమభిసంభవంత్యర్చిషోఽహరహ్న ఆపూర్యమాణపక్షమాపూర్యమాణ పక్షా న్మాసాన్ మాసేభ్యస్సంవత్సరం సంవత్సరా దాదిత్యమాదిత్యాచ్చంద్రమసం చంద్రమసో విద్యుతం తత్పురుషోఽమానవస్స ఏనాన్బ్రహ్మ గమయతీతి బ్రహ్మణా సహ సంవిశ్యతే యాంతి పరమం పద మిత్యాదినా తేషాం సగుణబ్రహ్మణా సహ ముక్తి రిత్యేవ ధేయం.

☛ ఓ రామచంద్రా! నీకంటె దయానిధి లోకమున వేరొండు లేడనుట నిక్కము. నీవు భక్తచింతామణి వనియే చిరకాలమునుండి నిన్ను నేను సేవించుచుంటిని. ఈపాంచభౌతికశరీరమును విడచి లోకాంతరమునకుఁ బోవ నిచ్ఛించుచున్న నా కీ సమయమున నీవు దర్శనమిచ్చి నీభక్తవాత్సల్యమును లోకమునకు వెల్లడించితివి గదా!

---

నను ప్రారబ్ధకర్మబలముచే బ్రహ్మలోకమునకు వెళ్ళుచుంటిననియే శరభంగముని భావము. ఇచ్చట బ్రహ్మలోక మనగా చతుర్ముఖబ్రహ్మలోక మను నది కానేరదు. దానియందుఁ బునరావృత్తియుండుటవలన నని తెలియఁదగును. ఇక నేది యన సగుణబ్రహ్మలోకమనియే చెప్పఁదగియున్నది. సగుణబ్రహ్మలోకవాసులకే పునరావృత్తిలే దని యుపనిషత్తులయందుఁ జెప్పఁబడియున్నది (ఎట్లన) "ఉపాసకులు మృతినొందుటతోడనే యర్చిర్లోకమున కేగుదు రనియు, నచ్చటనుండి యతివాహకులు (బోయీలు) అహర్లోకమునకు మోసికొని పోయి దిగపెట్టెదరనియు, నచ్చటనుండి యతివాహకులు శుక్లపక్షాభిమాని దేవతాలోకమున విడిచెద రనియు, అచ్చటనుండి యతివాహకులు వీరిని మోసుకొని పోయి మాసాభిమాని దేవతాలోకమున విడిచెదరనియు, నచ్చటనుండి యతివాహకులు సంవత్సరలోకమునకుఁ దీసికొని పోయి విడిచెద రనియు, నచ్చటనుండి వీరలను వాహకులు మోసికొని పోయి చంద్రలోకమున విడిచెదరనియు, నచ్చటనుండి వీరిని విద్యుల్లోకమునకుఁ గొనిపోవుదు రనియు, నటనుండి యమానవపురుషులు వీరిని సగుణబ్రహ్మలోకమునకుఁ దీసికొని వెళ్లి యచ్చట దిగవిడిచెద రనియు నా సగుణబ్రహ్మలోకమున వీరలు సర్వసుఖముల ననుభవించి సగుణబ్రహ్మతోఁ గూడ ముక్తి నొందుదు రనియుఁ బునరావృత్తి లేదనియుఁ జెప్పబడినది.

రూపద్వయం రఘుపతే! తవ విద్యతే హి వాచ్యం చ వాచక మితి ద్వివిధం జగత్యామ్। ఆద్యా ద్ద్వితీయ మధికం భవితా యత స్త్వచ్ఛక్తం బభూవ భవనాగర తారణాయ. ౧౦

శ్రీరామచంద్ర! విషయేషు భవే స్వరస్య, యో నైకదాచి దనురాగరసో జగత్యామ్।త్వన్నామ్ని రాఘవ సచే ద్భవితాను రాగః కో నామ నో భువి తరే ద్భవవారిధిం తు. ౧౧

అజ్ఞానా దపి కీర్తితం ప్రభవితా త్వన్నామ హర్తుం త్వఘం కర్తుం త్వాత్మగుణా న్యథాఽగద మవిజ్ఞే నోపయుక్తం క్షమమ్ మంత్రోఽల్పోపి యదృచ్ఛయా భువి జనై రుచ్చారితోఽపి ద్రుతం దాతుంచ ప్రభవే ద్యథా ఫల మలం త్వన్నామ తద్వత్ప్రభో! ౧౨

యావజ్జీవ మలంకరోతు విధినా కర్మాణి మర్త్యోఽవనౌ కాశ్యాం వా వసతా చ్చిరం తు మనుజో రుద్రానువాకా న్జపన్ త్యక్త్వా సర్వ మిదం వనే వసతు వా కుర్వం స్తపో మానవః, *ముక్తి స్త్వస్త్యఘనాశకే భవహరే త్వన్నామసంకీర్తనే. ౧౩

---

* వ్యా—ముక్తి స్త్వస్త్యఘనాశకే భవహరే త్వన్నామ సంకీర్తనే, ఇతి. నను కీర్తనం క్రియా నచ క్రియాసాధనో మోక్షః, తస్య శ్రుతిస్మృతిపురాణేతిహాసాదిషు జ్ఞానైకసాధ్యత్వే

౧౦ ఓ రామచంద్రా! నీ రూపము వాచ్యము, (అర్థము) వాచకము (నామము) అని రెండు విధములు గలదై యున్నది. ఈ రెంటిలో సంసార సముద్రమును దాటించుటకు వాచకమే (నీ నామమే) సమర్థమై యందున మొదటి దాని కంటె రెండవదియే గొప్పదని చెప్పనొప్పును.

౧౧ ఓ రామచంద్రా! నీ నామము సంసార వారిధి దాటింప సిద్ధముగా నుండినను నందరు నెందులకుఁ దరించుట లేదనినఁ జెప్పెద వినుము. ఐహిక విషయములందు మానవుల కుండిన రీతి యనురాగము కలదో యా యనురాగము నీ నామమునందు కూడ నుండినచో నెవ్వడు భవసాగరమును దరింపఁడో చెప్పుము.

౧౨ "నీ నామమం దిట్టి మహిమ యున్నదని తెలియక పోయినను నీ నామము నుచ్చరించిన మాత్రముననే పాపపుంజము నశించి పోవును. లోకమునం దౌషధ మందలి మహిమ తెలియక పోయినను వీర్యవంతమైన యౌషధమును సేవించినచో దన గుణమును జేయక మానదు గదా. మఱియు, మంత్రము స్వల్పమైనను యదృచ్ఛచే నుచ్చరింపఁబడినను అది తన ఫలమును కొంచెమంతగఁ జేయ గలుగునట్లు నీ నామముగూడ యదృచ్ఛచే నుచ్చరింపఁబడినను మహాఫలదాయకము కాఁగలదు.

౧౩ శ్రీరామచంద్రా! మానవుడు యావజ్జీవము యథావిధిగ సత్కర్మలను జేసిన జేయుగాక. లేక ఏ మనుజుడైనను కాశిలో విశ్వేశ్వరుని సాన్నిధ్యమున నమక చమకములను జపించిన జపించునుగాక. లేక యెవ్వడైనను సర్వమును త్యాగము జేసికొని వనములందుఁ దపము జేసినఁ జేయుఁగాక! * మోక్షము మాత్రము భవమోచకము నఘనాశకము నగు నీ నామ సంకీర్తనమునందే యున్నది.

* 'మోక్షము మాత్రము నీ నామ సంకీర్తనము నందే యున్నది' యనుదానిపై నొక యాశంక కలుగు చున్నది. (ఏమనగా) సంకీర్తనము క్రియ కావున మోక్షము క్రియాసాధ్యము కానేరదు. ఇక నేమన మోక్షము జ్ఞానైకసాధ్య మని శ్రుతి స్మృతి పురాణేతిహా

నాచార్యైరేవ కథితత్వాత్, నచ సాక్షాత్ జ్ఞానసాధనత్వమేవ తస్య మోక్షసాధనత్వ మితి, శ్రవణాదేరేవ సాక్షాజ్జ్ఞానసాధనత్వేన కథితత్వా దితి చే దత్రోచ్యతే.

"మ్రియమాణో హరే ర్నామ గృణ న్పుత్రోపచారితం। అజామిళో ప్యగా ద్ధామ కిముత శ్రద్ధయాన్వితః ఇత్యనేన తస్య మోక్షసాధనత్వం విజ్ఞాయతే."

కించ—"అవశేనాపి యన్నామ్ని కీర్తితే సర్వపాతకైః పుమా న్విముచ్యతే సద్య స్సింహత్రస్తై ర్మృగైరివ" [అస్యాయమాశయః· యథా కశ్చిద్రాజకుమారః సింహశిశుం పరిగృహ్య పంజరే విధాయ పుష్ణాతి తేనచ పరిచయప్రయుక్తానురాగేన వనాంతరే విహరతి, తస్మాచ్చకితై ర్వనగజవ్యాఘ్రాదిభి ర్ముచ్యతే దూరాత్, తథా వదనపంకజస్థా ద్భగవన్నామకంఠీరవా ద్భీతైః పాతకైః పురుషః పరిహీయతే) ఇత్యాదినా తస్యాఘనాశకత్వంచ సువ్యక్తం భవతి.

కించ—"సకృదుచ్చరితం యేన హరి రిత్యక్షరద్వయం బద్ధః పరికర స్తేన మోక్షాయ గమనం ప్రతి" త్యనేనా ప్యఘహరత్వం కథితం, పరికరబంధ శ్చాత్ర ప్రక్షీణపాపత్వమేవ తస్యై వాపవర్గప్రాసాదారోహణాయ ప్రథమసోపానత్వేన కథితత్వాత్.

సాధులయందుఁ జెప్పబడినది. సంకీర్తనమునకు సాక్షాద్జ్ఞాన సాధనత్వమే మోక్షసాధనత్వమని చెప్పుటకును వలనుపడదు. శ్రవణమననాదులు సాక్షాద్జ్ఞానసాధనము లని చెప్పబడినవి. కాని నామ కీర్తనము సాక్షాద్జ్ఞానసాధన మని చెప్పబడి యుండలేదనియు నిచ్చట నామకీర్తనము మోక్షసాధనమని చెప్పుట సమంజసముగ లేదనియు నాశంక పొడముగా సమాధానము చెప్పబడు చున్నది. (ఏమనగా) "మరణకాలమున నజామిళుడు నారాయణా యని తన పుత్త్రునిఁ బిలిచినంత మాత్రముననే భగవన్నామోచ్చారణ ఫలము కలిగి యాతడు ముక్తి నొందెననియు, శ్రద్ధతో భగవన్నామ ముచ్చరించినచో నింక చెప్పవలసిన దేమియున్న దనియెడి పురాణవాక్యమును విచారించిన నామ సంకీర్తనము ముక్తిసాధన మని స్పష్టపడుచుండెను.

మఱియు "అవశుడై యుండియు భగవన్నామమును నొక్కమారుచ్చరించిన మాత్రమున, సింహమువలన మృగములు భయపడి పారిపోయినవిధమున పాపములు వెడలిపోవును" (అనగా నొకరాజపుత్త్రుడు సింహపుపిల్లను పట్టుకొని పంజరమునఁ బెట్టి పోషించుచు దానితోఁ జిరపరిచయము గలుగుటవలన గలిగిన ప్రేమచే నాసింహపుపిల్లను గూడ వెంటఁబెట్టుకొని వనమధ్యమున సంచరించుచుండగా నతని వెంటనున్న సింహమువలన భయపడి వనగజములు మొదలగునవి పారిపోవ రాజపుత్త్రుడా వనమృగములనుండి విముక్తుడైనట్లు ముఖపంజరమునందున్న భగవన్నామమను సింహమువలన పాపములనియెడి వనమృగములు పారిపోవ నాపాపములవలన విముక్తుడగును.) అనియెడి పురాణవచనముచే భగవన్నామసంకీర్తనమునందు పాపనాశకత్వము స్పష్టమగుచున్నది.

ఇదియును గాక "హరియను రెండక్షరములను నొక్కమా రుచ్చరించినంత మాత్రమున మోక్షమును గూర్చి వెళ్ళుటకు బరికరములను గట్టినవాడగును" (పరికరములను గట్టుటయనగా మోక్షసాధము వెళ్ళుటకుఁ బ్రథమ సోపానము పాపక్షయముగాన నిచ్చట పాప

అపిచ—"హత్యాయుతం పానసహస్ర ముగ్రం గుర్వం నాగకోటినిషేవణంచ । స్తేనాన్యసంఖ్యాని హరేః ప్రియేణ గోవిందనామ్నా నిహతాని సద్యః" ఇత్యనేనాపి భగవన్నామ కీర్తనస్య మహాపాతకాది సర్వపాపహరత్వం సుస్పష్టం ప్రతిపాదితమేవ.

నను సమస్తానామేవ భగవన్నామ్నా మేతాదృశం సామర్థ్య ముత వ్యస్తానామపి; న తావ త్సమస్తానామేవ; అవశ్యేనాపీతి విశేషణాత్, నహ్యవశేన సమస్తానా ముచ్చారణం సంభవతి. అథ వ్యస్తానాం తత్రాపి కిం సర్వేషామేవ ఉత కేషాంచిదేవ? తత్ర యది సర్వేషామేవ నరకస్పృష్టే రానర్థక్యం ప్రసజ్యేత. నహ్యజాతిబధిరస్య కస్యాప్యేత త్సంభావ్యతే యన్నామ సహస్రమధ్యే కించిదపి కదావాపి కథంచిదపి నశ్రుణోతి నగృహ్ణాతి, అపిచ యది సర్వేషాం సమానం సామర్థ్యం, ఏకేనైవ పురుషార్థసిద్ధే రన్యేషామానర్థక్యం ప్రసజ్యేత,అన్యచ్చ సమాన సామర్థ్యానాం నామ్నాం సమాహారే త న్మహిమ్నా మపి సమాహారాత్ ఏకస్య శ్రీరామనామ్నో నామసహస్ర

క్షయమగుటకే పరికరములను గట్టుట యని.) అనియెడి పురాణ వచనము చేతనుగూడ భగవన్నామ సంకీర్తనమున పాపనాశకత్వ మున్నట్లు స్పష్టమగుచుండెను. ఇంతియేకాక "పదివేల హత్యలను జేసిన పాపమును సహస్రసురాపాన దోషమును, కోటిగురుదారాగమన దోషములును, అసంఖ్యాకములగు చౌర్యదోషములును, గోవిందా యని యొకమారు నామోచ్చారణము చేసినంత మాత్రమున వెంటనే నశించును" అను పురాణ వచనము నాలోచించిన నామకీర్త నమునకు పాపక్షయము చేయుశక్తి యున్నదనుట స్పష్టమగుచున్నది. కాన భగవన్నామము మోక్షదాయక మనుట సమంజసమే యని తెలుచున్నది.

ఇందుపై నొక యాశంక పొడముచున్నది. (ఏమనగా) సమస్త భగవన్నామములయం దన్నిటియందు కలిసి యిట్టి సామర్థ్యముకలదా! లేక, వ్యస్తములకు గూడ ప్రత్యేకముగా నిట్టి సామర్థ్యము కలదా!

సమస్తభగవన్నామములకుఁ గలిసి యిట్టి సామర్థ్య మున్నదనినచో అవశుడై యుండియు నొక్కమా రుచ్చరించిన ముక్తి కలుగునని" పూర్వవాక్యమును విచారించిన నవశుడు సమస్త నామముల నుచ్చరింపుట సంభవింపదు. వ్యస్తములకే యనినచో నందులోఁ గొన్నిటికా, లేక యన్నిటికా? యను నాశంక కలుగును. అన్ని టికి యనినచో సహస్రనామములలోనే యొక నామమునైనను పుట్టుచెవుడులేని మానవుడెల్ల నుచ్చరించియే యుండునుగాన నరక సృష్టియే యనర్థక మగును. ఇదియునుం గాక నామములయం దన్నిటి యందును సమానసామర్థ్యమే యున్న దనినచో నేయొక నామము చేతనే పురుషార్థము సిద్ధించుటవలన నితరనామము లన్నియు నిరర్థక ములు కావలసి వచ్చును. ఇదియునుంగాక, సమానసామర్థ్యము గల నామములకు సమాహారము (సమూహము) చెప్పినచో నా యా మహిమలకును సమాహారము చెప్పవలసి యుండును. అప్పుడు శ్రీరామనామ మొక్కటియే సహస్రనామములతో సమానమగున

సామ్యాభిధానం నావకల్పతే, నహి ప్రదీపసహస్రస్య యావా న్ప్రకాశః తావానేకస్య ప్రదీపస్య భవిష్యతి, సామర్థ్యాయుచ వైషమ్యంతు భవత్యేవ. యావత్ఖలు ఖద్యోతసహస్రస్య తేజ స్తావ దేకస్యైవ ప్రదీపస్య.

అథ కేషాంచిదేవ, తత్ప్రాప్తిః అన్యేషా మానర్థక్యంతు తద వస్థ మేవేతి చే దత్రాభిధీయతే.

సర్వేషామపి భగవన్నామ్నాం ప్రత్యేక మేతాదృశం సామర్థ్యం, నచ నరక స్పృష్టే రానర్థక్యం, దగ్ధేపి కథంచి త్ప్రాచీనే పాప్మని తదుత్తరకాలభావిభి ర్మహదవమానైశ్చ నరకపాతస్యాపి సంభవాత్.

నచావృత్తి గుణకమేవ కీర్తనం సర్వస్యాపి కశ్చిదస్తి నియమః, అతఏవ భరతదేవస్యాపి ఋషభదేవే నానుగృహీత స్యాపి ప్రతిబద్ధాపవర్గానుభవవత్త్వాత్ , అంతిరామై రత్యంత సముచ్ఛిన్నభగవదుపాసనత్వాచ్చత,దుత్తరకాలభావినామ్మృగా సక్తిరూపేణ కర్మణా నికృష్టదేహారంభః, జయవిజయయోశ్చ వైకుంఠవాసినో రపి బ్రహ్మవిదవమానా దధఃపతనం, వేనస్యతు భగవన్నిందాప్రతిబద్ధసామర్థ్యం సకృత్కీర్తన మావర్త్యమాన మపి నపాపక్షయాయాలం, శిశుపాలాదీనాంతు నిత్యవైరాను బంధ పరికల్పితసంపద స్సమాధే రేవ నిందాదోషస్యాపి దగ్ధ త్వాత్ పురుషార్థప్రాప్తి రితి సమాధేయం.

దని చెప్పు వాక్యము కూడ నసంగత మగును. లోకమందు వెయ్యి దీపముల కుండెడి ప్రకాశ మొక్క దీపమున కుండుట యసంభవము గదా! సామర్థ్యములో వైషమ్యము (భేదము) ఉండినచో నటు సంభవింపవచ్చును. ఎట్లనగా వెయ్యి మిణుగురుపురువుల కుండెడి ప్రకాశ మొక పెద్ద దీపమున కుండుట యసంభవము కాదుగదా! ఇట్లు పైన చెప్పబడిన విధముగ నామములకు సమానసామర్థ్యము చెప్పుటలో నాశంక కలుగును. సామర్థ్యము కొన్ని నామములకే యని నచో నితర నామములకు నిరర్థకత్వము సంభవించునను నాశంక కలుగును. వీనికి సమాధాన మేమనగా—భగవన్నామముల కన్నిటికిని ప్రత్యేకముగానే యిట్టి సమానసామర్థ్య మున్నది. ఇటులఁ జెప్ప నచో నరకసృష్టియే నిరర్థకము కావలసి వచ్చునను నాశంకకు సమాధాన మేమనగా సకృన్నామస్మరణముచేఁ బూర్వపాపము క్షీణించినను, అనంతరకాలమునందుఁ జేయబడు సజ్జనతిరస్కారము మొదలగువాని వలన నరకమునఁ బతనము కూడ సంభవించును గాన నరకసృష్టి యనర్థక మనుటకు వలనుపడదు. అందరును నామము నావృత్తిచేయుదురను నియమము లేదు. కావుననే జడభరతుడు ఋషభ దేవునిచే ననుగ్రహింప బడినను ప్రతిబంధింపబడిన యపరోక్షాను భవము గలవాడు తాన మధ్య మధ్య విఘ్నముచే భగవదుపాసనము విచ్ఛిన్నమైనందు వలనను మృగాసక్తి రూపమగు నుత్తరకాలిక మగు కర్మచే నికృష్టదేహారంభము కలిగెను. జయవిజయులు వైకుంఠవాసు లైనను బ్రహ్మవేత్తల నవమానించుటచే నధఃపతనము సంభవించెను.

వేనుడు సకృన్నామోచ్చారణము చేసియే యుండునుగదా. వానికి ముక్తియేల కలుగలేదనగా, భగవన్నిందచే నామకీర్తనము నందలి సామర్థ్యము ప్రతిబంధింపబడి పాపక్షయమునకు సమర్థము కాజాలదయ్యె నని సమాధానము చేసికొన దగియున్నది.

శిశుపాలుడు మొదలగు వారు నిత్యవైరానుబంధరూపమగు సమాధి సాధనసంపత్తి గలవారైనందున నిందాదోషము కూడ

పశ్చాత్తం తు తపోధనం రఘుపతిః ప్రాహ ప్రసన్నో వచః,
వస్తుం మే మునివర్య! యోగ్యవసతిం బ్రూహి ప్రసన్నో మయి
ఇత్యుక్తో మునిరాడ్విచార్య మనసా ప్రాహాథ రామం వచః
శ్రీరామ త్వమితో వ్రజేశ్శుభతరం రమ్యం సుతీక్ష్ణాశ్రమమ్॥౧౪

మామకం సుకృతం సర్వం రామచంద్ర! దదామి తే
నహి తేన ఫలం కించిన్మమాస్తి భువి కృత్యాతామ్.
సీతయా సహిత స్త్వం తు వసతాన్మే హృది క్షణమ్. ౧౫

---

యదప్యుక్తం ఏకేనైవ పురుషార్థసిద్ధే రన్యేషా మానర్థక్య మితి తదప్యయుక్తం, పురుషభేదేన సర్వేషా మపి పురుషార్థ సాధనత్వోపపత్తేః.

యత్తు సమానమహిమ్నాం నామ్నాం సమాహారే తత్తన్మహిమ్నా మపి సమాహారాత్ నైకస్య తాదృశో మహిమేతి.

తదపి పరిచ్ఛిన్న ప్రభావేషు ప్రదీపాదిషు ఘటతే; నపున ర్నిరంకుశ మహిమసు భగవన్నామసు, నఖలు చింతామణీనాం నిచయస్య ఏకస్య వా చింతామణేః, కల్పశాఖినాం వనస్య ఏకస్య వా కల్పశాఖినః కశ్చి దస్తి విశేషః, అతః భగవన్నామకీర్తనమేవ పాపనాశక మపవర్గప్రదం చేత్యలం విస్తరేణ.

౧౪ అనంతరము ప్రసన్నుఁడైన యా రామభద్రుఁడు ఆ మునీంద్రునితో నిటులఁ బలికెను. ఓ మునివర్యా! నేను కొంతకాలము నివసించుటకు యోగ్యమగు తావును జెప్పుమనఁగా నమ్మునీంద్రుఁడు మనమున విచారించి రామునితో నిటులఁ బలికెను. ఓ రామచంద్రా! నీవిచటి నుండి శుభప్రదమైన సుతీక్ష్ణాశ్రమమునకు పోగుము. నీ వచట సుఖముగా నుండగలవు.

౧౫ ఓ రామచంద్రా! నాదు సుకృతము నీకిచ్చుచున్నాడను. నా కింక సుకృతముతోఁ బనిలేదు. కావున నీవు గ్రహింపుము. సీతాసమేతుఁడవై నీవు నా హృదయపుండరీకమున చిరకాలము నివసించెదవు గాక.

---

ర్థమై పురుషార్థప్రాప్తిని గలుగఁ జేసిన దని తెలియదగును. ఒక నామముచేతనే పురుషార్థము సిద్ధించిన యితర నామము లనర్థకములు కావలసివచ్చునను పై యాశంకకు సమాధాన మే మనగా, పురుషులు భిన్నభిన్నులు గాన పురుషభేదముచే నామము లన్నిటికిని సఫలత్వము గలుగు నని సమాధానమై యున్నది, సమానమహిమ గల నామముల వల్ల సమాహార మగు నెడల నాయా మహిమలవల్ల సమాహారము చెప్పవలసి యుండునుగాన నొక్క నామమునకుఁ గూడ నట్టి సామర్థ్యము లేకపోవలసి వచ్చునను పై యాశంకకు సమాధాన మేమనగా, మితమైన ప్రభావముగల తీర్థాదులయెడ నది సంభవించును గాని యమితప్రభావము గల భగవన్నామముల విషయమై యది సంఘటింపదు, ఎట్లనగా, చింతామణుల సముదాయమునకు గాని, లేక, యొక చింతామణికి గాని సామర్థ్యములో భేద మేమియు నుండదు. మఱియు, కల్పవృక్షముల వనమునకు గాని, యొక కల్పవృక్షమునకు గాని భేదముండనట్లు భగవన్నామ సముదాయమునకు గాని లేక యొక భగవన్నామమునకు గాని సామర్థ్యములో భేద ముండదని, సమాధానము చెప్పఁదగి యున్నది. కాన భగవన్నామము పాపక్షయ కరము, నపవర్గప్రద మనుటలో సందియ మెంతమాత్రమును లేదని పర్యవసానము.

సీతానాయక! పాంచభౌతికతనుం త్యక్త్వా మ్యహం తేఽగ్రతః,
జీర్ణాం వ్యాళఇవ త్వచంత్వితిముని స్మృత్వాఽగ్నిమాధాయచ
హుత్వాత్మేన సమంత్రకం భగవతే దత్వా చ పుణ్యం నిజం,
పృష్ట్వాఽఽజ్ఞాం చితిమాశ్రితో *నిజతనుం దగ్ధ్వాఽజలోకం గతః.
౧౬

ఏవం తచ్ఛరభంగతాపసవరే సద్బ్రహ్మలోకం గతే
దంతోలూఖలినస్తథార్ద్రవసనా శ్శాంతాశ్చ పంచాగ్నయః
అబ్భక్షాశ్చ సమీరణాశనపరాః పర్ణాశనాః కేచన
సర్వే తాపసపుంగవా రఘుపతిం ద్రష్టుం తు తత్రాగతాః. ౧౭

*వ్యా:—నిజతనుందగ్ధ్వేతి-నను తస్యానల ప్రవేశో నసం
గచ్ఛతే, ఆత్మహత్యారూపదోష సంభవా దితి చేదత్రోచ్యతే.
యద్యుత్క్రాంతా తదావాప్తా బ్రహ్మమేధానలం ప్రవేశేదితి వచన
పర్యాలోచనయా, 'వృద్ధ శ్శౌచక్రియాలుప్తః ప్రత్యాఖ్యాత
భిషక్క్రియః, ఆత్మానం ఘాతయేద్యస్తు భృగ్వగ్న్యనశనాదిభి'
రితి ధర్మశాస్త్రవచనేన చ శరభంగస్యాగ్నిప్రవేశ స్సామంజస
మితి వేద్యం.

౩౮ ఓ సీతాపతీ ! సర్పముకదా ప్రాతకుబుసమును విడిచిపెట్టు చందమున ఈ పాంచభౌతిక దేహమును నీ ముందు నేను విడువఁగోరుచుంటినని చెప్పుచు నమ్మునీంద్రుఁడు వెంటనే యగ్నిని బ్రజ్వలింపజేసి సమంత్రకముగ నాజ్యముచే నందు హోమముచేసి తన పుణ్యఫలమును రామార్పణముచేసి యా రామచంద్రుని యానతి నొంది చితిని జేర్చి, యందుఁ బ్రవేశించి శ్రీరాముని ధ్యానించుచుఁ దన పాంచ భౌతిక దేహమును * దహింపఁజేసికొని దివ్యరూపధరుఁడై బ్రహ్మలోకమున కేగను.

౩౯ ఈ ప్రకారము శరభంగమహర్షి శాశ్వత బ్రహ్మలోకమున కేఁగగా దంతములచే గింజలపై పొట్టును దీసి తిని జీవించువారును, ఆర్ద్రవస్త్రధారులును, శమప్రధానులును, పంచాగ్ని సేవకులును, జలభక్షకులును, వాయుభక్షకులును, మొదలగు తాపసపుంగవు లందరును శ్రీరాముని దర్శించుటకై శరభంగాశ్రమమునకు వచ్చిరి.

---

* ౩౮ వ్యా॥ తన దేహమును దహింపజేసికొని యనుటచే శరభంగ మహర్షి యగ్నిప్రవేశము చేసినట్లు తెలియబడుచున్నది. ఆత్మహత్యారూపదోషము సంభవించు గాన నమ్మహర్షి యగ్నిప్రవేశము చేయుట సమంజసముగా లేదని యాశంక కలుగును. ఇందునకు సమాధాన మేమనగా, అగ్నిప్రవేశము చేయవలయు నను కోరిక యుండిన బ్రహ్మమేధాగ్నినిఁ బ్రజ్వలింపఁజేసి యందుఁ బ్రవేశించి శరీరమును వదలిపెట్టవచ్చును'' అను స్మృతివచనము నాలోచించి నను ''వృద్ధులు, లుప్తశౌచులు, వైద్యులచే నిరాకృతులై జీవితాశ లేనివారలును, అగ్నిప్రవేశము చేసికాని నిరశనవ్రతమును బూని కాని శరీరమును విడిచినను నాత్మహత్యారూపదోషము సంభవింపదు.'' అను ధర్మశాస్త్రవచనమును విచారించినను శరభంగమహర్షి యగ్నిప్రవేశము చేయుటవలన నాత్మహత్యారూపదోషము లేదనిభావము.

దృష్ట్వా తన్మునిసంఘమాశు పరయా భక్త్యాన్వితా స్తే త్రయ
స్సీతారాఘవలక్ష్మణా మునివరా న్నేముః క్రమా ద్దండవత్
ఆశీర్భి స్త్వభినంద్య తేఽపి మునయో రామం ససీతానుజం
పశ్చాత్సాంజలయోఽబ్రువ న్రఘుపతిం ధర్మైకశీలం విభుమ్. ౧౮

అత్రిత్యేషు తపోధనేషు సలిలాహారాశ్చ నిత్యాగ్నయో
వ్యబ్భక్షా శ్చ సమీరణాశనకృతః పంచాగ్నయోఽపి స్థితాః
ఏతే తాపసపుంగవా రఘుపతే! శ్రుత్వాఽఽగతం త్వా మిహ
ద్రష్టుం తే నిజకష్టనష్టనిచయం విజ్ఞాపితుం చాగతాః. ౧౯

శ్రీరామ! త్వదుపాసనాబలవశా త్సర్వే వయం త్వాం పునః,
భూభారవ్యపనోదనాయ జగతి ప్రాప్తావతారం హరిం
సీతాం మంగళదేవతాం త్వదనుజం శేషం చ విద్మో ధ్రువం
తస్మా న్మానుషభావతో వయ మహో నో వంచనీయా స్త్వయా.
౨౦

త్వన్నామైవ భవాబ్ధితారణకృతే త్వన్మాత్ర మస్తి ప్రభో!
కిం త్వత్ర ప్రభవేమ నో వయ మహో స్థాతుం తు రక్షోభయా
క్రవ్యాదా న్సముపేత్య రాత్రిషు బలా దత్తుం యతంతే మునీన్
రక్షోభక్షితతాపసాస్థినిచయం పశ్యాత్రిసంస్థం విభో! ౨౧

రక్షోభయం యథా న స్యా త్తథా కురు మహాప్రభో
అన్యథా శరణం నాస్తి రక్ష న శ్శరణార్థినః. ౨౨

౧౮ ఇట్లు తమ సమీపమునకు వచ్చిన మునిసంఘమును సీతారామలక్ష్మ
ణులుచూచి పరమభక్తితో వారికి నమస్కరింపఁగా నమస్కారములను
వారల ముగ్గురి నాశీర్వదించి యనంతరము చేతులు జోడించి ధర్మ
శీలుఁడగు రామచంద్రప్రభువుతో నిటులు విన్నవించిరి.

౧౯ ఓ రామచంద్రా! ఇచ్చటనున్న యీతపోధనులలో జలాహారులును,
వాయుభక్షకులును, పర్ణభక్షకులును, నిత్యాగ్నులు, పంచాగ్నులు
మొదలగు వారుండిరి. వీరందరును నీ విచ్చటకు వచ్చినట్లు తెలిసి
కొని నిన్ను జూచిపోవుటకును తమ కుండెడి కష్టనష్టములను విన్న
వించుకొనుటకును వచ్చియుండిరి.

౨౦ “మీ కష్టములను నాకుఁ జెప్పిన మాత్రమున సామాన్యమనుష్యుఁడను
నే నేమి చేయుదును” అని యను నేమో యని ముందుగనే యందుకు
సమాధానముఁ జెప్పుచుండిరి. ఓ రామచంద్రా! నీవు భూభారహర
ణార్థమై భూమియం దవతరించిన సాక్షాచ్ఛ్రీహరివే యనియు, సీత
లక్ష్మీదేవి యనియు, లక్ష్మణుఁడు శేషాంశసంభూతుఁడనియు, మా
మంత్రోపాసనాబలముచే మే మెఱుఁగుదుము. అందువలన నేను
సామాన్యమనుష్యమాత్రుఁడ నని నీవేదియూ చెప్పి మమ్ము మోస
గింపకుము.

౨౧ ఓ రామా! సంసారసముద్రమును దాటించుటకు మాకు నీనామ మను
నావ యున్నదిగాన మాముక్తివిషయమై నిప్పుడు మేము కోర
లేదు. ఇకనే మన రాక్షసబాధ యిచ్చట మెండుగా నున్నందున
మే మిచ్చట నివసింపఁజాలకుంటిమి. రాక్షసులు రాత్రులయం
దిచ్చట సంచరించుచు బలాత్కారముగా మునులను భక్షించు
చుందురు. మే మనృతము చెప్పుటలేదు. రాక్షసులచే భక్షింపఁబడిన
మునుల యస్థిపంజరములు గుట్టలుగ నిచ్చటనే యున్నవి చూడుము.

౨౨ రామచంద్రప్రభూ! మాకు రాక్షస బాధ లెట్లు లేకుండ నుండునో
యటులఁ జేయుము. మాకు వేఱు శరణ్యములేదు. కాన శరణాగ
తుల మగు మమ్ములను నీవు రక్షింపుము.

ఇతి తైః ప్రార్థితో రామః ప్రాహ తా న్మునిపుంగవాః
హరిష్యా మ్యసురా న్సర్వా న్కించిత్కాలవిళంబతః. ౨౩

పితాజ్ఞాకరణవ్యాజా ద్భవతా మర్థసిద్ధయే
సమాగతోఽహం విపినం రక్షసాం నాశనాయ చ. ౨౪
ఇతి తేభ్యోఽభయం దత్వా తత్త్రదాజ్ఞా మవాప్య సః
సీతాలక్ష్మణసంయుక్త స్సుతీక్ష్ణస్యాశ్రమం గతః. ౨౫

ఇత్యాశ్చర్య రామాయణే అరణ్యకాండే
ద్వితీయస్సర్గ స్సమాప్తః.



## తృతీయస్సర్గః.

[1]రామో భూసుతయా నుజేన సహితో గత్వా సుతీక్ష్ణాశ్రమం
తత్రత్యం మునిమప్యవేత్య సహితో భక్త్యా ప్రణమ్యాహ తమ్,
శ్రీరామోస్మ్యహ మాగతో మునివర! త్వాంద్రష్టుకామ స్త్వితి,
ప్రోక్తఃప్రాహమునీశ్వరో రఘుపతింత్వాలింగ్య దోర్భ్యాంతదా. ౧

దారాపుత్త్రగృహాఘకూప పతితం వ్యామోహపాశావశం
త్వాం మాఽనన్యగతిం కృపారసవశా దుద్ధర్తు మాగా ధ్రువమ్
సాక్షా దద్య భవత్పదాబ్జ మతులం వీక్షేఽహ మాద్యం బుధైః
ధన్యోహంభవదాగమా ద్రఘుపతే! మాన్యశ్చభూమావహమ్.

1. శాః.

౨౩ ఈ ప్రకారము వారలచేఁ బ్రార్థితుఁడై యా రామచంద్రమూర్తి యమ్మునులతో నిటులఁ బలికెను. ఓ మహాత్ములారా! నేను రాక్షసుల నందరను గొలదికాలములో సంహరింపఁగలను గాన నిర్భయముగా నుండుఁడు.

౨౪ పితృవాక్య పరిపాలన మను మిషచే నీ పనులను జక్కపెట్టుటకును రాక్షస వినాశనమునకును నేను వనభూమి కేతెంచితిని.

౨౫ ఇట్లు రామచంద్రమూర్తి యమ్మహర్షుల కభయ మొసంగి వారిసెలవు నొంది సీతాలక్ష్మణ సహితుడై పయనమై క్రమముగ సుతీక్ష్ణ మహర్షి యాశ్రమమునకు నేగెను.

ఆశ్చర్యరామాయణమున అరణ్యకాండమున

ద్వితీయసర్గము సమాప్తము.



## తృతీయసర్గ ప్రారంభము.

౧ పిమ్మట రాముఁడు సీతాలక్ష్మణ సహితుఁడై సుతీక్ష్ణాశ్రమమును జేరి యచ్చట తపశ్చర్య నున్న మునిని జూచి భక్తితోడ నమస్కరించి "మహాత్మా! నేను శ్రీరాముఁడను, నిన్ను దర్శించు నూహతో నిచ్చటకు వచ్చితిని." అని పలుకఁగా విని యా సుతీక్ష్ణుడును తన బాహుయుగ్మమున రాముని గౌగిలించికొని యిట్లు పలికెను.

౨ దారాపుత్రులు, ఇండ్లు వాకిండ్లను కూపములం బడి మహామోహపాశముచే బంధితుఁడనై దిక్కులేకయున్న న న్నుద్ధరింప దయ పుట్టి నా వద్ద కేతెంచితివి. దేవతలచే నెల్లప్పుడును సేవింపబడు నీ పాదాబ్జములను గన్నారఁ గాంచి ధన్యుఁడనైతిని. నీ యాగమనము వలన నేను ధన్యుడ నగుటయేగాక యీ భూమియందు నేను మాన్యుఁడను గూడ నైతిని.

రామచంద్ర! కృపాసింధో! భవవారిధితారక!
ఉప న్మనుం తేఽహ మపి భక్తకోటౌ విధేయతామ్. ౩
ఏక ఏవార్యమా యద్వ జ్జలపాత్రే ష్వనేకధా
భాతి త్వ మప్యేక ఏవ మాయయా భా స్యనేకధా. ౪
[1]త్వం సర్వభూతహృదయేషు కృతాలయోఽపి
త్వన్మంత్రజాప్యవిముఖేషు కరోషి మాయామ్
త్వన్మంత్రసాధనపరే ష్వపయాతి మాయా
సేవానురూపఫలదోఽసి యథా మహీపః. ౫

పశ్యామి రామ తవ రూప మరూపిణోఽపి
మాయావిడంబనకృతం తు మనుష్యవేషమ్
కందర్పకోటిసుభగం కమనీయచాప
బాణం దయార్ద్రహృదయం స్మితచారువక్త్రమ్. ౬

సీతాసమేత మజినాంబర మప్రధృష్యం
సౌమిత్రిణా నియతసేవితపాదపద్మమ్
నీలోత్పలద్యుతి మనంతగుణం ప్రశాంతం
మద్భాగధేయ మనిశం ప్రణమామి రామమ్. ౭
జానంతు రామ తవ రూప మశేషదేశ
కాలాద్యుపాధిరహితం ఘనచిత్ప్రకాశమ్
ప్రత్యక్షతోఽద్య మమ గోచర మేత దేవ
రూపం విభాతు హృదయే న పరం హి కాంక్షే.. ౮

1 అ॥ రా॥

౩ ఓ రామచంద్రా! కృపాసింధూ! భవవారిధితారక! నీ మంత్రో
పాసకుఁడనగు నన్ను గూడ నీ భక్తకోటిలోఁ జేర్చికొనుము.

౪ సూర్యుఁ డొకఁడైనను జలపాత్రములం దనేక రూపములతో
బ్రకాశించునట్లు నీవును ఒక్కఁడవయ్యు మాయచే ననేక విధము
లుగ భాసించుచున్నావు.

౫ నీవు సమస్తభూతముల హృదయాంతర్యామివై యున్నను నీ
మంత్రమును జపించుటయందు విముఖులైన జనులయందు మాయను
బ్రసరింపఁ జేయుచున్నావు. నీ మంత్రమును జపించు జనులనుండి
మాయను దొలఁగింపఁ జేయుచున్నావు. రాజు భృత్యులకు సేవాను
రూపమైన ధనాది రూపమగు ఫలము నొసంగుచున్నట్లు నీవు
భక్తులకు గూడ సేవానురూపమైన ఫలము నొసంగుచున్నావు.

౬ రామా! నీవు నరాకారుఁడవైనను మాయామానుషవిగ్రహుఁడవును,
కోటిమన్మథులకు సాటియగు నందచందముల వాఁడవును, మనో
హరములైన విల్లునమ్ములు ధరించినవాఁడవును, దయార్ద్రహృదయుఁడ
వును, చిఱునవ్వుఁదొలఁకు ముఖపద్మముచే నొప్పువాఁడవు నగు నీ
మనోహరాకారమును ఇప్పుడు ప్రత్యక్షముగఁ జూడఁ గల్గు
చున్నాఁడను.

౭ సీతాసహితుఁడవును, నారచీరలు ధరించినవాఁడవును, లక్ష్మణునిచే
నెల్లప్పుడును సేవింపఁ బడువాఁడవును, నల్లకలువఁబోలు దేహముకల
వాఁడవును, అనంత గుణాకరుఁడవును, శాంతస్వరూపుఁడవును, నా
యదృష్టదేవతవు నగు శ్రీరామచంద్రుఁడవైన నిన్ను నేను నమస్కరించె
దను.

౮ రామా! దేశకాలాద్యుపాధి రహితమైన నీ స్వయంప్రకాశ చిత్స్వ
రూపమును గొందరు సేవించిన సేవింతురుగాక! ఇచ్చట నిప్పుడు
నాకు బ్రత్యక్ష గోచరమగుచున్న యీరూపమే నా హృదయ సీమల
నిరంతరము వెల్గొందుఁగాక. ఇతర స్వరూపమును నేను గోరను.

[1]ఏవం సంస్తువతో మునే ర్భగవతో రామోఽబ్రవీ త్సస్మితః,
భక్తిం తే విమలాం తు వేద్మ్యహ మలం మన్నామసంకీర్తనాత్,
తస్మా త్త్వా మహ మద్య వీక్షితు మిహ త్వాగాం నసీతానుజః,
కిం చాహం శరభంగనామమునినా ప్రోక్తో భవద్యోగ్యతామ్. ౯

కించి త్కాల మిహ స్థాతు మహ మిచ్ఛామి తాపస,
స్థాతుం కథయ యోగ్యం మే నివాసస్థాన ముత్తమమ్. ౧౦
రాఘవస్య వచ శ్శ్రుత్వా సుతీక్ష్ణో ముని రబ్రవీత్,
రమ్యోఽయ మాశ్రమో రామ వాసయోగ్యో భవే త్తవ. ౧౧
ఋతే మృగభయా దన్యో దోషహేతు ర్న దృశ్యతే,
రాక్షసేభ్యో భయం చాస్తి రామచంద్రాశ్రమాంతరే. ౧౨

తచ్ఛ్రుత్వా వచనం తతో రఘుపతి స్తం తాపసం త్వబ్రవీత్
హన్యాం క్రూరమృగాంచ్ఛరాదిభి రహం రక్షోభయం నాస్తి మే
స్థిత్వా త్రాన్యత పోధనాశ్రమచయం ద్రష్టుం గమిష్యా మ్యహం,
యూయం తాపసపుంగవాః పరమితో భీతిం త్యజేత ధ్రువమ్.
౧౩

ఇత్యుక్త్వా రజనీముఖే రఘుపతి స్సంధ్యా ముపా స్యానుజం,
హిత్వా భూసుతయా సమం మునివరానీతం ఫలౌఘం తతః,
భుక్త్వా తన్నిశి తన్మునీంద్రరచితే సత్పర్ణశయ్యాతలే,
సుప్త్వోత్థాయ చ కల్య ఏవ నిఖిలం కృత్యం సమా ప్యావసత్. ౧౪

1 క ఖ॥ సర్గసమాప్తిపర్యంతం.

౯ ఇట్లు నుడింపుచున్న మునివరుని జూచి శుచిస్మితశోభితవదనారవిందుఁడై శ్రీరాముఁ డిట్లనెను. మునివరా! నీపరిశుద్ధమైన భక్తిని నే నెఱుంగుదును. నీభక్తి తాత్పర్యములకు నీయెడ నేను సంతసించితిని. కావున నేను నిన్ను జూచుటకు సీతాలక్ష్మణులతోఁ గూడి యిచ్చటకు వచ్చితిని. శరభంగముని గూడ నీ యోగ్యతను మిక్కిలి చెప్పఁగా విని యున్నాడను.

౧౦ మునివరా! కొంతకాల మిచ్చట నేను నివసింపఁ గోరుచున్నాను. కావున నాకు నివాసయోగ్యమైన తావొకటిఁ జూపుము.

౧౧ ఇట్లు రాముఁడు వచింప విని సుతీక్ష్ణుఁడును ఈమనోహరమగు నాశ్రమప్రదేశము నీకు నివాసయోగ్యము కాఁగలదని పలికెను.

౧౨ మఱియు రామా! మృగభయ మొకటి యీ తావున నుండును. ఇంక నితరాశ్రమములలో రాక్షసభయముగూడ నప్పుడప్పుడు మిక్కుటముగఁ గల్గుచుండును. ఇంతకు మించి యీ చోటునకు దోషమేమియుఁ గన్పింపదు.

౧౩ మునివరు డిట్లు పలుకుట విని పిమ్మట రఘురాముడు మునివరునితో తిరిగి యిట్లు పలికెను. ఇచ్చట క్రూరమృగములు నా శరజాలమున కెఱ కాఁగలవు. నాకు రాక్షసభయములేదు. ఇచ్చట నివాస మేర్పఱచుకొని యితర మున్యాశ్రమములను దర్శింప నేగెదను. ఓ తాపసులారా! ఇంక మీరు క్రూరమృగముల వలనఁ గాని రాక్షసులవలనఁ గాని భయమును మానుఁడు.

౧౪ ఇట్లు సుతీక్ష్ణాది మునిపుంగవులతోఁ బలికె నింతలో సాయంసమయమగుటచే సంధ్య నుపాసించి మునివరుఁడు తెచ్చి యిడిన ఫలాదులను సీతాసమేతుఁడై భక్షించి యా రాత్రి యచ్చట పర్ణశయ్యయందుఁ బరుండి నిద్రించి వేకువన లేచి తిరిగి సంధ్యాది కృత్యముల నిర్వర్తించెను.

ఏతస్మి న్నంతరే తత్ర రాఘవం సముపాగతమ్,
నిశమ్య మునయః కేచి ద్రామం ద్రష్టు ముపాగతాః. ౧౫

రాఘవో೭పి మునీ న్నత్వా సంపూజ్య చ తదావదత్
భవతాం దర్శనా ద్ధన్యః కృతార్థ శ్చాభవం ధ్రువమ్. ౧౬

మయాద్య భవతాం కార్యం యద్య స్తి వద తద్ద్రుతమ్,
భవతా మర్థసిద్ధ్యర్థ మహ మత్రాగతో ధ్రువమ్. ౧౭

ఇత్యుక్తా స్తే೭పి మునయః ప్రాహు రేవం తు తే೭పి తమ్,
త్వత్పాదరజసా పూతా నాశ్రమా న్నః కురు ప్రభో. ౧౮

రక్షోభయా దృతే೭స్మాక మపరం నా స్తి కించన,
సర్వం తత్త్వైవ విదితం భవితా చ త్వదాగమే. ౧౯

ఇత్యేవం కథితో రామ స్తథే త్యుక్త్వా మునీం స్తతః,
సుతీక్ష్ణ ముపసంగమ్య ప్రాహైవం మునిపుంగవమ్. ౨౦

ఏతే సంత్వరయంతి మాం మునివరా నేతుం స్వకీయాశ్రమా
గత్వా೭హం కతిచి ద్దినాని వసతిం కృత్వా೭೭శ్రమేషు క్రమాత్
సీతాలక్ష్మణసంయుతో ద్రుత మిహాగంతుం యతిష్యే మునే,
తస్మా త్త్వం త్వధునా గతే ర్మమ మునే! దేహ్యానతిం సత్వరమ్. ౨౧

ఇత్యేవం కథిత స్తేన మహర్షిః ప్రాహ రాఘవమ్
రామచంద్ర! సుఖం గత్వా ద్రుత మేహి మదాశ్రమమ్. ౨౨

ఇత్యుక్త స్తేన మునినా రాఘవో೭పి తథేతి తమ్,
నిగద్య నిర్గత స్సీతాలక్ష్మణాభ్యాం మునీశ్వరైః. ౨౩

౧౫ ఇంతలో నచ్చటకు రాముడు వచ్చుట విని మఱికొందరు మును
లచ్చటకు శ్రీరాముని దర్శనార్థమై వచ్చిరి.

౧౬ రాముఁడు నా మునులకు నమస్కరించి భక్తిచే బూజించి యిట్లు
పలికెను. మీ దర్శనభాగ్యము లభించినందున నేను ధన్యుఁడనైతిని.
కృతార్థుఁడను, కృతార్థుఁడను.

౧౭ మునీశులారా! నా వలనఁ దమకుఁ గావలసిన కార్యములను వచిం
పుడు. నే నవశ్యము చేయుచున్నాఁడను. మీకు వలసిన కార్యము
లను నిర్వర్తింపఁజేయు కొఱకే నే నిచ్చటకు వచ్చియుంటిని.

౧౮ రాముఁ డిట్లు పలికిన విని యాఋషీశ్వరులు తిరిగి రామునితో నిట్లనిరి.
రామా! నీ పాదపద్మములందలి పుష్పాదిచే మా యాశ్రమములను
పవిత్రముల నొనర్చుము.

౧౯ రామా! మాకు రాక్షసభయ మొక్కటి దక్క మఱి యేదియు
నిట క్లేశము లేదు. నీవాశ్రమ దేశములను జూచుటకు వచ్చినపుడు
నీకే తెలియగలదు.

౨౦ అవ్వుఁడు రాముఁడును వల్లెయని సుతీక్ష్ణునివద్ద కరిగి యా ముని
పుంగవునితో నిట్లు పలికెను.

౨౧ మునివరా! ఈ మునిచంద్రులు నన్ను తమ యాశ్రమ ప్రదేశములకుం
గొనిపోవుటకుఁ ద్వరపడుచున్నారు. కొన్ని దివసము లీ ఋషుల
యాశ్రమముల నివసించి తిరిగి సీతాలక్ష్మణులతో గూడ నచిర
కాలముననే యిట కరుదెంతును. కావున నాకు సెలవిమ్ము. పోయి
వచ్చెదను.

౨౨ అనిన విని య మ్మహర్షియు రాఘవున కిట్లనియెను. నాయనా,
రామచంద్రా! కుశలముగఁ బోయి తాపసుల యాశ్రమములం
గొన్ని దివసంబు లుండి సుఖముగ వెంటనే తిరిగిరమ్ము.

౨౩ నావుఁడు రాముఁడును నాతని యనుజ్ఞ పొంది మునీశులతోఁ గూడ
సీతాలక్ష్మణ సహితుఁడై యచ్చటనుండి బయలు వెడలెను.

నిర్గత్య రాఘవ స్త్వేవం సీతాలక్ష్మణసంయుతః,
మునీనా మాశ్రమా న్గత్వా తత్రతత్రావస చ్చిరమ్. ౨౪

సీతాలక్ష్మణసంయుతో రఘుపతి ర్మున్యాశ్రమా న్సర్వా న్వ్రజ
న్నేకత్రావస దేకవత్సర మసౌ వన్యత్ర మాసాన్దశ
త్రీన్మాసా న్క్వచిద ప్యవాస చతురో మాసా న్పరత్రావసత్
మాసా న్పంచ పరత్ర కుత్రచి దసౌ మాసా నయాసీచ్చ షట్. ౨౫

అష్టమాసా న్క్వచిత్సంస్థో మాసా దప్యధికం క్వచిత్,
మునిభిః సత్కృతో రామ స్త్వనైషీ ద్వత్సరా న్దశ. ౨౬

తస్మి న్కాలే రాఘవ స్తు మునీనా మాశ్రమేషు సః.
దివా తన్మునిభి ర్గోష్ఠీం కుర్వ న్కాలం తు యాపయన్.

నిశాసు సంచర న్నేకో ధనుర్బాణధరో వనే
ఆశ్రమే ష్వాగతా న్సర్వా నసురా న్సంహర న్పునః
దూరస్థితకబంధస్య పురతః పాతయం శ్చ తాన్
ఏవం కుర్వ న్ప్రతినిశ మజాన న్నైవ కించన
ప్రాత రేవాగత స్స్వీయ మాశ్రమం జానకీంప్రతి
కథయ న్గతవృత్తాంతం నందయ న్భూమిజాం పునః
రక్షో భయవిహీనానాం స్తా నాశ్రమా నకరో త్తథా
మునయో నిర్భయా స్తత్ర నిర్విఘ్నతపసోఽవసన్ ౨౭-౩౦

౨౪ ఇట్లు సీతాలక్ష్మణ సహితముగ సుతీక్ష్ణాశ్రమమునుండి బయలుదేరి యా మునీశుల యాశ్రమ ప్రదేశములకుఁ జేరి యా యా మునుల యాశ్రమములఁ గొంతకాలము నివసించెను.

౨౫ ఇట్లు రామచంద్రుఁడు భార్యానుజ సహితముగ నా ఋష్యాశ్రమముల యందు సంచరించుచు నొక్కచో నొక సంవత్సరమును, మఱి యొక్కచో బది మాసములును, వేరొక్కచో మూడుమాసములును, నాలుగుమాసము లింకొకచోటున నివసించెను. మఱియు మాస పంచక మొకచో వెళ్ళించెను. మఱి యాఱుమాసములు మఱియొక్క మున్యాశ్రమమున నివసించెను.

౨౬ మఱియు నొక మునీశుని యాశ్రమమున నెనిమిది మాసములు సుఖముగఁ గడచినవి. మఱియొక్కచోట నించుమించు మాసము మాత్రమే నివసింప వీలయ్యెను. ఈ విధముగ శ్రీరాముఁడు సీతాలక్ష్మణ సహితుఁడై యా యా ఋష్యాశ్రమముల నివసింపుచు పది సంవత్సరములు గడపి వచ్చెను.

౨౭-౨౮-౨౯-౩౦ ఆ మున్యాశ్రమముల నివసించు కాలమున రామచంద్రుఁడు పగటివేళల ఋషీశులగోష్ఠితోడఁ గాలమును గడపి వచ్చెను. రాత్రులయందు తా నొక్కఁడే ధనుర్ధారియై యవ్వన మందుఁ గ్రుమ్మరుచు నాశ్రమధ్వంసమున కేతెంచు రాక్షసఖండము నెల్ల మాటిమాటికి సంహరించుచు నాశ్రమప్రదేశములకు దూరముగ నున్నటువంటి కబంధుని ముందు పడునట్లు పారవైచుచుఁ గాలమును వెళ్ళబుచ్చుచుఁ దా నేమియు నెఱుఁగని వానివలె ప్రొద్దుననే తన యాశ్రమమునకు వచ్చి రాత్రి జరిగిన వృత్తాంతము నంతయు సీతతోడ నచ్చెరువు కలుగు నట్లు చెప్పుచు నామెను సంతోషపెట్టుచు నయ్యాశ్రమ ప్రదేశములం దెచ్చటను రాక్షసభయము లేకుండు నట్లు చేసివైచెను. అప్పటి మునులుగూడ రాక్షసభయము లేకుండ నిర్విఘ్నముగఁ దపస్సు చేసికొనఁ జొచ్చిరి.

ఏవం రామో బహూ న్రమ్యా నాశ్రమా న్సంచరం శ్చ తాన్
రక్షోభయేన రహితా నాశ్రమా నకరో త్తదా. ౩౧

తత్ర తత్ర దశాబ్దాంస్తు యాపయిత్వాఽఽశ్రమేషు సః ౩౨
సీతాలక్ష్మణసంయుక్త స్తతో నిర్గత్య రాఘవః
సుతీక్ష్ణ స్యాశ్రమం భూయ స్సమాగా ద్ద్రష్టు మిచ్ఛయా॥
రామం సమాగతం జ్ఞాత్వా సుతీక్ష్ణోఽపి ముదాన్వితః
ప్రత్యుద్గ మ్యానయిత్వా చ పూజయామాస భక్తితః.
రాఘవోఽపి గతిం వృత్త మాచచక్షే యథాతథమ్. ౩౩-౩౪
తత్రాపి మునినా రామః పూజితో బహుధా తతః
కంచిత్కాల ముషిత్వాథ సుతీక్ష్ణం ప్రాహ రాఘవః. ౩౫
అగస్త్యం ద్రష్టు మిచ్ఛామి సుతీక్ష్ణ ! భవతో గురుమ్
ఇత్యుక్త స్తేన మునిరా ట్సుతీక్ష్ణః ప్రత్యువాచ తమ్. ౩౬
రామచంద్ర! త్వయా సార్థ మాగమిష్యా మ్యహం ధ్రువమ్
ఉషి త్వాస్మి న్దినే త్వత్ర శ్వ స్త్వం నిర్గచ్ఛ తం ప్రతి. ౩౭
ఇత్యుక్త స్తేన రామోఽపి తథే త్యుక్త్వా తదాశ్రమే
తస్మి న్దినే స్థితః పశ్చా న్నిరగా త్కుంభసంభవమ్. ౩౮

ఇత్యాశ్చర్యరామాయణే అరణ్యకాండే తృతీయ స్సర్గ
స్సమాప్తః.

* * *

౩౧ ఇట్లు రాముఁడు మనోహరములైన యరణ్యప్రదేశముల గ్రుమ్మరుచు నయ్యాశ్రమభూముల నెల్ల రాక్షసభయము లేకుండఁ జేసివైచెను.

౩౨-౩౩-౩౪ ఇట్లచ్చట నివసింపుచుఁ బదిసంవత్సరములు గడపి తిరిగి సీతాలక్ష్మణ సహితముగ సుతీక్ష్ణాశ్రమమున కా మహర్షిని దర్శింపఁ గోరి వచ్చెను. రామునివచ్చుట విని సుతీక్ష్ణమునియు సంతోషపులకిత గాత్రుఁడై వాని నెదుర్కొని యాశ్రమము లోనికిం దోడ్కొని పోయి భక్తియుక్తముగఁ బూజించెను.

౩౫ ఇట్లా మునిచేఁ గూడ ననేక విధములఁ బూజితుఁడగుచు గొంతకాల మచ్చట గూడ నుండి పిమ్మట సుతీక్ష్ణమునితో నిట్లనెను.

౩౬ ఆర్యా! మునివరా! తమ గురువర్యులగు నగస్త్యులంగూడ దర్శింప నాకు వేడ్క పొడముచున్నయది. నా విని సుతీక్ష్ణుఁడు రామున కిట్లనెను.

౩౭ రామచంద్రా! నీతో నేనును వచ్చెదను. ఈరోజునకు మాత్రమిచ్చట నిలచి పోవుదము.

౩౮ ఇట్లు సుతీక్ష్ణుఁ డాడుమాటలకు రాముఁడును వల్లె యని సమాధాన మిచ్చి యయ్యాశ్రమమున నాఁడుండి పిమ్మట నగస్త్యాశ్రమమునకుఁ బ్రయాణ మయ్యెను.

అరణ్యకాండమునఁ దృతీయసర్గము

స మా ప్త ము.



## చతుర్థస్సర్గః

1శ్రీరామోఽపి తత స్సుతీక్ష్ణ మునినా సీతానుజాభ్యాం యుతో,
నిర్గ త్యోషసి సంచర న్నతితరం మధ్యాహ్నకాలే తు సః,
*రమ్యాం కుంభసముద్భవానుజమునే రాగా త్క్రమా దాశ్రమం,
శ్రుత్వా రామ ముపాగతం మునిరపి ప్రత్యుజ్జగా మాఽథ తమ్. ౧

---

* కుంభసముద్భవానుజమునే రిత్యనేన అగస్త్యభ్రాతేత్యర్థోఽవగమ్యతే· నను కుంభసముత్పన్నస్యాఽగస్త్య స్యాసత్యనుజే కథ మత్ర తదనుజ ఇతి కథనం సంగచ్ఛత ఇతి చే త్సత్యం. తథాపి తేన సహాఽస్యాపి పోషితత్వా దయ మగస్త్యభ్రాతేతి వ్యవహార ఇతి వేద్యం. నన్వస్య నామవినాఽగస్త్యభ్రాతేతి వ్యవహృతిః కథ మాగతేతి చేన్న. తస్య సుదర్శన ఇతి నా మావస దిత్యగస్త్యే నైవ సనత్కుమారసంహితాయాం ప్రతిపాదితం.

తథాహి,—యవీయా నేష మే భ్రాతా సుదర్శన ఇతి స్మృతః” ఇతి. తస్యానామకత్వే కేచి దేవం వర్ణయంతి· అస్య జననా దారభ్య బ్రహ్మవేత్తృత్వేన వ్యవహారజ్ఞానప్రాపంచికసంబంధశూన్యత్వా దయ మనామకోఽభూదితి. పరంతు సనత్కుమారసంహితావచనే నేకం విచారాసహ మితి వేద్యం.

---

1 కవికృతశ్లోకా ఏవ సర్గసమాప్తిపర్యంతం నాన్య ఇతి వేద్యం.

## చతుర్థసర్గ ప్రారంభము

౧ పిమ్మట శ్రీరాముఁడు సీతా లక్ష్మణ సుతీక్ష్ణులతో వేకువజామున నే పయనమై త్వరితముగ నడచుచు, మధ్యాహ్నకాలమగు సరికి రమణీయమైన * యగస్త్యభ్రాతయాశ్రమమునకుఁ జేరుకొనెను. రాముని రాక విని యా మునిపుంగవుండును నాతని నెదుర్కొ లున గౌరవించెను.

---

* అగస్త్య భ్రాతయాశ్రమము- కలశమునుండి పుట్టినయగస్త్యునకు భ్రాత లేనందున నిచ్చట నగస్త్యభ్రాత యని చెప్పుటయెట్లు పొసగు నను నాశంక కలుగును. ఔను. అగస్త్యునకు భ్రాత లేనిమాట వాస్తవమే కాని యయ్యగస్త్యునితోఁ బాటు నితడు కూడఁ బోషింపబడుటచే నగస్త్యభ్రాత యని వ్యవహారము కలిగినదని తెలియదగు.

అట్లైనను నెవ్వనికేని వ్యావహారిక నామ మేదైన నుండునుగదా! అట్లుగాక యగస్త్యభ్రాత యను వ్యవహార మెట్లు వచ్చెను? అను నాశంకకు సమాధాన మేమనగా ఇతనికిగూడ వ్యవహార నామము లేకపోలేదు. సనత్కుమార సంహితయందీ యగస్త్యుడే యీలుషికి సుదర్శను డని పేరుండెడిదని ప్రతిపాదించి యున్నాడు. "ఈ సుదర్శను డను నాతడు నా సోదరుడు" అని.

అగస్త్య భ్రాతయని యునామకుఁడుగానుండుటకు గొంత కిఁక్రింది విశేషముగఁ జెప్పదగు. ఇతడు పుట్టినప్పటినుండియు బ్రహ్మవేత్తగా నున్నందునను వ్యవహారజ్ఞానము ప్రాపంచిక సంబంధము లేనివా డగుటవలనను నామము లేనివా డయ్యెనని, కాని పై సనత్కుమార సంహితా వచనముచే నిది విచారసహమైనదిగా లేదని తెలియదగును.

ప్రత్యుద్గమ్య చ రాఘవం తదనుజం సీతాం సుతీక్ష్ణం చ సః,
ఆనీ యాశ్రమ మత్యనల్పవిమలప్రేమాతి రేకాన్వితః.
పాద్యార్ఘ్యాసనదానత స్సుమధురై రభ్యర్చ్య మూలైః ఫలైః
పశ్చాద్రాఘవ మేవమాహ సహితో భక్త్యా మునిస్సాంజలిః. ౨

ధన్యోఽహ మద్య ఫలితం చ తపో మ మాభూ,
న్మందస్మితస్య మృదుభాషణసంయుతస్య,
కర్ణాంతదీర్ఘనయనస్య ముఖాంబుజస్య,
సందర్శనేన తవ రాఘవ సుందరస్య. 3

యోగీంద్రహృద్భ్రమరసేవ్య మఘాపహారి,
శాపాపహం సపది గౌతమధర్మపత్న్యాః,
చక్రాంకుశాబ్జముఖచిహ్నయుతం త్వదీయం,
సంవీక్ష్య పాదకమలం త్వహ మద్య ధన్యః. ౪

సాకేతనాథ రఘునాయక తావకీన,
వీక్షాకటాక్షవితతిం సుమనోఽభిగమ్యామ్,
విన్యస్య సుష్ఠు మయి తావకపాదపద్మ
సేవాభిలాష మమలం తనుతా ద్భవా న్మామ్. ౫

---

(సుతీక్ష్ణాశ్రమస్య యోజనద్వయదూరేఽగస్త్యభ్రాతురాశ్రమః. ఏతస్య యోజనదూరే త్వగస్త్యాశ్రమ ఇతి వేద్యం. ఇదానీం బస్తరురాజ్యే వర్తతే.)

౨ ఆశ్రమము రేగి సీతాలక్ష్మణ సుతీక్ష్ణ సహితుడగు రాఘవుని నఖండ భక్తియుక్తుడై తన యాశ్రమములోనికిఁ గొంపోయి యర్ఘ్య పాద్యాసన కందమూల ఫలాదులచే గౌరవించి పిమ్మట నగస్త్య భ్రాత యగు నా సుదర్శన ఋషి రామున కంజలి ఘటించి వినయ వచనములతో నిట్లనెను,

3 ఓ రామచంద్రా! మందహాసపూర్వకమగు మృదుభాషణములతోడను, ఆకర్ణాయతములైన నేత్రములతోడను, జెన్నారు చున్నదియును, సుందరమగు రూపముతో నాశ్చర్యమగు చున్నదియు నగు నీముఖార విందమును సందర్శించుటవలన నే నిప్పుడు ధన్యుఁడనైతిని, నాతపము నేడు ఫలరూపము దాల్చినది

౪ ఓ రామభద్రా! యోగీంద్రుల మానసము లనెడి భ్రమరములచే సేవింపబడునదియును, పాపక్షయకరమైనదియును, గౌతముని భార్యయైన యహల్యయొక్క శాపమును బోద్రోచినదియును, శంఖ చక్ర పద్మాంకుశాది శుభరేఖలచే నొప్పుచున్నదియు నగు నీపాద పంకజమును జూచి నే నిప్పుడు ధన్యుడనైతిని.

౫ ఓ సాకేతనాథా! ఓ రఘునాయకా! భక్తజనమాత్ర సులభము లగు నీ కరుణాకటాక్షములను నాయందుఁ బ్రసరింపఁజేయుము ఎల్లప్పుడును నేను నీ పాదపద్మ సేవాభిలాషినై యుండునట్లును, పవిత్ర స్వభావము కలిగి యుండునట్లును వరప్రదాన మొసగి నన్ను గ్రహింపుము.

---

(సుతీక్ష్ణాశ్రమమునకు రెం డామడ దూరములో అగస్త్య భ్రాత యాశ్రమ మున్నదనియు దానికి యోజనదూరములో అగస్త్యాశ్రమ మనియు నిప్పుడు బస్తరురాజ్యములో నున్నదనియుఁ దెలియదగును)

*నమస్తే రామచంద్రాయ నమో † భక్తప్రియాయ తే

---

* రామచంద్రాయేతి:—రామచంద్రశబ్దార్థః కించిదత్ర వ్యక్తీక్రియతే· 'చది' ఆహ్లాదన ఇత్యస్మాద్ధాతో స్సముత్పన్నస్య చంద్రశబ్దస్య సకలలోకాహ్లాదక ఇత్యర్థోఽవగమ్యతే. తాదృశా చ్ఛంద్రా దప్యభిరామో రామచంద్రః అనేన తస్యాఽనితరసాధారణదివ్యసౌందర్యవిగ్రహత్వం వ్యజ్యతే. చంద్ర ఇవ రామః రామచంద్ర ఇత్యుక్తే, నిరుపమానసౌందర్యవర్ణనవ్యాఘాతనం భవతీతి జ్ఞేయం.

† భక్తప్రియాయేతి:—"వ్యాధస్యాచరణం, ధ్రువస్య చ వయో, విద్యా గజేంద్రస్య కా, కాజాతి ర్విదురస్య, యాదవపతే రుగ్రస్య కిం పౌరుషమ్, కుబ్జాయాః కమనీయరూప మధికం, కిం తత్సుదామ్నో ధనం, భక్త్యా తుష్యతి కేవలం, న చ గుణై ర్భక్తప్రియో మాధవ" ఇత్యనేన తస్య భగవతః భక్తప్రియత్వం వ్యక్తం భవతి—కించ॥ "నాహం వేదై ర్న తపసా న దానేన న చేజ్యయా, శక్య ఏవంవిధో ద్రష్టుం దృష్టవానసి యన్మమ" ఇతి భగవద్వచనే నాఽపి భక్తప్రియత్వం వ్యక్తం భవతి. కించ, భక్తానామ భక్తిమంతః. భగవతో భక్తిప్రియత్వా త్తద్వ త్స్వపి ప్రీతిమత్త్వం తస్య భవే దితి వేద్యం. తస్య భక్తప్రియత్వం మహానారాయణోపనిషది ప్రతిపాదితం - తథాహి:—సర్వేషా మధికారిణాం భక్తియోగ ఏవ ప్రశస్యతే· భక్తియోగో నిరుపద్రవః. భక్తియోగా న్ముక్తిః. బుద్ధిమతా మనాయాసే నాచిరాదేవ తత్త్వజ్ఞానం భవతి·తత్కథ మితి, భక్తవత్సల స్స్వయమేవ

౬  *1 ఓ రామచంద్రా ! 2 ఓభ క్తప్రియా !

## విశేషార్థము

* 1 రామచంద్ర శబ్దార్థ మిచ్చట వివరింపబడుచున్నది. (చది) అను ధాతువువలన నుత్పన్నమైన చంద్రశబ్దమునకు సకలలోకాహ్లాద కరుఁ డని యర్థము. అట్టి చంద్రునికంటె నభిరాముఁడు కాన రామ చంద్రుఁ డని చెప్పబడెను.

ఇందుచే, రామచంద్రుని కనితర సాధారణ దివ్య సౌందర్య విగ్ర హత్వము ద్యోతితమగుచున్నది. చంద్రునివలె నభిరాముఁడు కాన రామచంద్రుఁ డని వ్యవహారము కలిగె ననినచో, రాముని సౌందర్యము నిరుపమానమని చెప్పిన దానికి వ్యాఘాతము వచ్చును.

2 భక్తప్రియా! అను దాని వివరణము

“వ్యాధునకున్న యాచార మేమి? ధ్రువుని వయస్సెంత? గజేంద్రుని విద్య యేపాటిది? విదురుని జాతియేది? యాదవపతి యగు నుగ్రసేనుని పౌరుష మేమాత్రము? కుబ్జకున్న సౌందర్య మధి కమా? ఆ కుచేలుఁ డేమి ధనవంతుఁడు? వీరి నెల్ల రక్షించుటకు భగ వంతున కేమి యభిమానము? కేవలము భక్తిచేతనే భగవంతుఁడు సం తోషించును గాని గుణములచే సంతోషించువాఁడు కాఁడు” అను ప్రాచీన వాక్యములచే భగవంతుని భక్తప్రియత్వము వ్యక్తమగు చున్నది. మఱియు, “అర్జునా! తపస్సుచేతను, యజ్ఞముల చేతను, దానములచేతను గూడఁ జూడలేని నా రూపమును కేవల భక్తిచే మాత్రము చూడఁ గలుగుదురు” అనెడి భగవద్వచనముచే గూడ భగవంతుని భక్తప్రియత్వము వ్యక్తమగుచున్నది. మఱియు, భక్తు లనగా భక్తి గలవారని యర్థము. కాన భగవంతుఁడు భక్తప్రియుఁడై నందున భక్తి గలవారియందును ప్రియుఁడై యుండు నని తెలియ దగును. భక్తిప్రియుఁ డనుట మహానారాయణోపనిషత్తునందు చెప్ప బడెను.

“అందరకును భక్తియోగమే ప్రశస్తమైనది. భక్తియోగమునిరుపద్రవ మైనది. భక్తియోగమువలన ముక్తి, సుఖము అనాయాసముగ

నమో § వేదాంతవేద్యాయ † నమోఽనంతగుణాయ తే. ౬
కుంభయోనేః కృతం శ్రుత్వా స్తవం శ్రుత్వాఽథ రాఘవః,
ప్రహస న్నాహ తం మౌని మగస్త్యస్యానుజం వచః. ౭

సర్వేభ్యో మోక్షవిఘ్నేభ్యో భక్తనిష్ఠా న్సర్వా న్పరిపాలయతి, సర్వాభీష్టాన్ ప్రయచ్ఛతి, మోక్షందాపయతీతి.

§ వేదాన్తవేద్యాయేతి-రామోత్తరతాపనీయోపనిషది- గర్భజన్మ జరామరణ సంసారమహద్భయా త్సంతారయతి తస్మా దుచ్యతే షడక్షరం తారకమితి య ఏతత్తారకం బ్రహ్మ బ్రాహ్మణో నిత్య మధీతే స సంసారం తరతి స సర్వం తరతీతి.

† అనంతగుణాయేతి - సకలకల్యాణగుణ పరిపూర్ణాయే త్యర్థః. భగవతి కల్యాణగుణాః భాగవతప్రథమస్కంధే వర్ణి తాః-తథాహి.

"సత్యం శౌచం దయా క్షాంతి స్త్యాగ స్సంతోష ఆర్జవం, శమో దమ స్తప స్సామ్యం తితిక్షోపరతి శ్శ్రుతం, జ్ఞానం విరక్తి రైశ్వర్యం శౌర్యం తేజో బలం స్మృతిః, స్వాతంత్ర్యం కౌశలం కాంతి ర్ధైర్యం మార్దవ మేవచ, ప్రాగల్భ్యం ప్రశ్రయ శ్శీలం సహ ఓజో బలం భగః, గాంభీర్యం స్థైర్య మాస్తిక్యం కీర్తి ర్మానోఽనహంకృతిః, ఏతే చాన్యే చ బహవో యస్మి న్నిత్యా మహాగుణాః, ప్రార్థ్యా మహత్త్వ మిచ్ఛద్భి ర్నవియంతి స్మ కర్హిచిత్" ఇత్యాదినాఽనంతగుణత్వంవర్తత ఏ వేతి వేద్యం.

3 ఓ వేదాంతవేద్యా! 4ఓ యనంతగుణా! నీకు నమస్కారము.

౨ ఇట్లగస్త్యభ్రాతచేసిన స్తవమునకు రామచంద్రమూర్తి సంతసించి చిరునగవుతో నా మునితో నిట్లు పలికెను.

---

లభించును. అదియెట్లన భక్తవత్సలుడు సమస్తమోక్షవిఘ్నముల నుండి భక్తులను స్వయముగ రక్షించుచున్నాడు. వారలకెల్ల కోరికల నిచ్చుచున్నాడు. మోక్షము గూడ నొసంగుచున్నాడు'' అని--

3 వేదాంతవేద్యా! అను దాని వివరణము

రామోత్తరతాపనీయోపనిషత్తునందు నిట్లు చెప్పబడినది: ''గర్భజన్మజరామరణములు సంసారము మొదలగు భయముల నుండి తరింప జేయువాడు కాన షడక్షరరామమంత్రము తారక మంత్రమని చెప్పబడినది. కావున నీ తారకమును నిత్యము జపించుటచే సంసారమును తరించును'' అని వేదాంతములయందు తెలియదగినవాడు కాన రామునకు వేదాంతవేద్యత్వముపపన్నమగుచున్నది.

4 అనంతగుణా! అను దాని వివరణము.

అనంతగుణుడన, సకలకల్యాణ గుణ పరిపూర్ణుడని యర్థము. భగవంతుని యందలి కల్యాణగుణములు భాగవతప్రథమస్కంధమున నిట్లు వర్ణింపబడెను.

''సత్యము, శౌచము, దయ, క్షాంతి, త్యాగము, సంతోషము, ఋజుస్వభావము, శమము, దమము, తపస్సు, సమభావము, తితిక్ష, ఉపరతి, జ్ఞానము, విరక్తి, ఐశ్వర్యము, శౌర్యము, తేజము, బలము, స్మృతి, స్వాతంత్ర్యము, కౌశల్యము, కాంతి, ధైర్యము, మార్దవము, ప్రాగల్భ్యము, శీలము, ఓజస్సు, గాంభీర్యము, స్థైర్యము, ఆస్తిక్యము, కీర్తి, అభిమానము, నిరహంకారము, ఈ మొదలగు గుణములు మహత్త్వమును గోరువారలచేఁ బ్రార్థింపదగినవి'' అని - కావున శ్రీరాముఁడు పూర్వోక్తానంత సకలసద్గుణములు గలవాడని భావము.

మన్మంత్రోపాసనా దేవ ముక్తిం ప్రాప్స్యసి సువ్రత,
అచంచలాఽస్తు తే భక్తి ర్నిర్మలా చ మునీశ్వర. ౮
ఇత్యుక్త్వా రాఘవోఽగస్త్యభ్రాత్రా వై మునినా తతః,
కుంభయోనే స్తు చరితం సుతీక్ష్ణం పృష్టవా న్మునిం. ౯

*సుతీక్ష్ణో మునిరప్యేత్య గురో ర్జన్మ చ కర్మ చ,
అవద ద్రామచంద్రాయ కుంభయోనే ర్యథాతథం. ౧౦

---

* అగస్త్యజన్మకర్మవృత్తాంతః

పురా కదాచి త్కేచి దసురాః దివా సముద్రే నిలీయ రాత్రౌ భూమ్యాం మున్యాశ్రమేషు సాయుధా స్సంచరంతః దృశ్యమానాం స్తాపసజనా న్సర్వా నపి సంహరంతః, కించ లోకే ఇతరజనా నప్యనేకా న్పీడయంతః, యథేచ్ఛం ప్రవర్తయంతః, పునః ప్రాత స్సముద్రే ప్రవిశ్య సుఖేన కాలం గమయంతిస్మ. తదా మహేంద్ర స్తా న్సంహర్తుం వినా సముద్రశోషణ మన్యోపాయ మపశ్యంల్లోకకల్యాణార్థం వాయ్వగ్నీ సమాహూయ "యువాం గత్వా సముద్రం శోషయత" మి త్యాజ్ఞాపయామాస. తథా తయో రకరణా న్మహేంద్ర స్తయోః కుపితః "యువాం మర్త్యలోకే జన్మ లభేథా" మితి తౌ శశాప. తతః కదాచి న్మిత్రావరుణౌ సముద్రతీరే సంచరంతౌ ఊర్వశీసందర్శనేన కామబాధా పరిపీడితౌ వభూవతాం. స్వీయవీర్యం తతో భువి పతితం చాజానంతా వేవ స్వస్వనిలయం జగ్మతుః.

౮ ఋషిపుంగవా! నీవు నా మంత్రోపాసనాబలముచేతనే ముక్తి
నొందెదవు. నీయొక్క భక్తి నిర్మలమై యచంచలమై వర్ధిల్లుగాక.

౯ ఈప్రకారము రామచంద్రమూర్తి యగస్త్యభ్రాత యగు సుదర్శన
మునితోఁ జెప్పి పిమ్మట నగస్త్యమహామునియొక్క జన్మ కర్మ
వృత్తాంతమును గూర్చి తచ్ఛిష్యుఁ డగు సుతీక్ష్ణమహామునినిఁ బ్ర
శ్నించెను.

౧౦ సుతీక్ష్ణమహర్షియును శ్రీరామచంద్రమూర్తికి తనగురువైన యగస్త్య
మహర్షియొక్క జన్మకర్మ వృత్తాంతములను గొన్నిటినిఁ జెప్పెను.

---

## అగస్త్యజన్మ వృత్తాంతము

* పూర్వ మొకానొకప్పుడు కొంద ఱసురులు పగటి వేళల సముద్రమందు డాగి రాత్రులందుఁ బుడమిపైకి వచ్చి యాయుధములతో మునిపుంగవుల యాశ్రమ ప్రదేశముల సంచరించుచుఁ గనుపడిన తపస్విజనుల నెల్ల సంహరించుచు, మఱియు లోకమున జనుల ననేకులఁ బీడించుచు యథేచ్ఛగఁ బ్రవర్తించి తిరిగి ప్రాతఃకాల మనుసరించి సముద్రమందు జొరఁబడి సుఖముగఁ గాలయాపన మొనర్చుచుండెడివారు. అప్పుడు దేవేంద్రుఁడు వారిని సంహరించుటకు సముద్ర శోషణముకంటె వేఱు తెన్నుఁ గానక లోకకల్యాణ మొనర్పఁగోరి, వాయ్వగ్నులను బిలిచి "మీరు పోయి సముద్రమును శోషిల్లఁ జేసిరండు" అని యాన తిచ్చెను.

వారట్లు చేయమికి మహేంద్రుఁడు వారిపైఁ గినిసి మీరు మర్త్యలోకమున జనింపుఁ డని వారిని శపించెను. అంత గొంతకాలమునకు మిత్రావరుణులు సముద్రతీరమ్మునం గ్రుమ్మరుచు నూర్వశీ సందర్శనమువలనఁ గామబాధా ప్రపీడితులై తమ వీర్యము స్ఖలితమై భూపతిత మగుటఁగూడ గుర్తింపఁజాలక తమ తమ నెలవులకుం జనిరి.

విశ్వంభరాపతితతద్వీర్యస్య కేనచి త్కలశప్రక్షేపణేన తస్మా ద్ద్వా వుత్పన్నౌ. తావేవ వసిష్ఠాగస్త్యౌ. తత ఏవ తయో ర్ద్వయో రపి కుంభసంభవ ఇతి మైత్రావరుణి రితి నామనీ సమాగతే. సోఽయ మగ స్త్య స్తత్త్వాపి ధనుర్వేదనిపుణః. పరోపకారపరాయణశ్చ, శ్రీరామమంత్రోపాసకాగ్రేసర శ్చ. సోఽయం గార్హస్థ్య మనిచ్ఛ న్నప్యంతతః పితృదేవతానురోధపాశబద్ధః లోపాముద్రాం పరిణీతవాన్. పరిణీయ చ పితౄణాముక్త్యా తస్యా మాత్మజా నుత్పాదయితుం ప్రయతతోఽప్యస్య రతి సమీహాం ధనాశాపిశాచ పరిపీడితా సేయం లోపాముద్రా నిరాకృతవతీ. తతస్స్వజాయాసమీహాం ప్రథమం పూరయితుం ధనార్జనార్థం శ్రుతర్వరాజనికట ముపేత్య తత్ర విఫల మనోరథ స్తత్ప్రేరణయైవ తేన సహ బ్రధ్నశ్వరాజాంతిక మాజగామ. తత్రాపి స్వాభీప్సితస్య విఫలతయా తత్ప్రేరణయా సహ తేన త్రసదస్యుసమీప మాయయౌ. తత్రాప్యలబ్ధధన స్తత్ప్రేరణయా తేన స హేల్వలాంతిక మాగాత్. వాతాపీల్వలౌ సోదరా వుభా వపి స్వాశ్రమాగతా న్మునీ నతిథ్యాయ నిమంత్ర్య ఆత్మనో మేకం భాగం కృత్వా, పక్త్వా చ తన్మాంసం, భోజయిత్వా చాతిథీన్ వాతాపే, సమేహీతి తస్మి న్నాహూతే సో ఽప్యతిథిజఠరం భిత్త్వా సమాగతో భవేత్. ఏవ మాత్మనో నియతవిధి మనుసృత్య స్వాశ్రమసమాగత మగస్త్యం చాతిథ్యాయ సంప్రార్థ్య పూర్వవ ద్వాతాపిం ఛాగీకృత్య భిత్త్వా చ తం, పక్త్వా చ తన్మాంసం, భోజయిత్వా చ కుంభయోనిం, పూర్వవ ద్వాతాపే ద్రుత మాయా

అప్పుడా భూపతితమైన వీర్యము నొకానొకఁడు కలశమం దునిచి పోషింప నా కలశమునుండి యిర్వురు జన్మించిరి. వారే వసిష్ఠాగస్త్యులు కావుననే వారి కిద్దరికిని కుంభసంభవులనియు, మైత్రావరుణులనియు, పేర్లు వచ్చెను. ఈ యగస్త్యుఁడు తత్త్వవేత్తయు, ధనుర్విద్యానిపుణుఁడును, పరోపకార పారీణుఁడును, శ్రీరామ మంత్రోపాసకాగ్రేసరుఁడునై యున్నాఁడు. ఈతఁడు గృహస్థ ధర్మము నొల్ల నిష్టము లేకున్నను పితృదేవతాజ్ఞాపాశ బద్ధుఁడై లోపాముద్ర యను కన్యకం బెండ్లియాడెను. పరిణయమై పితౄణ విముక్తి కొఱకు నామెయందు సంతానముం బడయుటకుఁ బ్రియత్నించుచున్నను అమ్ముని కోరికను ధనాశాపరిపీడిత యగు లోపాముద్ర నిరాకరించెను. అతఁడును దన భార్య మనోరథమును బూరింపనెంచి, ధనార్జనమ్మునకై శ్రుతర్వురాజునొద్ద కరిగి యచ్చట విఫల మనోరథుఁడై తత్ప్రేరణమున వానితోఁగూడ ప్రథశ్వుని సమీపమునకుం బోయెను. అచ్చటనుం దనకోరిక సిద్ధింపమి తత్ప్రేరణమున వానితోఁగూడ త్రసదస్యురాజు సమీపమునకేగెను. అచ్చటను దన కోరిక సఫలము గామి నతని ప్రేరణచే నతనితోఁగూడ నిల్వలుని దరింజేరెను.

సోదరులగు వాతాపీల్వలు లిర్వురును దమ యాశ్రమ సమాగతులగు మునుల నాతిథ్యమునకై వేఁడి తమలో నొక్కని మేకనుగ నొనర్చి దాని మాంసమును వండి యతిథులకు భుజింప నిడి వారు భుజించి కూర్చుండునెడ "వాతాపీ! రమ్ము, రమ్ము" అని పిలువఁగా వాఁడయ్యతిథి యుదరమును చించుకొని వచ్చుచుండువాఁడు. ఇట్లే తమ నిత్య విధి ననుసరించి తమ యాశ్రమమున కరుదెంచిన యగస్త్యునిఁగూడ నాతిథ్యమున కర్థించి పూర్వముంబోలె వాతాపిని మేకనుగ నొనర్చి, ఛేదించి, వాని మాంసముం బచనముచేసి, యగస్త్యుని భుజింపఁజేసి, యెప్పటి యలవాటుచొప్పున "వాతాపీ! రమ్ము, రమ్ము" అని పిలువఁగా నగస్త్యుని యుదరమునుండి యాతఁడు

తచ్ఛ్రుత్వా రాఘవ స్తుష్టః కించి త్సందిగ్ధ మానసః,
సుతీక్ష్ణం పరిపప్రచ్ఛ పున రేవం మహామతిం. ౧౧
అగస్త్యేన సముద్ర స్తు పురా పీత ఇతి శ్రుతం,
కిమర్థం తత్కృతం తేన వద తచ్చరితం మునే. ౧౨

ఇతి పృష్ట స్సుతీక్ష్ణోఽపి వక్తు మారబ్ధవా నితి. ౧౩
పురా కదాచన విభో రాక్షసా స్త్వహ్ని వారిధౌ,
నిలీయ రాత్రౌ నిర్గత్య బహి రాగత్య మానవాన్,
మహర్షీన్ భక్షయిత్వా చ పున రప్యబ్ధి మాశ్రితాః. ౧౪

---

హితీల్వలేన తస్మిన్మహాత్మేఽపి బహి రనాగతే చింతాంకూర స్తస్య హృదయే ప్రాదుర్భూతః. జీర్ణో వాతాపి ర్జీర్ణ ఇతి ముని వచనేన శాఖోపశాఖిత శ్చాభూత్. తతః కింకర్తవ్యతా విమూఢో వాతాపి ర్వినా తచ్ఛరణ మామృగ్యమాణ మప్య పశ్యన్, ఆత్మనోఽపి ప్రమాదభియా త్వనన్యగతి స్సన్ కేవల మగస్త్యం శరణ మేవగతః. కింతు తస్య చ రాజ్ఞాం చ మణికనక వస్తుజాలం పారితోషికం పుష్కలతయా వితీర్య కృత్వా త్వహింసాశపథం, తదాదిత ఏవ చ దుష్కర్మణో విరరామ. అగస్త్యోఽపి సఫలమనోరథః సమాదాయ పుష్కలం ధనం, సమాగత్య చ నిజాశ్రమం, వితీర్య చ సర్వం దేవ్యై, సంతర్ప్య చ తాం, ఉత్పాద్య చ తస్యాం దృఢదస్యుదృఢాస్యనామానా వాత్మజౌ, నిర్వర్త్య చ పిత్ౄణాముక్తిం, మత్వా చాత్మానం చధన్యం, మాశ్రావయ న్మునీ న్నామిత త్త్వ మాశ్రమే నివసతిస్మ.

౧౧ అని విని రాముఁడు సంతోషమున మఱియు నా సుతీక్ష్ణు నిట్లడిగెను

౧౨ మునివరా ! అగస్త్యునిచేఁ బూర్వము సముద్రోదకమంతయు నాచమింపఁబడిన దని వినియుంటిని. అతఁ డట్లేందులకుఁ జేయవలసి వచ్చెనో యా చరిత్రమును నాకు సవిస్తరముగ విన్పింపుము.

౧౩-౧౪ నప్పుఁడు సుతీక్ష్ణుఁడును రామున కిట్లు చెప్ప నారంభించెను. పూర్వము కొందఱురాక్షసులు పగటివేళ నడవియందు డాగి రాత్రులం దందుండి వెల్వడి భూమియందు సంచరించుచు, మానవులను ఋషీశులను, భక్షించి తిరిగి తెల్లవారు సరికి సముద్రములోనికిఁ జొచ్చుచుండిరి

---

బయల్వెడలక పోవుటచే జింతాంకుర మాతని హృదయ భూమిని ప్రాదుర్భవించెను. ఇంతలో "జీర్ణుఁడయ్యెను. వాతాపి జీర్ణుఁడయ్యెను ఇక వాతాపి యెచ్చటనుండి వచ్చును." అని అగస్త్యుడు చెప్పిన క్షణముననే వాని చింతాంకురము శాఖోపశాఖలుగ హృదయాంతరాళమునఁ గ్రిమ్మ్రిక్కొనెను. పిమ్మటఁ గింకర్తవ్యతా విమూఢుఁడై యిల్వలుఁ డగస్త్యుని శరణు వేడుటకన్న తదాపన్నివారణమునకుఁ దెరువుఁగానక వేఱుగతి లేక తనకుఁ గూడ ప్రాణాపాయము సంభవించునను భయమున నగస్త్యుని శరణు వేడుటయే కాక యతనికిని, నతనితో వచ్చిన రాజపుంగవులకుం గూడ ధన కనక వస్తు వాహనాదులు పారితోషికముగ నొసంగి యగస్త్యు నెదుటనే యహింసా శపథ మొనర్చి, యది మొదలు దుష్కృత్యములు మాని వర్తించుచుండెను. అగస్త్యుఁడును సఫల మనోరథుఁడై పుష్కలముగ ధనముఁ గైకొని తన యాశ్రమమున కరుదెంచి తెచ్చిన ధనము నెల్ల లోపాముద్ర కర్పిత మొనర్చి, యామెను తృప్తిపఱచి యామె యందు దృఢదస్యు, దృఢాస్యనాము లగు నిర్వురఁ గుమారులం గని పితౄణమునుండి ముక్తుఁడై, తనను ధన్యతమునిఁగాఁ దలంచుచు తన యాశ్రమమునం దుండి శ్రీరామ తత్త్వమును మునిజనులకుం గర్ణపర్వముగ విన్పించుచు సుఖముగనుండెను.

ఏవం ప్రతిదినం తే తు కుర్వంతి స్మాసురాః పునః· ౧౫
శోషణేన వినా సింధో స్తత్ర త్యాసురమారణం. ౧౬
దుస్సాధ మితి మత్వాథ దేవతా ఋషయః పునః. ౧౭
వినిర్గత్యాగతాః ప్రాపు శ్శరణం కుంభసంభవం,
ఉక్త్వా చ సకలం తస్మై తే త్వేవం తం యయాచిరే,
మహాత్మే వారిధిః పీతో భవతా యది రాక్షసాన్,
తతస్త్వా న్సంహరిష్యామ స్తేభ్య స్సర్వేఽపి బిభ్యతి. ౧౮
ఇతి సంప్రార్థితో దేవై రగస్త్యోఽపి తథేతి తాన్,
నిగద్య ప్రేషయిత్వా చ పశ్చా దాలోచ్య మానసే. ౧౯
రామచంద్ర! భవన్నామ సంస్మర న్వారిధిం మునిః· ౨౦
పపౌ త్రి రాచమనత స్తతో దేవా స్సమాగతాః,
వారిస్థా నసురా న్సర్వాన్ సంజఘ్ను స్తే తతః పునః.
సోఽపి దేవార్థితో భూయః పూరయామాస వారిధిం· ౨౧
ఇత్యుక్తో రాఘవః ప్రాహ పున రేవం మహామునిః. ౨౨
కుంభయోనే ర్మునే రస్య త్వాగస్త్య ఇతి నామ తత్,
కిమర్థ మాగతం బ్రూహి గురుచారిత్రవిత్తమ, ౨౩
ఇత్యుక్త స్సో ప్యువాచేదం వచనం రాఘవం ప్రతి.
మహాత్మే వింధ్యమేర్వో స్తు వివాదోఽభూత్పురాచన. ౨౪
ప్రదక్షిణీకృత్య మాం తు సూర్య స్సంచర తీత్యతః,
అహ మేవ మహాం శ్చేతి మేరు ర్వింధ్య మువాచ తమ్,
వింధ్యాచల స్తతో వృద్ధి మగా త్సూర్యావరోధకృత్. ౨౫
సూర్యసంచరణాభావా దభూ త్సర్వం తమోమయం,
సూర్యతేజోవరోధేన సర్వే దుఃఖ ముపాగమన్. ౨౬

౧౫-౧౬-౧౭-౧౮ ఇట్లు వారు ప్రతిదినము జననాశన మొనర్చుటఁ జూచి సహింపఁజాలక సముద్రశోషణము వలనఁగాని ఈ రాక్షసుల సంహరింప వీలుకాదని దేవతలు తలంచి కుంభసంభవుని దరిఁజేరి సమస్త వృత్తాంతము నాయనకు విన్పించి యిట్లు వేడికొనిరి. మహర్షీ! నీవు సముద్ర జలమును సర్వమును గ్రోలితివేని దానియందు దాగిన లోక భక్షకులగు రాక్షసులను సంహరింపఁ గలము. వారివలన లోకము చాల భయపడుచున్నది.

౧౯-౨౦-౨౧ ఇట్లు దేవతలు ప్రార్థింప నగస్త్యుడును వల్లెయని వారిని వీడ్కొలిపి కార్యనిర్వహణమునకుఁ గొంతయాలోచనము సలిపెను. రామచంద్ర! నీ నామస్మరణము చేయుచు వారిధిలోని నీటిని ముమ్మా రాచమించి నిశ్శేషమొనర్చెను. వెంటనే దేవత లచ్చటకు వచ్చి యందుఁ జిక్కియున్న యసురుల నెల్ల సంహరించిరి. దేవతల కోర్కెపై నగస్త్యుఁడు మరలసముద్రమును జలముచేఁ బూరించెను.

౨౨-౨౩ పిమ్మట రాముఁడు కుంభజన్మున కగస్త్యుఁడను నామ మెట్లువచ్చెనో చెప్పుమని సుతీక్ష్ణ నడుగగా నా మునివరుఁడును రామునితో నిట్లు చెప్పఁ దొడంగెను.

౨౪-౨౫ తొల్లియొకప్పుడు వింధ్యపర్వతమునకును, మేరువునకును, గొప్పతనము విషయమై గొప్పవివాదము వచ్చెను. సూర్యుఁడెల్లప్పుడును నాకుఁ బ్రదక్షిణ మాచరించుచుండుటచే నేను గొప్పవాడ నని మేరువు వింధ్యముతోఁ బోరాడెను. అందుపైఁ గోపించి వింధ్యము పెరిగి పెరిగి సూర్యమార్గము నడ్డగించెను.

౨౬ సూర్యసంచారము లేమిచే భూలోకమెల్ల చీకట్లమయ మయ్యెను. సూర్యతేజోదర్శనము లేమికి జగమెల్ల దుఃఖముల పాలయ్యెను.

తతో దేవా స్సమాలోచ్య కుంభయోనిం సమాశ్రితాః,
అవదం శ్చాపి తే సర్వం, వింధ్యవృత్తం మునిం ప్రతి. ౨౭
తతోఽగస్త్యోఽభయం దత్త్వా ప్రేషయిత్వా చ తా
న్సురాన్,
వింధ్యాద్రినికటం చాగా ద్దేవకార్యచికీర్షయా. ౨౮
వింధ్యోఽపి స్వగురుం వీక్ష్య త్వాగతం కుంభసంభవం,
నమ్రీభావేన తం మానిం ప్రణనామ చ తద్భయాత్. ౨౯

అగస్త్య స్త్వథ తన్మూర్ధ్ని నిక్షిప్య స్వకరం తదా
సంప్రయు జ్యాశిషం ప్రాహ త మేవం వింధ్యపర్వతం. ౩౦
మదాగమనపర్యంత మేవం నివసతా ద్భవాన్. ౩౧
ఇత్యుక్త్వా కుంభయోని స్తు గతవా న్దక్షిణాం దిశం,
తదాది వింధ్యనికటం ముని ర్నాగా త్పున స్తు సః. ౩౨
వింధ్యోఽపి నమ్రీభావేన గురుశాపభయా త్తథా
సంస్థితోఽద్యాఽ ప్యగస్త్యోఽపి దక్షిణాస్యాం దిశి స్థితః. ౩౩
అగ స్త్యేవం వారణేన త్వగస్త్య ఇతి కీర్త్యతే,
రామచంద్ర భవన్నామకీర్తనా త్కుంభసంభవః. ౩౪
అనన్యసాధ్యకార్యాణి కృతవా న్నాత్ర సంశయః,
తచ్ఛ్రుత్వా రాఘవ స్స్వాంతే మహ దాశ్చర్య మాప్తవాన్.
౩౫

ఏవం సంభాషమాణానాం తేషాం తు రజనీముఖం
బభూవ సాయంకృత్యాని కర్తుం సర్వే విసర్గతాః. ౩౬
కృత్వా కర్మాణి విధివ త్సమాప్య చ తత స్తు తే.
ఇష్టాగోష్ఠిప్రసంగేన యాపయంతిస్మ తాం నిశాం. ౩౭

౨౪ అప్పుడు దేవతలు తమలో తా మాలోచించికొని కుంభసంభవునిసమీ పించి వింధ్యవృత్తాంతము నెల్ల నాయనకు విన్నవించి శరణువేడిరి.

౨౫ అగస్త్యుడును వారి కష్టము నెఱింగి, సురలను వీడ్కొలిపి, దేవ కార్యసిద్ధ్యర్థముగనై వింధ్యాద్రి కరిగెను.

౨౬ వింధ్యపర్వతమును, తన గురువగు నగస్త్యుడు తన్ను జేరవచ్చుటం జూచి భయభక్తులు పెనగొన నమ్రీభావమున గురువునకు నమస్క రించెను.

౩౦-౩౧-౩౨-౩౩ అగస్త్యుడును వాని శిరమ్మునం గరకమ్మునిచి యాశీర్వదించి నేను తిరిగి వచ్చువరకు నిట్లే యుండుమని వింధ్యాద్రి కానతిచ్చి, అటనుండి దక్షిణదిక్కునకు బయనమై పోయెను.

౩౪ రామచంద్రా! నీనామస్మరణ వలనం గుంభసంభవుం డనన్యసాధ్యము లగు గార్యముల నాచరించి యున్నాడు.

౩౫-౩౬-౩౭ అనవిని రాముం డమితానందము నొందెను. ఇట్లు వా రిద్ద రును సంభాషించుచుండ నింతలో సాయంకాల మయ్యెను. అంత నందరును సాయంకృత్యముల నర్వర్తించికొని నేగి, తమ తమ జప విధుల నెఱవేర్చికొని, పిమ్మట నిష్టాగోష్ఠులతో నాటిరాత్రిం గడిపి పుచ్చిరి.

తతః ప్రాత స్సముత్థాయ స్నానసంధ్యాదిసత్క్రియాః,
కృత్వాఽనుజ్ఞాం మునేః ప్రాప్య తేఽగస్త్యంప్రతి నిర్గతాః.
శ్రీరామ స్సహలక్ష్మణేన మునినా భూజాతయా నిర్గతః
గత్వా దూర మలంకృతం సురగణాం సంసేవితం చ ద్విజైః,
నానాభూజచయై స్సుశోభితతమం సర్వర్తుపుష్పాన్వితం,
రమ్యం చాఽథ దదర్శ కుంభజమునే స్త స్యాశ్రమం తు
తూర్ణాత్. ౩౮౪

ఏతస్మి న్సమయే త్వగస్త్యముని రప్యాత్మాశ్రమే సంసది
తత్రత్యా నుపవేశ్య తాపసవరా న్సార్ఘ్యాద్య మేఽగ్రేప్యయమ్
*సాఽర్థా న్గోప్యతమా న్స్వహృ నపి వదన్ శ్రీరామనామ స్థితాన్
బ్రహ్మానందనిమగ్నమానసతలా న్సూర్య న్మునీ న్సంస్థితః ౩౯౪

---

* అర్థాన్గోప్యతమా నితి :—

వ్యా—శ్రీరామనామ గతరహస్యార్థ నానార్థాస్తు, రామ తారకోపనిషది విశ్లేషతః ప్రతిపాదితాః—తథాహి; "చిన్మయే స్మి న్మహావిష్ణౌ జాతే దాశరథౌ హరౌ। రఘోః కులేఽఖిలం రాతి రాజతే యో మహీ స్థితః" ఇతివచనేన నామైకదేశే నామగ్రహణ మితిన్యాయేన వైకుంఠవాసీ భగవాన్ రాతి రాజతే మహీతలఇతి రామః. నన్వేతస్యా ఉపనిషదః రామకథాప్రతిపాదకతయా శ్రీరామావతారా త్పరమే వోపనిషదో జాతత్విఇతిచేన్న. "అంబేఅంబా ల్యంబికే" "మనుఃపుత్రేభ్యో దాయం వ్యభజత్" ఇత్యాద్యా శ్శ్రుతయ స్తు స్థితాః. శ్రుతౌ మను పుత్ర దాయభాగకథనేన మనుదాయభాగా త్పర మేవ శ్రుతి స్సముత్ప న్నేతి, అంబాలికాదినామకథనమాత్రేణ

మఱునాటి దినమున ప్రాతఃకాలముననే లేచి, నిత్య కృత్యముల నొనర్చుకొని, యమ్ముని యనుజ్ఞ గైకొని యచ్చటినుండి సుతీక్ష్ణునితోఁగూడ నగస్త్యాశ్రమమునకుం బయనమైరి.

౩౫౪ ఇట్లు శ్రీరాముఁడు సుతీక్ష్ణ సీతా లక్ష్మణ సమేతుఁడై బయలుదేరి పోయి, పోయి, యొక్కచో బ్రాహ్మణ జన సేవితమును, అనేక వృక్ష జాతులచే మనోహరమును, అన్ని ఋతువులందునుం బుష్పించు పుష్పములచే నయనానందకరము నగు నా కుంభసంభవుని యాశ్రమమును జూచెను.

౩౬౪ ఆ సమయమునం దచ్చట నగస్త్యమునియుఁ దన యాశ్రమము నందు ముందు భాగమునను నిరుపార్శ్వములను నచ్చటి తాపసవరులు నలుప్రక్కలఁ దన్నుఁ బరివేష్టించి సేవింప రామనామము నందలి యనేక *రహస్యార్థములను వివరింపుచు వారిని బ్రహ్మానంద రసపూర విమగ్నులఁ జేయుచుండెను.

---

* శ్రీరామనామము నందలి విశేషార్థములు రామతారకోపనిషత్తునందు విశేషముగ ప్రతిపాదింపఁ బడియున్నవి. ఎట్లన "చిన్మయరూపుఁడగు మహావిష్ణువు దశరథ పుత్రుఁడై పుట్టి రఘుకులమునఁ బ్రకాశించుచున్నాఁడు" అను వచనముచే నామములో'నేకదేశమును గ్రహించిన నామము నంతను గ్రహించినట్లగు" నను న్యాయము ననుసరించి వైకుంఠవాసియగు భగవానుఁడు మ=మహీతలమున, రా=ప్రకాశించుచున్నాఁడు, అనఁగా భూతలమునఁ బ్రకాశించుచున్నాఁడు. కావున రాముఁడను నర్థము నిర్వచింపఁబడినది. దీనిపై నొక యాశంక కలుగును. (ఏమనఁగా) ఉపనిషత్తునందు రామకథ ప్రతిపాదింపఁబడుటచే శ్రీరామావతారము ముగిసిన తరువాతనే యుపనిషత్తులు పుట్టిన వను నాశంకకు సమాధాన మేమనఁగా, వేదములో, అంబ, అంబాలిక, అను పేర్లు చెప్పినంత మాత్రమునను, మనుపుత్త్రులదాయభాగము వేదములోఁ జెప్పఁబడిన మాత్రమునను, మనుపుత్రదాయ భాగమైన తర్వాతనే శ్రుతి పుట్టినదన కాని

భారతకథానంతర మేవ శ్రుతి రుత్పన్నేతి కథనం యస్య నిశ్వసిత మిత్యాదినా శ్రుతేరనాదిత్వావగమాత్ యథాఽవిద్యావిలసిత మేవ, తథేదమ పీతి బోధ్యం. కించ నారాయణతాప న్యుపనిషది "రమంతే యోగినోఽనంతే నిత్యానందే చిదాత్మని" ఇతి రామ పదే నాసౌ పరబ్రహ్మాభిధీయతే॥ చిన్మయ స్యాఽద్వితీయస్య నిష్కళ స్యాశరీరిణః। ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా" ఇత్యాదివచనైః త్రిమూర్త్యతీత పరబ్రహ్మైవ రామపదవాచ్య మితి, తన్మాయాకల్పితా ఏవ రామకృష్ణాద్యవ తారా ఇత్యవగమ్యతే॥

తత్రైవ శ్రీరామమంత్రరాజస్య సమ్యగర్థోఽయ ముచ్యతే. "నారాయణాష్టాక్షరేచ శివపంచాక్షరే తథా। సార్థ కార్థద్వయం రామో రమంతే యత్ర యోగినః" ఇత్యాదినా తదుభయమంత్రస్థితసార్థకవర్ణద్వయ మేళనేన రామనామసిద్ధ మిత్యుక్తం. ఏత మర్థ మనుసృత్యైవ "నాయనాయ ముఖాత్ వినార్థకం, మాళితోఽపి న శివాయ పంచకం, రామనామ ఇతి తాదృశం, తథాత త్తదన్వయవశాచ్చ తద్ద్వయ" మిత్యభి యుక్తే నా ప్యుక్తం సంగచ్ఛత ఇతి. అతఏవ రామనామ హరి హరాభేదవ్యంజక మితి కథనం సంగచ్ఛతే. "అహం రామో భవిష్యామి త్వం సీతా భవ పార్వతీ"తి శివవచనేన సీతారామౌ పార్వతీ పరమేశ్వరాత్మకా వితి జ్ఞాయతే॥

భారతము పుట్టిన తర్వాతనే వేదము బయలుదేరినదని కాని చెప్పలయు "యస్యనిశ్వసితమేవ ఋగ్వేదః" ఇత్యాది వాక్యములచే శ్రుతుల కనాదిత్వము స్పష్టముగాన సెల్లజ్ఞానవిలసితమా; యట్లే రీని విషయమైకూడ నా యాశంక యజ్ఞానవిలసితమే యగును. ఏలనన, శ్రుతు లనాదు లగుటవలన నని తెలియఁదగును. నారాయణతాపన్యుపనిషత్తునందు "అనంతుఁడును నిత్యానందుఁడును, చిన్మాత్రుఁడును, నగు వీనియందు యోగులు రమింతురు గనుక రాముఁడని చెప్పఁబడుటచే నీ రామ యను పదము పరబ్రహ్మమును బోధించుచున్నది. మఱియు చిన్మయుఁడును, అద్వితీయుఁడును, నిష్కలుఁడును, అశరీరియు నగు నీ పరబ్రహ్మస్వరూపునకు రూపకల్పన యుపాసకుల సౌకర్యమునకై యేర్పడినది. ఈ మొదలగు వచనములచే రాముఁడని త్రిమూర్త్యతీతుఁ డగు బ్రహ్మగా జెప్పబడినది. కావుననే రామకృష్ణాద్యవతారము లెల్ల మాయాకల్పితములే యని తెలియుచున్నది.

అచ్చటనే శ్రీరామమంత్రరాజమునకీ యర్థము చెప్పబడుచున్నది. "నారాయణాష్టాక్షరియందలి, రా యను వర్ణమును, శివ పంచాక్షరియందలి మ యను వర్ణమును గలిపి రామ, యని యయ్యెను. ఈ యర్థము ననుసరించియే ప్రము ఖాక్షరమగు రా, యనునది లేకున్న నష్టాక్షరి మోక్షము నొసఁగాదనియు, మాహానీయమైన మకారము లేకున్న శివపంచాక్షరి శుభమునొసఁగు గాదనియుఁ గావున రామనామము శైవవైష్ణవమంత్ర సమన్వయము వలన రామ యను రెండక్షరము లుత్పన్నము లను నభియుక్త వచనము పూర్వోక్తములైన యర్థములనే బలపఱచుచున్నది. కావుననే రామనామము హరిహరాభేదవ్యంజక మని చెప్పుట గూడ సమీచీనమగుచున్నది. లేక రముధాతువునకు క్రీడించుట యర్థము కాన, రాముఁడనగా సమాధికాలమున నెవనియందు యోగులు క్రీడించెదరో, అత డని తెలియఁదగును. "నేను రాముఁడ నయ్యెదను. నీవు సీత వగు మను శివవచనముచే సీతారాములు పార్వతీ పరమేశ్వరాత్మకు లని తెలియబడుచున్నది.

అథవా:—రమ్యతేఽనేనేతి వ్యుత్పత్త్యా దివ్యసుందర విగ్రహ ఇత్యర్థోఽవగమ్యతే. కించ బ్రహ్మవైవర్తే కృష్ణజన్మ ఖండే "రాశబ్దో విశ్వవచనః మ శ్చాపీశ్వరవాచకః విశ్వానా మీశ్వరో యో హి తేన రామః ప్రకీర్తితః" ఇత్యాదినా విశ్వేశ్వర ఏవ రామపదవాచ్య ఇత్యర్థోఽవగమ్యతే. కించ "రమతే రమయా సార్ధం తేన రామం విదు ర్బుధాః" ఇత్యనేన, "రా చేతి లక్ష్మీవచనో మ శ్చాపీశ్వరవాచకః లక్ష్మీపతిం త్వమం రామం ప్రవదంతి మనీషిణః" ఇత్యనేన చ లక్ష్మీపతిరేవ రామపదే నాఽభిధీయత ఇతి. కించ—"రాక్షసా యేనమరణం యాంతి స్వోద్రేకతోఽథవా, రామనామ భువి ఖ్యాత మభి రామేణ వా పునః" ఇతి రామతాపన్యుపనిషద్వచనేన రాక్షస మారకత్వా ద్రామ ఇతి.

అథవా అభిరామత్వా ద్రామ ఇతి చాఽర్థోఽవగమ్యతే.

కించ, నామ్నైకదేశే నామగ్రహణన్యాయేన రాశబ్దో రావణవాచకః, మకారో మరణవాచకః, రావణో యేన మరణం యాతి స రామ ఇతి, రావణమారకత్వా ద్రామ ఇతి పర్యవసితం. యద్వా పూర్వోక్తన్యాయేన రాతి దదాతి ముక్తిం భగవా న్మహిస్థిత ఇతి రామః—

కించ, ఆత్మని రమత ఇతి వ్యుత్పత్త్యా ఆత్మారామ ఏవ రామశబ్దార్థః.

అపిచ—"రకారోఽనలబీజ స్యా జ్జన్మకర్మ కరోతి చ,

లేక లోక మిలనిచే రమింపఁ జేయఁబడుచున్నదను వ్యుత్పత్త్యర్థముచే దివ్యసుందరవిగ్రహుఁడను నర్థ మవగతమగుచున్నది. మఱియు బ్రహ్మవైవర్తమునందు కృష్ణజన్మ ఖండమందు "రా" యనఁగా విశ్వమనియు, మకారమున నీశ్వరుఁ డనియు, విశ్వేశ్వరుఁడే రాముఁడని చెప్పఁబడుచున్నాడు" అను వాక్యములచే విశ్వేశ్వరుఁడే రామపద వాచ్యుఁడనియు నర్థ మవగత మగుచున్నది. మఱియు రమతోఁగూడ రమించుచున్నాఁడు గాన బుధులు రాముఁ డని చెప్పుచున్నారు. అనుటచేతను, "రా, యనఁ లక్ష్మీవాచక మనియు, మ, యనునది యీశ్వరవాచకమనియు, రాముఁ డనఁగా లక్ష్మీపతియని విద్వాంసులు చెప్పుచున్నారు" అను వచనము చేతను లక్ష్మీపతియే రామపదముచే బోధింపఁబడుచున్నాడు. నామైకదేశన్యాయముచే, 'రా' యనఁగా రాక్షసులను, 'మ' అనఁగా మారణము చేయువాడు కాన రాముఁడనఁగా రాక్షస మారకుఁ డని యర్థముకూడ రామతాప న్యుపనిషద్వచనముచే నవగత మగుచున్నది.

మఱియు రాముఁ డనఁగా నభిరాముఁడనియు పై యుపనిషత్తునందే చెప్పఁబడియున్నది.

ఇట్లే నామైకదేశన్యాయముచే, 'రా' యనగా రావణుఁ డని యర్థము. మకారమునకు మారకు డని యర్థము. రావణ మారకుఁడు గాన రాముఁ డని యర్థముగూడ నవగతమగుచున్నది. అనఁగా 'రా' అనగా రావణుని, 'మ' అనగా మారణము చేయువా డని యర్థము. లేక,'మ'అనగా మహీతలమునం దవతరించి 'రా' అనగా ముక్తినిచ్చువాడు గాన రాముడని యర్థము.

మఱియు నాత్మయందు రమించుచున్నాఁడను వ్యుత్పత్త్యర్థముచే నాత్మారాముఁడే రాముఁడని రామశబ్దార్థము-

లేక రామ అను నామములో రకారము, అకారము, మకారము

ఆకారో భానుబీజం స్యా దవిద్యాం నాశయే త్తమః, మకార శ్చంద్రబీజంస్యా త్తాపం హరతి వై సదే”త్యనేన పాపనాశక త్వాఽజ్ఞానాంధకార నివ ర్తకత్వ తాపత్రయనివార కత్వరూప శక్తి త్రయవ ద్రామనా మేత్యర్థః॥

కించ “రకార స్తత్పదార్థ స్స్యా న్మకార స్త్వం పదార్థకః తయో స్సంయోజన మసీ త్యేత త్తత్త్వవిదో విదుః । ఇత్యాదినా జీవబ్రహ్మైక్యరూపాద్వైతార్థో ప్యవగమ్యతే.

అథవా—రామః శ్యామ ఇత్యర్థః.

అథవా:—నామైక దేశన్యాయేనరాజ్ఞాం మహీస్థితానాం నీతిబోధకత్వా ద్రామ ఇతి. ఇదం చిత్రకూటే భరతం ప్రతి రాజనీతికథనేన సంగచ్ఛతే. భ ర తం నిమి త్తీకృత్య సర్వేషామపి రాజనీతి బోధనార్థ మేవ రామేణ భరతం ప్రతి నీతికధన మితి వేద్యం.

అధవా— “రాశబ్దోచ్చారణా దేవ ముఖాన్నిర్యాంతి పాతకాః, పునః ప్రవేశభీ త్యైవ మకార స్తు కవాటవత్, శ్రీ శబ్దో చ్చారణా దాదౌ లభ తే శ్రియ మైహికీం” ఇత్యాదినా పాపనాశక ఇత్యర్థోఽవగమ్యతే.

అథవా:—'రమ్'ధాతోః ద్యుతిమోదాద్యర్థా న్నాదాయు రమతే, మోదత ఇతి రామః. సర్వదా ఆనందరూప ఇతియావత్

నుండినవి. వీనిలో రకారమున కగ్నియర్థము. అగ్నికి భస్మముచేయు శక్తి కలదు. అకారమునకు సూర్యుఁడని యర్థము. అతడు తమోనాశకుడు. మకారమునకుఁ జంద్రుఁడర్థము. అతడు తాపాపహారకుఁడు" అను వచనములచే రామ అనుపదములో అగ్నిబీజము, చంద్రబీజము, అగ్నిబీజ మున్నందున పై ముగ్గురిశక్తులు రామనామ మందున్నందున రామ అను పదమునకు పాపనాశకత్వము తాపత్రయ నివారకత్వము, నజ్ఞానాంధకార నివర్తకత్వము అను నర్థము లవగతము లగుచున్నవి.

మఱియు రకారమునకు తత్పదార్థమగు పరబ్రహ్మ మర్థము. మకారమునకు త్వంపదార్థకమగు జీవుఁ డర్థము. ఈ రెండింటి కలయికయే యైక్యముకాన జీవబ్రహ్మైక్యరూప వేదాంతార్థము రామనామముచే జెప్పఁబడినది.

టీక :—రాముఁ డనఁగా శ్యామవర్ణు డని యర్థము.

టీక:—మ, అనఁగా మహీతలమందున్న రా, అనగా రాజులకు నీతిని బోధించువాడు గాన రాముడని యర్థము. ఈ విషయము చిత్రకూటమందు భరతునితో రాముడు రాజనీతిని గురించి చెప్పుటచే సంగతార్థమగుచున్నది. ఎట్లనఁగా, భరతుని నిమిత్తముగాఁ జేసి రాముడు లోకములో రాజులకు రాజనీతిని బోధించెను. గాని భరతునికై కాదని తెలియఁదగు.

మఱియు 'రా'శబ్దోచ్చారణము వలన పాతకములు ముఖమునుండి బయల్వెడలు చున్నవి. పునఃప్రవేశ భీతిచే 'మకారము' కవాటమువలె నగుచున్నది. ఆదియందు 'శ్రీ'శబ్దము నుచ్చరించుటచే నైహిక సంపద లభించు చున్నది' అను వచనముచే రామనామము పాపనాశక మను నర్థ మవగతమగుచున్నది.

మఱియు, ధాతువు లనేకార్థబోధకములు గాన (రమ్) ధాతువు కయుక్త— ద్యుతిమోదాద్యర్థములం గాని, రమతే = అనఁగా సంతసించు చున్నాఁడు గాన రాముడు అనఁగా నానంద రూపుఁడని

అథవా స్వేచ్ఛయా రమణీయవపుర్ధారిణా రామఇతి.
యద్వా - రమయతీతి రామః;

యద్వా:—రమతే ప్రకాశత ఇతి రామః స్వయం ప్రకాశమాన ఇత్యర్థః;

యద్వా: —రమారూపిణ్యా సీతయా రమత ఇతి రామః అనేన సీతాలోలః దాశరథి రిత్యర్థోఽవగమ్యతే.

యద్వా:—"కళాతీతా భగవతీ స్వయం సీతేతి సంజ్ఞితా తత్పరః పరమాత్మాచ శ్రీరామః పురుషోత్తమః" ఇతి తారసారోపనిషద్వాక్యేన నాదబిందుకళాతీతా భగవతీ సీతేత్యుచ్యత ఇతి తత్పరః పరమాత్మైవ పురుషోత్తమః శ్రీరామ ఇ త్యుచ్యతే.

యద్వా:—"వైదికా స్తాంత్రికా శ్చైవ మంత్రాణాం సప్తకోటయః తత్ర శైవా వైష్ణవా శ్చ ప్రాధాన్యేన ద్విధా మతాః, శివపంచాక్షరీ శైవే మంత్రజాతే ప్రశస్యతే, నారాయణాష్టాక్షరీ తు వైష్ణవేషు విశిష్యతే, రాకారో వైష్ణవో గ్రాహ్యో మకారశ్శైవసంగ్రహః, రామేత్యక్షరయుగ్మం తు శైవవైష్ణవసారవత్, శాక్తానా మథ మంత్రాణాం గ్రాహ్యః శ్రీకార ఉచ్యతే, తత్సర్వం చ సమాఖ్యాతం శ్రీరామేత్యక్షరత్రయం, ఐహికాముష్మికసుఖం శ్రీరామే త్యక్షరత్రయాత్, త్ర్యక్షరం తారకం బ్రహ్మ శ్రీరామేతి భజంతి యే, ధర్మార్థకామమోక్షాణాం సిద్ధి స్తేషు న సంశయః" ఇతి యోగరహస్యమంత్రశాస్త్రవచనే నైహికాముష్మికసుఖదాయక శ్రీరామ ఇత్యర్థోఽవగమ్యతే.

యర్థము. లేక, స్వేచ్ఛచే రమణీయ శరీరమును ధరించుచున్నాడు కాన రాము డనియు, లేక సంతోషము పెట్టువాడు గాన రాముడు, లేక, ప్రకాశించువాడు గాన రాము డనియు, అనఁగా స్వయం ప్రకాశమానుఁ డనియు,

లేక, రమారూపిణియగు సీతతో రమించువాడు గాన రాముఁ డనియు, ఇట్లనుటచే సీతారాములుఁ డను నర్థ మవగతమగుచున్నది.

లేక, "కళాతీత యగు భగవతి స్వయముగ సీతయై యవతరించినది. ఆమె యం దాసక్తుఁడగు పరమాత్మ శ్రీరాముఁ"డని తారసారోపనిషద్వాక్యముచే నావలింత కళాతీత యగు భగవతి సీత యనియు, తత్పరుఁడగు పురుషోత్తముఁడు శ్రీరాముఁ డని యర్థము చెప్పఁబడుచున్నది.

లేక వైదికములు, తాంత్రికములు, అని సప్తకోటిమంత్రములు రెండు విధములుగ గలవు. అవియెల్ల శైవములు వైష్ణవము లని ద్వివిధములు. శివపంచాక్షరి శైవమంత్రములందును, నారాయణాష్టాక్షరి వైష్ణవమంత్రములందును, సారభూతము లనియు, రాకారము వైష్ణవమంత్రసార మనియు, మకారము శైవమంత్రసార మనియు, రామ యను నక్షరద్వయము శైవవైష్ణవమంత్రసారభూత మనియు, శ్రీకారము శాక్తమంత్రములలో నుత్తము మనియు, కావున శ్రీరామ యను నక్షరత్రయము ఐహికాముష్మిక సుఖప్రద మనియు శ్రీరామయను నక్షరత్రయము ధర్మార్థకామమోక్షముల నొసంగుచున్న దని యొడి యోగ రహస్యమంత్ర శాస్త్రవచనముచే నైహికాముష్మిక సుఖదాయకుఁడు శ్రీరాముఁడను నర్థ మవగత మగుచున్నది.

కించ:—రామ ఇతి నామని సూర్యచంద్రాగ్నిబీజ సద్భావాత్ సూర్యస్య కళాః ద్వాదశ, చంద్రస్య త్వేకాకళా, అగ్నే స్తిస్రః కళాః సంభూయ షోడశకళాః. తాదృశకళా పరిపూర్ణ ఇత్యర్థోఽవగమ్యతే. అనేన పరిపూర్ణావతారః రామావతార ఇత్యుక్తం భవతి.

కించ:—రమాశబ్దా దపి రామ ఇతి భవతి. రమయా సహితో రామః లక్ష్మీపతి రిత్యర్థోఽవగమ్యతే.

కించ:—శ్రీరామరహస్యోపనిషది "రామ ఏవ పరం తత్త్వమ్ శ్రీరామో బ్రహ్మతారకం" ఇత్యనేన శ్రీరామో నామ తారక బ్రహ్మేత్యర్థో వగమ్యతే. అతఏవ శ్రీరామః పర మాత్మతత్త్వ మితి హనుమతా యోగీంద్రం ప్రత్యుపదేశోఽపి సమీచీన ఏవ.

అథవా:—రామ ఇత్యనేన కటపయాదిసూత్రసిద్ధ సంఖ్యాక్రమేణ (రా౨ మ౫ సంభూయ౨౫) పంచవింశతి తత్త్వాత్మక ఇత్యర్థోఽవగమ్యతే.

అథవా:—రా౨ + మ౫ = ౭ సంకలనసిద్ధసంఖ్యాకః ప్రణవః. శివసూత్రేషు సప్తమవర్ణ ఓంకారః. తస్మా ద్రామః ప్రణవాత్మక ఇత్యర్థోనగమ్యతే. "నామ్నాం సహస్రం దివ్యానాం స్మరణే యత్ఫలం భవేత్, తత్ఫలం లభతే నూనం నామోచ్చారణమాత్రతః" ఇత్యనేన సహస్రనామోచ్చారణ ఫలప్రదం రామనామేతి పూర్వోక్త్యా సిద్ధ్యతి.

మఱియు రామనామమందు సూర్యచంద్రాగ్ని బీజము లుండుటచే సూర్యునికి కళలు పండ్రెండును, చంద్రునికి కళ యొక్కటియును, అగ్నికి కళలు మూఁడును, సంఘీభవించి షోడశకళ లయ్యెను. అట్టి షోడశకళా పరిపూర్ణుఁడు రాముఁడను నర్థ మవగతమగుచున్నది. ఇందుచే రామావతారము పరిపూర్ణావతార మని తేలుచున్నది.

మఱియు, రమాశబ్దమునుండి గూడ రామశబ్ద ముత్పన్న మగుచున్నది. కావున రమాసహితుఁడుగాన రాముఁ డనుటచే లక్ష్మీపతియను నర్థముగూడ నవగతమగుచున్నది.

మఱియు శ్రీరామ రహస్యోపనిషత్తునందు శ్రీ రాముఁడు పరతత్త్వమనియు, శ్రీరాముఁడే తారక బ్రహ్మము నను వచనముచే రాముడు పరమాత్మ తత్త్వమని హనుమంతునిచే యోగీంద్రుల కుపదేశింపఁబడినది గూడ సుసంగత మగుచున్నది.

మఱియు కటపయాది సూత్రసిద్ధమైన సంఖ్యాక్రమమున, యరలవలలో రా. ౨ వ యక్షరము గాన 'రా' ౨ మ. అనగా పవరులోని అయిదవ యక్షరముగాన 'మ' యనగ ౫ సంఖ్యయు సంఘీభవించి ౨౫ అయ్యెను కాన రాముఁ డనగా, పంచవింశతి తత్త్వాత్మకుఁడని యర్థము.

లేక. రా. ౨ మ. ౫. సంకలనముచే ౭ అయ్యెను. శివసూత్రముల యందు సప్తమవర్ణము ఓంకారము. కావున రాముఁడు ప్రణవాత్మకుఁడని తేలుచున్నది. మఱియు, సహస్రనామ సంకీర్తనము వలన నెట్టి ఫలమో, అట్టిఫలము ఒక్కమారు రామనామము నుచ్చరించిన మాత్రముననే సంభవింపఁ గల దని వచన ముండుటచే సహస్రనామోచ్చారణ ఫల ప్రదము శ్రీ రామనామమని యవగత మగుచున్నది.

"తాగ్రృజ్ఞామసహస్రేషు రామనామ పరం మత"మితి వచన మపి పూర్వోక్తార్థ మే వానువద తీతి గ్రాహ్యం. "రామం త్రినేత్రం సోమార్ధధారిణం శూలినం పరం, భస్మోద్ధూళిత సర్వాంగం కపర్దిన ముపాస్మహే ! రామాభిరామాం సౌందర్య సీమాం తాం జనకాత్మజాం పాశాంకుశధనుర్బాణధరాం ధ్యాయే త్త్రిలోచనాం" ఇతి శ్రీరామరహస్యోపనిషద్వచనేన రామస్య హరాభిన్నత్వం ద్యోత్యతే.

కించ:—"ఓం తత్పరః పరమపురుషః పురాణపురుషోత్తమో నిత్య శుద్ధ బుద్ధముక్తసత్యపరమానందానంతాద్వయపరిపూర్ణః పరమాత్మా బ్రహ్మైవాహం నాన్యోస్మి" ఇత్యుపనిషద్వచసా రామస్య సచ్చిదానంద పరమాత్మత్వం చావగమ్యతే.

కించ:—"అకారాక్షరసంభూత స్సౌమిత్రి ర్విశ్వభావనః, ఉకారాక్షరసంభూత శ్శత్రుఘ్న స్తైజసాత్మకః, ప్రాజ్ఞాత్మక స్తు భరతో మకారాక్షరసంభవః, అర్ధమాత్రాత్మకో రామో బ్రహ్మానందైకవిగ్రహః, ఉత్పత్తిస్థితి సంహారకారిణీ సర్వదేహినాం, సీతా భగవతీ జ్ఞేయా మూలప్రకృతిసంజ్ఞితా, ప్రణవత్వా త్ప్రకృతి రితి వదంతి బ్రహ్మవాదినః॥ ఇతి రామోత్తరతాపనియోపనిషద్వాక్యేన సీతాలక్ష్మణభరతశత్రుఘ్న హనుమత్సమేత శ్రీరామచంద్ర ష్షడవయవప్రణవవాచ్య ఇతి ప్రణవస్వరూప ఇతి చావగమ్యతే॥

కించ:—"షడక్షర మహామంత్రం తారకం బ్రహ్మ ఉచ్యతే, యే భజంతి చ మాం భక్త్యా తేషాం ముక్తిర్న

విష్ణునామ సహస్రమునందు రామనామ ముత్కృష్టమను వచనముఁగూడ పూర్వోక్తార్థమునే యనువదించుచున్నదని గ్రహింపనగును. మఱియు, చిన్మయుండును, సోమార్ధధారియును, త్రిశూలియును, పరాత్పరుండును, భస్మోద్ధూళిత సర్వాంగుఁడును, కపర్దియునగు రాము నుపాసించెదను. రామాభిరామయు, పాశాంకుశధనుర్బాణధారిణియు, త్రిలోచనయు, నగు సీతకు నమస్కరించెదను, అను శ్రీరామరహస్యోపనిషద్వచనముచే రాముఁడు హరాభిన్నుఁడును, సీత పార్వతీరూపిణియు నను నర్థము ద్యోతితమగుచున్నది.

మఱియు, "నిత్యశుద్ధ బుద్ధముక్తస్వరూపుడును సచ్చిదానంద రూపుడు నగు పరమాత్మనే నేను, ఇతరుడను కానను నుపనిషద్వాక్యానుసారముగ రాముఁడన సచ్చిదానంద పరమాత్మస్వరూపుఁడని గూడ నవగతమగు చున్నది.

మఱియు, ఓంకారములో అకార ఉకార మకారార్ధ మాత్రలున్నవి గాన నకారమునకు విశ్వాత్మకుఁడగు సౌమిత్రియు, ఉకారమునకు తైజసాత్మకుఁడగు శత్రుఘ్నుఁడును మకారమునకుఁ ప్రాజ్ఞాత్మకుఁడగు భరతుండును, అర్ధమాత్రకు బ్రహ్మానందైక విగ్రహుఁడగు రాముడును, సీత ఉత్పత్తి స్థితి సంహార కారిణియగు మూలప్రకృతియనియు, ప్రణవము కాన ప్రకృతియనియు, బ్రహ్మవాదు లర్థము చెప్పుచున్నారు. అను రామోత్తర తాపనీయోపనిషద్వాక్యముచే సీతాలక్ష్మణభరతశత్రుఘ్న హనుమత్సమేతుఁడగు శ్రీరామచంద్రుఁడు షడవయవప్రణవవాచ్యుఁడనియు ప్రణవస్వరూపుఁడనియు వ్యక్తమగుచున్నది.

మఱియు షడక్షరమహామంత్రమునకు తారకబ్రహ్మమర్థముగఁ జెప్పఁబడుచున్నది. మఱియు నన్నెవ్వరు భజించుచున్నారో వారికి

సంశయః" ఇతి పాద్మోత్తరఖండవచనేన తారకబ్రహ్మరూప ఇత్యవగమ్యతే.

"య ఏతం మహామంత్రరాజం శ్రీరామచంద్రషడక్షరం నిత్యమధీతే సోఽగ్నిపూతో భవతి, స వాయుపూతో భవతి" ఇత్యనేన, "ఇతిహాసపురాణానాం రుద్రాణాం శతసహస్రాణి జప్తానిఫలాని భవంతి, శ్రీరామచంద్ర మనుస్మరణేన గాయత్ర్యాశ్శతసహస్రాణి జప్తాని ఫలాని భవంతి, ప్రణవానామయుతకోటిజపాని భవంతి, దశపూర్వాన్దశోత్తరాన్పునాతి, స పంక్తిపావనో భవతి, స మహాన్భవతి, సోఽమృతత్వం గచ్ఛతి, సోఽమృతత్వం గచ్ఛతి"—ఇత్యుపనిషద్వచనేన చ రామమంత్రజపస్య సర్వాఘపరిహారకత్వం సర్వాభీష్ట ఫలప్రదత్వం, ముక్తిదాయకత్వం చావగమ్యత ఇత్యలం విస్తరేణ॥

ఇత్యాశ్చర్యరామాయణే అరణ్యకాండే
చతుర్థస్సర్గస్సమాప్తః



ముక్తి నిస్సంశయముగ లభించఁగలరు, అను పాద్మోత్తర ఖండవచనముచే రాముఁడు తారకబ్రహ్మస్వరూపుఁడని యవగతమగుచున్నది.

మఱియు, రామనామకీర్తనఫల మిట్లు కన్పడుచున్నది. ఈ మహామంత్రరాజమగు శ్రీరామచంద్ర షడక్షరమంత్రము నెవ్వఁడు నిరతము జపించుచున్నాఁడో వా డగ్నిపూతుఁ డగుచున్నాఁడు. వాయుపూతుఁ డగుచున్నాఁడు, ఇత్యాదివాక్యములచేతను, ఇతిహాసపురాణములు రుద్రమంత్రములు వేనకువేలు జపించినంతఫలము శ్రీరామమంత్రమొక్కమా రుచ్ఛరించిన నా ఫలము గల్గుననియు, మఱియు రామమంత్రము నొక్కమా రుచ్ఛరించిన సహస్రగాయత్రి జపించినట్లగుననియు పదితరములు పూర్వమునుండి పదితరములు పరమువరకు తనవంశస్థులను బవిత్ర మొనర్చుచున్నదనియు, అతఁడే పవిత్రపావనుఁ డగుచున్నాఁడనియు, అతఁడే మహత్తుగలవాఁడనియు, అతఁడమృతత్వసిద్ధిని గనుచున్నాఁడనియు" అను నుపనిషద్వాక్యముచే రామమంత్రజపమునకు సమస్తపాపనాశకత్వము సర్వాభీష్టఫలప్రదత్వము, ముక్తిదాయకత్వము సిద్ధించుచున్నది. ఇక శాఖాచంక్రమణము చాలును.

చ తు ర్థ స ర్గ ము స మా ప్త ము.



## పంచమసర్గ ప్రారంభః

[1]వృక్షస్కంధ విలంబమానవిలస చ్చీరాంబరై శ్శోభితం
నానాజాతిమృగై ర్విరోధరహితై స్సంసేవితం పావనమ్
శాంతం చోద్గతహోమధూమ మతులం సంసేవితం తాపసై
ర్వీక్ష్యాగ స్త్యమునీశ్వరాశ్రమ మథ ప్రాహానుజం రాఘవః. ౧

సౌమిత్రే! సుమహా న్మునిః కలశజో, రక్షో భయా త్తాపసాః
ఆగ త్యాత్ర మునీశ్వరేణ మహతా సంరక్షితా స్సంస్థితాః
దైత్యా శ్చాపి మునే ర్భియాఽశ్రమతలా ద్దూరే చరంతి ధ్రువం
తస్మా దత్ర వసామ లక్ష్మణ వయం కాలేఽవశిష్టే సుఖమ్. ౨

ఇ త్యుక్త్వాథ సుతీక్ష్ణ మేవ మవద చ్ఛ్రీరామచంద్రప్రభుః
గత్వా త్వం గురుసన్నిధిం వద మునే మా మాగతం సీతయా
ఇ త్యుక్తో ద్రుత మేత్య తం కలశజం నత్వా సుతీక్ష్ణోఽబ్రవీత్
రామో భూసుతయా సమేత్య వసతి త్వాం ద్రష్టుకామో
బహిః. ౩

త చ్ఛ్రుత్వా వచనం మునిః కలశజో నిర్గత్య శిష్యై ర్వృతః
ప్రత్యుద్గమ్య చ రాఘవం తదనుజం సీతాం చ తద్వందితః
ఆశీర్భి స్త్వభినంద్య చాశ్రమతలం చానీయ పాద్యాదిభి
స్సంపూ జ్యాహ రఘూ త్తమం ప్రతివచః కృత్వాంజలిం స్తావకమ్ర

---

1 శా॥

## పంచమసర్గ ప్రారంభము.

౧ వ్రేలుం గొమ్మలకు నారఁ గట్టఁబడిన నారచీరలచేఁ బెన్నుమీఱు వృక్షతతుల కాకరమై పరస్పర విరోధములు మాని యన్యోన్య స్నేహ భావముల మెలంగు నానామృగ జాతులచే సంసేవితమై పవిత్రితమై, శాంతి నిలయమై నిరంతర హోమధూమ పరీతమై తాపసగణ సేవితమై యొప్పు నగస్త్యమునీశు నాశ్రమస్థానమ్మును జూచి రాముఁ డానంద పరవశుఁడై తమ్మునితో ని ట్లనియెను.

౨ లక్ష్మణా! యీ కుంభసంభవుఁడు మునిజనాగ్రేసరుఁడు సుమా! రాక్షస భయము మూలమున నీ చుట్టుపట్టుల నుండు తాపసు లెల్లరు నిచ్చటకు వచ్చి యీ మునిచే రక్షింపఁబడుచు నిచ్చట నివసించు చున్నారు. ఈ మునివరువలని భయమున రక్కసులు నిచ్చటఁ జేరవెఱచి దూరదూరముగఁ దొలఁగి పోవుచుందురు. కావున మన మింక మిగిలిన వనవాస కాలము నిచ్చట నివసించి శాంతముగఁ గడపిపుత్తము.

౩ అని లక్ష్మణునితోఁ బలికి పిమ్మట శ్రీరామచంద్రుఁడు సుతీక్ష్ణునితో మునివరా! నీవు ముందుగ నీ గురు సన్నిధానమున కేగి సీతా సహితుఁడనై నేను వచ్చితి నని యాయన కెఱింగింపుము. నాథుఁడు వల్లెయని సుతీక్ష్ణుఁడు కుంభ సంభవుని దరికేగి నతులు నుతులు సలిపి రాముఁడు సీతతోఁగూడ వచ్చి నిన్ను దర్శింప వాకిట వేచియున్నా డని విన్నవించెను.

౪ అది విని యగస్త్యుఁడు బ్రహ్మానందమున మునిగి తేలుచు శిష్యజన సహితుఁడై సీతారామ లక్ష్మణుల నెదుర్కొని వారిచే వందితుఁడై వారి నాశీస్సుల నభినందించి తనాశ్రమములోనికిం గొనిపోయి యర్ఘ్యపాద్యాదులఁ బూజించి యంజలి ఘటించి నుతివాక్యములతో రామునితో నిట్లు పలికెను.

రామాఽశేన పురా తు దుగ్ధజలధౌ భూభారవిచ్ఛిత్తయే
దేవై స్త్వం తు యదార్థితో రఘుపతే తేఽహం తదాది ధ్రువం
ద్రష్టుం త్వా మిహ సంవసామి తపసి స్థిత్వా ప్రతీక్ష న్పునః
అద్యాభూ త్సఫలం తపో మమ మునే ధన్యోఽహమస్మి ధ్రువమ్॥ ౫

శ్రీమ ద్దశరథపుత్ర । స్సమ స్తభువనైకమంగళచరిత్ర
సీతాస్యకమలమిత్రః । పాయా న్మాం పదజగాతమకళత్రః. ౬

[1]మాయామానుషవేషం శ్రితజనరక్షాధి సంతోషమ్
రక్షస్సంచయశోషం వందే త్వాం భక్తసంపోషమ్. ౭

[2]త్వమేక ఏ వాసి పురా తు సృష్టే ర్నిరంజన స్త్వం నిరుపాధికశ్చ
త్వదాశ్రయా త్వద్విషయా చ మాయా శక్తి స్త వేతి
ప్రథితా జగత్యామ్. ౮

[3]యదా వృణోతి మాయా త్వాం తదాఽవ్యాకృత మిత్యభూత్,
మూలప్రకృతి రిత్యేకే ప్రాహూ ర్మాయేతి కేచన,
అవిద్యా సంసృతి ర్బంధ ఇత్యాది బహుధోచ్యతే. ౯

త్వయా సంబోధ్యమానా సా మహ త్తత్త్వం ప్రసూయతే,
మహ త్తత్త్వా దహంకార స్తయా సంబోధితా దభూత్. ౧౦

అహంకారో మహ త్తత్త్వసంవృత స్త్రివిధోఽభవత్,
సాత్త్వికో రాజస శ్చేతి తామస శ్చేతి భణ్యతే. ౧౧

---

1 అ॥ రా॥ 2 కవి.

3 అ॥ రా॥

౫ రామా! పూర్వము భూభార హరణార్థము బ్రహ్మాది దేవతలు క్షీర సముద్రతీరమున నిన్నుఁ బ్రార్థించిన నాటనుండియు నిన్ను దర్శింపఁగోరి తపశ్చర్యతో నీరాకకై ప్రతీక్షించుచున్నవాఁడను. నేటికి నా తపస్సు ఫలరూపమును దాల్చినది. నేను ధన్యుఁడ నైతిని.

౬ దశరథపుత్రుఁడవును లోకకల్యాణదాయకమగు మంగళ చరితముగల వాఁడవును, సీతా ముఖకమల కమలమిత్రుఁడవును పాద రేణువుచే గౌతమపత్నికి నిజరూప మొసంగినవాఁడవును, పరమాత్ముఁడవును శ్రీరాముఁడవు నైననీవు నన్ను నిరంతరము రక్షింతువుగాక.

౭ లీలామానుషవిగ్రహుఁడవును, ఆశ్రితజనరక్షా దీక్షితుఁడవును, రాక్షస నాశకుఁడవును భక్తపోషకుఁడవు నగు నీకు నమస్కరించెదను.

౮ ఈ జగత్సృష్టికిఁ బూర్వము నీ వొక్కఁడవే నిరంజన, నిరాకార, స్వరూపుఁడవై యుంటివి. నిన్నాశ్రయించి త్రిగుణాత్మకమైనమాయ నీ శక్తియని జగత్తయందుఁ బ్రసిద్ధి నందియున్నది.

౯౪ నిన్నాశ్రయించిన యావ్యాకృతమైన శక్తిని కొందరు మూల ప్రకృతి యనుచున్నారు. కొందరు మాయ యనుచున్నారు. అవిద్యారూప మనియు, సంసారబంధ మనియు ననేక విధముల నదియే చెప్పఁబడుచున్నది.

౧౦౪ నీచే బోధింపఁబడుచు మాయ మహత్తత్త్వమును గనుచున్నది. మహత్తత్త్వమునుండి యహంకారమును దానిచే సంబోధితమై జనింపుచున్నది.

౧౧౪ మహత్తత్త్వ సంవృతమైన యహంకారము, సాత్త్విక, రాజస, తామస ప్రభేదములచేఁ ద్రివిధ మయ్యెను.

తామసా త్వత్సముత్పన్నాస్తాభ్యో న్యాస న్మ్యాతా న్యతః పరమ్,
స్థూలాని క్రమశో రామ క్రమోత్తరగుణాని చ,
రాజసానీంద్రియా ణ్యేవ సాత్త్వికా ద్దేవతా మనః,
తేభ్యోఽభవ త్వత్సముత్థకాయం లింగం సర్వగతం మహత్.
౧౨-౧౩ ॥

విరా డుత్పత్తి మగమ త్స్థూలా దూర్ధ్వతచయా త్తతః,
తస్మా జ్జగ దభూ త్సర్వం త్వం రజోగుణతో విధిః,
విష్ణు స్సత్త్వగుణా త్త్వం తు తమస స్త్వం శివ స్తథా.
దేవతిర్యఙ్మనుష్యా శ్చ కాలకర్మక్రమేణ తు, ౧౪-౧౫ ॥
జాగ్ర త్స్వప్న సుషు ప్త్యాఖ్యా వృత్తయో బుద్ధిజై ర్గుణైః,
తద్వృత్తీనాం రామచంద్ర భవసి త్వం విలక్షణః. ౧౬ ॥

సృష్టిలీలాం యదా కర్తు మీహసే రఘునందన
అంగీకరోషి మాయాం త్వం తదా గుణవా నివ. ౧౭ ॥

రామ మాయా ద్విధా భాతి విద్యాఽవిద్యేతి తే సదా,
ప్రవృత్తిమార్గనిరతా హ్యవిద్యావశవర్తినః,
నివృత్తిమార్గనిరతా స్తే వై విద్యామయా స్స్మృతాః. ౧౮-౧౯

అవిద్యావశగా యే చ నిత్యం సంసారిణ శ్చ తే,
విద్యాభ్యాసరతా యే చ తే చ ముక్తా న సంశయః ౨౦

త్వ ద్భక్తినిరతా యే చ త్వన్మంత్రోపాసకా శ్చ యే,
తేషాం ప్రాదుర్భవే ద్విద్యా నేతరేషాం కదాచన. ౨౧

౧౩-౧౫ ఆ తమోమయమైన యహంకారమునుండి సూక్ష్మతన్మాత్ర లుద్భవిల్లినవి. అటుపిమ్మట స్థూలభూతము లుద్భవిల్లినవి. రాజసాహంకారమునుండి యింద్రియములును, సాత్త్వికాహంకారమునుండి దేవతలును, మనస్సును వాటినుండి సూక్ష్మశరీరమును జనించినవి. స్థూలభూతచయమునుండి విరాట్టుద్భవమయ్యెను. రామా! నీవు రజోగుణము వలన బ్రహ్మవైతివి. తమోగుణమువలన రుద్రుఁడ వైతివి. సత్త్వగుణమువలన విష్ణుఁడవైతివి. కాలకర్మక్రమమున దేవతలును, తిర్యక్కులును, మనుష్యులును బ్రభవిల్లిరి.

౧౬ బుద్ధిజన్యములైన గుణములచే జాగ్రత్స్వప్న సుషుప్తులను వృత్తులును జనించినవి. రామచంద్రా! ఆ వృత్తులకంటె నీవు విలక్షణుఁడవై యెల్లప్పుడును వెలుంగుచుందువు.

౧౭ ఓ రామా! నీ వెప్పుడు సృష్టిలీలల సల్పుట కిచ్ఛగింతువో అప్పుడు నిర్గుణుఁడవైనను నీవు గుణవంతునింబోలె మాయ నంగీకరింతువు.

౧౮-౧౯ రామా! ఆ మాయ విద్యయనియు నవిద్యయనియు రెండువిధముల నెల్లప్పుడు నాభాసించుచుండును. సంసారమార్గనిరతు లవిద్యారూపిణియగు మాయకు వశవర్తు లగుదురు. నివృత్తిమార్గ నిరతులు విద్యాస్వరూపిణి యగు మాయకు వశు లయ్యెదరు.

౨౦ అవిద్యావశ వర్తను లెల్లప్పుడును సంసారలంపటులై యుందురు. జ్ఞానాభ్యాసరతులు నిశ్చయముగ నిత్యముక్తు లయ్యెదరు.

౨౧ నీభక్తియందు రక్తిగల జనులకును, నీ మంత్రోపాసన చేయు పుణ్యులకును, పైన చెప్పిన జ్ఞాన ముత్పన్నమగును. ఇతరులకు మాత్ర మెన్నడును జ్ఞానోదయము కలుగనేరదు.

రామచంద్ర తతో ముక్తా స్త్వద్భక్తా స్తు భవంతి చ,
అన్యేషాం ముక్తిశంకాపి న భవే చ్చ కదాచన. ౨౨

కిం రామ బహునోక్తేన సారం కించి ద్వదామి తే,
సాధుసంగతి రే వాత్ర మోక్షహేతు రుదాహృతా. ౨౩

సాధవ స్సమచిత్తా యే నిస్పృహా విగతైషిణః
దాంతాః ప్రశాంతా స్త్వద్భక్తా నివృత్తాఖిల కామనాః. ౨౪
ఇష్టప్రాప్తి విపత్త్యోశ్చ సమా స్సంగ వివర్జితాః,
సంన్య స్తాఖిలకర్మాణ స్సర్వదా బ్రహ్మతత్పరాః ౨౫
యమాదిగుణ సంపన్నా స్సంతుష్టా యేన కేనచిత్,
సత్సంగమో భవే త్తస్మా త్త్వత్కథాశ్రవణే రతిః. ౨౬
సముదేతి తతో భక్తి స్త్వయి రామ సనాతనే,
తద్భక్తా వుపపన్నాయాం విజ్ఞానం విపులం స్ఫుటం
ఉదేతి ముక్తిమా ర్గోయ మాద్య శ్చతురసేవితః. ౨౭

తస్మా ద్రాఘవ సద్భక్తి స్త్వయి మే ప్రేమలక్షణా,
సదా భూయా ద్ధరే సంగ స్త్వద్భక్తేషు విశేషతః. ౨౮

1సార్థకం జీవితం మేఽద్య భూ త్త్వత్పదాంభోజదర్శనాత్
అద్య మే క్రతవ స్సర్వే బభూవు స్సఫలాః ప్రభో ౨౯

---

1 కవః.

౨౨ రామచంద్రా! నీ భక్తులు జ్ఞాన సంపాదన మొనర్చి పిమ్మట ముక్తులయ్యెదరు. ఇతరులకు ముక్తి లేశమైనఁగూడ గలుగ దనుట తెల్ల సుమా.

౨౩ రామా! పలుమాట లేల? సారాంశము నొకింత వచించెద నాలకింపుము. ఇహలోకమునందు సాధుసాంగత్యమే మోక్షహేతు వని యుదాహరింపఁబడినది.

౨౪-౨౫-౨౬-౨౭ సమస్త భూతములయందును సమదృష్టికల వారును, నిస్పృహులును, ఉపశాంత్యుపహితులును, అంతరింద్రియ బాహ్యేంద్రియ నిగ్రహులును, నీ భక్తియందు మాత్రమే నిరతులై ఆపత్సంపదలను చలింపక కోరిక లుడిగి కర్మసన్న్యాస మొనర్చి, యెల్లప్పుడును బ్రహ్మవిచారమున నాసక్తులై, నియమాది గుణసంపన్నులై, దొరకిన యాహారమునకు మాత్రమే సంతుష్టి పడియుండు వారు సాధువు లనఁబడుదురు. అట్టి సాధుత్వమువలన సత్సంగతియు, దానివలన నీ కథలయం దాసక్తియు, అందువలన సనాతనుఁడ వగు నీయందు నిశ్చలభక్తియు, ఆభక్తివలనఁ బ్రస్ఫుటమైన జ్ఞానమును, దానివలన ముక్తిమార్గమును లభింపగలవు.

౨౮ కావున రామా! నీయందు నాకుఁ బ్రేమరూపమైన యపరిమిత భక్తియు, త్వద్భక్తులతో నెక్కుడగు సాంగత్యమును, నెల్లప్పుడును గలుగుచుండుఁగాక.

౨౯ నీ పాదపద్మములు దర్శించుటవలన నా జీవితము సార్థకమైనది. మున్ను నేఁజేసిన యజ్ఞయాగాదు లెల్ల సఫలములైనవి.

[1]దీర్ఘకాలం మయా తప్త మనన్యమనసా తపః
తస్యేహ తపసో రామ ఫలం తవ యదర్శనమ్. ౩౦౪

వైదేహ్యా సహిత స్త్వం తు మత్స్వాంతే వసతా ద్విభో
[2]యత్రకుత్ర స్థిత స్యాపి సదా మేఽస్తు స్మృతి స్త్వయి. ౩౦౫

స్తుత్వైవం కలశోద్భవో రఘుపతిం ధ్యాత్వా క్షణం మానసే
సంతృప్త్యా రహిత స్తతో దృఢతరం చాలింగ్య దోర్భ్యాంతు తమ్
పశ్చాత్ప్రియకరేణ తత్కరమకం ధృత్వాఽశ్రమాభ్యంతరం
నీత్వా స్థాపిత మాత్మనా సురపదా న్యాదర్శయామాస సః. ౩౦౬

*బ్రహ్మాగ్నీంద్రవివస్వతాం చ మరుతో విష్ణోః కుబేరస్య చ,
గాయత్రీవసునాగరాజశశినాం ధామాని ధాతుః సదమ్,
ధర్మస్కందవిధాతృవారుణభగస్థానాని రామః క్రమాత్,
దృష్ట్వా భక్తియుతః ప్రణమ్య విబుధాన్ తుష్టావ పశ్చాన్మునిమ్

* బ్రహ్మాగ్నీంద్రేతి. "యో వై సప్తదశ" ఇత్యనువాకోక్తసప్తదశాక్షరదేవస్థానాని మునినా ప్రకల్పితానీతి వేద్యమ్. అత్ర కైశ్చిదేవ మాశంక్యతే. రుద్రనామ్నోఽకథితత్వేన తస్యాపూజ్యతా భవేదితి. తత్ర కేచిదేవం సమాదధతే. అగస్త్యోపాసనార్థమాగతేభ్యో దేవేభ్య స్సర్వేభ్యోఽపి తస్యోత్కృష్టత్వేన తదాగమనం న యుజ్యత ఇతి. తత ఏవ తస్య స్థాన మపి నాస్తీతి యథా తదాశంకా త్వవిచారితపేశలా, తథా సమాధాన మ పీద మితి వేద్యం.

1 అ॥ రా॥ 2 క౧॥

౩౦౪ రామా! నే ననన్య మనస్కుఁడనై చాలకాలము తపస్సు చేసితిని. ఆ తపస్సున కెల్ల నిప్పుడు నాకు లభించిన నీ యభ్యర్చనము ఫల భూతమైనది.

౩౧౪ రామచంద్రా! వైదేహీ సహితముగ నీ విప్పుడును నా యంతఃకర ణమున నివసింపుము. నే నెచ్చట నున్నను నా మనస్సు నీయందాస క్తమై యుండుఁగాక.

౩౨ కుంభ సంభవుఁడీ విధముగ రాముని స్తుతించి యుక్తజ్ఞుఁడా కాలమా భగవన్మూర్తిని మనస్సునందు ధ్యానించియుఁ దుష్టినందక గాఢముగఁ గౌగిలించికొని కైదండ యొసఁగి యాశ్రమములోనికిం దోడ్కొని పోయి యచ్చట నున్న దేవతాస్థానముల నెల్ల జూపించెను.

౩౩ * బ్రహ్మాగ్నీంద్ర సూర్యవరుణ విష్ణుకుబేర గాయత్రీ వసుశేష చంద్రుల స్థానములను, బ్రహ్మస్థానమును, ధర్మస్థానమును, స్కందుని తావును, ధాతృవరుణ భగస్థానములను జక్కఁగ దర్శించి రాముఁడు భక్తియుక్తుఁడై నమస్కరించి యటుపిమ్మట నగస్త్యు నిట్లని సంస్తుతించెను.

---

* "యోవై సప్తదశ"మ్మను ననువాకోక్తమైన సప్తదశాక్షర దేవతలను బూజార్థమై యగస్త్యుడు తన యాశ్రమమునఁ బ్రతిష్ఠించినాఁడని యెఱుంగ నగును.

ఇచ్చట రుద్రుని నామము నుచ్చరింపమిచే నతడు పూజ్యుఁడు కాఁడని కొందరు ఆశంకింపగా మరికొందరీ క్రిందివిధముగ సమాధానము చెప్పెదరు. అగస్త్యోపాసనమునకై వచ్చిన దేవతలందఱికంటె నీశ్వరున కుత్కృష్టత యున్నది గనుక నే ఈ దేవతలతో రుద్రునిగూడఁ జతపరుప లేదని తెలియునగుననియు కావున నే యతనికి దేవస్థానమున స్థానము లేదనియు కొందరు సమాధానముఁ జెప్పుచున్నారు. పై యాశంక యెట్లు విచారమూలకమో యీ సమాధానముగూడ నట్లే యున్నది.

తవ హుంకారమాత్రేణ నహుషోఽజగరోఽభవత్
కిం న్వతో విద్యతే చిత్రం యదబ్ధి శ్చులుకీకృతః. ౩౬
సూర్యమార్గనిరోధార్థం ప్రవృద్ధో వింధ్యభూధరః,
త్వయా ప్రశాంతిం గమితః కిం న్వతో విద్యతే పరం ౩౭
తవాద్భుతాని కర్మాణి క స్స్తోతుం ప్రభవే న్మునే
తదా రఘువచ శ్శ్రుత్వా ప్రహస న్ముని రబ్రవీత్
భవ న్నామప్రభావేణ తత్త త్సర్వం మయా కృతమ్. ౩౮
స్తుత్వైవం రఘురామ మాశ్రమవసతిం నీత్వా తతోఽర్ఘ్యాదిభి
స్సంపూజ్యావనిజాసమేత మనఘం తం భోజయిత్వా మునిః
తత్తద్గోష్ఠికథాభి రేవ దివసం తం యాపయామాస సః
ఏవం త ద్వసతౌ దినాని కతిచి త్తస్థౌ సుఖం రాఘవః ౩౯

ఇత్యాశ్చర్య రామాయణే అరణ్యకాండే
పంచమ స్సర్గ స్సమాప్తః



---

అత్ర కైశ్చిత్ "అగ్ని రత్రి రుద్ర ఇతి తిలకవ్యాఖ్యానుసారేణ, "తత్రాగ్నిశబ్దేన శంభు రుచ్యత ఇతి శిరోమణివ్యాఖ్యానుసారేణ చ, అగ్నిశబ్దేన శివ ఇత్యర్థో వర్ణితః. తదపి క్లిష్టకల్పన మేవ భవేత్. వస్తుతస్తు రుద్రపుత్రే స్కందే సతి పూజితే కుంభసంభవేన, తత్పితు శ్శివస్య కథ మపూజ్యతా భవేత్, అతః కర్మకాండప్రకారేణ తదనువాకోక్తదేవనామా న్యత్రోక్తాని. న త్వన్యానీత్యేవ వేద్యం.

౩౪-౩౫-౩౬ మునిచంద్రా! నీహుంకారమాత్రముచే నహుషుఁ డజగరమై పోయినాఁడు. ఇంతకన్నను సముద్రజల మెల్ల నాచమింపఁబడుట మహావిచిత్రము. సూర్యమార్గ నిరోధమున కుద్యమించిన వింధ్యమ్ము తలవంప గలిగినంతటి దిట్టవు. ఇంతకన్న నేమి కావలయును. నిన్ను నుతింప నెవ్వనితరము? ఇట్లు రాము డాడుమాటలకు చిరునవ్వు నవ్వి యగస్త్యుఁడి ట్లనెను. నీనామప్రభావముచే నాయా పనులు నాచేఁ జేయఁబడినవి.

౩౭ ఇట్లు రాముని స్తుతివాక్యములతో యాశ్రమములోనికిం గొంపోయి యర్ఘ్యాదులఁ బూజించి సీతాసహితముగ నతని భుజింపఁజేసి యా యా కథాకథన విధానములచేఁ గాలమును వెళ్లఁబుచ్చుచు రాముఁ డగస్త్యాశ్రమమున సుఖముండెను.

పంచమసర్గ సమాప్తము.

---

ఇచ్చట మఱికొందరు "అగ్ని"యన రుద్రుఁడని తిలకవ్యాఖ్యానుసారముగను "అగ్నిశబ్దముచే శంభుఁడు చెప్పఁబడు చున్నాఁడు" అను శిరోమణి వ్యాఖ్యానుసారముగను వాల్మీకి రామాయణమున అగ్నిశబ్దమునకు శివుఁడను నర్థము వర్ణింపఁబడినది. ఇదియు క్లిష్టకల్పనముగనే యున్నది. నిజమునకు రుద్రపుత్రుఁడైన కుమారస్వామి యగస్త్యునిచేఁ బూజింపఁబడినప్పుడు రుద్రున కపూజ్యత యెట్లగును. కర్మకాండలోఁ జెప్పినట్లు లయ్యనువాకోక్తములైన దేవతా నామములే యిచ్చటఁ జెప్పఁబడినవి. కాని యితరనామము లిచ్చటఁ జెప్పఁబడలేదని తెలియవలయును.

## షష్ఠసర్గప్రారంభః

[1]పశ్చా ద్రామ మువాచ కుంభజముని శ్చాపం త్విదం వైష్ణవం,
పూర్వం త్వష్టృవినిర్మితం రఘుపతే! సౌవర్ణరత్నాంచితమ్
దేవేంద్రేణ భవత్కృతేఽసురవధం కర్తుం మదీయాశ్రమే,
నిక్షిప్తం తు మదంతికేఽక్షయశరై స్సాకం గృహాణ ద్రుతమ్. ౧

ధృత్వేదం స శరం ధను స్తు పరమం పంక్త్యాస్యముఖ్యాసురాన్
హత్వా రాక్షసమండలం తదితరం హృత్వా చ భారం భువః,
కృత్వైనం త్వవతారకార్య నిచయం గత్వా తత స్స్వాం పురీం
ధృత్వాఽఽస్యే శుభపట్టబంధఫలకం స్యా స్త్వం సుఖీ సీతయా. ౨

రామాఽవశిష్టం కాలం తు యోజనద్వయ దూరగే
గమయ త్వం పంచవటీదేశే గోదావరీ తటే. ౩

తత్రైవ దేవకార్యాణి సిద్ధం ప్రాప్స్యంతి భూరిశః,
సఫలో భవితా రామ తేఽవతారశ్చ తత్ర హి. ౪

ఇత్యుక్తవంతం కలశోద్భవం తం
ప్రణమ్యరామ స్త్విద మాహ వాక్యమ్,
దశాస్యవృత్తం సకలం చ మహ్యం
శుశ్రూషవే త్వం కథయ ప్రసన్నః ౫

---

1 క పు.

## ఉఊవ సర్గప్రారంభము.

౧ అనంతరము కుంభసంభవుఁడు రామునితో నిట్లనెను. రామా! ఈ ధనుస్సు వైష్ణవధనుస్సు. ఇది బంగరుతొడుగు గలిగి యచ్చటచ్చట రత్నములుగూడఁ బొదిగి విశ్వకర్మచే నిర్మింపఁబడినది. నీకు రాక్షసవధ చేయుట కుపయోగపడు నని యెంచి దేవేంద్రుఁడు అక్షయబాణతూణీరములతోఁ గూడ నీ ధనుస్సును నా యాశ్రమమునం దునిచినాఁడు. కావున నీవింటిని యీ యక్షయబాణతూణీరములను బరిగ్రహింపుము.

౨ ఈ సర్వోత్తమములైన ధనుర్బాణములను గొని రావణుఁడు మొదలగు రాక్షససమూహము నెల్ల చెండాడి భూభారమ్ము నడంచి యవతారకార్యము నెల్లఁ బూర్తియొనర్చి నీవు సాకేతమున కేగి సీతాసమేతముగఁ బట్టాభిషిక్తుఁడవై సుఖింపుము.

౩ రామా! ఇంక మిగిలిన వనవాసకాలము నిచ్చటకు రెండుయోజనముల దూరమున నున్న గోదావరీ తటమునఁ గల పంచవటియందు నివసించి గడపుము.

౪ దేవకార్యము లెల్లఁ జాలవఱకు నచ్చటనే పూర్తి కాఁగలవు. నీయవతారముఁగూడ నచ్చటనే సఫలము కాఁగలదు.

౫ అగస్త్యు డిట్లనిన విని రామచంద్రుఁడు నాతనికి నమస్కరించి రావణుని విషయమై ప్రస్తావించితిరి గాన, మునివరా! యీరావణాసురుని వృత్తాంతమునెల్ల నాకు సవిస్తరముగ విన్పింపుము. నేను వినుటకుఁ గుతూహలపడుచున్నాఁడను.

తచ్ఛ్రుత్వా వచనం పశ్చా ద్రామం ప్రతి మునీశ్వరః,
దశాస్య జన్మ కర్మాణి వృత్తం వక్తుం ప్రచక్రమే. ౬

[1]పురా కృతయుగే రామ పులస్త్యో బ్రహ్మణ స్సుతః,
తృణబిందు సుతాయాం తు నామ్నా విశ్రవసం సుతమ్.
జనయామాస పశ్చా ద్వై భరద్వాజసుతాం తు సః,
పరిణీయ తు తస్యాంతు జనయామాస వై సుతమ్. ౭-౮

సతు వైశ్రవణోనామ తప స్తేపే విధిం ప్రతి,
చిరా త్ప్రసన్నో భగవాన్ దదౌ తస్మై బహూ న్వరాన్,
అఖండితం ధనేశత్వం స్వపుష్పక మదా ద్విధిః. ౯

పుష్పకేణ ధనే శోఽథ గత్వా స్వజనకం ప్రతి,
నత్వా తం సర్వ ముక్త్వాఽథ ప్రాహేదం వచనం తు తమ్. ౧౦

తాత మే విధినా దత్తే ధనేశత్వం చ పుష్పకమ్,
న తేన బ్రహ్మణా స్థాతుం దర్శితం మే పదం క్వచిత్. ౧౧

కుత్ర స్థేయం మయా తాత విచార్య వద సత్వరం,
ఇత్యుక్తో విశ్రవా శ్చాహ సుతం వైశ్రవణం వచః. ౧౨
లంకానామపురీ శ్రేష్ఠా నిర్మితా విశ్వకర్మణా,
పురా తత్ర నివాసం తు చక్రు ర్దైత్యా శ్చిరం సుత, ౧౩
త్యక్త్వా విష్ణుభయా దద్య తాం తేఽగు శ్చ రసాతలమ్,
తత్ర గత్వా సుఖం తిష్ఠ లంకాపుర్యాం సుతాఽధునా. ౧౪

---

1 అ॥ రా॥ సా॥

౬ నావుఁడు మునీశుఁడు రఘుకుల జలధిసోముఁడగు రామునకు రావణుని జన్మకర్మ వృత్తాంతమునెల్ల నిట్లని చెప్పఁదొడంగెను.

౭-౮ శ్లో॥ కృతయుగమ్మునం బులస్త్యబ్రహ్మ సుతుఁడు పౌలస్త్యుఁడను వాఁడు తృణబిందుని కూతునందు విశ్రవసుఁడను సుతునిఁ గాంచెను. విశ్రవసుఁడును భరద్వాజుని సుతను జేపట్టి యామెయం దొక్క సుతునిం బడసెను.

౯౪ ఆతండు వైశ్రవణుం డనంబరఁగి బ్రహ్మనుఁగూర్చి బహుకాలమ్ము తపమ్ముచేసి యాతని మెప్పువడసి యతనివలన ననేక వరము లంది యఖండితమైన ధనపతిత్వము సంపాదించుటయేగాక పుష్పక మను నొక్క విమానముం గూడ బడసెను.

౧౦౪ ఆ వైశ్రవణుఁడు (కుబేరుఁడు) బ్రహ్మ తన కొసంగిన పుష్పకము నధిష్ఠించి తన తండ్రిసన్నిధి కరిగి యాతని కెఱఁగి జరిగిన కథనెల్ల వినిపించి మఱియు నిట్లనెను.

౧౧౪ జనకా! బ్రహ్మ నాకు ధనపతిత్వమును, ఈ పుష్పకవిమానము నొసంగినాఁడే కాని నాకీ సంపదతో నివసించుటకు యోగ్యమగు ఠావుఁ జూపింపలేదు.

౧౨౪ కాన నే నెచ్చట నివసింపవలెనో విచారించి నా కానతిమ్ము. అనవుఁడు విశ్రవసుఁడును తన సుతునితో నిట్లనెను.

౧౩౪ పుత్రా! పూర్వము లంక యను పేర నొక పట్టణమును విశ్వకర్మ నిర్మించియున్నాఁడు. మున్ను రక్కసు లనేకు లచ్చటఁ జాలకాలము నివాసము చేసియున్నారు.

౧౪౪ ఇప్పుడా రక్కసు లెల్ల విష్ణువువలని భయమువలన నా పట్టణమును వదలి పాతాళమున కేగిరి. ఇప్పుడు నీ కా లంకాపురము నివాస యోగ్యము. కావున నచ్చటకుఁ బోయి నివసింపుము.

ఇత్యుక్త స్సోఽథ గత్వా తాం వసతిస్మ సుఖం తు సః,
కదాచన సుమాలీ తు నిర్గత్య చ రసాతలాత్,
కైక స్యాత్మజయా యుక్త స్సంచచా రావనౌ రహః, ౧౫-౧౬

తస్మి న్కాలే పుష్పకేణ ధనేశ శ్చరతిస్మ ఖే,
పుష్పకస్థం ధనేశం తు జ్ఞాత్వా తం విశ్రవస్సుతమ్,
కైకసీం తనయాం మాహ సుమాలీనామ రాక్షసః. ౧౭॥

పశ్య విశ్రవసః పుత్త్రం చరంతం పుష్పకేణ తమ్.
సఏవాఽస్మత్పురీం లంకా మాక్రమ్య వసతి ధ్రువమ్. ౧౮॥

రక్షసాం హిత మిచ్ఛే స్త్వం యది విశ్రవసంమునిమ్
గత్వా వృణీష్వ తద్వీర్యా ద్ధనేశ నిభపుత్త్రకాః, ౧౯॥

భవిష్యంతి న సందేహో రక్షోవంశవివర్ధకాః,
అవిదూరే మునే స్తస్య చాశ్రమోఽస్తి ద్రుతం వ్రజ. ౨౦॥

ఇత్యుక్తా సా త థే త్యుక్త్వా వవ్రాజ మునిసన్నిధిమ్,
సంధ్యాకాలే మునే రగ్రే దివ్యరూపధరాఽవసత్,
అధోముఖీ లిఖంతీ సా పాదాంగుష్ఠేన భూతలమ్. ౨౧-౨౨

దృష్ట్వా తాం ముని రప్యాహ కా త్వం కిమను సమాగతా,
ఇ త్యుక్తా సా మునిం నత్వా ప్రాహ వేత్తుం త్వ మర్హసి. ౨౩

తతో ధ్యాత్వా ముని స్సర్వం జ్ఞాత్వాచ ప్రాహ తామిదమ్,
జ్ఞాతం త వాభిలషితం మత్తః పుత్త్రా న్నవాప్స్యసి. ౨౪

౧౫-౧౬ నా విని కుబేరుఁడు సంతసించి, లంకకుఁ బోయి, యచ్చట సుఖ ముండెను. ఇట్లుండ నొకప్పుడు సుమాలి యను రక్కసుఁడు పాతాళ కుహరమునుండి వెల్వడి కైకసి యను పుత్రికతోఁ గూడ నవనియందు రహస్యముగ సంచరించుచుండెను.

౧౭½ ఆ సమయమున విశ్రవసు కుమారుడైన కుబేరుఁడు పుష్పకారూఢుఁడై యాకసమున సంచరించుచుండెను. వైశ్రవణుఁడు విమానముపై నెక్కి యట్లాకాశమున సంచరించుటఁజూచి సుమాలి కుబేరుని యూహించుచు దన కుమార్తె కిట్లనెను.

౧౮½ పుష్పకారూఢుఁడై యాకసమున సంచరించు నావిశ్రవసుని పుత్త్రునిఁ గమనింపుము. ఈతఁడే మన పట్టణమైన లంక నాక్రమించి యందు నివసించు చున్నాఁడు.

౧౯½ నీవు రక్కసుల క్షేమమును గోరక వేని వెంటనే విశ్రవసుని దరిఁ జేరి, యాతని నెట్లయిన వరియించి యీ కుబేరునితో సమానులైన పుత్త్రులం బడయుము.

౨౦½ ఆమునివలన రాక్షసవంశవర్ధను లగు పుత్త్రులు నీకు నిస్సందేహముగ జనింపగలరు, పొమ్ము. ఇచ్చటకు చాల దగ్గరలోననే యా విశ్రవ సుని యాశ్రమ మున్నది.

౨౧-౨౨ నావుఁడు వల్లెయని యచ్చటనుండి పయనమై దేవకన్యక రూప మును ధరించి, యా కైకసి ముని సన్నిధికరిగి, యాతని యెట్ట యెదుర నిలచి, తల వంచికొని, కాలి బొటనవ్రేలితో నేల వ్రాయుచు నిల చెను.

౨౩ ఆమెను జూచి, మునివరుఁడును "ఎవరు నీవు! ఎందుల కరుదెంచితివి?" అని యడుగ నామెయు నతనికి నమస్కరించి "మునివరా! నీవు తెలి యని దేమి యున్నది" అనెను

౨౪ పిమ్మట న మ్మునిశేఖరుఁడు నిమిషకాలము కనుమూసి యోగ దృష్టితో సర్వము నెఱింగి "చెలువా! నీ యభిలాషమును దెలిసికొం టిని. నావలన పుత్త్రులను గాంచ గలుగుదువు".

దారుణాయాం తు వేళాయా మాగతాసి సుమధ్యమే,
అత స్తే దారుణౌ పుత్త్రౌ రాక్షసౌ జని మేష్యతః. ౨౫

సాఽబ్రవీ న్మునిశార్దూలం త్వత్తో ప్యేవంవిధౌ సుతౌ,
తా మాహ తే తృతీయ స్తు భవిష్యతి మహామతిః. ౨౬

తత స్సా సుషువే పుత్రాన్ యథాకాలం సుమధ్యమా,
రావణం కుంభకర్ణం చ క్రౌంచీం శూర్పణఖాం శుభామ్,
కుంభీనసీం కనీయాంసం తృతీయం తం విభీషణమ్ ౨౭
రావణః కుంభకర్ణ శ్చ తిస్రో దుహితర స్తథా,
దుర్వృత్తాః పాపభక్తా శ్చ బభూవు ర్మునిహింసకాః. ౨౮½

ఏకదా రావణో మాత్రా లింగార్థం ప్రేషిత శ్శివమ్,
కర్తుం ప్రసన్న మకరోత్ కైలాసే కర్మ దుష్కరమ్. ౨౯½

సతు స్వీయం ప్రతీకం తు వీణాం కర్తుం సముద్యతః. ౩౦
కృత్వా పీఠం హి దేహస్య తన్మూలం చ శిర స్తథా,
తదగ్రం ప్రపదం కృత్వా శంకూ నంగుళిభి స్సహ,
తంత్రీం కృత్వాంత్రమాలాభిః శతశోఽథ సహస్రశః. ౩౧½

ఏవం కృత్వా స్వదేహం తు వీణాం షడ్జస్వరై ర్మహాన్,
చకార స్వముఖే నైవ గాంధర్వం గాన ముత్తమమ్. ౩౨½

౨౬ ఈ సాయం సంధ్యా సమయమున (దారుణకాలమున) నీవు నన్ను సమీపించితివి. కాన నీకు దారుణకృత్యముగల యిర్వురు పుత్త్రులు జనింపగలరు.

౨౭ అనిన విని కైకసియు మునివర్యునితో నిట్లు పలికెను. "ఓ మునివరా! నీవలనఁగూడ నిట్టి క్రూరులగు పుత్త్రులను నేను బడయుట ధర్మమా!" యని పలుకగా విశ్రవసుఁడును తిరిగి కైకసితో నిట్లు పలికెను. ఓ కైకసి! నీకు మఱియొక పుత్త్రుఁడు కలుగును. ఆ మూడవ కుమారుఁడు సద్బుద్ధి గలవాఁడును, దైవభక్తి గలవాఁడును గాఁగలఁడని పలికెను.

౨౮ పిమ్మట నా కైకసి యమ్మునీశ్వరుని వలనఁ గాలక్రమమున రావణ కుంభకర్ణులను, కాంచి, శూర్పణఖ, కుంభీనసి అను ముప్వురు కొమరితలను గని, తుట్టతుదకు విభీషణుని గనెను.

౨౮½ రావణ కుంభకర్ణులును, పిమ్మటి ముగ్గురు కూతుండ్రును గూడఁ గడు దుస్స్వభావులును, ప్రాణి భక్షకులును, మునిజన హింసకులునై యుండిరి.

౨౯½ ఇట్లుండ నొక దినమున తల్లియగు కైకసి తాను పూజించుకొనుటకు కైలాసమున కేగి, శంకరసమీపమున నుండు నాత్మలింగమును దనకు దెచ్చిపెట్టుమని రావణుని కోరఁగా నతఁడు కైలాసమున కేగెను.

30-3౧½ పిమ్మట రావణుఁడు శంకరుని మెప్పించుటకై తన దేహమును వీణగాఁ జేయఁగోరి దేహమును వీణాపీఠముగను, తన శిరస్సును వీణామూలముగను, పాదములను వీణాదండముగను, తన వ్రేళ్లను తీగల బిగించు బిరడాలుగను, ప్రేగులను తీగెలుగను, తయారొనర్చెను.

3౨½ ఇట్లు తన దేహమును వీణగాఁజేసి, షడ్జస్వరముతో గానము చేయ నారంభించెను.

తదా కైలాసనాథోఽపి నందీశం ప్రాహ వై వచః ౩౩

ఆత్మలింగం రావణ తే శంకరో న ప్రదాస్యతి,
ఇతి నందీశ్వర! బ్రూహి, గత్వా త్వం రావణం ప్రతి ౩౪

ఇత్యుక్త స్తు తదై వేతి గత స్తం నందికేశ్వరః,
శంకరోక్త మవాదీ చ్చ రావణం ప్రతి వై వచః. ౩౫

తథాపి నత్యజ త్యేవ గానం తు సతు రావణః,
చిచ్ఛే దాత్మశిర శ్చాపి తుష్ట్యర్థం శంకరస్య తు,
ఇత్థం దశదినా న్యేవ రావణేన కృతాని చ ౩౬

అథ తత్కర్మణా తుష్ట శ్శంకర స్తస్య గానతః,
ప్రసన్నచేతా స్తం ప్రాహ వరం వరయ రావణ. ౩౭

నత్వా శంభుం రావణోఽథ శిరసా తేన సంధితః,
జనన్యై వరయామాస హ్యాత్మలింగం తదాత్మనః,
పత్న్యర్థం పార్వతీం చాపి తథేత్యుక్త్వా దదౌ శివః. ౩౮-౩౯
గృహీత్వా గంతుకామం తం పునః ప్రాహ హర స్తదా,
మత్తోషార్థం త్వయా వీర దశవారం నిజం శిరః,
ఖడ్గేన ఛేదితం యస్మా త్తస్మా త్తేఽద్య శిరాంసి తు,
దశ స్యు ర్వింశతిభుజా భవిష్యంతి న సంశయః. ౪౦-౪౧
తత స్స రావణ స్తుష్టో గిరిజాలింగసంయుతః,
వింశద్భుజో దశగ్రీవః స్వస్థలం ప్రతి నిర్గతః. ౪౨

౩౩ ఇట్లు రావణుఁడు గానము చేయుచుండగా శంకరుఁడు నాలకించి నందీశ్వరునితో నిటుల జెప్పెను.

౩౪ నందీశ్వరా! నీవు వెళ్లి, నేను జెప్పినట్లుగ రావణునితో నిటులఁ జెప్పుము. శంకరుఁడు తన యాత్మ లింగమును నీకు నొసంగఁడని గట్టిగ జెప్పుమని పంపెను.

౩౫ ఆ నందీశ్వరుడును వల్లెయని రావణుని దగ్గరకు వచ్చి, "రావణా! శంకరుఁడు నీ కాత్మలింగము నొసంగనని చెప్పుమని చెప్పె"నని చెప్పి వెళ్లిపోయెను.

౩౬ ఇట్లు నందీశ్వరుఁడు చెప్పినను రావణుఁడు పైవిధముగ వీణాగానమును మానక చేయుచునే యుండెను. మఱియు శంకరుని మెప్పింపనెంచి తన శిరస్సు బలి యిచ్చుటకు నుద్యమించెను. ఇట్లు పది దినములు రావణుఁడు చేయుచుండెను.

౩౭ తుదకు రావణుఁడు తన శిరస్సునుగూడ ఛేదించుకొనఁగా వాని సాహసమునకును, వాని గానమునకును శంకరుఁడు మెచ్చుకొని స్వయముగ రావణుని యొద్దకు వచ్చి వరమును వేడుకొనుమని చెప్పెను.

౩౮-౩౯ మఱియు రావణుని శిరస్సును నతికించెను. పిమ్మట రావణుఁడు శంకరునకు నమస్కరించి, తన తల్లికొఱకై యాత్మలింగమును తనకు పార్వతిని పత్నియగునట్లును వరమును గోరెను. శివుఁడును వల్లె యిచ్చెను.

౪౦-౪౧ పిమ్మట రావణుఁ డాత్మలింగమును పార్వతిని దీసికొని బయలుదేరు సమయమున శంకరుఁడు మరల వానితో నిట్లనెను. రావణా! నీవు నా ప్రీతికై పదిమారులు శిరచ్ఛేదమును చేసికొంటివి కాన నీకు పది శిరస్సులును, ఇరువది భుజములును గాగలవు అనియు వర మిచ్చెను.

౪౨ పిమ్మట పదితలలు నిరువది చేతులు గల రావణుడు సంతుష్టుడై పార్వతితోడను, ఆత్మలింగముతోడను స్వస్థలమునకు బయలుదేరెను.

కించిద్దూరం గతే తస్మిన్ గౌరీ సస్మార వై హరిమ్,
గౌర్యా హరే స్సంస్మరణాత్ హరి రేత్యాహ రావణమ్,
స్వభార్యాం రావణా వన్యాం దాతు మిచ్ఛే త్పరస్య కః. ౪౩
శివ స్త్వాం వంచయామాస నేయం గౌరీ ధ్రువం ధ్రువమ్,
యత్ర స్థితా సా గిరిజా దర్శయేయం చ రావణ
లింగ మత్రైవ నిక్షిప్య త్వ మేనాం శంకరాంతికం
ప్రేష యేతి తము క్త స్సన్ రావణోఽపి తథా పునః,
విధాయ హరిసాన్నిధ్య మాగా చ్ఛీఘ్రగతిః పునః
౪౪-౪౫-౪౬

సింధుతీరే వినిక్షి ప్త మాత్మలింగం తు రావణః,
ఉద్ధర్తుం యతమా నోపి వ్యర్థయత్నోఽభవ త్తదా,
త దాత్మలింగవిన్యాస దేశో గోకర్ణ ముచ్యతే. ౪౭

పశ్చా ద్ధరి స్త మానీయ మయే నాధిష్ఠితాం గుహామ్,
దర్శయిత్వా మయసుతాం ప్రాహేదం రావణం వచః౪౮

దృష్ట్వైవ సా తత స్త్వేతాం సమాదాయ నిజాం పురీమ్,
దశానన వ్రజే త్యుక్త్వా హరి రంతర్దధే తతః. ౪౯

తతో మయోఽపి సంతుష్ట్వా దత్త్వా మండోదరీం సుతామ్,
ఏకప్రాణిహరాం శక్తిం రావణాయ దదౌ తతః,
మండోదరీం సమానీయ రావ ణోగా న్నిజాం పురీమ్.౫౦-౫౧

౪౩ ఇట్లు రావణుఁడు బయలుదేఱి కొంతదూర మేగిన పిదప పార్వతీదేవి విష్ణుమూర్తిని స్మరించెను. ఆ శ్రీహరియును స్మరణమాత్రము చేతనే యచ్చటకు వచ్చి, రావణునితో నిట్లు పలికెను. రావణా! లోకములో తన భార్యను నితరుల కిచ్చువా డుండునా ! (ఉండ డని భావము.)

౪౪-౪౫-౪౬ ఓరావణా! శివుఁడు నిన్ను నిశ్చయముగ మోసగించెను. ఈమె పార్వతికాదు. ముమ్మాటికి నిశ్చయము. పార్వతి యున్న చోటును నీకుఁ జూపించెదను. నీ యొద్ద నున్న లింగమును నిచ్చటనే యుంచి, నీవు శంకరునియొద్దకు నీమెను తీసికొనివెళ్ళి, దిగ పెట్టిరమ్ము. అనిచెప్పగా రావణుఁడును నవ్విధముగనే లింగ మచ్చటనుంచి, పార్వతిని తీసికొనిపోయి,శంకరునియొద్ద దిగవిడిచి, తిరిగి యచ్చటికి వచ్చెను.

౪౭ సముద్రతీరమున తనచే నుంచఁబడిన యాత్మలింగమును రావణు డెత్తుటకుఁ బ్రయత్నించెను. కాని, యా లింగ మచ్చటనుండి కదలదయ్యెను. ఆ లింగమే గోకర్ణక్షేత్రమునందలి గోకర్ణేశ్వరుఁడని చెప్పబడుచున్నది. ఆ లింగము నుంచిన ప్రదేశమే గోకర్ణక్షేత్రమని చెప్పబడుచున్నది.

౪౮ అనంతరము శ్రీహరియు రావణుని వెంటఁబెట్టుకొని మయుఁడు నివసించిన గుహయొద్దకుఁ దీసికొనిపోయి మయుని కూతురగు మండోదరిని జూపించి రావణునితో నిట్లుఁ బలికెను.

౪౯ ఓరావణా! ఈమెయే యామెయై యున్నది. కాన నీమెను తీసికొని నీ పట్టణమున కేగు మని చెప్పి, పిమ్మట శ్రీహరి యంతర్ధానమయ్యెను.

౫౦-౫౧ అనంతరము మయుఁడును తన కూతురికిఁ దగినవరుఁడు దొరికెనని సంతసించి తన కొమరితయగు మండోదరిని రావణున కిచ్చుటయే కాక యాపత్సమయమున నొకనిని సంహరింప శక్తిగల శక్తియను నాయుధమునుగూడ నిచ్చెను. రావణుఁడును మండోదరిని వెంటబెట్టుకొని తన పట్టణమున కేగెను.

దృష్ట్వైకదా ధనాధ్యక్షం పుష్పకస్థం తు కైకసీ,
పుత్రా న్నిరాకరయామాస యూయం మందా మృతోపమాః. ౧౨
పాపశ్చాస్య బంధుం యే దృష్ట్వా న భవం త్యతిలజ్జితాః
మహోన్నతపదస్థం తు తేఽవనౌ తు మృతోపమాః. ౧౩

తే మాతృవచనం శ్రుత్వా యయు ర్గోకర్ణ ముత్తమమ్
దశవర్షసహస్రాణి కుంభకర్ణోఽకరో త్తపః. ౧౪

విభీషణోఽపి ధర్మాత్మా సత్యసంధపరాయణః
పంచవర్షసహస్రాణి పాదాంగుష్ఠేన తస్థివాన్,
తీవ్రం తప శ్చకార రాజ ముద్దిశ్య విజితేంద్రియః. ౧౫
[1]దివ్యం వర్షసహస్రకం దశముఖః కృత్వా చ తీవ్రం తపః,
సంపూర్ణేఽబ్దసహస్రకే నిజశిర శ్ఛిత్వా విధేః ప్రీతయే,
హుత్వాఽగ్నౌ తు పున స్తపో విరచితుం ప్రారబ్ధవా న్రావణః,
పూర్వస్మా దపి తీవ్రభూత మతులం కుర్వ న్నభూ ద్దైవ్య తపః. ౧౬-౭

నవవర్షసహస్రాణి కృత్వైవం పరమం తపః,
ఛిత్త్వో త్తమాంగనవకం హుత్వా చాగ్నౌ దశాననే,
సహస్రే దశమే పూర్ణే ఛేత్తుం చ దశమం శిరః,
ఉద్యుక్తే విధి రేత్యాహ వరం వృణు దశానన. ౧౮-౧౯
సురజ్యేష్ఠం తదా నత్వా ప్రార్థయామాస రావణః
త్రిమూర్తి దేవగంధర్వ యక్షరక్షోముఖై ర్మమ
అవధ్యత్వం వరం దేహి మానవేభ్యో న భీ ర్మమ. ౨౦-౨౧

1 క్రో॥

౫౨-౫౩ ఒకప్పుడు పుష్పకవిమానముచే సంచరించుచున్న కుబేరుని రావణ
మాతయగు కైకసిచూచి రావణుఁడు మొదలగు పుత్రులను ధిక్కరిం
చుచు నిటులఁ బలికెను. ఓపుత్రులారా! మీరలు నపుంసకులు,
జీవన్మృతులు నయియుంటిరి. సవతిసోదరుఁడు మహోన్నతమైన
పదవియందుండఁగా వానినిఁజూచి కూడ సిగ్గులేనివారలై యెవరుండు
దురో వారలు మృతతుల్యులనియే చెప్పవలయు ననియెను.

౫౪ వారును తమతల్లిమాటలవలనఁ గ్రోధానలము హృదయములఁ బ్రజ్వ
రిల్ల గోకర్ణక్షేత్రమునకుఁ బోయి తపస్సుచేయ నారంభించిరి.
వారిలోఁ గుంభకర్ణుఁడు పదివేల సంవత్సరములు ఘోరమైన తపస్సు
చేసెను.

౫౫½ ధర్మాత్ముఁడును సత్యసంధుఁడు నగు విభీషణుఁడు అయిదువేల సంవ
త్సరములు జితేంద్రియుఁడై కాలిబొటనవ్రేలును మాత్రము భూమి
యందు మోపి తీవ్రతప మాచరించెను.

౫౬½ రావణుఁడు ధూమాహారుఁడై వెయ్యి దివ్యసంవత్సరములు తపముచేసి
సహస్రవర్షములు పూర్తియగుట తోడనే దేవతాప్రీత్యర్థ మొక శిర
స్సును ఛేదించి యగ్నియందు హోమముచేసి తిరిగి తపమును
బ్రారంభించుచుండెను.

౫౭-౫౮½ ఇట్లు తొమ్మిదివేలసంవత్సరములు తపస్సుచేసి తొమ్మిది శిర
స్సులను ఛేదించి యగ్నియందు హోమముచేసి పదియవ వెయ్యి
పూర్తి కాగాఁ దనపదియవ తలనుగూడ ఛేదింప యత్నించు తఱి
బ్రహ్మ యాతనికిఁ బ్రత్యక్షమై వరముగోరు మిచ్చెదనని తెలిపెను.

౫౯-౬౦ అప్పుడు రావణుఁడు బ్రహ్మకు నమస్కరించి "దేవా! దేవదానవ
యక్షసుపర్ణ నాగగంధర్వాదుల వల్లను, అగ్నిమూర్తులవలనను నాకు
చావు లేకుండునట్లు వరి మీయుము. మానవులవలన నాకెట్టివి
మయిన భయము లేదు. (వారలు రాక్షసుల కాహారమయినందున వారి
వలన భయములేదని భావము.)

ఏవం తేన వృత స్తథేతి విధి రప్యుక్త్వా దశాస్యం, తత-
స్సంధాయాస్య శిరాంసి వై దశ తతో నిర్గత్య తత్సోదరమ్,
సంప్రాప్యాథ విభీషణం త మనఘం జ్ఞాత్వా త దప్రార్థితః
సద్బుద్ధిం వ్యామరత్వ మప్యసులభం తస్మై దదౌ ప్రీతితః. ౬౧

దేవేంద్రస్య పదం స్వమానసగతే వృత్వా చరంతం తపః,
దేవప్రేరితవాగ్విమోహితధియం తం కుంభకర్ణం విధి
స్సంప్రాప్యాహ వరం వృణు స్వభిమతం త్వం కుంభకర్ణేతి సః,
ప్రోక్త స్త ద్విధినా తదా౽౽హ వచనం త్వేవం దశాస్యానుజః.
౬౨

బ్రహ్మణః షణ్మాసనిద్రాం చ జగ్ధ మేకదినే తతః,
నిద్రాం పున ర్దేహి మే త్వ మిత్యుక్తే సో౽ప్యదా త్తథా. ౬౩

పశ్చా దంతర్దధే బ్రహ్మా సోదరా స్తే విధే ర్వరాన్,
ప్రాప్యైవం స్వపదం జగ్ముస్సుమాలీ తై ర్ధ్రువం గతః. ౬౪

ప్రహస్తాద్యైః ప్రేరిత స్స్వాభిషేకం తు దశాననః
నిష్కాస్య లంకాపుర్యా స్తం వివేశానుచరై స్సమమ్. ౬౫

౧ ఇట్లు రావణుఁడు బ్రహ్మను వరమువేడగా నతఁడు కోరినటులనే బ్రహ్మయును వర మొసంగి యాతని పదితలలును తిరిగి సంధించెను. పిమ్మట విభీషణునకు మరణము లేకుండునట్లును సమృద్ధి కలుగునట్లును బ్రహ్మ వరమిచ్చెను.

౨ దేవేంద్రపదవిఁ గోరి తపముఁజేయు కుంభకర్ణుని వంచించుటకై దేవ ప్రేరితయై సరస్వతి కుంభకర్ణుని వాక్కునందుఁ బ్రవేశించి యున్నందున బ్రహ్మ కుంభకర్ణుని వరమును గోరుకొమ్మని చెప్పగా నతఁడీ క్రింది విధముగ వరమును గోరెను.

౩ సరస్వతిచే వంచితుడైన యా కుంభకర్ణుఁడు ఆరుమాసములు నిద్రయు నొకదినము భోజనము జరిగి నిద్రయు కలుగునట్లు వరము వేడగా నటులనే బ్రహ్మయు నతఁడు కోరిన విధముగ నిద్ర నిచ్చెను ఆరు మాసముల కొక దినము భోజనమును గూడ నిచ్చెను. (నిద్రాకాలములో బలవంతముగ నతనిని లేపినచో మరణము కలుగు నటులగూడ బ్రహ్మ చెప్పెనని కూడ మఱియొకచోట గలదు).

౪ పిమ్మట బ్రహ్మదేవుఁ డంతర్ధానమయ్యెను. ఇచ్చట రావణ కుంభకర్ణ విభీషణులును బ్రహ్మవలన వరములఁబడసి తమయిండ్ల కేగిరి. సుమాలియు తన మనుమలైన రావణకుంభకర్ణ విభీషణులను బ్రహ్మవలన వరములం బడసి వచ్చిన వారలనుగాఁ దెలిసికొని ప్రహస్తాది రాక్షస సమూహముతోఁ గూడి పాతాళమునుండి భూమికి నిర్భయముగ వచ్చి చేరెను.

౫ రావణుఁడును రాక్షస మంత్రి ప్రేరితుఁడై కుబేరునిలంక నుండి వెడలఁగొట్టి, యా పట్టణమున తాను నివసించి యచ్చట రాక్షససంఘమును స్థాపించెను.

పశ్చా చ్ఛూర్పణఖాం దత్వా విద్యుజ్జిహ్వాయ రావణః
పరిణీయ దదౌ తస్యై ప్రీత్యా దండకకాననమ్. ౬౬

కుంభీనసీం స్వసారం తు మధుదైత్యాయ రావణః
దత్వా వివాహం కృత్వాదా త్తస్యై మధువన మ్ముదా. ౬౭

క్రౌంచీం తు ఖడ్గజిహ్వాయ దత్వా చ పరిణీయ సః,
పరలంకాం దదౌ తస్యై పారిబర్హం దశాననః
లంకాంతికస్థా, విజ్ఞేయా పరలంకాభిధా మహీ. ౬౮½

తతో వైరోచనిసుతాం వృత్రజ్వాలాం తు రావణః,
వివాహం కారయామాస కుంభకర్ణాయ దాపయన్. ౬౯½

గంధర్వరాజశ్శైలూషపుత్రికాం సరమాం తు సః,
కనిష్ఠసోదరా యాథ దాపయామాస రావణః. ౭౦½

తతో మండోదరీ పుత్రం మేఘనాద మజీజనత్,
జాతమాత్ర స్తు యో నాదం మేఘవ త్ప్రచకార హ
తత స్సర్వేఽబ్రువ న్మేఘనాదోఽయ మితి వై జనాః. ౭౧½
గుహాయాం కుంభకర్ణోఽపి నిద్రావ్యాప్తోఽతినిద్రితః
షణ్మాసా త్పర ముత్థాయ భుక్త్వా నిద్రాం గతః పునః. ౭౨½
తత స్స రావణ శ్చాపి దేవగంధర్వ కిన్నరాన్
హత్వా ఋషీశ్వరా న్నాగాన్ స్త్రియ స్తేషా ముపాహరత్. ౭౩½

ధన దోఽపి చ తచ్ఛ్రుత్వా రావణ స్యాక్రమం తదా,

అధర్మం మా కురు ష్వేతి దూతవాక్యా ద్వ్యజిజ్ఞపత్ ౭౪½

౬౬ పిమ్మట రావణుఁడు తన చెల్లెలైన శూర్పణఖను విద్యుజ్జిహ్వున కొసంగి వివాహము చేసి యామెకు దండకారణ్యము నరణముగ నిచ్చెను.

౬౭ కుంభీనసియను చెల్లెలను మధువను రాక్షసున కిచ్చి రావణుఁడు వివాహము చేసి మధువనము నామె కరణముగా నిచ్చెను.

౬౮½ పిమ్మట రావణుఁడు తన చెల్లెలగు క్రౌంచియను రాక్షసిని ఖడ్గజిహ్వుఁడను రాక్షసున కిచ్చి వివాహముచేసి యామెకు పాలంకను నరణముగా నిచ్చెను. (పాలంక యనునది లంకకు సమీపమున నున్నది యని తెలియదగును.)

౬౯½ పిమ్మట వైరోచనుని కూఁతురగు వజ్రజ్వాలను తన తమ్ముఁడగు కుంభకర్ణున కిప్పించి వివాహము చేయించెను.

౭౦½ పిమ్మట రావణుఁడు శైలూషుఁడను గంధర్వరాజుయొక్క కూఁతురగు సరమను విభీషణున కిప్పించి వివాహము చేయించెను.

౭౧½-౭౨½ పిమ్మటఁ గొంతకాలమునకు రావణుని భార్యయగు మండోదరి మేఘనాదుఁడను పుత్త్రునిఁ గనెను. అతఁడు పుట్టుటతోడనే మేఘము వలె నాదమొనర్చెను గాన నాతనిని నెల్లవారలు మేఘనాదుఁ డనిరి. కుంభకర్ణుఁడు నొకగుహయందు బ్రహ్మ వరప్రసాదములచే లభ్యమైన నిద్రాసుఖము ననుభవించుచుండెను.

౭౩½ పిమ్మట రావణుఁడు దేవతలను, గంధర్వులను కిన్నరులను, కింపురుషులను సాధించుచు ఋషిశ్రేష్ఠులను హతమొనర్చుచు, వారి స్త్రీలను హరించుచుండెను.

౭౪½ ఇట్లాగమునఁ జేయుచున్న రావణుని దుశ్చేష్టలను కుబేరుఁడు విని, "అక్రమమును మానుము తమ్ముఁడా" యని రావణునకు దూతముఖమునఁ గబురంపెను.

రావణ స్తేన రుష్ట స్స న్నిర్గ త్యానుచరై స్సమం
గత్వా ధనేశం నిర్జిత్య జహా రాస్య చ పుష్పకమ్. ౨౫½

తతో మయం చ వరుణం నిర్జిత్య సమరేఽసురః
స్వర్గలోక మగా త్తూర్ణం దేవరాజ జిఘాంసయా ౨౬½
తతో రావణ మభ్యేత్య బబంధ త్రిదశేశ్వరః,
తచ్ఛ్రుత్వా సహసాగత్య మేఘనాదః ప్రతాపవాన్

కృత్వా యుద్ధం మహాఘోరం జిత్వా త్రిదశపుంగవమ్
ఇంద్రం ధృత్వా దృఢం బధ్వా మేఘనాదో మహాబలః

మోచయిత్వా స్వపితరం గృహీత్వేంద్రం యయౌ పురీమ్.
బ్రహ్మా తం మోచయామాస వరా న్దత్వా చ తస్య తు

ఇంద్రజి న్నామ తస్యాసీ త్తదారభ్య రఘూత్తమ !
౨౭-౨౮-౨౯-౩౦

నృసింహవరదానా చ్చ రావణోఽభూ ద్దశాననః
దశాస్యవృత్తం కథితం రామచంద్ర యథాతథమ్. ౩౧

అస్తి పంచవటీనామా ఆశ్రమో గౌతమీతటే
తత్రైవ బహుకార్యాణి దేవానాం కురు రాఘవ. ౩౨

౨౫½ అంతమునకు రావణుడు కోపించి, కుబేరునిపైకి యుద్ధమునకు వెళ్లి వాని నోడించి, యాతని పుష్పక విమానము నపహరించెను.

౨౬½ మఱియు మయుని వరుణుని యుద్ధమున నోడించి యా రాక్షసరాజు దేవేంద్రునిగూడ నోడించు నుద్దేశముతో స్వర్గమున కేగెను.

౨౭-౨౮-౨౯-౩౦ రావణుడు తనపై దండెత్తివచ్చుట విని, దేవేంద్రుడు వాని నెదుర్కొని, యుద్ధమున వానిని జయించి కారాగృహమునందు వానిని బంధించెను. తన తండ్రియగు రావణుని దేవేంద్రుడు బంధించినట్లు మేఘనాదుడు విని మహా బల పరాక్రమ వంతుడయిన యతడు దేవేంద్రునిపై యుద్ధసన్నాహముతో వచ్చెను.

ఇటుల మేఘనాదుడు వచ్చి యింద్రునితో యుద్ధమునకు డీకొని ఘోరయుద్ధ మొనర్చి వాని నోడించి బంధించెను

పిమ్మట మేఘనాదుడు తన తండ్రిని కారాగృహమునుండి విడిపించి బంధింపబడిన యింద్రునితోగూడ తన పురమున కేగెను. పిమ్మట బ్రహ్మదేవుడీ వృత్తాంతమును విని లంకాపురికివచ్చి, మేఘనాదున కనేక వరము లిచ్చి యింద్రుని చెఱనుండి విడిపించెను. నాటి నుండియు మేఘనాదునకు నింద్రజిత్తను బిరుద నామము కలిగెను.

౩౧ పూర్వము నృసింహస్వామి వరమిచ్చి యుండుటవలననుగూడ రావణుడు దశాననుడు (పదితలలుగలవాడు) అయ్యెనని తెలియదగును. ఓ రామచంద్రా! రావణుని వృత్తాంతమంతయు చెప్పబడినది. (పూర్వము హిరణ్యకశిపుని నృసింహస్వామి సంహరించునపుడు హిరణ్యకశిపుడు నరసింహస్వామితో నీకంటె విశేషముగ బలికెను. నీవు పంచాననుడవు గాన ఏకముఖము గల నన్ను జంపగలిగితివి యనగా, నప్పుడు నరసింహమూర్తి యా రాక్షసునకు జన్మాంతరమున పదితలలు గలవాడగునట్లు వరమిచ్చె నని తెలియదగును.

౩౨ ఓ రామచంద్రా! గోదావరీతీరమున పంచవటియను నాశ్రమ మొకటి కలదు. నీ వచ్చటకేగి దేవకార్యములను జక్కబెట్టుము.

రామ స్తతో మునిం నత్వా ప్రాప్యానుజ్ఞాం చ తస్య చ
వినిర్యయౌ పంచవటీం సీతాలక్ష్మణసంయుతః. ౮౩

ఇత్యాశ్చర్యరామాయణే అరణ్యకాండే షష్ఠ స్సర్గ
స్సమాప్తః.



## సప్తమ స్సర్గః



[1]అథ రామో వినిర్గత్య తదగస్త్యాశ్రమా త్పునః,
సీతాలక్ష్మణసంయుక్తో వ్రజ న్పంచవటీ మభూత్. ౧
నిర్జలే నిష్ఫలే ఘోరే తేషాం తు వ్రజతాం వనే,
మధ్యాహ్నసమయ శ్చాభూ ద్గ్రీష్మబాధాధికాఘవత్. ౨
నహి పాతుం జలం తత్ర దృష్టం భోక్తుం ఫలం తు వా,
ఏకస్మిం స్తరుమూలే తు సీతాఽన్యస్మిం స్తరో స్థలే
రామ స్సముపవిష్టౌ ద్వౌ గ్రీష్మబాధాసహౌ స్థితౌ. ౩
తత స్సీతా సముద్దిశ్య విధిం ప్రాహ వచ స్త్విదమ్,
హా విధే క్లేశయసి వా ఫలం వాఽదర్శయం శ్చ నౌ. ౪
ఇత్యేవం ప్రార్థయంత్యా స్తు భూమిజాయా స్తదాంజలౌ
తద్వృక్షా దపత త్స్వాదురస మేకం ఫలం మహత్. ౫

1 క వి.

౧౩ ఇట్లాగాముగ నగస్త్యుడు చెప్పగాఁ బిమ్మట రామచంద్రమూర్తియు నగస్త్యమహామునికి నమస్కరించి యనుజ్ఞను బొంది సీతా లక్ష్మణ సమేతుఁడై పంచవటికిఁ బయన మయ్యెను.

ఆధ్యాత్మ రామాయణమున
అరణ్యకాండమున
నాలుగవసర్గము ముగిసెను.



## సప్తమసర్గ ప్రారంభము.



౧ అనంతరము రామచంద్రమూర్తి సీతాలక్ష్మణ సమేతుఁడై యగస్త్యాశ్రమమునుండి బయలుదేరి పంచవటినిగూర్చి వెళ్ళుచుండెను.

౨ నిర్జలమును ఫలరహితమును భయంకరము నగు వనమున సీతారామలక్ష్మణులు వెళ్ళుచుండ మధ్యాహ్నమయ్యెను గ్రీష్మబాధకూడ నధికమయ్యెను.

౩ ఆ యరణ్యమునఁ ద్రాగుటకు నీరుకాని తినుటకు ఫలముకాని కన్పడనందునను గ్రీష్మబాధ యధికమయినందునను సీత యొక చెట్టుక్రిందను, రామచంద్రమూర్తి మఱియొక చెట్టుక్రిందను గూర్చుండిరి.

౪ పిమ్మట సీతాదేవి దైవము నుద్దేశించి యుద్విగ్నముగఁ బలికెను. ఓ దైవమా! నీవు మా కిచట నొక ఫలమునైనను గనుపఱుపక మమ్ముల నెంత కష్టపెట్టుచుంటివి' అని పలికెను

౫౬ ఇట్లు దైవమును ప్రార్థించుచున్న సీతయొక్క దోసిలిలో నా చెట్టునుండి యొక మధురమైన ఫలముపడెను

ఏతస్మిన్నేవ కాలే తు రామహస్తే పత త్ఫలమ్,
సీతాయాః ఫలదానేన సీతాఫలతరు స్స్మృతి
రామస్య ఫలదానేన రామాఫల తరు స్స్మృతి.
*కథితౌ తౌ తరూ సద్యః పాపముక్తౌ నిజం వపుః
ధృత్వా నత్వా భూమిజాం చ రామచంద్రం చ తౌ తతః,
దివ్యరూపౌ విమానేన జగ్మతు శ్చ సురాలయమ్. ౬-౭-౮౪
తతో నిర్గత్య రామోఽపి సీతాలక్ష్మణసంయుతః,
వజ్రిజ స్సుధి దద ర్శాద్రిసన్నిభం విహగాధిపమ్ ౯౪

---

*పాపముక్తావితి:— సన్త్యేతౌ తరూ పురా కౌ తాభ్యాం కృతం దుష్కృతం కిమిత్యాశంకాం సమాధత్తే. తత్రేద మవధార్యం. కదాచన గంధర్వనగరే సీతారామాలయే పురాణకాలక్షేపః ప్రచలతిస్మ. సర్వేఽపి తత్రత్యా గంధర్వాః ప్రత్యహం పత్రపుష్పఫలాదిహస్తా స్తత్ర గత్వా, దత్వా చ ఫలాదికం భగవతే, కథాంచ పౌరాణికీం శ్రుతవంతో బభూవుః. తత్ర ద్వావేవ గంధర్వౌ జాయాపతీ నకదాపి గతా వాలయం, గతావపి కదాచన తౌ శూన్యహస్తౌ గత్వా ఫలసమర్పణాకృతో గంధర్వైః పరిహాసంతౌ స్థితౌ. తావేవోత్తరజన్మని భగవత్ఫలానర్పణజా దఘా ద్దండకారణ్యాం తరుభూతౌ. అధునా సీతారామయోః ఫలసమర్పణేన పాపముక్తౌ నిజలోకం జగ్మతురితి.

౬-౭-౮౪ ఈ సమయముననే రాముని దోసిలిలో నొకఫలము చెట్టునుండి పడెను. సీతకు ఫలమును సమర్పించిన వృక్షమునకే సీతాఫలమనియు రామునకు ఫలమును సమర్పించిన వృక్షమునకు రామాఫలమనియు ప్రసిద్ధి కలిగెను. ఆ వృక్షములు రెండును వెంటనే * పాపవిముక్తి నొందినవై తమ నిజరూపముల ధరించి సీతారాములకు నమస్కరించి దివ్యరూపధరులై తమకై వచ్చిన విమానముల నధిష్ఠించి స్వర్గమునకేగెను.

౯౪ అచ్చటనుండి బయలుదేరి రామచంద్రమూర్తి సీతాలక్ష్మణ సహితుడై పంచవటికి వెళ్లుచుండ మార్గమధ్యమున ఉన్నతాకారము గల యొక పక్షిరాజు (జటాయువు) కన్పడెను

---

* పాపవిముక్తి నొందినవై యను దాని వివరణము— ఈ వృక్షములు పూర్వ మెవ్వరై యుండిరి? వారలు చేసిన పాపమేమి? అను నాశంక కలుగును. అందువిషయమై యీ క్రింది విషయము తెలిసికొనదగి యున్నది. ఒకప్పుడు గంధర్వనగరములో సీతారామాలయమున పురాణకాలక్షేపము జరుగుచుండెను. అచ్చటనున్న గంధర్వులందరును ప్రతిదినము పత్రపుష్పఫలాదులతో నచ్చటకు వెళ్ళి యాలయములోని సీతారాములకు సమర్పించి పురాణకాలక్షేపము వినుచుండిరి. కాని యా నగరమున నిద్దరు గంధర్వదంపతులు మాత్ర మెప్పుడును దేవళమునకు వెళ్ళుటకాని, యొకవేళ నొకప్పుడు వెళ్ళినను శూన్యహస్తములతో వెళ్ళి భగవంతునకు ఫలసమర్పణము కాని చేయక పోవుటయే కాక, భగవంతునకు ఫలాదులను సమర్పించువారినిగూడ పరిహసించుచుండిరి. ఆ గంధర్వదంపతులే యుత్తరజన్మమున భగవంతునకు ఫలమునైన నర్పింపని దోషముచే దండకారణ్యమున వృక్షజన్మములనొందిరి. ఇప్పుడు సీతారాములకు ఫలము నర్పించుటచేఁ బాపవిముక్తులై దివ్యరూపధారులై తమ నిజగంధర్వరూపములతో దేవలోకమునకుఁ బోయిరి. (అని తెలిసికొనఁదగును)

దృష్ట్వా తం గృధ్రరాజం తు మత్వా రామోఽసురం పునః,
ప్రాహేదం వచనం క్షిప్రం సౌమిత్రి మనుజం తదా
రాక్షసోఽయం వధాయ త్వం ధనుస్సజ్యం కురు ద్రుతమ్॥౧౦-౧౧
తచ్ఛ్రుత్వా రామవచనం గృధ్రరా డ్భయపీడితః,
రామచంద్ర మువాచైవ మాహాత్మ్యవృత్తం యథాతథం. ౧౨
[1]సోఽస్మద్గోత్రమహత్తరః ఖగపతి ర్యస్తుష్యతి శ్రీపతేః
దృష్ట్వా ద్దానవదానకర్మణి మహో నానందన స్స్యందనః,
యే నాజౌ సహకృత్వనా సురపతే రాజన్వతీ భూ రభూ
త్తస్య ప్రాణసమ స్సఖా దశరథ స్యాసం సమా శ్శాశ్వతీః.౧౩
ప్రీతిం తే కరవాణ్యహం రఘుపతే వధ్యో నచాహం విభో
[2]గృధ్రోఽహం నతు రాక్షసోఽహ మభవం త్వద్వంశసంబంధ్యహం,
కించాహం తు సమీప ఏవ నివసంఛ్రీపంచవట్యాః పునః
రక్షిష్యామి చ మైథిలీం త్వయి గతే కుత్రాపి సౌమిత్రిణా.౧౪
రామ త్వం పితృవాక్యపాలనకృతే సీతానుజాభ్యాం వనం
ప్రాప్తోసీతి మయా శ్రుతం తవ విభో ద్రష్టుంకృతార్థోఽభవమ్.
తిష్ఠా మ్యత్ర రఘూత్తమ! ప్రియకృతే తే సర్వథా సాంజలి
స్తస్మా న్మామవతా ద్భవాం స్త్వమనుతాం మాం దాసభూ
తం తవ. ౧౫

భూమే ర్భార మపోహితుం భువి సతాం రక్షాకృతే శిక్షితుం
దుష్టానాం నిచయం భవంత మనఘ ప్రాప్తావతారం హరిమ్,
జానామ్యేవ రఘూత్త మాహ మపి భో శ్రీరామచంద్రప్రభో!
తస్మా న్మా మవతా ద్విభో రఘుపతే! త్వద్దాసభూతం తు మామ్.

1 నవ॥ రా॥ 2 క ఖ॥

౧౦-౧౧ ఆ గృధ్రరాజమును జూచి రాక్షసుఁడనుకొని యప్పుడు రామ
చంద్రమూర్తి లక్ష్మణునితో నిట్లు పలికెను. లక్ష్మణా! ఇతఁడు
రాక్షసుఁడై యుండినయెడల నేను వధింపుటకు ధనుస్సు నెక్కు-
పెట్టుము, అని పలికెను.

౧౨ ఆమాటవిని పక్షిరాజగు జటాయువు భయపడి శ్రీరామునితోఁ దన
వృత్తాంతము నున్నది యున్నట్టుల నిట్లుల జెప్పదొడఁగెను.

౧౩ ఓ రామచంద్రా! దైత్యులను సంహరించు కాలమున నే మహనీయు
డగు గరుత్మంతుఁడు లక్ష్మీపతికి వాహనమై యొప్పుచుండునో, అట్టి
గరుత్మంతుఁడు నాకు మూలపురుషుఁడై యుండెను. మఱియు, దేవ
దానవ యుద్ధములో నింద్రునకు దశరథుఁడు సహాయుఁడయ్యెనో
ఆ దశరథుఁడు నాకు ప్రాణస్నేహితుఁడై యుండెను.

౧౪ ఓ రామచంద్రా! నేను నీకు సంతోషమును జేయుచుందును. నేను
వధార్హుఁడను గాను. నేను జటాయు వను పక్షినిగాని రాక్షసుఁడను
కాను. ఇదియునుగాక నీ సూర్యవంశ సంబంధికుఁడనై యున్నవాఁడను.
మఱియు. నేను పంచవటికి సమీపములోనుండి సీతను గాపాడు
చుందును. నీవు లక్ష్మణునితో నెచ్చటికైన వెళ్లినను వెళ్లుచుండవచ్చును.

౧౫ ఓ రామచంద్రా! నీవు పితృవాక్య పాలనమునకై సీతాలక్ష్మణ
సమేతుఁడవై యరణ్యమునకు వచ్చినట్లు నేను వినియుంటిని. నీ దర్శన
ముచేఁ గృతార్థుఁడ నైతిని. నీకు సర్వవిధములఁ బ్రియమును జేయఁదల
చియే యున్నట నీరాక కెదురుఁజూచుచు సాంజలియై యున్నవాఁడను.
నన్ను నీ దాసునిగాఁ దలఁచి రక్షింపుము.

౧౬ ఓ రామచంద్రా! మఱియు నీవు భూభార హరణార్థమై దుష్టశిక్షణ
శిష్ట రక్షణములకై యవతరించిన పురాణ పురుషుఁడ వనికూడ నెఱుగు
దును. ఓ భక్తరక్షకా! దాసుఁడనగు నన్ను రక్షింపుము.

[1]గ॥ జయజయ జగతీపతే! లోకకర్త! శ్రియఃకాంత!
నాథ! త్రిలోకీశరణ్య! పరిత్రాణైకసింధో! జయార్తైకబంధో!
కృపాళో! జయాంభోజనేత్రాంబుదశ్యామగాత్ర! క్షమాపాల
కోటీరకోటి స్ఫురద్ధీర నీరాజితాంఘ్రి! జయ క్షాత్రతితిక్షో! జ
యోదారబుద్ధే! జయాశేషసిద్ధే! జయావాప్తవృద్ధే! జయ గ్రీవ
యావాప్తకంబో! త్రయీమౌళి వేద్య! త్రిలోకీశుభంయో!
జయాతుల్యవాత్సల్యసింధో! జయ స్వాస్త్రవాతూలతూలాయ
మానోచ్ఛలత్తాటకేయ క్రియాయోగిగాధేయయజ్ఞఘ్న
నిఘ్నార్భకక్రీడయైవ ప్రణశ్యత్సుబాహో! జయాజాను
బాహో! జయ స్వావలోకక్షణాక్షీణశాపోపలీభావలబ్ధ
ప్రమోదర్ధ్యహల్యాసమభ్యర్చితాంఘ్రి! పినాకప్రమర్దిన్!
జయ జ్యాలతావత్సమాకృష్టసీతామనఃపుణ్యకీర్తే! జయానంగ
మూర్తే! జయారణ్యవాసప్రియ! బ్రహ్మవిద్భిస్సమారాధి
తాంఘ్రి! విరాధప్రమాథిన్! ప్రపన్నార్తిహారిన్! జయ బ్రహ్మ
రుద్రేంద్రముఖ్యైశ్చ దేవై రభిష్టూయమాన ప్రభావ!
ప్రసాదిన్! జయిన్! జానకీదృక్చకోరైక చంద్రక్షమామండ
లేంద్ర ప్రభో! రామచంద్ర! ప్రసీద ప్రసీద ప్రసీద ప్రకృష్ట
ప్రశస్తే! నమస్తే నమస్తే నమః. ౧౨

[2]శ్రుత్వా తత్స్తుతివాక్యజాల మతులం శ్రీరామచంద్రప్రభుః
ప్రీత్యాలింగ్య చ తం ఖగాధిప మిదం ప్రాహాదరేణాన్వితః
అస్తు త్వాత సుహృత్తమస్య భవతి స్సందర్శనాచ్చా ప్యహం
సత్యం మత్పితృదర్శనోద్భవముదం ప్రాప్నోమి గృధ్రాధిప!

1 నవ॥ రా॥ సా॥ 2 శాః

౧౭ గ॥ ఓ లోకేశా! లోకరక్షకా! శ్రియఃకాంత! త్రిలోకీశరణ్యా! ప్రతాపనిధీ! ఓ యార్తత్రాణ పరాయణా! ఓ దయాసముద్రా! ఓ పుండరీకాక్షా! ఓ మేఘశ్యామలాంగా! ఓ మహీకాంతా! ఓ యుదారమతీ! నీకు జయము కలుగుగాక; ఓ యశోనిధీ! ఓ సంప్రాప్తసమృద్ధీ! రాజాధిరాజుల కిరీటములయందలి హీరమణులచే నీరాజింపబడిన పాదపద్మములుగల నీకు విజయము చేకూరుగాక! ఓ వేదాంతవేద్యా! లోకత్రయ శుభంకరా! ఓ యాశ్రితవత్సలా! గాలి దూది నెగురఁ గొట్టినటుల వాయవ్యాస్త్రముచే మారీచుని శతయోజన దూరము నెగురఁగొట్టిన నీకు జయము గలుగుగాక! మఱియు విశ్వామిత్రుని యాగమునకు విఘాతము చేసిన రాక్షసులఁ జెండాడిన నీకు మంగళము గలుగుగాక! ఓ పాపసంహారకా! నీ కటాక్ష వీక్షణకాలముననే పాపక్షయమై శిలారూపమును విడిచి నిజరూపమును ధరించిన యహల్యచేఁ గొల్వబడిన పాదపద్మములు గలవాఁడవును, శివధనువు నెక్కుపెట్టి నారిత్రాడుతోఁబాటు సీతా మనస్సునుగూడ నాకర్షించి యామెను జేపట్టి కీర్తినొందినవాఁడవును నవమన్మథుఁడవు నగు నీకు మేలు కలుగుగాక.

ఓ వనవాసప్రియా! బ్రహ్మవేత్తలచేఁ బూజింపబడిన పాదపద్మములు గలవాఁడవును; విరాధుని సంహరించినవాఁడవును; శరణాగత రక్షకుఁడవు నగు నీకు విజయము గలుగుగాక.

బ్రహ్మరుద్రేంద్రాదులచేఁ గొనియాడఁబడు ప్రభావము గలవాఁడవును, ప్రసన్నుఁడవును, జయశీలుఁడవును, జానకీహృత్కైరవ చంద్రుఁడవు నగు నో రామచంద్రా! మున్ముట్టికి నీకు నమస్కారము. దాసుఁడ నగు నాయందుఁ బ్రసన్నుండ వగుము. ప్రసన్నుండ వగుము.

౧౮ ఇట్లు జటాయువు స్తుతింపగా రామచంద్రప్రభువు విని, సంతోషముతో నా జటాయువును గౌగిలించుకొని యాదరముతో నిటుల బలికెను. ఓ పక్షిరాజమా! మా తండ్రి యగు దశరథునకు స్నేహితుఁడవైన నిన్నుఁ జూచుటవలన నిజముగ మాతండ్రినిఁ జూచిన సంతోషము గలుగుచుండెను.

గృధ్రేంద్ర స్త్వ మిత స్తు నో జనకవత్ క్షేమం సమాలోచయ
న్నస్మత్స్థానసమీప ఏవ వసతా త్ప్రీతిం ప్రకుర్వం శ్చ నః
ఇత్యుక్త్వా త మథానుజేన సహితో సద్గత్య భూజాతయా
ప్రాగా త్పంచవటీం క్రమా ద్ద్రుతగతి ర్గోదాతటీసంస్థితామ్. ౧౯

ఏవం పంచవటీ మేత ద్దృష్ట్వా త ద్రామణీయకమ్,
తతోఽనుజ మువా చేదం వచనం రాఘవ స్తదా. ౨౦

సౌమిత్రే తటినీతటే విలసతీ ప్రాంచత్పటీరాటవీ,
సేయం పంచవటీ తు వస్తు మిహ నో యోగ్యా దరీదృశ్యతే
ఏతస్యా రమణీయతా నిజపురీం విస్మారయే న్మాం ధ్రువం,
నూనం భూమిజయా త్వయా యది యుతోఽయోధ్యాం చ
నాభ్యర్థయే. ౨౧

కుంభోద్భవోక్తాం తు వయం ప్రాప్తాః పంచవటీ మిమామ్,
యత్ర తేఽభిమతో దేశః క్రియతా మాశ్రమ స్త్వయా
ఇత్యుక్త స్తేన సౌమిత్రిః ప్రాహేదం రాఘవం వచః. ౨౨
జ్యాశబ్దేన తు దుష్టసత్త్వనివహం దూరం నయామి ద్రుతం,
శాలా మాశు కరోమి రాఘవ దళై ర్బధ్నామి శయ్యాం సుమైః
వేత్రై రాసన మాశు మానివిశతే భ్రాతః కరోమ్యున్నతం
కృత్వా భూమి మిమాం సమాం జలకణై స్సిక్తాం కరిష్యా
మ్యహమ్. ౨౩

౧౯ ఓ గృధ్రరాజమా! ఇంతటినుండి మాతండ్రివలె నీవు కూడ మా క్షేమమును గోరుచు మా యాశ్రమ సమీపముననే యుండి మాకు సంతసము నొసగూర్చుచుండుము. అని చెప్పి రామచంద్రమూర్తి యచ్చటనుండియు సీతాలక్ష్మణసమేతుండై బయలుదేరి క్రమముగ గోదావరీ తీరమునందలి పంచవటీ క్షేత్రమును బ్రవేశించెను.

౨౦ ఈ ప్రకారము రామచంద్రమూర్తి పంచవటిని బ్రవేశించి యందలి రామణీయకమును జూచి యాశ్చర్యమొంది పిమ్మట లక్ష్మణునితో నిట్లం బలికెను.

౨౧ ఓ లక్ష్మణా! ఈ గోదావరీ తీరమునం దొప్పుచున్నదియు, మంచి గంధఫలవనములచే గూడినదియు నగు పంచవటీ క్షేత్రము మనకు నివసించుటకు యోగ్యమై కన్పడుచున్నది. ఇందలి రామణీయకము నన్ను సాకేతపురమును గూడ మఱపించు నని తోంచుచున్నది. నిశ్చయముగ సీతయు, నీవును నాకిచ్చట దగ్గరనుండిన నిచ్చట నాకేమి కొఱతయుండదు నని యయోధ్యజ్ఞాపకము వచ్చునా? (రాదని భావము).

౨౨ తమ్ముడా! మన మగస్త్యునిచేం జెప్పబడిన పంచవటికిం జేరితిమి, నీ కభిమతమైన స్థలమునందు పర్ణశాలను నిర్మింపుము. అని రామచంద్రమూర్తి లక్ష్మణునితోం జెప్పగా నతండు శ్రీరామునితో నిట్లం బలికెను.

౨౩ అన్నా! నీ యానతికే నిరీక్షించుచుంటిని. క్షణములో ధనుష్టంకారము చేతనే దుష్టజంతువులను దూరముగం దరిమి భూమిని సమముగంజేసి పర్ణశాలను నిర్మించెదను. నీటిచేం దడిపి శుభ్రముచేసెదను. మఱియు మునీశ్వరులు కూర్చుండుట కాసనముల నేర్పరచెదను. మీరు పరుండుటకుం బుష్పశయ్యల నేర్పరచెదను.

యావ త్కరోమి సంపూర్ణాం పర్ణశాలా మిమా మహమ్,
సదార స్త్వం నదీతీరే శ్రమం త్వపనుద న్వస. ౨౪
ఇత్యుక్త్వా రాఘవం నీత్వా సీతయా తటినీతటే,
ఉపవేశ్య స తు ప్రాగా త్కర్తుం త త్పర్ణమందిరమ్. ౨౫

తత స్సీతా మువా చేదం రాఘవో హర్షయ న్వచః,
దృశ్యతే పురవాసా చ్చ వనవాసో ఽధికః ప్రియే. ౨౬
*కే వ్యస్మాక మితః పురా నివసతాం సాకేతపుర్యాం సతా,
మావాసో విపినే ముహూర్త మపి నో సోఢుం తు శక్య స్త్వితి
ఉత్పన్నా మతి రద్య కాననవసతౌ సౌఖ్యానుభూతే ర్మమ,
శ్రేయా న్వై వనవాస ఏవ నగరావాసా దితి ప్రత్యయః. ౨౭

---

*అథ రాఘవ స్సర్వరాక్షసవధప్రతిజ్ఞానంతరం తదుత్సాహ మవలంబ్య వర్తమానః పంచవటీం భయానక యాతుధాననిషేవితా మాకర్ణ్య తన్నివాసం రాక్షసవైరసంఘటనాద్వారభూతం మన్యమానః సౌమిత్రిసీతాభ్యాం సహ తన్మధ్యగతాయా ఆర్యాయా గోదావర్యా స్తట మాసాద్య పర్ణశాలాయా నిర్మాణార్థం లక్ష్మణం నియుజ్య తత్తరంగశీతల సమీరణ సేవాపనీయమానాధ్వపరిశ్రమ స్స దశవర్షాణి ఋష్యాశ్రమేషు ఋషిపత్నీభి స్సంలాలితాయా నివసంత్యా అస్యాః వనవాసో ప్యేతావంతం కాలం సాకేత నివాసతుల్య ఏ వాభూత్. ఇదానీం ఘోరత రేస్మి న్విజ నేరణ్యే నివాసో యద్యస్యా అనభిమత స్స్యాత్ తర్హ్యాయ ముత్సాహ

౨౪ అన్నా! పర్ణశాల పూర్తిచేయు దనుక నీవు సీతతోగూడ మార్గశ్రమాపనోదార్థమై నదీతీరమున నివసింపుము.

౨౫ ఇవ్విధముగఁ జెప్పి సీతారాములను నదీ తీరమునఁ బ్రవేశపెట్టి పర్ణశాలను నిర్మించుటకై లక్ష్మణుఁడేగెను.

౨౬ పిమ్మట సీతను సంతోషపెట్టుటకై శ్రీరామచంద్రమూర్తి తన ప్రియసతితో నిట్లు పలికెను. ఓ ప్రేయసీ! మనకీ వనవాసము నగరవాసముకంటెను సుఖకరముగ నున్నదని తలంచెదను.

౨౭ * దేవీ! మన యయోధ్యలో నివసించినప్పుడు వనవాసమును క్షణము కూడ సహింపలేనని తలంచితిమి. వనవాసములోని సౌఖ్యముల ననుభవించుచున్న నా కప్పుడు నగరవాసముకంటె వనవాసమే శ్రేయస్కర మని నమ్మకము కలుగుచున్నది.

---

## అవతారిక

* రామచంద్రమూర్తి రాక్షసవధను ప్రతిజ్ఞచేసిన పిమ్మట నత్యుత్సాహము గలవాడై పంచవటి ప్రాయుంకెడి రాక్షస సేవిత మని విని, యచ్చట నివసించుట రాక్షసవైరమునకు ద్వారకముగా నుండునని తలంచి సీతాలక్ష్మణులతో గోదావరీ తీరమునొంది పర్ణశాలా నిర్మాణమునకై లక్ష్మణుని నియోగించి గోదావరినుండి వచ్చు పిల్లవాయువుల సేవచే మార్గశ్రమను బోగొట్టుకొనుచు మనమునం దిట్లు చింతించెను. పది సంవత్సరములనుండి ఋష్యాశ్రమములలో ఋషిపత్నులచే లాలింపబడు చుండిన యీ సీతకు వనవాస మయోధ్యానివాసమువలె నున్నది. ఇప్పుడు ఘోరమైన యీ యరణ్యమునందు నివసించుట యీ సీత కభిమతము కానిచో నాకుకూడ నీ యరణ్య

శ్లో॥ వసతాం విపినేఽస్మాకం కథ ముద్యానభూసుఖమ్,
ఇతి చింతా నకార్యైవ వన ముద్యానతోఽధికమ్,
వనభూ ర్మ్యాత్మ కోద్యాన మయత్నే నైవ సిధ్యతి,
నివాసలాభోఽత్ర సదా విశేషోఽత్రైవ తిష్ఠతి,
నగరోద్యాన మస్మాకం యత్నసాధ్యం భవే త్ప్రియే,
కించాత్ర సర్వదా వాసలాభ స్తత్ర తథా నహి,
తత్రాపి పాదపా స్సంతి పుష్పితా స్సంతి తేఽత్ర చ.
౨౮-౨౯-౩౦-౩౧

శైలాః క్రీడాద్రయోఽస్మాకం భవంతి ప్రేయసి ధ్రువమ్,
స్నానార్థం సంతి నద్య శ్చ వాయు ర్వాతి సులక్షణః. ౩౨

తచ్ఛ్రుత్వా జనకాత్మజా పతివచ స్తుష్ట్వాంతరంగే పునః,
సంత్యక్తాఖిలసంశయా రఘుపతిం సప్రశ్రయా ప్రాహ తమ్. ౩౩

---

ఏత ద్వనవాసాభావే నాలబ్ధ నైరావకాశత్వాత్, కుంఠప్రసర ఏవ భవేత్, ఇత్యాలోచ్య ఉత్సాహాంగత్వేన సీతాయా వనవాసాభిరుచి ముత్పాదయతి అయోధ్యానివాసాత్ వనవాసస్య శ్లాఘ్యత్వం సమర్థయతే, ఇతి వేద్యం.

౨౮-౨౯-౩౦-౩౧. ఓ ప్రేయసీ! వనమునందు వసించు మనకు ఉద్యానభూముల సుఖ మెట్లు కలుగునని తలంపవము. ఈ వనమే యుద్యాన వనము. ఈ యుద్యానమున మనకు చిరకాలము నివాసలాభము కలుగుచున్నది. ఇదియునుంగాక వనరూపమైన యుద్యానవనము (పూలతోట) ప్రయత్నము లేకుండగనే సిద్ధించుచున్నది. పుష్పించిన వృక్షము లిచ్చుట నచ్చుటను సమముగానే యుండును. నగరోద్యానమన్నచో ప్రయత్నసాధ్యమైనది. కాన నగరోద్యానముకంటె నీ యుద్యానమే శ్రేష్ఠమని నాభావము.

౩౨ ప్రేయసీ! క్రీడాపర్వతము లిచ్చట నుండునుగదా! ఇచ్చట నవి యేవని తలంపకుము. ఇచ్చటనున్న పర్వతములే క్రీడాపర్వతములుగా నున్నవి. జలక్రీడలకు క్రీడా సరోవరములు లేవనికూడ సంశయింపకుము. వానికంటె గొప్పవి యగు నదులే యిచ్చట స్నానార్హమై యొప్పుచున్నవి.

౩౩ ఇట్లు చెప్పుచున్న భర్తృవాక్యములకు సీత సంతోషించి సర్వసంశయములను విడిచి, సాంజలియై రామునితో నిటులఁ బలికెను.

---

మునందే యునికి సంభవించని హేతువుచే రాక్షసవైరమునకే యవకాశ ముండనందున రాక్షస సంహారమునకైన వారు నుత్సాహమంతయు నిరర్థకమగును, అని చింతించి యుత్సాహాంగముగ సీతకు వనవాసాభిరుచిని బుట్టించుటకై యయోధ్యా నివాసముకంటెను వనవాసమే శ్రేయస్కరమని సమర్థింపబడుచున్నది.

స్థాతుం మే విపినే చతుర్దశసమా ఏవార్య నోదేతి ధీః,
కింతు స్థాతు మిహాభ్యుదేతి చ మతి ర్మే జీవితాంతం విభో. ౩౩

సీతారామౌ నదీతీరే భాషయంతౌ పరస్పరమ్,
సంత్యక్తాధ్వశ్రమౌ తత్ర సంస్థితౌ ద్వౌ సుఖేన తౌ. ౩౪

సౌమిత్రి శ్చ గతో ద్రుతం వనతలా దానీయ వంశాం స్తథా,
శాఖాః పర్ణ లతాచయం సమతలే శ్రీపర్ణ శాలాం దృఢామ్,
బద్ధ్వా పుష్పబలిం విధాయ నితరాం కృత్వా చ శాంతిం తతః
ఆనేతుం ద్రుత మగ్రజం తు నిరగా ద్గోదాతటే సంస్థితమ్. ౩౫

సౌమిత్రి స్తు వినిర్గతో ఽగ్రజకృతే గోదాతటం త్వాగతః,
సౌవర్ణాభరణై ర్దుకూలవసనై శ్ఛత్రై స్తథా చామరైః,
భృత్యాద్యై ర్నృపలక్షణై శ్చ రహితం భార్యాద్వితీయం స్థితం
దృష్ట్వా చీరజటాధృతం రఘువరం శోకాకులః ప్రాహ తమ్. ౩౬

భ్రాత స్తే పరిదృశ్యమాన మధునాఽ వస్థాంతరం యత్స్థితం
స్వప్నే వా న నిరూపితం రఘుపతే కేనాపి పూర్వం తు తత్
నోల్లంఘ్యం తదిదం హి తే విధివశా త్ప్రాప్తం త్వవస్థాంతరం
యుక్తాయుక్తవివేక ఏవ తు విధే ర్నాస్తీతి విజ్ఞాయతే. ౩౭

భ్రాంతోఽభవ మహం భ్రాత ర్నచైత ద్విధినా కృతమ్,
అవస్థాంతర మేత త్తే కైకేయ్యాః సముపాగతమ్. ౩౮

ఇత్యుక్త్వా రాఘవం భూయ శ్శోకాకులమనా స్తదా
సంబోధ్య కైకేయీ మేవం సౌమిత్రి స్తాం నినింద సః. ౩౯

౩౩ నాథా ; పదునాలుగు సంవత్సరములు మాత్రమే యీ వనవాసము చేయవలయు నని బుద్ధి నాకు పుట్టుటలేదు. ఇక నేమన జీవితాంతము నిచ్చట నుండఁ గోరిక నాకుఁ గలుగుచున్నదనెను.

౩౪ ఇట్లు సీతారాములు సంభాషించుకొనుచుఁ బిల్లవాయువులచేఁ బోఁగొట్టబడిన మార్గశ్రమగలవారలై నదీతీరమున సుఖముగ నుండిరి.

౩౫ లక్ష్మణుఁడు నచ్చటనుండి శీఘ్రముగ వనమునకేగి యచ్చటనుండి శమీశాఖలను వెదురుబొంగులను, లతలను, పర్ణములను దీసికొని వచ్చి పర్ణశాలను దృఢముగ నిర్మించి పుష్పబలి నిచ్చి వాస్తుశాంతిచేసి గోదావరీ తీరమునందున్న సీతారాములను దీసికొనివచ్చుటకు బయలుదేరెను.

౩౬ లక్ష్మణుఁ డిట్లు బయలుదేరి గోదావరీతీరమున కేగి యచ్చట సీతాద్వితీయుఁడై యున్నట్టియు, సువర్ణాభరణములు, దుకూలములు, ఛత్రచామరములు, భృత్యపరివారము మొదలగు రాజలక్షణములతో రహితుఁడైయున్నట్టియు, జటావల్కలధారియు నగు రామునిజూచి శోకాకుల మనస్కుఁడై శ్రీరామునితో నిటులఁ బలికెను.

౩౭ అన్నా ! ఇప్పుడు కన్పడుచున్న యీ యవస్థాంతరము (నీ స్థితి) స్వప్నమునందుగూడ నెన్నఁడు నెవ్వఁడుకూడ నిటుల జరుగునని తలంచి యుండలేదుగదా ! దైవవశముచేఁ బ్రాప్తమైన యీ యవస్థ యుల్లంఘించుటకు శక్యము కాదుగదా !

౩౮ అన్నా ! నేనే భ్రాంతి పడుచుంటిని. నీకుఁ గలిగిన యీయవస్థ విధి వలన సంప్రాప్తమైనదికాదు. ఇక నేమన, కైకమూలముగ వచ్చినది.

౩౯ ఇట్లు లక్ష్మణుఁడు రామునితోఁ జెప్పి విచారపడుచు కైకను సంబోధించి యిటుల నిందింపసాగెను.

*కైకేయ్యంబ పురా త్వయా కృత మభూద్యత్కర్మసర్వంకషం
తస్మాత్కర్మణ ఏవ వల్కలజటాధారీ స్థితో మేఽగ్రజః
సీతా కష్టదశా మవాప తనయ స్తే ప్రాప్త కార్శ్యం మహత్
త్వం చాసీర్విధవా శుచం పురజనాః ప్రాపుశ్చ తే కర్మభిక్. ౪౦

త్వత్పుత్రప్రియ తు రాజ్యకాంక్షిణ మిదం యుక్తం భవేత్కైకయి
రామపరివ్రజనం త్వయా త్వవనిజాపరివ్రాజనం యత్కృతమ్
విద్వేషం తవ రాఘవే జనకజాదేవ్యాం చ తత్సూచయేత్
నో దూయేఽగ్రజదుస్స్థితిం ప్రతి పరం దూయే మహీజాస్థితిమ్.
౪౧

ఇత్యేవం వదత స్తస్య ముఖరాగం నిరీక్ష్య సః,
పరిహస్య రాఘవః ప్రాహ సౌమిత్రిం సాంత్వయ న్వచః. ౪౨

నాద్యాపి శాంత స్సంరంభ స్సౌమిత్రే తవ మాతరి,
*వ్యాజేన కారయామాస కైకేయీ హిత మేన సః. ౪౩

---

*వ్యా—యత్కర్మేతి—తస్మై వరద్వితీయ మాశ్రుత పూర్వ మేవ యాచే బిభర్తు భరత స్తవ రాజ్యంక్షిత్రం, వర్షాణి తిష్ఠతు చతుర్దశదండకాయాం సౌమిత్రి మైథిలసుతా సహిత శ్చ రామః॥ ఇత్యేవం రూపేణ వచనేన మంథరాముఖే నాభిషేకనిరోధాదికం కర్మేతి వేద్యం.

*వ్యాజేనేతి—అమీ యౌవనమదాంధాః స్వయ మాత్మహితం నబుధ్యంతే, బోధితా అపి విషయభోగేచ్ఛయా న

౮౦ *ఓ కైకమ్మా! నీవు చేసిన యేకర్మయుండెనో యది సర్వంకషమై నదిగదా! నీదుష్కర్మవలననే గదా మాయన్న జటావల్కలధారి యయ్యెను. సీత కష్టముల పాలయినది నీకర్మవలననే గదా! నీ కొడుకు కొరకు రాజ్యమును సంపాదింపఁ గోరితివా యతఁడు (భరతుఁడు) త్యజించెను గదా!. పౌరులును దుఃఖముల పాలయిరి. నీవా-భర్తృహీనురాలవైతివి. తుదకు నీకర్మ (నీపని) సర్వనాశకమయ్యె గదా! ఎంత కష్టము.

౮౧ ఓ కైకేయి! నీ కుమారునకు రాజ్యమును గోరుట యొక పక్షమున యుక్తము కావచ్చును. కాని సీతారాముల నరణ్యమునకుఁ బంపుట యనునది నీకు వారల యందలి ద్వేషభావమును సూచింపుచున్నది. రాముని దుస్థితిని గూర్చికూడ నేను విచారపడను గాని సీతయొక్క కష్టమును జూచి పరితాప పడుచుంటిని.

౮౨ ఈప్రకారము కోపావేశముతోఁ బలుకుచున్న లక్ష్మణునిముఖమైఖరి రామచంద్రమూర్తిచూచి వత్సచులక్ష్మణునితో నిట్లులఁ బలికెను.

౮౩ ఓలక్ష్మణా! తల్లియగు కైకవిషయమై నీ కిప్పటికిని కోపము శాంతింపలేదా? కైక *వనవాస మను మిషచే మనకు హితమే చేసెను.

---

* నీవుచేసిన యేకర్మ యుండెనో అను దానివివరణము.
"నాథా! నీవు నాకిచ్చెదనని పూర్వము ప్రతిజ్ఞ చేసిన రెండు వరములలో నొక వరముచే భరతునకు రాజ్యమును. రెండవ వరముచే సీతాలక్ష్మణ సమేతముగ రామున కరణ్యవాసమును గలుగజేయుము. అను వచనములచే మంగళాముఖమున నభిషేక నిరోధరూపమగు నేకర్మ కలదో యా కర్మయని తెలియదగును.

* వనవాసమను మిషచే నను దాని వివరణము – కైక మనలను వనమునకుఁ బంపిన యభిప్రాయ మేమనగా, యౌవన మదాంధులగు వీరలు స్వయముగ తమహితమును గుర్తింపలేరనియు, నొకపక్షమున

*ఆరభ్యాదిన్నృపా త్సమ స్తపృథివీపాలై శ్చ గమ్యం వనం
కై కేయ్యాఽవనిభారదూరకరణా త్తుక్త్యేన సీతా వయమ్.
తత్తైస్స్వైరం పథి తీర్థసేవన మభూ త్సేవా మునీనాం చ న
స్తన్మూలా ద్దురితక్షయోఽభవదతోఽవిద్యానివృత్తి స్త్వభూత్ ౪౪

---

కుర్వంత్యేవ, అతో యేన కేనాపి ప్రకారేణ అయం హి తే ప్రవర్త యితవ్య ఇతి మత్వా భరతాధిపత్య లాభాత్మకం వ్యాజ మాశ్రిత్యైవం కృతం - అనేన వాత్సల్యాతిశయో వ్యజ్యత ఇతి.

*అనేన వనవాసోఽపి కులధర్మ ఇతి సూచితం. సత్సేవా సదుపదేశబలా ల్లబ్ధే నాత్మజ్ఞానేన అవిద్యానిరాసో దర్శితః- యథోక్తం - "భిద్యతే హృదయగ్రంథి శ్ఛిద్యంతే సర్వ సంశయాః । క్షీయంతే చాస్య కర్మాణి తస్మి న్దృష్టే పరావరే ఇతి - వస్తుత స్త్వస్యా పి వచనస్య సర్వరాక్షసవధోత్సాహం గత్వ మేవ వ్యజ్యతే - తథాహి - యోఽయం సర్వరాక్షస వధాత్మకోఽర్థః ప్రతిజ్ఞాతః, తత్రైకో లక్ష్మణ ఏవ సహాయత్వేన నిరూపితః. తత్ర యదిసోఽపిరాజ్యాభిలాషా ద్వనవాసంరాక్షస వైరసంఘటనా హేతుభూతం నాభినందేత్, తతోభిన్నమతిత్వేన తస్యసాహాయ్యాక మస్థిర మాపద్యేతేతి మత్వా, వనవాసస్య శ్రేయ స్తరత్వం సమర్థిత మితి వేద్యమ్.

౪౪ *ఇక్ష్వాకు మహారాజు మొదలు నేటిదనుక యుండెడి రాజులంద
రిచే సేవితమైన వనమును గూర్చి మనలను కైక పంపివేయుట రాజ్య
భాగ మెట్లయినను మనకుఁ దొలగింపఁజేయుఁ గుతూహలముతోఁ
జేసెను గాని వేఱుకాదు. ఇదియునుం గాక, కైక మనకు వనవాస
మును గల్పించుటవలన ననేక లాభములు మధ్యమార్గమునఁ గలిగెను.
(అవి యెవన) తీర్థసేవయు, మహర్షిజనసేవయు,నందువలనఁ బాపక్ష
యము, అందుచే నవిద్యానివృత్తియు గలిగెను.

---

బోధించినను విషయభోగేచ్ఛచే దానిని నాచరింపరనియు, గాన
నెవ్విధముననైనను వీరలను మంచిమార్గమునఁ బ్రవేశపెట్టవలయునని
యు, కైక తలఁచి భరతునకు యౌవరాజ్యమును గోరుట యను
మిషచే మహర్షిజనసేవితమగు నీ యరణ్యమునకు మనకు హితమును
గలుగజేయ నుద్దేశముతో కైక మనలను నడవికిఁ బంపెను. ఇందు
మూలమున నామె వాత్సల్యాతిశయము వ్యజ్యమాన మగుచున్నది.

* ఇక్ష్వాకువు మొదలుకొని యని చెప్పుటచే వనవాసము కుల
ధర్మమని సూచితమగుచున్నది. మునిసేవాతదుపదేశములచే నాత్మ
జ్ఞానము గలుగుననియు,నందుచేన విద్యానివృత్తి యనియు తెలియదగి
నది. అద్వ్యాగమునకే యుపనిషత్తునందుఁ జెప్పఁబడినది. ఆత్మదర్శనము
వలన హృదయగ్రంథి భిన్నమగుననియు, సర్వసంశయములు విచ్ఛి
న్నము లగుననియు, కర్మక్షయ మగుననియు, జెప్పబడినది. వాస్తవి
కము విచారించిన నీవాక్యము గూడ సర్వరాక్షసవధ కుత్సాహాంగ
ముగ నున్నట్లు వ్యంగ్య మగుచున్నది. (ఎట్లనగా) రామచంద్రమూర్తి
లోగడ సర్వరాక్షసవధ రూప మగు ప్రతిజ్ఞ చేసి యుండెను. అవిష
యమున లక్ష్మణుఁడొక్కఁడే సహాయుఁడుగ గన్పించుచుండెను.
ఈ లక్ష్మణుఁడును రాజ్యాభిలాషచే రాక్షసవైర సంఘటనకు ద్వార
మైన వనవాసము నభినందింపక పోయినచో భిన్నాభిప్రాయము
గలవాఁడగును. కాన నతని సాహాయ్య మస్థిరమగునని తలచి వన
వాసమే శ్రేయస్కరమని రామచంద్రమూర్తిచే సమర్థింపబడు
చున్నదని తెలియదగును.

ఏవం నో ముక్తమార్గస్య హేతుభూతాం తు మాతరం
సౌమిత్రే త్వం వృథాక్రోధా త్కైకేయీం కిం వినిందసి. ౪౫
మాతాఽపరాధి న్యపి వందనీయా మాత్రా భవంతం ప్రతి
నాపరాద్ధమ్,
సంరంభ ఏవానుచితో హి తస్యాం తత్రాప్యయుక్తా హ్యను
వృత్తి రస్య. ౪౬

తచ్ఛ్రుత్వా వచనం తస్య లక్ష్మణః ప్రాహ రాఘవమ్.
నహి సంత్యగుణా ఏవ గుణినా మితి యద్వచః,
తదద్య సత్యం భవతి దృశ్యతే నాత్ర సంశయః
త వాత్యంతాపకారిణ్యా ముపకార మతి స్త్వహో. ౪౭-౪౮
కైకేయ్యా మతదర్హేణ మాతృభావం తు కర్మణా,
ప్రతిక్షిప న్నిమ మేవం సౌమిత్రిః ప్రావద త్పునః. ౪౯

*ప్రారబ్ధస్య తవాభిషేకమహసో మధ్యే విఘాతం పునః,
కృత్వా లోక మిమం విచారజలధౌ మగ్నం విధాయాపి చ
కించ త్వాం సహ సీతయా వనభువం సంప్రేష్య నిస్సంశయం
భర్తృఘ్నీం చ కథం ను కేకయసుతాం త్వం మన్యసే
మాతరమ్. ౫౦

---

*ప్రారబ్ధస్యేతి - ప్రారబ్ధస్య గురుణా వసిష్ఠేన ప్రారబ్ధస్యేత్యర్థః, అనేన సర్వలోకవంద్యేన వసిష్ఠేన క్రియమాణస్య కర్మణో నిరోధా న్మహ దతిక్రమ నిబంధనో దోషః నిరూపితః. యథోక్తం "హంతి శ్రేయాంసి సర్వాణి పుంసో మహ దతిక్రమః" ఇతి.

౪౫ ఇవ్విధముగ ముక్తిమార్గమునకు మనకు హేతువగు కైకను వ్యర్థముగఁ గోపావేశమున నెందులకు దూషించెదవు ?

౪౬ తమ్ముడా! తల్లి యపరాధము చేసినను గూడఁ బూజనీయురాలే యని శ్రుతమగుచుండ, నీ విషయములో నామె యొట్టితప్పు చేయక పోయినను నీ విట్టుల సంరంభములో (ఆటోపముతో) మాట్లాడుటయే దోషము అందున నావృత్తి (పదేపదే దూషించుట) బొత్తిగఁగూడదని చెప్పనేల ?

౪౭-౪౮ ఆ రాముని వచనములను విని లక్ష్మణుఁడు రామచంద్రునితో నిట్టులఁ బలికెను. అన్నా! నీ విషయమై యత్యంతాపకారము చేసిన కైక విషయమై, యామె యుపకారమే చేసినదని నీవు సమర్థించుట చూడ, గుణవంతులుగ నుండువారికి గుణహీనుడే కన్పడఁడను వచనము నీయందు సార్థకమైనదని తలచెదను.

౪౯ అన్నా! ఆమె చేసిన పనులనుబట్టి యామె విషయమై మాతృశబ్దము నుపయోగించుటకూడ ననర్హమనియే నేను భావించెదను. ఏలననఁ జెప్పెదను వినుము.

౫౦ *ప్రారంభింపబడిన నీ పట్టాభిషేక మహోత్సవమునకు మధ్యలో విఘాతముచేసి లోకమునంతను విచారసముద్రములో ముంచుటయే కాక సీతతోగూడ నిన్నడవికిఁ బంపి నిస్సంశయముగ భర్తృమరణమునకుఁగూడ కారణమయిన కైకను నీ వింకను మాతనుగా (తల్లినిగా) దలచుచుంటివా ?

---

* ప్రారంభింపఁబడిన యనుదాని వివరణము:- ప్రారంభింపబడినదనగా గురువగు వసిష్ఠునిచే ప్రారంభింపబడినదని తెలియవలయును. ఇట్లు చెప్పుటచే సకలలోక వంద్యుడగు గురువగు వసిష్ఠునిచే సంకల్పింపబడిన పట్టాభిషేక రూపమగు కర్మను నిరోధించుటవలన మహా దతిక్రమరూపమగు దోషముకూడ కైకకు సంభవించె నని సూచిత మగుచున్నది. "మహాత్ముల నతిక్రమించుట సర్వశ్రేయస్సులకు విఘాతము చేయు"నని చెప్పబడినది.

సౌమిత్రే ర్వచనం శ్రుత్వా సద్యః కర్ణౌ పిధాయ సః,
రాఘవః ప్రాహ సౌమిత్రిం శాంతం పాప మితి బ్రువన్. ౫౧

పాప మూలే శుచో హేతౌ నింద్యే రాజ్యేఽఖిలాపదః,
అహో భవా న్పూజనీయాం మాతరం చ వినిందసి. ౫౨

*పరితోషవిహీనానాం జనానాం సతతం మనః,
అలబ్ధస్య భవే ల్లబ్ధ్యై గుర్వ్యధిష్ఠపతత్పరమ్. ౫౩

యద్రాజ్యే త్వభిలాషేణ వదస్యేవం నిరంకుశః,
తద్రాజ్యే బహవో దోషా స్సంతి తా న్వచ్మ్యహం శృణు. ౫౪

ఏకేన భుజ్యమానాపి మహీ వీక్ష్య గుణాధికం,
అపరం స్వైరిణీ వాన్య మవ్యవస్థానుయాతి హి
ఏతాదృశీ మహీ రాజ్ఞః కళత్ర మితి గద్యతే, ౫౫

విమృశ్యమానే బంధుత్వే రాజ్ఞ స్స్వస్త్రీణి బంధవః,
యతోఽస్య మిత్రభృత్యేషు నాస్తి విస్రంభణీయతా. ౫౬

---

*అనేన సంతోషగుణః సర్వోత్కృష్టత్వేన సూచితః,
తథాహి—అకించనోఽపి సంతుష్ట శ్శేతే సర్వాంగవిజ్వరః,
అసంతుష్టః సకృత్స్నేశా న్నాప్నోత్యపి సురేశ్వరః ఇతి.

౫౧ ఇట్లు చెప్పుచున్న లక్ష్మణుని మాటలు విని రామచంద్రమూర్తి చెవులు మూసుకొని యిట్టి వినకూడని మాటలు వినుట వలన కలిగిన దోష ముపశమించుగాక యని లక్ష్మణునితో నిటులబలికెను.

౫౨ పాప మూలకమును దుఃఖహేతువు నగు రాజ్యమునందలి యభిలాషచే బూజనీయురాలైన తల్లిని నీ విటుల నిందించుట తగదు.

౫౩ * లక్ష్మణా! అసంతుష్టులైన వారి మనస్సు ఎల్లప్పుడు ప్రాప్తింపని దాని ప్రాప్తికై పూజనీయుల నవమానించుటయం దాసక్తమై యుండు ననుట నిక్కువము.

౫౪ ఓ లక్ష్మణా! నీవు రాజ్యాభిలాషచే నిట్లు నిరంకుశముగ మాట్లాడుచుంటివి కాని, రాజ్యమునందున్న దోషములను గ్రహింపకైతివి, చెప్పెదను వినుము.

౫౫ ఒకనిచే ననుభవింపఁబడుచున్న భూదేవి యతనికంటె గుణాధికుఁడు కన్పడిన వానిని వ్యభిచారిణివలె ననుసరించును. ఇట్టి యవ్యవస్థగల భూమి రాజునకు కళత్రమయి యున్నది. రాజునకు కళత్రమా యిట్టిది?

౫౬ ఇక రాజునకు బంధుత్వవిషయ మాలోచించుదము. రాజునకు శస్త్రాస్త్రములే బంధువులు. మిత్రుల యందును భృత్యుల యందుకూడ విశ్వాస ముండదు.

---

* ఇందుచే సంతోష గుణము సర్వోత్కృష్టమని సూచిత మగుచున్నది (ఎట్లన) "దరిద్రుఁడయ్యు సంతోషముతో నుండిన నెట్టి మనస్తాపములులేక సుఖముగ నుండును. ఇంద్రుఁడంతవాడైనను అసంతుష్టుఁడైనచో మాటిమాటికి క్లేశములను బొందు"నని చెప్పఁబడినది.

•రాజ్ఞో లబ్ధాధిపత్యస్య తనయా ఏవ శత్రవః,
సుతాశ్చ పితరం హంతుం రాజ్యప్రాప్త్యై యముద్యతాః
రాజాపి భ్రాతృపుత్రాదీన్ హంతు మిచ్ఛే చ్ఛ్రియై పునః. ౫౭-౫౮

*కిం చాన్యదురితా దస్య నరకే పతనం భవేత్,
శ్వేతచ్ఛత్రా చ్చామరా చ్చ ఫల మన్య న్నదృశ్యతే. ౫౯

తచ్ఛ్రుత్వా ప్రాహ సౌమిత్రి ర్వచనం రాఘవం త్విదమ్,
న కేవల మహం త్వేకః సర్వే నిందంతి కైకయీమ్. ౬౦

రాజ్యాభిలాషా దభిషేకవిఘ్నకృతే ర్న మే కుత్సముపాగ
తాభూత్, అస్మత్కులీనా చరితస్య ధర్మ స్యాతిక్రమా
న్మే సముపాగతా కుత్. ౬౧

---

•రాజేతి, యథోక్తం - "శ్రుతిరూపో మయం ధర్మః ప్రజాపతివినిర్మితః, భ్రాతాపి భ్రాతరం హన్యా ద్యేన ఘోర తమం తమః. ఇతి.

*వ్యా—నరకేపతన మితి-అన్యాయ మాశయః. వర్ణాశ్రమానురూప్యేణ యథావిధి ధర్మప్రవర్తనస్య పాపీయసాం దండ్యానాం యథార్హం దండన స్యాసమర్థకరత్వా త్తద్గతా దోషాః రాజానం ప్రాప్నువంతీ త్యన్యాపా దస్య నరకే పతన మితివేద్యం. శ్వేతచ్ఛత్రా దిత్యస్యాయ మాశయః-

౫౪-౫౫ • రాజునకు పుత్రసౌఖ్యము విచారించెద మన్నను రాజునకు కుమారులు శత్రువులు. కుమారులుగూడ రాజ్యకాంక్షచే తండ్రినిజంపుటకు గూడ వెనుదీయరు. రాజు రాజ్యమునకై సోదరులను పుత్రులను గూడ జంపుటకు వెనుదీయడు.

౫౯ *లక్ష్మణా! ఇదియునుం గాక యితరులపాపము రాజులకు సంభవించును గాన రాజునకు నరకపతనము సంభవించును. ఛత్రచామరములు రెండుతప్ప రాజ్యపాలనములో వేఱు ఫలము కన్పడదు

౬౦ లక్ష్మణుని యావచనములను విని రామునితో నిట్లు బలికెను కేవలము నే నొక్కడనే కైకను నిందించుటలేదు. ఇక నేమన లోకమంతయు నిందించుచున్నది.

౬౧ రాజ్యాభిలాషచే బట్టాభిషేకమునకు విఘ్న మాచరించినందున కైక మీదను నాకుఁ గోపమువచ్చుటలేదు. మన వంశీకులచే ననుష్ఠింపబడుచు నేటివఱకు జరుగుచున్న సనాతనధర్మమును (పెద్దవాడుండఁగాఁ జిన్నవాడు రాజ్యమునుఁ బాలింపకపోవుట యను ధర్మమును) కైక యతిక్రమించినందున నామెవిషయమై నాకు కోపమువచ్చెననియెను.

---

• ఇవ్విధముగ ధర్మశాస్త్రమునందు జెప్పబడినది. ఘోరతమస్సును బొందింపజేయు (భ్రాతృహత్య)కూడ సోదరులు రాజ్యకాంక్షచే జేయుదురు. ఇది క్షత్రియ ధర్మమని ప్రజాపతిచే నిర్మింపబడినది'' అని.

* నరకపతనమును దాని వివరణము.

వర్ణాశ్రమములకు దగునట్లు యథావిధిగ ధర్మముగ బ్రవర్తించుట కాని, పాపులను దగునటుల దండించుట కాని రాజునకుఁ గష్టసాధ్యములు గాన, సక్రమముగ పైవానిని జరుపక పోవుటవలన సంభవించు దోషములు రాజును బొందగలవు. కాన నితరులపాపముచే నరకపతనము రాజునకుఁ గల్గునని చెప్పబడినది. ఛత్రచామరముల కంటె వేఱుగ ఫలము లేదను దాని భావ మేమనగా—

తచ్ఛ్రుత్వా వచనం రామ స్సౌమిత్రి మిద మాహ సః,
యద్యేవం తర్హి సౌమిత్రే తవోపాలంభగోచరః,
ప్రథమం త్వహ మేవేతి వాచ్యం తత్కారణం శృణు. ౬౨

రాజ్యస్య భరణే శక్తే జనానా మనురంజకే,
రాజ్ఞ స్సిద్ధేఽభిషేకాయ సిద్ధోఽహం యదపత్రపః
సౌమిత్రే రక్షితుం భూమి మశక్తః కిము నః పితా
రరక్ష విక్రమో యస్య దైత్యా నున్మూల్య దేవతాః
౬౩-౬౪

రాఘవస్య వచ శ్శ్రుత్వా సౌమిత్రిః ప్రాహ తం ప్రతి,
యద్యేవ మపరాద్ధోఽహం ప్రసీదతు భవా న్మయి
కథాప్రసంగా న్మర్యాదా మతిక్రమ్య త్వభాషయమ్
నిర్మితా పర్ణశాలాఽభూత్ శాంతి శ్చాపి కృతా మయా
సీతయా నిర్గత స్తూర్ణం ప్రవేశం కురుతా ద్భవాన్.
౬౫-౬౬-౬౭

ఇత్యుక్త స్సీతయా సార్ధం లక్ష్మణేన చ నిర్గతః,
రాఘవః పర్ణశాలాయాం ప్రవివేశ ద్రుతం గతః. ౬౮

---

క్షత్రియ స్యాధిపత్యఫలం కిమితి విమర్శే క్రియమాణే శ్వేతచ్ఛత్రచామరద్వయా దన్య దసాధారణం ఫలం నాస్తి. శ్వేతచ్ఛత్రచామరద్వయాత్మకఫల స్యాధిపత్యేన వినాపి సులభత్వేన న తదర్థ మాధిపత్యం ప్రార్థనీయం. శ్వేతచ్ఛత్రాదేర్నానస్యాధ్యసుఖహేతుత్వ మస్తి. ఉపాయాంతరేణాపి ఆతపనిరాసాదిఫలస్య సాధయితుం శక్యత్వా దితి భావః.

౬౨ ఆ మాటలు విని రామచంద్రమూర్తి లక్ష్మణునితో నిటులఁ బలికెను తమ్ముఁడా! నీవు చెప్పినదే నిజమైనచో నేనుకూడ నట్టిధర్మము నతిక్రమించినవాఁడనే కాన నీ నిందకు నేనుగూడ పాత్రుఁడను కావలసినవాఁడనే. కారణము చెప్పెదను వినుము.

౬౩-౬౪ రాజ్యమును ధరించుటకు సమర్థుఁడై యుండినవాఁడును, ప్రజారంజకుఁడు నగు మన తండ్రియగు దశరథుఁడుండఁగ పట్టాభిషేకము చేసికొనుటకు సిద్ధపడితినిగదా! ఎవఁడు తన పరాక్రమముచే రాక్షసులను జయించి దేవతలనుగూడ రక్షించెనో అట్టి మనతండ్రి భూమిని బరిపాలించలేనివాఁడా?

౬౫-౬౬-౬౭ ఆ రాముని వచనములను విని లక్ష్మణుఁడు రామునితో నిటులఁ బలికెను. అన్నా! ఇట్లయినచో నేనే తప్పుగ మాట్లాడితిని. తెలియక మాట్లాడిన నా మాటలను క్షమించి నన్ననుగ్రహింపుము. మాటల ధోరణిని నేను హద్దు నతిక్రమించి మాట్లాడితిని. క్షమింపుము. ప్రకృతము ననుసరించుదము. పర్ణశాల పూర్తియయినది. వాస్తుశాంతిగూడ చేసితిని. సీతతోఁగూడ వచ్చి గృహప్రవేశమును జేయుము.

౬౮ ఇట్లు లక్ష్మణుఁడు చెప్పుట తోడనే రామచంద్రమూర్తియును సీతా లక్ష్మణ సమేతుఁడై శీఘ్రముగ వెళ్ళి పర్ణశాలలోఁ బ్రవేశించెను.

---

క్షత్రియున కాధిపత్యఫలమేమని విచారించినచో ఛత్రచామర ద్వయముకంటె వేఱుగ నసాధారణ ఫలమేమియు గన్పడదు. ఛత్ర చామరము లాధిపత్యము లేకున్నను సులభముగ లభ్యమగును కాన, వాని నిమిత్తము ఆధిపత్యము కోరదగినది కాదు. ఛత్రచామరాదులు అనన్యసాధ్యసుఖహేతువులు కానేరవు. ఇతరోపాయములచేతను ఆతపనివారణరూపఫలము సాధింప శక్యమగునని భావము.

*తతో రామోఽభితో వీక్ష్య లక్ష్మణేన వినిర్మితామ్,
పర్ణశాలాం తు ముదితః ప్రాహేదం జానకీం వచః. ౬౯

* పర్ణశాలావిషయే కించిదత్ర విచార్యతే. తద్విషయే ద్వాపరస్తు చిరాదనేకాన్బాధతే. భద్రాచలనికటస్థితా పర్ణశాలేతి కేచన. నాసికానికటస్థితేత్యపరే సంవదంతే. ద్వయోరనయోః కా నామ సత్యభూతేత్యత్ర రామాయణవచనైస్తత్తత్స్థలశోధనైశ్చ నిర్ధారణం కరణీయమస్తి. పర్ణశాలా గోదావరీతీరవర్తినీత్యత్ర నిర్వివాద ఏవాయం విషయః. వాల్మీకివచనపరిశీలనే పర్ణశాలానికటే సీతాద్రిః, రథాద్రిః పద్మసరాంసి స్థాతవ్యానీతి సందృశ్యతే తేషాం త్రయాణాం భద్రగిరినికటస్థితపర్ణశాలాంతిక ఏవాధునాపి పరిదృశ్యమానత్వాదియమేవ పర్ణశాలేతి వక్తుం శక్యతే తథాహి (1) భద్రాచలనికటస్థిత పర్ణశాలాయా నికటే రథాద్రిః (రథగుట్ట) ఇతి వ్యవహ్రియమాణః కశ్చిదచలో వర్తతే. స ఏవాయం దశాస్యరథనిక్షేపణాద్రిరితి తత్రత్యైరధునాపి కంఠరవేణోచ్యతే (2) తత్రైవ సీతాద్రిః (సీతగుట్ట) ఇతి వ్యవహ్రియమాణః కశ్చనాన్యోఽద్రిరప్యస్తి. యస్మిన్ఖరస్య యుద్ధార్థమాగమనసమయే సీతాలక్ష్మణౌ స్థితౌ. అతఏవ తస్య సీతాద్రిః (సీతగుట్ట) ఇతి కథనమపి సంగచ్ఛతే. (3) వాల్మీకివచనపరిశీలనే పర్ణశాలా నికటే కస్యచిత్పద్మసరసోఽపి స్థాతవ్యత్వేన సందృశ్యమానత్వాదిదానీమప్యత్ర పర్ణశాలానికటే మహాం

౬౯ అనంతరము రామచంద్రమూర్తి లక్ష్మణునిచే నిర్మింపబడిన *పర్ణశాల నంతటను బరిశీలించి చూచి సంతుష్టుఁడై సీతతో నిటులఁ బలికెను.

---

* పర్ణశాల విషయమై కొంచె మిచ్చట విచారింప బడుచున్నది. ఈ విషయమైన సందేహము బహు జనులను చిర కాలమునుండి బాధించుచున్నది. పర్ణశాల యనునది భద్రాచల సమీపమున నున్న పర్ణశాలయే యని కొందరును, నాసికయొద్ద నున్నది యని మఱి కొందరును వాదించెదరు. ఈ రెండిటిలో నేది సత్యమను విషయము రామాయణవచన విషయములవలనను స్థలశోధనముల వలనను నిర్ధారణము చేయవలసియున్నది.

వాల్మీకి వచనములను పరిశీలించినచోఁ బర్ణశాల దగ్గరగ సీతగుట్ట, రథముగుట్ట, పద్మసరస్సు, అను నీ మూఁడు నుండవలసి యున్నట్లు స్పష్టమగును.

పైమూఁడును భద్రాచల సమీపమందున్న పర్ణశాలకు సమీపమున నున్నట్లు నిప్పటికిని గన్పడుచుండుటవలన నిచ్చటి పర్ణశాలయే రామాయణమునందు వర్ణితమైన పర్ణశాలయని చెప్పఁదగి యున్నది. భద్రాచల సమీపమందలి పర్ణశాలయొక్క సమీపమున నేటికిని రథగుట్టయని వ్యవహరింపబడు నొక పర్వతము కలదు. రథగుట్ట యనగా రావణునిచే తన రథమేగుట్టయందు ముంచబడెనో యాగుట్టకే రథగుట్టయని పేరు కలిగినట్లు యచ్చటివారలు చెప్పుదురు. అచ్చటనే సీతగుట్ట యనెడి యొక చిన్న పర్వతముగలదు. సీతగుట్ట యనగా, పూర్వము ఖరదూషణాదులు 14 వేల రాక్షసులతో యుద్ధము నకు వచ్చు సమయమున రామచంద్రమూర్తి సీత నేగుట్టయందలి గుహలో నుంచి లక్ష్మణునిఁ గావలియుంచి రాక్షసులతో యుద్ధము చేయ వెడలెనో యాగుట్ట సీత గుట్టయని చెప్పబడుచున్నదని చెప్పెదరు. మఱియు, వాల్మీకి వచనమును బరిశీలించినచో బర్ణశాల సమీపమునకొక పద్మసరస్సుకూడ నుండవలసియున్నట్లు కన్పడును. ఇప్పుడీ పర్ణశాల సమీపమున గొప్ప తటాకము కలదనికూడఁ జెప్పు

స్తటాకః కశ్చ నాస్తీతి తన్నికటస్థై రిదానీమపి కథ్యతే - తదే
వేద మితి వక్తుం నశక్యతే. అపిచాత్ర సీతాస్నానకుండ స్స్వర్ణ
కుండ మిత్యాద్యపి వ్యవహృతి రస్తి- కించ, అస్యాః పర్ణశాలాయా
భద్రాచలం ప్రత్యాగమనే మధ్యేమార్గం దొమ్మగూడె మితి
కశ్చన గ్రామోద్య సందృశ్యతే. రాక్షసై ర్యత్ర రామస్య
కలహః, దొమ్మీత్యాంధ్రభాషాయాం వ్యవహ్రియమాణః
సంబభూవ, తస్యైవ ప్రదేశస్య దొమ్మిగూడెమితి దొమ్మ
గూడె మితిచ వ్యవహృతి రద్యాపి ప్రచలతీతి తత్రత్యైః కంఠ
రవే ణోచ్యతే. కేచన దొమ్మగూడె మిత్యస్యార్థాంతర మేవం
వర్ణయంతిస్మ- అస్య జటాయో రగ్నిసంస్కారణప్రదేశత్వేన
తత్సంస్కారకాలీన ధూమ ప్రసార దేశత్వా ద్ధూమగూడె
మిత్యభూదితి క్రమాద్దొమ్మగూడె మిత్యధునా వ్యవహ్రియత
ఇతి ద్విధాపి తన్నామ సార్థకాఖ్య మేవ భవతీ త్యతో
ప్యేషైవ పర్ణశాలా వాల్మీకివర్ణి తేత్యపి కథయితుం శక్యతే.
ఉపరితనచిహ్నానాం నాసికానికటే త్వాపరిదృశ్యమానత్వేన
నాసికా పంచవటీతి కథనం నసంగచ్ఛత ఇతి. అన్య దపి మహా
త్కారణం పశ్యామః. యేన నాసికా పంచవటీతి కథన మవిచార
పేశలం భవేత్. తథాహి చిత్రకూటా ద్వినిర్గత్య నాసికాం ప్రతి
గమనే మార్గమధ్యే నర్మదాతపతీ నద్యా తర్తవ్యే దృశ్యేతే.
కృతం తయో స్తరణ మేభి స్త్రిభి రితి న కుత్రాపి వర్ణితం భగ
వతా వాల్మీకినా చ. తతోపి నాసికా పంచవటీ నేతి, భద్ర
గిరినికటస్థై వేతి నిర్ధార్యత ఇత్యలం విస్తరేణ.

దురు. ఆ సరోవరమే యిది యగునో కాదో చెప్పుట కాధారము కన్పడదు.

మఱియు, సీత స్నానము చేసిన గుండ మొకటి యిప్పటికి నుష్ణకుండమను పేరుతో నొప్పుచుండెను. ఇదియునుంగాక పర్ణశాలనుండి భద్రాచలమునకు వచ్చు మధ్యమార్గమున దొమ్మగూడె మను నొక గ్రామము కలదు. రాక్షసులతో నిచ్చట యుద్ధము రామునకు దొమ్మి (కలహము) కలిగినందున దొమ్మిగూడెమని, దొమ్మగూడెమని పేరు గలిగెనని చెప్పెదరు.

దొమ్మగూడె మనుపేరు వచ్చుటకు హేత్వంతరమును గొందరు చెప్పెదరు. (ఏమన) జటాయువున కగ్నిసంస్కారమును నిచ్చట యుద్ధము జరిపినప్పుడు ధూమము (పొగ) ఇచ్చట విశేషముగా వ్యాపించినందుచే నీ ప్రదేశమునకు ధూమగూడెమని పేరువచ్చిన దనియు. కాలక్రమముచే నదియే దొమ్మగూడెమని పిల్వబడుచున్న దనియు నచ్చటివారలు చెప్పెదరు. రెండువిధముల నామము సార్థకమే యగును. పై హేతువులవలన పర్ణశాల యనునది భద్రాచల సమీపమునందున్న పర్ణశాలయనియే తెలియదగినది. పైన చెప్పిన చిహ్నములు నాసిక యొద్దను లేనందున నచ్చటిది కాదనియు స్పష్టము. పర్ణశాల యచ్చటిది కాదనుటకు మఱియొక గొప్పకారణముగూడ కలదు. (ఏమన) చిత్రకూటమునుండి నాసికకు రావలయు ననిన మధ్యమార్గములో నర్మదా తపతీనదులను దాటవలయును. వీరు వానిని దాటినట్లు వాల్మీకి యెచ్చటను వర్ణించనందున నదికాదని స్పష్టము.

పశ్య ప్రేయసి సర్వతోముఖ మిదం సౌమిత్రినైపుణ్యకం,
జ్యాశబ్దేన తత స్త్వితో విచరతో జంతూ నపాస్య ద్రుతమ్
కృత్వా చాప్యవనిం సమాం దృఢతరం బద్ధ్వా చ పర్ణై ర్గృహం
కృత్వా నవ్యసుమై శ్చకార శయనం సంసిచ్య గేహం జలైః.౨౦

ప్రాహాథ వచనం సీతా పర్ణశాలా విభో ధ్రువమ్,
అధఃకరోతి సౌధాదీ న్సమృద్ధా సుమపల్లవైః. ౨౧

సౌమిత్రి స్తు తతః ఫలా న్యనుదినం త్వానీయ దత్వా తయో
స్సేవాతత్పరధీ ర్నిశాసు సధనుర్బాణ స్తు జాగర్తి సః,
స్నానార్థం తటినీం త్రిసో ప్యనుదినం గత్వా ద్రుతం తత్ర తే
స్నాత్వాగత్య నిజాశ్రమేఽధికసుఖం కాలం నయంతిస్మ తే.
౨౨

సౌమిత్రి స్తు కదాచి దేవ మవద ద్రామం తు సప్రశ్రయః,
త్వత్తోఽహం త్వపవర్గమార్గవిషయం శ్రోతుం చిరా ద్వాంఛితః
తస్మా త్త్వం వద ముక్తిమార్గ మమలం వక్తా స్తి నో త్వత్పరః
భ్రాత స్త్వం మయి శిష్యభావ మధునా విన్యస్య శీఘ్రం వద.౨౩

ఇత్యుక్తోఽవనిజాపతి స్త మవద ద్గోప్యా చ్చ గోప్యం పరం,
యద్జ్ఞాత్వా మనుజో జహాతి హృదయగ్రంథిం భ్రమం సత్వరమ్
యాఽనాత్మన్యనుజాత్మబుద్ధి రుదితా మాయాభిధా సాభవేత్
సంసార శ్చ తయైవ కల్ప్యత ఇతి త్వం విద్ధి తం మాయికమ్.
౨౪

౨౦ ఓ ప్రేయసీ! చూచితివా లక్ష్మణుని సర్వతోముఖపాండిత్యము. మొదట నిచ్చటికి వచ్చినప్పు డిచ్చట మృగములు విశేషముగ నచ్చటచ్చట సంచరించుచుండెను. వాని నన్నిటిని ధనుష్టంకారముచేతనే లక్ష్మణుఁడు పారదోలి భూమిని చదునుగ జేసి, పర్ణశాలను దృఢముగ నిర్మించి జలముచే భూమిని దడిపి పుష్పములచే శయ్యనుగూడ నేర్పరచెను.

౨౧ సీతయు రాముని వచనములను విని యిటులఁ బలికెను. ఓ నాథా! నిశ్చయముగఁ బుష్పసమృద్ధితో నొప్పుచున్న యీ పర్ణశాల యయోధ్యాపురమందలి సౌధమును గూడ మఱపించుచున్నదనియెను.

౨౨ ఇట్లు వారచ్చట సుఖముగఁ గాలము గడుపుచుండిరి. లక్ష్మణుఁడును సీతారాములకుఁ బ్రతిదినము కందమూలఫలములను దీసికొని వచ్చి యిచ్చుచు వారిసేవ చేయుచుండెను. రాత్రులయందు ధనుర్బాణములను ధరించి మేలుకొనుచుండెను. నదికి స్నానమున కేగినపుడు మువ్వురును కలిసియే వెళ్లి స్నానముచేసి తమ యాశ్రమమునకుఁ జేరుచు సుఖముగఁ గాలము గడపుచుండిరి.

౨౩ లక్ష్మణుఁడొకప్పుడు చేతులు జోడించి రామునితో నిటులఁ బలికెను. అన్నా! నీ వలన మోక్షవిషయమును దెలిసికొనఁ గోరిక యుండెను. అందుచే ముక్తిమార్గమును నా కుపదేశింపుము. నాకీ విషయము చెప్పువాఁడు నీకంటె నితరుఁడు దొరకడు. అన్నా! నీవు నాయందు శిష్యభావ ముంచి చెప్పుమని ప్రార్థించెను.

౨౪ ఇట్లు లక్ష్మణుఁ డడుగుటతోడనే "యేముక్తిమార్గమును దెలిసికొనుటవలన మానవుడు హృదయగ్రంథులను భ్రమను వదలునో, యట్టి గోప్యతమమగు ముక్తిమార్గము నిట్లు రాముఁడు చెప్పఁదొడగెను. లక్ష్మణా! అనాత్మ యందాత్మ బుద్ధి యేదికలదో యదియే మాయ యని చెప్పబడును. ఆ మాయచేతనే సంసారము కల్పితమైనది కాన సంసారము మాయిక మని తెలిసికొనుము.

జీవో దేహవిలక్షణ శ్చ సతతం జీవేశయో ర్నో భిదా
తద్విజ్ఞానసుసాధనాని మయి సద్భక్తి ర్గురో స్సేవనమ్
బాహ్యాభ్యంతరశుద్ధి కర్మనిరతీ దేహాతిరిక్తాత్మధీః
మద్భక్తే ర్విముఖస్య తత్తదఖిలం స్యా ద్దుర్లభం లక్ష్మణ. ౭౫

మద్భక్త్యా స్వయమేవ భాతి హృదయే స్వీయే పరా త్మానుజ,
మద్భక్తై రపి వచ్మి హేతునిచయం మద్భక్తసంగ స్తథా
మత్సేవా మమ నామకీర్తన మలం భక్తైః కథాయాం మమ
మత్పూజానిరతి ర్మదాశ్రితజనే భక్తి ర్విరక్తిః ఖలే. ౭౬

ఏతస్మా న్మయి భక్తి మేతి మనుజో మద్భక్తిభాజ స్తతో
వైరాగ్యం సముదేతి తేన విమలం జ్ఞానం సముత్పద్యతే
తస్మా న్ముక్తి ముపైతి ముక్తిసులభోపాయ స్స్వయం కీర్త్యతే
మద్భక్త్యా విముఖాయ జాతు భవతా వాచ్యం నయత్నా దిదమ్
శ్రూయతే దృశ్యతే యచ్చ స్మర్యతే వా నరై స్సదా
అస దేవహి తత్సర్వం యథా స్వప్నమనోరథః,
దేహ ఏవ హి సంసారవృక్షమూలం దృఢం స్మృతమ్ ౭౭-౭౯

రజ్జౌ భుజంగ వద్భ్రాంత్యా విచారే నాస్తి కించన
ఆత్మజ్ఞానే సదోద్యోగః వేదాంతార్థావలోకనమ్. ౮౦-౮౧
ఆచార్యశాస్త్రోపదేశా దైక్యజ్ఞానం యదా భవేత్,
లీయతే కార్యకరణై స్సహైవ పరమాత్మని .
ఇదం మోక్షస్వరూపం తే కథితం రఘునందన

౧౫ లక్ష్మణా! జీవుడు దేహముకంటె విలక్షణుఁడు. జీవేశ్వరులకు భేదము లేదు. తద్విజ్ఞానమునకు సాధనములను జెప్పెదను. వినుము. నాయందలి భక్తియు, గురుసేవయు, బాహ్యశుద్ధియు, నాంతరశుద్ధియు, కర్మాసక్తియు, దేహముకంటె నాత్మవిలక్షణుఁడను విజ్ఞానమని తెలియదగు. నాయందు భక్తి లేనివానికిఁ గైవల్యము దుర్లభము.

౧౬ లక్ష్మణా! నాయందు భక్తి కలిగినప్పుడు బరమాత్మ సాక్షాత్కారము హృదయగుహాయందుఁ గలుగును. నాయందు భక్తి గల్గుటకుఁ గారణములఁ జెప్పెదను. నాదు భక్తులతో స్నేహము, నాకథలయందాసక్తియు, నన్నుఁ బూజించుటయందాసక్తియు, నాయాశ్రితజనము నందనురక్తియు, ఖలులయందు విరక్తియు, (ఇవి నాయందు భక్తికి సాధనములు.)

౧౭ ఈపై సాధనములవలన మానవుడు భక్తియుక్తుఁడగును. నాయందు భక్తి గలిగిన వెంటనే వైరాగ్యముదయించును అందుచే ముక్తి నొందును. ఇది ముక్తినొందుటకు సులభోపాయము. నాయందు భక్తిలేని వానికి నీచే నెప్పుడు నిది చెప్పఁదగదు.

౧౮-౧౯ లక్ష్మణా! మనచేఁ జూడఁబడునదియు, వినబడునదియు, స్మరింపఁబడునదియు, నంతయు స్వప్నమనోరథము వలె నసత్యమని తెలిసికొనుము. సంసారమను వృక్షమునకు దేహము మూలము. త్రాడును జూచి సర్పమని భ్రాంతి చెందినట్లు భ్రాంతి జెందెదరు. విచారించినచో బ్రహ్మకంటె నితర మేదియు సత్యము కాదు.

౨౦-౨౧ లక్ష్మణా! ఆత్మజ్ఞానము నొందుటకుఁ బ్రయత్నింపవలయును. అందునకు వేదాంతపరిశీలన మవసరము. ఆచార్యశాస్త్రోపదేశములచే నైక్యజ్ఞాన మెప్పుడుదయించునో, అప్పుడు కార్యకరణసంఘములతో బరమాత్మయందు నిలీనుఁడగును. ఇదియే మోక్షస్వరూపము. సంక్షిప్తముగ నీకిది చెప్పబడినది.

ఏవం రామేణ కథితం ముక్తితత్త్వం నిశమ్య సః
పూర్వస్మా దధికం రామే భక్తియుక్తో౽భవ త్తదా. ౨౨

ఇత్యాశ్చర్య రామాయణే అరణ్యకాండే సప్తమ స్సర్గ
స్సమాప్తః.

## అష్టమ స్సర్గః

[1]ఏవం తత్ర సుఖేన సంస్థితవతాం తేషాం త్రయాణాం సతాం,
మాగా చ్ఛీతలవాతపాతవిసరో హేమంతకాల స్తదా
స్నాతుం జాతు నదీజలే రఘుపతిం గచ్ఛంతి ముద్వీక్ష్య స
సౌమిత్రి స్త మనువ్రజ న్స్వామకస్మై రార్ద్రో౽వద
దాఘవమ్. ౧

సంవత్స రసా మర్త్యతాపసర్వంకష స్తథా
సమాగతో౽యం హేమంతో దుర్బలానాం భయావహః. ౨

కల్యే సంచరణం బహి ర్హిమమయే కాలే న శక్యం ధ్రువమ్,
వాయో శ్శైత్యయుతస్య వేష్టనవశా న్నైకో౽పి సంధృశ్యతే
కిం చారణ్యకపక్షిజాత మనిలా చ్ఛీతా దభూ త్పిండవత్
భాతి స్సర్వజనా శ్చ బిభ్యతి హిమాత్కాలో హ్యయం
దుస్సహః. ౩

---

1 కవి॥

౨౨ ఆవిధముగ రామునిచేఁ జెప్పఁబడిన సూక్తి తత్త్వమును లక్ష్మణుఁడు విని పూర్వముకంటె నధికభక్తితో రాముని విషయమై మెలగు చుండెను.

అరణ్యకాండమున
సప్తమసర్గము ముగిసెను.



## అష్టమసర్గ ప్రారంభము

—∘—

౧ ఈ ప్రకారముగా నా పంచవటియందు సీతారామ లక్ష్మణులు ముగ్గురు సుఖముగ నివసించుచుండగా, చల్లని పిల్ల తెమ్మెరల సంచారములచే నొప్పారు హేమంతకాలము వచ్చెను. ఆ సమయమున నొకప్పుడు నదీ జలమున స్నానముచేయ వెడలుచున్న రామచంద్ర మూర్తి ననుగమించుచున్న లక్ష్మణుఁడు మంచుబిందువులచేఁ దడిసినవాడై యున్నలో నిటులఁబలికెను.

౨ అన్నా! ఈ హేమంతకాలము కొలకులకుఁ బ్రియకాల సమమైనదియును, (అనగా వానిలోని పద్మములను గళాహీనములనుగా జేయునదియని భావము) సూర్యుని వేడిమిని నిర్మూలించు నదియును, బలహీనులకు దుస్సహ మైనదియునై యున్నది.

౩ సోదరా! హిమమయ మగు నీ సమయమున నుదయమున జనులు బయట సంచరించుట కశక్తులుగ నుండిరి. అత్యంత శైత్యముతో గూడిన వాయువుచే దిక్కు లావరింప బడినందున నెటుజూచినను నొక్కడైనను కాన్పించుట లేదు. అదియునుంగాక, వనమునం దలి పక్షులన్నియు చలిగాలిచే ముద్దకట్టుకు పోయినట్లున్నవి. జను లందరు నీ మంచువలన మిగుల భయమును జెందెదరు. ఈ కాలము కడు దుస్సహమైనది.

చంద్రికాచంద్రశాలాసు చందనే చామరే తథా,
నిరుత్సుకా భవం త్యేవ జనా లోకే రఘూత్తమ 4

భవే త్ప్రతీకం కఠినం ప్రజానాం
స్ప్రష్టుం త్వసాధ్యం జల మద్య నూనమ్
వైశ్వానరో ప్యాప్తతమః ప్రజానామ్
కర్తుం యతంతే విబుధా *నవేష్టిమ్. 5
హిమాభిభూత స్తేజస్వీ నోదితోఽపి దివాకరః,
†ఏవం స్థితే భవే దస్య తపనాఖ్యా నిరర్థకా. 6

---

* నవేష్టిమితి—ఆగ్రయణ మిత్యర్థః. నవధాన్యే నవాగతే తత్క్షీరే పక్త్వా తద్దేవతాభ్యో నివేద్య పాపరహితా భవం తీత్యాప స్తంబో ప్యాహ. "నానిష్ట్వాగ్రయణే నాహితాగ్ని ర్నవస్య ధాన్య స్యాశ్నీయా ద్వ్రీహీణాం శ్యామాకానా మగ్రపాకస్య యజేత" ఇతి.

† హిమాభిభూతఇత్యత్ర కశ్చి ద్వ్యంగ్యార్థోపి ప్రతీయతే. వనవాస మాగతవత స్తవ చిరకాలో గతః. తథాపి రాక్షసై రవమానితః కథం తూష్ణీం తిష్ఠసి. భ్రాత స్తవ శక్తిం లోకై రస్పృష్టాం రాక్షసాః కుర్వంతి. కించ రామో రాక్షసమర్దన ఇతి సమాఖ్యాపి తే నిరర్థకా భవే దత స్తవోపేక్షా న యుక్తేతి భావః.

౪ సోదరా! లోకమందలి జనులందరు వెన్నెలల యందును, చంద్రకాంతమణి నిర్మిత సౌధములయందును, మంచి గంధము నందును, చామరములందును నుత్సాహము వీడుదురు.

౫ జనుల శరీర మీ కాలమున కఠినముగ నుండును. జలము ప్రజలకు స్పృశింప నలవిగాక యుండును. అగ్ని యాప్తతముగ నుండును. కర్మిష్ఠు లీకాలమున నూతనమైన * ఇష్టిని జేయ బ్రయత్నించెదరు.

౬ •సూర్యు డుదయించినను మంచుచే గప్పబడినందున బ్రకాశము లేనివాడయ్యెను. అట్లగుటచే సూర్యునకు గల తపను డను పేరు (తపింప జేయువాడను పేరు) నిరర్థకమగు చున్నది.

---

* నూతనేష్టి యనగా అగ్రయణ మను పేరుగల యాగ విశేషమని యర్థము. "నూతన ధాన్యము పండిరాగానే యా ధాన్యమును దంపి యా తండులమును క్షీరమున వండి యా ధాన్యాధి దేవతలకు నివేదించిన బాప విముక్తులగుదురు. అను నాపస్తంబ మహర్షి వచనముచే నాహితాగ్ని పైవిధముగా నాచరించి క్రొత్తధాన్యమును భుజింపవలయును. పై విధముగ నాచరింపక క్రొత్త ధాన్యమును భుజింపరాదు.

• ఇచ్చట నొక వ్యంగ్యార్థము గోచరించుచున్నది

సోదరా! నీ కరణ్యవాసము చాల గడచినది నీవు రాక్షసులచే నావృతుడవై యిట్లు ప్రకాశము లేకుండనుండనేల? రాక్షసులు నీ ప్రకాశము లోకవిదితము కాకుండ జేయుచుండిరి ఇట్లు నీవుండిన "రాముడు రాక్షసమర్దనుడు" అను నీనామము నిరర్థకము కాగలదు. కాన నీవిక నుపేక్షించుట తగదని భావము.

భాతి, పశ్చిమశీతవాయు రధికో వాతిస్మ హా దుస్సహో,
నీహారేణ న భాతి గాఢతమసా వ్యాప్తే యథా దిక్చయం
కిం చైషా వనపంక్తి రప్యవిమలా సుప్తేవ సందృశ్యతే
కాలేస్మిం స్త్వయి భక్తిత స్తు భరత శ్శేతే హి శీతావనౌ. ౭

తచ్ఛ్రుత్వానుజ మేవ మాహ భరతస్స్నేహాకులో రాఘవో,
భూయ స్తద్భర తేన లక్ష్మణ! కదా నూనం సమేష్యామ్యహమ్,
ప్రోక్త్వైవం త్వనుజస్స్మృతే ర్వ్యాకలహృత్స్వశ్చాదుపే త్యాపగాం,
స్నాత్వా తత్రవిధాయ తర్పణమపి ప్రాగా త్పున స్స్వాశ్రమమ్.
౮

తత్ర తే గమయంతిస్మ సుఖ మబ్దత్రయం త్రయః,
సమిదాహరణార్థం తు జాత్వగా ల్లక్ష్మణో వనమ్ ౯

సౌమిత్రి ర్యత్ర గతవాం స్తత్ర శూర్పణఖాసుతః,
సాంబో విధిం తపః కుర్వన్ స్థితో గుల్మాంతరే క్వచిత్. ౧౦

తత్రైవం వసతో౽సురస్య నికటం జా త్వాగతః పద్మభూ,
స్తత్స్వాంతాశయవి ద్రిపుక్షయకృతే తస్యాంతికే కంచన
ప్రక్షిప్యోత్తమదివ్యఖడ్గ మసురా యేదం త్వనుక్త్వా యయౌ
సాంబ స్తద్విధిద త్తఖడ్గవిషయం నో వేద యోగస్థితః. ౧౧

౭ సోదరా! సహింపరాని చలిగాలి మిక్కుటముగా వీచుచున్నది. ఎంతకష్టము! దట్టమగు చీకటిచే నావరింపఁబడినట్లు దిక్కులు మంచుచే నావరింపబడి స్పష్టముగఁ గన్పడుటలేదు.

మఱియు, వనపంక్తి నిద్రించుచున్నదో యనునట్లు స్వచ్ఛముగ గన్పించుటలేదు. ఇట్టి సహింపరాని యీ చలికాలమున నీ యందలి భక్తి విశేషముచే భరతుఁడు గూడఁ జల్లని నేలమీదఁ బరుండుచుండును గదా!

౮ అని విని రామచంద్రమూర్తి సోదరుడైన భరతునియందలి ప్రేమచే విచారపడుచు లక్ష్మణునితో నిట్లుఁ బలికెను. లక్ష్మణా! ఎన్నఁడా భరతునితో నేను గలసికొందునో కదా! యిట్లనుచు సోదర స్మృతివలనఁ గలతఁజెందిన మనస్సుకలవాఁడై కొంతసేపటికి మెల్లగ నదికిఁ జేరి స్నాన మాచరించి పితృతర్పణము మొదలగు విధుల నాచరించి పిమ్మట సీతాలక్ష్మణసమేతుడై తిరిగి తననివాసమున కేగెను.

౯ సీతా రామలక్ష్మణులు ముగ్వురును పంచవటియందు మూడు సంవత్సరములు సుఖముగ గడపిరి. ఇట్లుండ నొకానొకప్పుడు లక్ష్మణుఁ డింధనములకొఱకై వనమున కేగెను.

౧౦ లక్ష్మణుఁ డే ప్రదేశమునకు వెళ్ళెనో, యచ్చటనే శూర్పణఖా పుత్త్రుండగు సాంబుఁడను రాక్షసుడు పొదరింటిలోఁ గూర్చొని, బ్రహ్మనుగూర్చి తపముచేయుచుండెను.

౧౧ ఇట్లు పొదరింటఁ దపము చేయుచున్న రాక్షసునొద్ద కొకప్పుడు బ్రహ్మయే తెంచి వాని యాశయ మెఱిగినవాడై శత్రుసంహారకరమగు నొక ఖడ్గమును వాని సమీపముననుంచి యాసంగతి వానికేమియుఁ జెప్పకయే వెడలిపోయెను. ఆ సమయమున ధ్యానవశమున నున్న యా రాక్షసుడేమియు నెఱుగడయ్యెను.

దదర్శ ఖడ్గం తత్రత్యం సౌమిత్రిః కాననే చరన్,
తదాదాయ మహాఖడ్గం లతాగుల్మాల్పభూరుహాన్
చిచ్ఛేద లక్ష్మణ స్తత్ర గుల్మాంతస్థోఽసురో హతః. ౧౧-౧౨

గుల్మాంతరే హతం స్వేన నాంబం వీక్ష్య తు లక్ష్మణః,
బ్రహ్మహత్యాభియా యుక్త స్స్వాగ్రజాంతిక మాగతః
కథయామాస రామాయ గతవృత్తం శుచాన్వితః. ౧౩-౧౪

విచార్య మనసా సర్వం రాఘవః ప్రాహ లక్ష్మణం,
మా శోచతు భవా న్నాయం విప్రోఽభూ ద్వచ్మి కారణమ్. ౧౫

సౌమిత్రే భవతా హతోఽయ మసురో నాయం ద్విజర్షి ర్ధ్రువం,
బ్రహ్మర్షి ర్యదిచే త్తదంతికతలే ఖడ్గస్థితి ర్నోభవేత్
కశ్చి ద్రాక్షస ఏవ శత్రువిజయం కర్తుం తు తత్సాధనం
దైవా త్ప్రాప్తుమనా స్తపస్తు కురుతే దత్తం న వేద ధ్రువమ్. ౧౬

ఏవ ముక్త్వానుజం రామ స్సమాధాయ సుఖం స్థితః,
కందమూలఫలాద్యర్థం గతవా న్లక్ష్మణో వనమ్. ౧౭

౧౨ ఇట్లుండ లక్ష్మణుఁడా కాననమున తిరుగుచు నచటనున్న యా ఖడ్గమునుజూచి గ్రహించి దానితో నచ్చటి తీగెలను చిన్నచిన్న చెట్లను ఛేదించుచుండఁగా పొదలో నున్న సాంబుఁడను రాక్షసుఁడు కూడ హతుఁడయ్యెను.

౧౩-౧౪ పిమ్మట లక్ష్మణుఁడు పొదలమధ్య తనచేఁ జంపబడిన యా సాంబునిఁజూచి బ్రహ్మర్షి యొవఁడో తనచేఁ జంపబడెననియు, అందుచే బ్రహ్మహత్యాదోషము సంభవించెననియు, భయముగల వాఁడై తనయన్న యగు శ్రీరామచంద్రుని సన్నిధికేగి జరిగిన వృత్తాంతము నంతయు విచారపూర్వకముగఁ జెప్పెను.

౧౫ లక్ష్మణుఁడు చెప్పిన విషయము నంతను శ్రీరామచంద్రమూర్తియు మనమునందు విచారించి, లక్ష్మణునితో నిటులఁజెప్పెను. లక్ష్మణా! ఇతఁడు బ్రాహ్మణుడై యుండఁడు. కారణము చెప్పెదను. నీవు దుఃఖింపకుము.

౧౬ లక్ష్మణా! నీచేఁ జంపఁబడిన యతఁడు రాక్షసుఁడుకాని బ్రహ్మర్షి నిక్కముగఁ గాఁడనుటకుఁ గారణ మేమన గా నతఁడు బ్రహ్మర్షియే యైనచో నతని సమీపమున ఖడ్గముండదు. ఎవఁడో యొక రాక్షసుఁడు శత్రుజయమునకై తత్సాధనము నెద్దేవునివలననో సంపాదింపఁ గోరి తపముచేయుచుండ నద్దైవ మతనికిఁ దెలియకుండఁగ నొక ఖడ్గము నచ్చటనుంచి యుండగా, నా ఖడ్గవిషయము నతఁడు గుర్తెఱుఁగక యుండియుండెను. ఇది నిశ్చయము.

౧౭ ఈవిధముగ రాముఁడు తమ్ముని నోదార్చి సుఖముగనుండెను. పిమ్మట నొక సమయమునఁ గందమూలఫలాదులఁ దెచ్చుటకై లక్ష్మణుఁడు వనమున కేగెను.

యయా భ్రాత్రా హతభర్తృకా దశముఖే నాద్యాపి లోకోత్తరం,
భర్తృత్వేన న పూరుషం క్షితితలే చిన్వంత్యుపైతుం క్షమా
సైషా శూర్పణఖాత్మజం నరహతం శ్రుత్వా శుచా నిర్గతా
చిన్వంతీ సుతహంతకం తు తటినీతీరం క్రమా దాగతా. ౧౮

తత్రైవం విచరంతీ సా కంజాంకుశముఖాంకితాన్
రామపాదాం స్తు పశ్యంతీ సైకతే హ్యా ద్యచింతయత్ ౧౯
అత్ర కశ్చిన్మహాం స్తిష్ఠే త్పూరుష స్తం వృణో మ్యహమ్
సంచింత్యైవం కామరూపం సద్యో ధృత్వా వినిర్గతా. ౨౦

విస్మృత్య పుత్రదుఃఖం చ విచిన్వంతీ చ తన్నరమ్
క్రమా ద్రామాశ్రమం ప్రాప్య తత్రత్యం లోకసుందరమ్
కోటికందర్పసంకాశం జటావల్కలధారిణమ్
పద్మపత్రవిశాలాక్షం రాజలక్షణ లక్షితమ్
దృష్ట్వా శూర్పణఖా రామం వివశా కామమోహితా
ఉవాచ వచనం త్వేవం దశాననసహోదరీ. ౨౧-౨౨-౨౩

క స్త్వం కేయ మహో సుదుర్గమవనం కిం న్వాగతో స్యేతయా
కస్మా త్త్వం సముపాగతోసి చ పునః కుత్ర వ్రజే స్త్వం త్వితః
ప్రాజ్ఞ బ్రూహి యథాతథం త్వితి తయా పృష్టో మహీజాపతి
స్స్వీయం వృత్త మథానుపూర్వికతయా ప్రాహాఖిలం తాం ప్రతి.
౨౪

౧౮ ఇంతలో తనయన్నయగు రావణాసురునిచేఁ జంపబడిన భర్తగలది యును, తదాదిగ లోకోత్తరుఁడగు పురుషుని భర్తనుగాఁబొందగోరి లోకమునంతయు వెదకినను బొందలేనిదియు నగు శూర్పణఖ తన కుమారుఁడొక మానవునిచేఁ జంపబడినట్లు విని దుఃఖముచే దన కుమారునిఁజంపిన యా మనుజుని వెదకుచుఁ గ్రమముగ గోదావరీ నదీతీరమునకు వచ్చెను.

౧౯ ఆ నదీతీరమునఁ దిరుగుచున్న యా శూర్పణఖ పద్మాంకుశాదిరేఖలచే నొప్పుచున్న శ్రీరాముని యడుగులజాడల నా యిసుకతిన్నెల యందుఁజూచి తన మనమునం దిట్లు చింతించెను.

౨౦ ఇచ్చట నొక మహాపురుషుఁ డుండి తీరును. నేనీ మహాపురుషు నెట్లయినను వరించెదనని యోజించి, తత్క్షణమే కామరూపమును ధరించి బయలుదేరెను.

౨౧-౨౨-౨౩ పుత్రదుఃఖమునుగూడ మఱచి, యప్పురుషశ్రేష్ఠు నరయుచుఁ గ్రమముగా శూర్పణఖ రామాశ్రమమును జేరి, యయ్యాశ్రమము నందు నివసించినవాఁడును, సకల లోకసుందరుఁడును, కోటిమన్మథ సమానుఁడును, జటాచీరధారియును, పుండరీకాక్షుఁడును, రాజలక్షణలక్షితుఁడును నగు, రామునిఁజూచి కామమోహితయై, తన యధీనము తప్పిన మనస్సుగలదై శ్రీరామునితో నిట్లు పలికెను

౨౪ ఓ సుధీమణీ! నీ వెవ్వడవు? ఈమె యెవ్వతె? ఈమెతోఁగూడ నీవిచటి కేలవచ్చితివి? ఎచ్చటనుండి నీరాక? ఇటనుండి మరల నెచ్చటికిఁ బోయెదవు? నీవు యథార్థము చెప్పుమన శ్రీరామ చంద్రుఁడు తన వృత్తాంతమునంతయు నామూలాగ్రముగ నామెకుఁ జెప్పెను.

ఉక్త్వైవ మాత్మనో వృత్తం రాఘవ స్తాం నిశాచరీమ్
ప్రాహేదం వచనం భద్రే! నిజవృత్తం వదాద్య మే
ఇత్యుక్త్వా కథయామాస రామం ప్రతి నిశాచరీ. ౨౫॥

శ్రోతవ్యం మమ వృత్త మార్య భవతా సద్వంశజాహం ధ్రువం,
కాచి ద్రాజసహోదరీ సమభవం జ్ఞాత్వా భవేయం క్రమా
ద్దృష్ట్వా త్వా మిహ సుందరం తవ వశే స్థాతుం మనో మేఽభవ,
న్నాథ! త్వం మమ కామనాం తు సఫలాం కృత్వా ప్రసన్నో భవ. ౨౬॥

*మద్వంశ్యా నఖిలా న్వేత్తు నూనం పుణ్యజనా న్భవాన్,
సహోదరా స్త్రయ స్సంతి మమ తేవిభవో బుధాః. ౨౭॥

•తే ష్వాద్యో మితవిక్రమో బుధనుతో విద్యుత్ప్రభు స్సంయుగే,
జిత్వా లోకపతీ సహా స్త్వవిభవ స్సంశోభతే మానితః,
అన్య స్తత్సమ ఏవ కింతు న బహి స్త్వాయాతి నిద్రావశ
స్తార్తీయీకసహోదరస్తు నితరాం ధర్మేఽనురక్త స్సదా. ౨౮॥

---

* వ్యా—శ్లేషార్థోఽప్యత్ర గ్రాహ్యః - పుణ్యజనాన్ - రాక్షసా నిత్యర్థోప గ్రాహ్యః - తేవిభవోబుధా ఇత్యత్రాపి తేఽవిభవః, అబుధాః ఇతి చ్ఛేదే తే త్రయః (అవిభవః) త్వత్పురత స్త్వసమర్థాః, (అబుధాః) అజ్ఞానినః అథవా దేవశత్రవః, ఇత్యర్థోఽవగమ్యతే.

• వ్యా—విశేషార్థః- ఆద్యోమితక్రమ ఇత్యత్ర ఆద్యః అమితవిక్రమ ఇతి, ఆద్యః మితవిక్రమ ఇతి ద్విధా ఛేదః కార్యః.

౨౫ ఇట్లు తన వృత్తాంతమునంతయు నామెకుఁ జెప్పి, శ్రీరామచంద్రమూర్తియు నిప్పుడు నీ వృత్తాంతమునుగూడ దాపక చెప్పుమని యా శూర్పణఖ నడుగ నామె యీ క్రిందివిధముగఁ దన వృత్తాంతమునుఁ జెప్పఁదొడగెను.

౨౬ ఓ పూజ్యుఁడా! నా వృత్తాంతమును వినుము. నేనొకమంచి కులమున జన్మించిన దానను.

ఒకానొక రాక్షసునకు సహోదరిని క్రమముగ నా సంగతి నంతయు నీవు తెలిసికొనగలవు. లోకసుందరుఁడవగు నిన్ను దానవఁ జూచినప్పటినుండియు నీ యందనవనమునఁ దుందుటకు నాకుఁ గోరిక పుట్టినది. నాకు కోరికను సఫలము జేసినన్ననుగ్రహింపుము.

౨౭ మఱియు, నా సంబంధులందరును * పుణ్యజనులేయని తెలిసికొనుము. ఇంకను ప్రభువులును, పండితులు నగు ముగ్గురు సోదరులు నా కుండిరి.

౨౮ • ఆ ముగ్గురిలో మొదటవాఁడు అమితపరాక్రమము గలవాఁడును బుధులచే గౌరవింపఁబడువాఁడును, విశ్రవప్రభువును, మఱియు యుద్ధమున లోకపాలురనుగూడ జయించి విశేషఖ్యాతిను గాంచినవాఁడునై యుండెను. రెండవవాఁడు నన్నిట నతనికిఁ జీనిపోవని వాఁడేకాని నిద్రావశుఁడై యున్నందును బయల్పడలేదు. ఇక మూఁడవ సోదరుఁడు ధర్మాత్ముఁడై యుండును.

* పుణ్యజనులేయని తెలిసికొనుమనునప్పుడు రాక్షసులనుగా దెలిసికొనుమను శ్లేషార్థము గ్రాహ్యము. ఇట్లే (తేవిధవోఽబుధాః) అను స్థలమునందును (తే, అవిధవః, అబుధాః) అని పదవిభాగము చేసిన (తే) నా సోదరులు (అవిధవః) నీకంటె వైశ్వర్యవిహీనులును (అబుధాః) మూర్ఖులునని, లేక దేవశత్రువులని యర్థము గ్రాహ్యము.

• మూలములోని శ్లేషార్థము వివరింపబడుచున్నది. (అన్యమితవిక్రమః) అనుచోటున అద్యః మితవిక్రమః, అని పదవిభాగము చేసిన మిత పరాక్రమము గలవాఁడనియు, (విక్రమోబుధమతేః) అన్నప్పుడు

సాపత్న్యస్సోదరో ప్యస్తి రాజరాజో ధనాధిపః
ధనదో విబుధా స్తు శ్చ భిన్నభావేన నో స్థితః. ౨౯

రాజ్య మేకం మమాప్యస్తి బహవ స్సంతి సేవకాః
చతుర్దశసహస్రాణి సైనికా శ్చ స్థితా మమ
క్రమా త్సర్వం చ విదితం భవితా తే నరోత్తమ
ఇతోధికం వివిచ్యా ద్య వక్తుం సాపత్రపం మనః
ఏతాదృగ్బంధుసంబంధం మా విముంచతు వై భవాన్.
30-31-32

అనురూపవరాలాభా న్నచోఢాహం పున ర్విభో,
హేత్వంతరా ది హాయూతా ధన్యాహం తవ దర్శనాత్. 33

ఏతాదృశగుణోపేతా కామరూపా శ్రియాన్వితా
కులీనా సత్వసంపన్నా తవాహం సదృశీ విభో!
మమానురూపోపి భవాం స్తేఽనురూపా ధ్రువం త్వహమ్. 34

కందర్పకోటిసదృశస్య తవేయ మార్య
యోగ్యా భవే న్నహి కురూపయుతా కుజాతా,
యోగ్యాహ మేవ పురుషోత్తమ తే ధ్రువం త్వ
మహార్య మిమా మధిప మాం గృహిణీం గృహాణ. 35

---

తత్రైవ విక్రమోబుధనుత ఇత్యాత్రాపి అబుధనుతః, బుధనుతఇతి చ పదచ్ఛేదః కార్యః. ఏవం నుతోవిద్వత్ప్రభు రిత్యత్రాపి, అవిద్వత్ప్రభు రితి, విద్వత్ప్రభు రితి పదచ్ఛేదః కార్యః.

౨౯½ మఱియు, నాకొక సవతిసోదరుఁడు గలఁడు. అతఁడు రాజరాజు. ధనాధిపతి. ధనదుఁడు. దేవతలకు మిగుల నాప్తుఁడు. భేదభావముతో మా విషయమై యుండువాఁడు కాఁడు.

౩౦-౩౧-౩౨ మఱియు, నాకొక రాజ్యము గలదు. అనేకులు సేవకులు గలరు. ఇంతియే కాక పదునాలుగు వేలసైనికులును గలరు. ఓ మానవోత్తమా! క్రమముగ నిదంతయు నీకుఁ దెలియఁగలదు. ఇంతకుఁ బైని వివరించి యధికముగఁ జెప్పుటకు నా మనము లజ్జపడుచున్నది. ఇక నిట్టి యున్నతమైన సంబంధ బాంధవ్యమును విడిచిపెట్టుకొనకుము.

౩౩ ఓ ప్రభువరా! అనురూపుఁడగు వరుఁడు లభింపమి వలన నేనింతవరకు వివాహము చేసికొని యుండలేదు. నే నిప్పుడు కొండొక కారణమున నిచ్చటకు వచ్చి మీదర్శనము చేయుటచే ధన్యాత్మురాల నైతిని.

౩౪½ రాజ్యసంపద, సైనికసంపద, బంధుసంపద మొదలగు లక్షణములతోఁ గూడిన దానను, కామరూపిణియు, శ్రీమంతురాలను, గొప్పబలము గలదానను, గొప్పవంశమునందుఁ బుట్టినదాన నగు నేను నీకుఁ దగి యుంటిని, నీవును నాకుఁ దగియుంటివి. (మన యిద్దరికి దాంపత్యము బాగుండు నని భావము.)

౩౫½ ఓ పూజ్యుఁడా! కోటి మన్మథులను సమానుఁడవగు నీకు, ఈ కుజాతయు (కుత్సిత జన్మము గలదియు) ఈ కురూపిణియు నగు నీమె తగినది కాదు. ఓ పురుషోత్తమా! నిజముగ నేనే నీకుఁ దగినదానను. నీకు దగిన నన్ను భార్యనుగా గ్రహింపుము. (కుజాత యన భూమిలోఁ బుట్టినదనియు నర్థము గ్రాహ్యము.)

---

(విక్రమః, అబుధైర్నుతః) అని పదమును విభజించిన బుధులచే గాని యాడఁబడువాఁడు; కానివాఁడనియు, (మతో విద్వత్ప్రభుః) అనునప్పుడు (మతః అవిద్వత్ప్రభుః) అని విభాగింప మూర్ఖ ప్రభువనియు, శ్లేషార్థము స్ఫురించును.

తచ్ఛ్రుత్వా ప్రహసన్ ప్రాహ రామ శ్శూర్పణఖాం ప్రతి,
తవాయం వ్యసనాయోఽయం ప్రార్థనీయో హి మద్విధైః. ౩౬

సౌందర్యస్య విమర్శనే తవ భవ త్యభ్యర్థనీయా మయా,
రమే నాభ్యర్థనయోగ్యతా తు న భవే త్తన్నా స్త్యవద్యం త్వయి
*కింతు బ్రహ్మపదార్థినో మమ పునః పిత్రాద్యనుజ్ఞా వశా,
ద్దారార్థం విధినాగ్నిసాక్షికమసా వూఢా వ్యభూ ద్బంధవత్

ఏవంస్థితే బంధకీ త్వం బంధకీ న భవే కథమ్,
యత్రకుత్రాపి గచ్ఛ త్వం నిర్బంధేన న తే ఫలమ్. ౩౭

---

బ్రహ్మపదమితి. పద్యతే గమ్యత ఇతి వ్యుత్పత్త్యా సకల విద్యాస్థానప్రతిపాద్యం పదశబ్దే నాభిధీయతే.

యద్వా, జన్మాద్యస్య యత ఇత్యనేన న్యాయేన జగదుత్పత్తిస్థాన మితి వా పదశబ్దార్థః యద్యపి బ్రహ్మణ స్స్వప్రకాశత్వేన, నిర్వికారత్వేన చ విద్యాస్థానగమ్యత్వం జగదుత్పత్త్యాదికారణత్వం వా పారమార్థికం నాస్తి. తథా ప్యుపనిష దర్థవిచారజన్యజ్ఞానస్య బ్రహ్మనిష్ఠత్వా దారంభాధికరణ న్యాయేన జగతో బ్రహ్మవివర్తత్వాభ్యుపగమా చ్చ తద్వ్యవహారో ఘటతే.

౩౬౪ ఆనవిని శ్రీరామచంద్రమూర్తి చిరునగవుతో శూర్పణఖను గూర్చి యిట్లు బలికెను. నీదు ప్రయత్నము మాబోంట్లకును కోరదగినదే.

౩౭౪ నీ యందలి చందములను విచారించిన నీవు మాచేఁ గోరదగిన దానవు. అట్లు కోరకుండుటకుఁ దగిన యవద్యత్వము (దోషము) నీయందేమియు గన్పడదు. కాని *బ్రహ్మపదమును గోరు నాకు నాదుజననీజనకుల గురువుల యానతిచే నగ్నిసాక్షిగా ధర్మార్థమై వివాహముచేసికొనఁబడిన యీమెయే నాకొక బంధముగా నుండెను (ఇట్టి స్థితిలో నితరుల పొత్తు విషయమై వేఱు చెప్పన దేమి యని భావము)

౩౮౪ ధర్మము కొఱకై యగ్నిసాక్షిగ పరిణీతయైన సీత విషయమే యిట్లుండ స్వతః కులబయగు నీవెట్లు నాకు బంధకముగా కుందువు? నీ చెలికైన నీయున్న వచ్చిన తావునకుఁ బొమ్ము. బలవంతపరచినను నీ కేమియు ఫలముకలుగదు.

---

* బ్రహ్మపద మనుచోట విమర్శనము.

పదమనగా పొందబడునది యని యర్థము. (అనగా సకల విద్యలచేఁ బ్రతిపాదింపఁబడునది) కాన పదమని చెప్పబడుచున్నదని తెలియఁగను. లేక, "జన్మాద్యస్య యతః" అను వ్యాససూత్రాను సారముగ సకల జగదుత్పత్తి స్థితిలయ కారణమని యర్థము గ్రహింపనగు. బాగుగ విచారించినచో బ్రహ్మపదార్థము స్వతఃప్రకాశమానము. సర్వవికారశూన్యము నగుటచే సకలవిద్యలచేఁ బ్రతిపాదింపబడునది యని కాని, సకల జగదుత్పత్తి స్థితిలయకారణమైన దని కాని వాస్తవికముగఁ జెప్ప వలనుపడదు. కాని, ఉపనిషద్వ్యాఖ్యాతల చేత సర్వోత్కృష్టమైన యేబోధ యుదయించునో, అయ్యదియే బ్రహ్మప్రాప్తిక ముఖ్యసాధన మగుటచేతను, ఆరంభాధికరణము ననుసరించియు, సమస్తజగత్తును బ్రహ్మపరిణామ మని యంగీకరించుటచే బ్రహ్మవస్తువు సకల విద్యాప్రతిపాద్యమని కాని, సకల జగదుత్పత్తిస్థాన మని కాని వ్యవహరింపబడుట కనుపపత్తి యేమియు లేదు.

ప్రపంచోఽయం బాధార్హః, దృశ్యత్వాచ్ఛుక్తి రజతవదిత్యనుమానేన ఆత్మాతిరిక్తస్య సర్వస్య శేషప్రపంచస్య మిథ్యాత్వాత్ ఆత్మనశ్చ స్వప్రకాశత్వేనదృశ్యత్వాభావాచ్చ సత్యజ్ఞానరూపత్వం సుఖరూపత్వం చ,తస్య సుఖ మహ మస్వాప్స మితి సుప్తోత్థితస్యసుఖానుభవపరామర్శ స్యాన్యథానుపపత్త్యా వేద్యమ్.

బంధకమితి—నచ వివాహస్య మోక్షపరిపంథిత్వం. తస్యాభావే మోక్షాసిద్ధేః. తథాచ మనునోక్తం "ఋణాని త్రీణ్యపాకృత్య మనో మోక్షే నివేశయేత్, అనపాకృత్య మోక్షే తు సేవమానో పతత్యధః, అధీత్య విధివ ద్వేదా న్పుత్రానుత్పాద్య ధర్మతః, ఇష్ట్వాచ శక్తితో యజ్ఞై ర్మనో మోక్షే నివేశయేత్, అనధీత్య ద్విజో వేదా ననుత్పాద్య తథాత్మజాన్ అనిష్ట్వా చైవ యజ్ఞైస్తు మోక్ష మిచ్ఛ న్వ్రజ త్యధః" ఇతి కించ "ఆశ్రమా దాశ్రమం గచ్ఛేత్" ఇత్యాదినా, "గురవేతు వరం దత్వా స్నాయీత తదనుజ్ఞయా, వేదవ్రతాని వా పారం నీత్వా హ్యుభయ మేవవా, అవిప్లుతబ్రహ్మచర్యో లక్షణ్యాం స్త్రియ ముద్వహేత్" ఇత్యాదినా చ విహితత్వాద్వివాహ స్యావశ్యకర్తవ్యత్వం. మోక్షార్థినా ధర్మానుష్ఠానం కర్తవ్య మేవ. జీవనం నిమిత్తీకృత్య విహితానాం నైమిత్తికానామగ్నిహోత్రాదీనా మకామనయా కృతానాం దర్శపూర్ణమాసాదీనాం చోపాత్తదురితక్షయాంతఃకరణశుద్ధ్యాది సమర్పణద్వారేణ మోక్షశేషత్వాత్.

ఈ ప్రపంచ మంతయు నశించునది-దృశ్యమగుటవలన-ముత్తెపు చిప్పయందలి రజతబుద్ధివలె-ననియెడి యనుమానముచేఁ బరమాత్మాతిరిక్తమగు సర్వప్రపంచకము కల్లయై యున్నది.

ఆత్మ స్వయంప్రకాశమానమైన దగుటచేఁ గనులకు గోచరింపనిది యగుటవలనను సత్యజ్ఞానరూపత్వమును, నిద్రించి మేల్కాంచిన పురుషునకు "నేను సుఖముగ నిద్రించితి" నను ప్రత్యభిజ్ఞ పొడముచున్నది గనుక సుఖరూపత్వమును, ఆత్మకు లభించుచున్నది, అని తెలిసికొనదగును.

బంధమునకెనున్నది యనుదాని విమర్శనము - వివాహము లేక మోక్షమే సిద్ధింపకుండుటవలన వివాహమెన్నఁడును మోక్షమునకు విరోధి కానేరదు. మోక్షవిరోధి కాదనుటలో మను వీక్రిందివిధముగ జెప్పెను. "ఋషిఋణమును, పితౄణమును, దేవఋణమును తీర్చి మోక్షవిషయమున మనస్సును బ్రవేశపెట్టుము ఈ మూడు ఋణములనుండి ముక్తుడుకాక యెవడు మోక్షమార్గమును సేవించునో, వాడసంపతితు డగుచున్నాడు. వేదాధ్యయనము చేయకయు, పుత్రులను గనకయు, యజ్ఞములను జేయకయు మోక్షమును గోరువాడు పతితుఁ డగును, అదియునుంగాక, ఒక యాశ్రమమునుండి మఱియొక యాశ్రమమునకు బోవలయును. మఱియు, సాంగ వేదాధ్యయనముచేసి గురుదక్షిణ నొసంగి వారియాజ్ఞను బడసి స్నాతకవ్రతము నాచరింపవలయును. వేదవ్రతములను సాంగముగ నాచరించికాని వేదములను వేదవ్రతములను రెంటిని బూర్తిచేసికాని బ్రహ్మచర్యాశ్రమము గడపి శుభలక్షణములుగల కన్యకను వివాహ మాడవలయును" ఇట్లు మనువుచే విహితమగుటవలన వివాహ మవశ్యము చేసికొనదగినదియై యున్నది. మోక్షమును గోరువారంతయను విధిగ ధర్మానుష్ఠానమును జేయవలసినదే. జీవనమును నిమిత్తముగా జేసికొని విహితములయిన నైమిత్తికములగు నగ్నిహోత్రాదికర్మలు, దర్శపూర్ణమాసాదిశ్రౌతకర్మలును, పాపక్షయద్వారా చిత్తశుద్ధిజనకములగుటచే మోక్షాంగములయినవి.

బాలే! కథ మహం జహ్యా మిమాద్య క్స్వభాగ్యశాలినీం
మహాకుల ప్రసూతాం చ సీతాం సన్నిహితా మిమాం. ౩౯

నిసర్గతోఽహ మభవ మేకపత్నీవ్రతాన్వితః
తస్మా న్మమ త్వత్స్వీకరణం నయుక్త మితి భాతి మే. ౪౦
*విద్ధి మాం జానకీజాని మస్యా మే త్వం తు నక్షమా
సుష్ఠు మాం పరిశీల్య త్వ మన్యతో గంతు మర్హసి. ౪౧
తచ్ఛ్రుత్వా వచనం ప్రాహ రామం శూర్పణఖా తతః
నైవం వాచ్యం త్వయా రామ వశం త్యక్త్వైవ తే విభో! ౪౨
పాదా వుపచరిష్యామి త్వయాఽనుజ్ఞా ప్రదీయతామ్
నైవ మంగీకరోషి త్వం యది త్యక్ష్యామి జీవితమ్. ౪౨-౪౩

---

న చానూఢభార్య స్యాగ్నిహోత్రాదికర్మానుష్ఠానం సంభవతి. తస్యాగ్న్యాధానానర్హత్వే నాఽనగ్నికత్వాత్. తస్మాద్ధర్మానుష్ఠానశేషత్వే నాపి పరిణయన మవశ్యం కర్తవ్య మేవ. అనేనప్రకారేణాక్షరపదప్రాప్త్యనుకూలాఽపి సీతాబంధా యభవిష్యతీతి యస్య మహతీ శంకా తస్య కథ మన్యాంగనాపరిగ్రహ స్స్యాత్. విశేష తోఽరణ్యమధ్యే సహసా దృశ్యమానాయా అవిదితకులనామధేయాయా స్స్వైరిణ్యా స్తవ పరిగ్రహణేఽత్యంత మధర్మాయ భవిష్యతీత్యాశయ ఇతి వేద్యం.

* పరమార్థ స్తు దుష్టశిక్షణ శిష్టపరిపాలనార్థం దశరథాత్మజ రూపేణావతీర్ణస్య రాక్షససంహారకస్య విష్ణోర్మమ న హి రాక్షసీవరణం యుక్త మితి భావః.

౩౯॥ ఓ బాలికా! గొప్పవంశమున జన్మించినదియును, యిట్టి సౌందర్యశాలినియు, సన్నిహితయు నగు నీ సీతను నేనెట్లు వదలుదు నను కొంటివి!

౪౦॥ మఱియు, నేను స్వభావముచేతనే యేకపత్నీవ్రతస్థుడను, కావున నీవు నన్ను వరించుట మిగుల నయుక్త విషయము.

౪౧॥ నన్ను జానకీపతినిగాఁ దెలిసికొనుము. అందువలనను నీవు నాకుఁ దగవు. * నన్ను బాగుగఁ దెలిసికొని వేఱొండు దేశమున కేగుము.

౪౨-౪౩॥ ఇట్లు శ్రీరామచంద్రమూర్తి పలుకగా విని శూర్పణఖ శ్రీరామునితో నిట్టులఁ బలికెను. ఓ శ్రీరామచంద్రా! ఈ విధముగఁ బలుకుట నీకుఁ దగదు. నే నిచ్చటనే యుండి నాథుఁడవగు నీపాదముల సేవించెదను. అనుజ్ఞ నిమ్ము. ఈ నాదు దాస్యమును గూడ నీ వంగీకరింపవిచో జీవితమును నే నిచ్చటనే వదలుకును.

---

మఱియు, వివాహితుఁడు కన్యాదానమునందు దర్శిత లేకపోవుటచే ననగ్నికుఁ డగుటవలన నగ్నిహోత్రాది కర్మానుష్ఠానము పొసఁగదు. కాన ధర్మానుష్ఠానాంగముగ వివాహము తప్పనిసరియైనదగును. పైవిధముగఁ బరమపవిత్రుఁడై కనుకూలమైన దైనను సీతయే బంగము గాగలదను గొప్పసంశయముగల శ్రీరామచంద్రుని కెట్లు పరస్త్రీపరిగ్రహణము సంభవించును! అంతియేకాక యరణ్యమధ్యమందు ఏకాకికముగఁ గన్పించిన తెలియబడని కులగోత్రములు గలిగి స్వేచ్ఛాసంచారిణి యగు నిన్నుఁ బరిగ్రహించుట మిక్కిలి యనర్థము కాగలదని యభిప్రాయమని తెలియదగును.

* నన్ను బాగుగా దెలిసికొనుము దాని విశేషార్థము. దుష్టులను శిక్షించుటకును, శిష్టులను రక్షించుటకును దశరథపుత్రుఁడనై యవతరించిన రాక్షససంహారకుఁడ నగు నన్ను నీవు వరించుట తగదని తాత్పర్యము.

ఇత్యుక్తో రాఘవః ప్రాహ వచ శ్శూర్పణఖా మిదం
నైవం భవత్యా కార్యం హి మద్వచ శ్శృణు సాదరం ౨౪॥

భార్యా తిష్ఠతి మేఽంతికే సుదతి తే సాపత్న్యదుఃఖం భవే
ద్భ్రాతా మే తరుణోఽతి సుందరతను ర్బాహ్యే స్థితో లక్ష్మణః.
త్వత్కార్యం సఫలం భవిష్యతి లఘు త్వం గచ్ఛ తస్యాంతికం
యోగ్య స్తే సతు విప్రియుక్త సుదతీయోగ స్తత స్త్వం వ్రజ.
౨౫॥

తచ్ఛ్రుత్వా రాఘవం ప్రాహ తత శ్శూర్పణఖా వచః
భవద్వశా న కిం కుర్యా మహం యామి త్వదాజ్ఞయా. ౨౬॥

భవదాజ్ఞాం తు సౌమిత్రిః పాలయే ద్యది రాఘవ
సంతోష ఏవ హి భవే న్నో చేదాయా మ్యహం పునః. ౨౭॥

ఇత్యుక్త్వా తదనుజ్ఞాం తు ప్రాప్య శూర్పణఖా తతః
సౌమిత్రే రంతికం ప్రాప వనా దాగచ్ఛతో ద్రుతం. ౨౮॥

ఇత్యాశ్చర్య రామాయణే అరణ్యకాండే
అష్టమస్సర్గ స్సమాప్తః.

---

అస్మిన్సర్గే చోత్తరత్ర చ తత్ర తత్ర శక్తిభద్రాశయాః త ద్వ్యాఖ్యానవచాంసి గృహీత్వా నీతివేద్యమ్.

౪౪½ ఇట్లన విని శ్రీరామచంద్రమూర్తి "నీ విటుల నాచరింపవలదు-నామాటల నాదరముతో వినుమ"ని శూర్పణఖతో ననెను.

౪౫½ ఓ సుందరీ! నాకు సమీపమున భార్య గలదు. నీవు సవతివలని దుఃఖము కలుగగలదు. నా సోదరుఁడగు లక్ష్మణుఁడును నా వలె యువకుఁడును, మిగుల నందమైనవాఁడునై యున్నాడు. అతఁడు వెలుపల నున్నవాఁడు. నీవు శీఘ్రముగ వాని సమీపమున కేగుము. నీ కార్యము ఫలవంతము కాగలదు. అతఁడు నీకుఁ దగినవాడు. అతని భార్యకూడ దూరస్థురాలయి యున్నది. కాన వానినిఁ బొందుము.

౪౬ ఇదంతయు శూర్పణఖ విని శ్రీరామచంద్రునితో నిటులఁ బలికెను. రామచంద్రా! నేను నీ యధీనురాలనైయున్నాను. కాన నీయాజ్ఞానుసారముగ నటులనే చేయుదును.

౪౭ రామచంద్రా! నీ తమ్ముఁడగు లక్ష్మణుఁడు నీయాజ్ఞను బరిపాలించిన సంతసమే. లేకుండిన నేను తిరిగి నీ సమీపమునకే వచ్చెదను.

౪౮ ఇట్లు పలికి శూర్పణఖ శ్రీరామచంద్రుని యాజ్ఞానుసారముగ బయలుదేరెను. ఇంతలో లక్ష్మణుఁడు శీఘ్రముగ నరణ్యమునుండి వచ్చుచుండ నతని కెదురుగ శూర్పణఖ వెడలుచుండెను.

అరణ్యకాండమున నెనిమిదవ సర్గము

సమాప్తము.

---

# నవమస్సర్గః



తత స్సాంతిక మాయాంతీం సౌమిత్రిః కామరూపిణీం,
దృష్ట్వా శూర్పణఖాం చిత్తే చింతయామాస నైకధా.

స్త్రీరత్నస్య విలాసినో మృదుతనో రస్యాబ్జపత్రాక్షిణా,
స్స్వర్గో వా వసతి ర్మహీతల మిదం న జ్ఞాయతే ధామ కిం,
ఏవం తు క్షణమాత్ర మాసురమహామాయాప్రభావా త్తత
రూప ప్రేక్షణజన్యవిస్మయవశః పశ్చా త్స్మృతిం ప్రాప సః. ౨

శాంతం పాప మయం విచారవిషయో దాసస్య మే నోచితః,
పిత్రో ర్వాక్య మనుష్ఠితుం రఘుపతేః ప్రాప్తస్య చైత ద్వనమ్,
సంచిం త్యైవ మథాపరత్ర గమనోద్యుక్తం సుమిత్రాసుతం,
స్వాస్యేక్షావిముఖం ప్రజం త్యను తదా సా రాక్షసీచాప్యభూత్. 3

పరావృత్య ముఖం పశ్చా, దాగచ్ఛంతీం నిశాచరీం,
దృష్ట్వా స్వమానసతలే, చింతయామాస లక్ష్మణః. ౪
*తపస్విధర్మా న్పశ్యంతీ మమాంతిక మియం వధూః,
సమీక్ష్య తాపి సావజ్ఞ మే త్యస్యా శ్చరితం త్వహో. ౫

---

* తపస్వినా మితి - తపస్వినాం తపస ఏవ పరమ
ధనత్వేన పరమప్రేమాస్పదత్వేన చ కళత్రాదివిషయాభి
లాషాభావా త్తదాచారానువిధాయినో మమాపి తదభావః

## నవమసర్గప్రారంభము.



౧ అనంతరము లక్ష్మణుఁడు తనసమీపమునకు వచ్చుచున్న కామరూపిణి యగు శూర్పణఖను జూచి తనమనమునందుఁ బలువిధములుగఁ జింతించెను.

౨ వెలఁదుల మిన్నయును, విలాసినియును, సుందరశరీరముగలదియును, పద్మములఁబోలు నేత్రములుగలదియును, నగు నీ యువతి స్వర్గలోకవాసినియా! లేక భూలోకవాసినియా! తెలిసికొనలేకుండ నుంటిని, అని లక్ష్మణుఁడు ఉణకాలము రాక్షసమాయా ప్రభావముచేఁ బొందబడిన యాశ్చర్యకరమైన యీ రూపమునుఁ జూచుటవలన గలిగిన విస్మయమునకు వశుఁడై పిమ్మట స్మృతిగలిగి యీ క్రిందివిధముగఁ దలంచెను.

౩ నా పాప ముపశమించుగాక. తల్లిదండ్రుల యాజ్ఞను నెరవేర్చుటకై యీ యరణ్యమున కేతెంచిన శ్రీరామచంద్రునకు దాసుఁడనగు నాకీ యాలోచన కూడదు. అని చింతించి తనను జూచుటకుఁగూడ విముఖుఁడై మఱియొకచోటు కేగుచున్న లక్ష్మణుని రక్కసియగు శూర్పణఖ వెంబడించెను.

౪ తన వెనుక వెంబడించి వచ్చుచున్న రాక్షసిని లక్ష్మణుఁడు ముఖము వెనుకకు మరల్చిచూచి యిట్లు చింతించెను.

౫ * తాపసవేషమును తాపసధర్మములను జూచియు, నాచే నవమానపూర్వకముగఁ జూడఁబడియుఁగూడ నా సమీపమునకు వచ్చుచున్న యీ స్త్రీయొక్క ప్రవర్తన మిక్కిలి యాశ్చర్యజనకముగ నున్నది.

---

* తాపసులనగా తపస్సే ధనముగాఁగల జనులని యర్థము. కానఁ దపస్సే వారలకు పరమధనమును, పరమప్రేమాస్పదమునై యుండుట వలనఁ గళత్రాది విషయాభిలాష యుండదు. కాన తద్ధర్మములతో నున్న నాకును కళత్రాది విషయాభిలాష లేనట్లు ప్రకటిత మగు

ఆత్మచిత్తవిమోహాయ యతం త్వాఽఽత్మవిచేష్టితైః
అనయా భాషణం చాపి భంజకం నియమస్య మే. ౬

ఇత్యాలోచ్య వ్రజంతం త మనుస్మృత్యాహ సా పునః,
'వాచా ప్యనభినంద్యార్య సహి ధర్మ్యా గతి స్తవ,
లోకవృత్తానుసృత్యాపి దేయం ప్రతివచ స్త్వయా,
* కిం చోపేక్ష్యా న తే యుక్తా స్త్రీజనే శరణాగతే,
శ్రూయతే హి రిపు శ్చాపి నోపేక్ష్య శ్శరణాగతః,
ఏవం స్థితే సదాచారే కిం పునః స్త్రీజనోఽగతిః. ౭-౮-౯

---

ప్రకాశ్యతే. ధర్మాన్నిత్యేనేన యమనియమాదీన్ తదంగభూత త్రికాలస్నానాదీన్ తపశ్చరణచిహ్నభూతా న్జటావల్కలాదీనపి పశ్యంత్యా అస్యాః మదంతికాగమన మననురూపం భవేత్. తథాపి మనోహరవేషాభరణ మాత్మపతి మివైవంభూతం మాం పరిత్యాగమన మనురాగప్రకాశనం చాత్యంతవిరుద్ధం. తథాపి నిందాగర్భమీక్షితాపి మదంతికాగమన మతీ వానుచిత మితి భావః.

* శరణాగత ఇతి—అత్రాత్మీయవ్యసన మనుక్త్వా శరణాగతేతి కథనం తదీయదురాశయ మేవం భూత మావేదయతి. ప్రథమత ఏవాహ మేతంప్ర త్యనంగపరితాపరూప మాత్మీయం వ్యసన మావేదయేయం, తతో రాగరహిత స్యాప్యుపేక్షా మయి భవేత్. శరణాగతేత్యభిహితే తేన "క స్తే వ్యసన

౬ ఈమె తన విలాస చేష్టలచే నామనస్సును మోహపఱచుటకై ప్రయత్నించుచున్నట్లుండెను కాన నీమెతో సంభాషించుటకూడ నా నియమమునకు భంగము కాగలదు.

౭-౮-౯ ఇట్లాలోచించి, వెడలిపోవుచున్న లక్ష్మణుని శూర్పణఖ వెంబడించుచు నతనితో నిట్లనెను. ఓ పూజ్యుడా! నీ నిమిత్తమై వచ్చుచున్న నన్ను మాటలచేనైన సంభావింపకుండ నీవిట్టుల వెడలుట ధర్మము కాదు. లోకయాత్ర ననుసరించియైన నామాటకుఁ బ్రత్యుత్తర మీయఁదగియున్నది. అదియుంగాక, స్త్రీజనము * శరణుపొందగా నిట్లుపేక్షించుట నీకుఁ దగినది కాదు. శత్రువైనను శరణు పొందిన నుపేక్షింపఁ గూడదని పెద్దలు చెప్పుచుందురు. సదాచార మట్లుండె దిక్కులేని స్త్రీవిషయమై చెప్పవలసిన దేమియుండును?

---

చున్నదని భావము. తాపసధర్మములనగా యమము, నియమము, మొదలగునవియు, వాని కంగములైన త్రికాలస్నానము మొదలయినవని తెలియదగు. సారాంశమేమన తపశ్చర్యకు చిహ్నములైన జటావల్కలాదులను ధరించుచున్నదియై యీ స్త్రీ నా సమీపమునకు వచ్చుటయే యుక్తముగాలేదు. అందునను మనోహరములైన వస్త్రలను, ఆభరణములను ధరించిన నిజభర్తను వలె నిర్భయముగ నన్నను సరించుటయు, నందునను తన యనురాగమును ప్రకటించుటయు మిగుల విరుద్ధమైనది. అంతియేకాక, నాచే నిందాగర్భముగఁ జూడఁబడియు నా సమీపమున కేతెంచుట మిక్కిలి యనుచితమని భావము.

*శరణుపొందగా ననుగాని వివరణము – ఇచ్చట మొదట శూర్పణఖ తన సంకల్పమును బయల్పఱుపక శరణుపొందితినని చెప్పుట యారాక్షసియొక్క మర్మవ్యసనమునుఁ దెలియఁజేయుచున్నది. (ఎట్లన) నేను ముందుగనే వానితో నా వ్యసనమునుగూర్చి తెల్పితినేని యనురాగమే లేని యీతనికి నాయందు నుపేక్షయే కలుగును. కావున నేను శరణుబొందితి నన నతఁడే స్వయముగ నీ చింతయేమి! యని యడు

గురో ర్భయాచ్చ భవతా నోపేక్ష్యాఽహం నరోత్తమ
రాఘవాజ్ఞావశా దాగా మహం తు భవదంతికమ్. ౧౩

తచ్ఛ్రుత్వా లక్ష్మణ స్స్వాంతే ఖేద మేవం గతోఽభవత్
భ్రాంత్యాహం కథ ముద్యుక్త స్త్యక్తుం రాఘవశాసనమ్
విచార్యైవం తతః ప్రాహ సౌమిత్రి స్తాం నిశాచరీం. ౧౦౪

భద్రే! కి మాజ్ఞాపితవా న్త్వ మార్య స్సత్వరం వద
ఇత్యుక్తా సా శూర్పణఖా ప్రాహైవం లక్ష్మణం వచః ౧౧౪

*భవతః పరిచర్యార్థ మప్పృచ్ఛం త్వద్గురుం త్వహమ్
మయా సహాత్మన స్సేవాం భ్రాతా తవ నియుక్తవాన్. ౧౬

---

విశేష ఇతి స్వయ మేవ పృచ్ఛేత్. తదా మదీయవ్యసనం దూరీ
కర్తుం భవా నేవ సమర్థః, రక్షిష్యా మీ త్యుక్తే వదామీ
త్యుచ్యతే. తత స్త్వాత్మనోఽ సామర్థ్యభియా య ద్యయం
కరిష్యా మీతి ప్రతిజానీతే, తదా మద్వ్యసన మావేదయేయం.
సత్యప్రతిజ్ఞాభంగభియా త్వనిచ్ఛ న్నపి మాం పరిగ్రహిష్యతీ
త్యాలోచ్య శరణాగత ఇతి కథన మితి వేద్యమ్.

*అత్రాయ మాశయః - జాయాత్వేన మే గ్రహణం
నియుక్తవా నిత్యుక్తే మమ స్వీకృతిం భ్రాతృపాదసేవావిరోధినీం
మత్వా మా ముపేక్షే తాతోఽభిలాషో భవత్పరిచర్యా
మాత్రే పర్యవసిత ఇత్యుక్తం. సోపి గుర్వాజ్ఞావిషయ ఇతి

౦ ఓ పురుషశ్రేష్ఠా! పెద్దలవలని భయమువలన నన్ను నీవు పేక్షింపవలదు సుమా! నేను శ్రీరాముని యాజ్ఞను బొందియే నీ సమీపమునకు వచ్చితిని.

౧౦½ ఆమాట విని లక్ష్మణుఁడు- ఎట్లు? నేను శ్రీరాముని యానతిని గూడ భాగింపచే నుపేక్షించుచుంటినే? అని మనమున విచారపడ సాగెను. ఇవ్విధముగ విచారపడి పిమ్మట లక్ష్మణుఁడు రక్కసితో నిట్లు పలికెను.

౧౧½ ఓ మంగళప్రదురాలా! పూజ్యుఁడగు శ్రీరాముఁడు నన్నుగూర్చి యేమి చెప్పెనో వెంటనే చెప్పుము. అనగా నా శూర్పణఖ లక్ష్మణునితో నిట్లు పలికెను.

౧౨ * నేను నీయొక్క సేవ చేయుటకై నీగురువగు శ్రీరాముని యానతిని గోరనతఁడు నాతోగూడ నిన్నుఁ దన సేవను జేయవలసినదిగా నాజ్ఞాపించెను.

---

నును. అప్పుడు నా చింతను బాప నీవే సమర్థుఁడవు రక్షించెదనని నచో నా వ్యసనముఁ జెప్పుదును. అని చెప్పవచ్చును. అనంతరమున నతఁడు తానసమర్థుఁడని లోకమునఁ దన కపకీర్తి వచ్చునను భయముచేఁ దప్పక చేసెదనని ప్రతిజ్ఞ చేసినచో నప్పుడు నా యభిలాషమును బ్రకటనఁ జేయుదును. అప్పు డతఁడు సత్యవాక్పరిపాలనముగలవాఁ డగుటచే, సత్యప్రతిజ్ఞాభంగభయముచేత తనకుఁ గోరిక లేకున్నను నన్నుఁ బరిగ్రహించునని యాలోచించి శరణుబొందితి నని చెప్పినదిగాఁ దెలిసికొనదగును.

*ఇచ్చటి విశేషాశయము- నన్ను భార్యనుగా గ్రహింపుమని రాముఁ డాజ్ఞాపించెనని చెప్పినచో, నన్ను భార్యనుగా గ్రహించుట తన సోదర సేవకుఁ బ్రతిబంధకమని తలంచి నన్నుఁ బరిగ్రహించుటయే మానును. తాన నిన్ను సేవించుటయే నా తలంపని చెప్పబడినది. అట్టి పరిచర్యయు, గుర్వాజ్ఞావిషయమని చెప్పబడుచున్నది. ఈ విధ

తచ్ఛ్రుత్వా వచనం తస్యా స్త్వభిలాషం నిషేధయన్
సౌమిత్రిః ప్రాహ వచనం హేతుమత్తాం నిశాచరీం. ౧౩

*స్వర్లోకే వసితుం క్షమా హి భవతీ నిత్యం వనేఽహం స్థితః
కించ స్థండిలశా య్యహం తు భవతీ తల్పేతు శేతుం క్షమా,
త్వం తు స్వాదుపయోఘృతౌదనపరా వన్యేన జీవా మ్యహం
వేత్తుం చాత్మహితం క్షమా న భవతీ ముగ్ధే! న తేఽహం క్షమః

---

నివేద్యతే. అనే నాఽవకాశేన లబ్ధసన్నిధి రహం క్రమా త్వాన్ధ యేయ మభిలషిత మిత్యనేన దురాశయేన స్వాభిమతవిషయత్వేన గుర్వాజ్ఞానివేదనం న కృతం. తథాచోక్తం. "యస్య యస్య హి యో భావ స్తేన తేన పరివిశ్యతమ్, స్వయం తద్భావసంయుక్తః క్షిప్ర మాత్మవశం నయేత్, ఇతి. అయ మత్ర నిష్కర్షః. పూర్వమే వాత్మపరిచరణేసహాయాంతరాభావేనపరిఖిన్నశ్చరణాగతాంమా మిమామవేక్ష్య దయార్ద్రమానసస్స న్నేవం విజ్ఞాపితవాన్. హే సౌమిత్రే! భవతా పరిచరణే నియమనివర్తనే చ సాహాయ్యా యైషా గృహ్యతా, మే తేన శ్రేయోద్వయం భవితా. యదస్యా అనాథాయా స్సనాథత్వం, యచ్చ భవత స్సాహాయ్యలాభః. ఇతి మద్వచనా దుచ్యతా మిత్యర్థో మయా సహేత్యనేన సూచితః.

*ముగ్ధే, ఇత్యనేన సౌందర్యాది గుణసంపదా సురలోకవాసిజనార్హయా భవత్యా నిత్యంవనే స్థితోఽహం కథమనురాగభాజనస్స్యామితి భావః. యది వనేపి భోగయోగ్యవిభవ

౧౩ ఆ మాటను విని యా మెయొక్క యభిలాషను నిషేధించుచు లక్ష్మణుఁడు యుక్తియుక్తముగ దక్క సియగు శూర్పణఖతో నిట్లుపలికెను.

౧౪ నీవు స్వర్గలోకమున నివసింపఁదగిన దానవు. నే నెల్లప్పుడు నరణ్యములో నుండువాఁడను. మఱియు, నేను నిత్యము వట్టి నేలమీఁద నే పరుండువాఁడను. నీవు హంసతూలికా శయ్యయందుఁ బవళింపఁదగిన దానవు. నీవు మధుర పదార్థములను భుజింపఁదగిన దానవు. నేనారణ్యక వస్తువులచే జీవయాత్రఁ గడుపుచున్న వాఁడను, * మాధురాలా! నీ హితమునుఁగూడ నీవు తెలిసికొనలేకుంటివి. నేను నీకుఁ దగినవాఁడను గాను.

---

మున సాన్నిధ్యమును సంపాదింప మెల్ల మెల్లగాఁ దనకోరికను నెరవేర్చుకొనియెద నను దుస్స్వభావముచేత నిట్లు చెప్పఁబడినది.

"ఎవరి కెవరికి నే నేమి భావముండునో" ఆ యా భావముతో వానిఁజేరి తానుగూడ నాభావముతోఁగూడికొన్నదిగ వానిఁ దన స్వాధీన పఱునట్లుగఁ జేసికొనవలయును" అని యుండెను. ఇది వరకే లక్ష్మణుఁడు తనకుఁ జేయు పరిచర్యలయందు లక్ష్మణునకు సహాయ మెవరును లేక పోవుటచేఁ గష్టము తోనున్న శ్రీరాముఁడు శరణుపొందిన నన్నుఁజూచి మిక్కిలి దయగలిగిన మనస్సుగలవాఁడై "ఓ లక్ష్మణా! నాకుఁ బరిచర్యచేయుటలో నీ కీమె తోడుగా నుండును. ఈమెను నీవు గ్రహింపుము. అట్లు గ్రహించుటచే రెండు శ్రేయస్సులు నీవు లభింపగలవు (అవియేవనగా) భర్తృహీనురాలగు నీమెకు భర్త గలుగుట యొకటియు, నీకు సాయము లభించుట రెండవదియు, అని నామాటగాఁ జెప్పుమని రాముని యానతి యని "నాతోఁగూడ" అను దానిచే సూచింపఁబడినది.

* మాధురాలా! అను దాని వివరణము- సౌందర్యాది గుణములచే స్వర్గలోక నివాసులగు జనులకుఁ దగియుండిన నీ కెల్లప్పుడు నరణ్యమున నివసించు నే నెట్లనురాగపాత్రుఁడ నగుదునని భావము. అరణ్యమునందైనను భోగముల ననుభవించుట కనువగు సంపత్తు కలిగి

కించ రామస్య దాసోహం త్వం తు దాసీ భవిష్యసి,
నహి దాసీపదం యోగ్యం కులీనాయాః స్త్రియః పునః. ౧౫

సంత్యన్యాన్యపి కారణాని బహునా కిం వచ్మి సారం శృణు,
కామః కుత్ర తప స్తు కుత్ర సుదతి స్యాద్బద్ధవైర స్తయోః,
తద్వ్రాత్రాశ్రవణంచ తాపసజనా దూరం విముంచం త్వలం,
సాక్షాత్కర్తు మహం యతేయ సుభగే తద్ధర్మయుక్తః కథమ్. ౧౬

---

సంపన్నో భవేయం తదా వనవాసోపి నాత్యంతం దోషమావహేత్ తదపి నేతి. కించ స్థండిలశాయ్యహ మిత్యాదినోచ్యత ఇతి వేద్యం. అనేన నిర్మలస్వాదుక్షీరాన్నాద్యుపభోగసముచితాయా భవత్యా స్తత్తాదృగ్విభవసంపన్నో లోకోత్తరగుణశాలీ పురుష శ్రేష్ఠ ఏవ ప్రేమపాత్రం భవతీతి వ్యతిరేకో వ్యజ్యతే.

నను యస్మి న్ననురాగో విద్యతే స పరిగ్రాహ్యః. ఉత్ప న్నశ్చ మమ త్వద్గోచరోఽనురాగః. స హ్యనురాగోత్పత్తి ర్బహి రుపాధీ నపేక్షతే. తథోక్తం - "నఖలు బహి రుపాధీ న్ప్రీతయ స్సంశ్రయంతే" ఇత్యాశంకాయాం న తేహం క్షమ ఇత్యుచ్యతే. అంతరార్థ స్తు-అహం విష్ణురూప శ్రీరామ భక్త త్వే నాత్యంతపావనః, శున్యా ఆదోళికారోహణాహాం భితవ ద్విష్ణుభక్త వరణం దుష్కులీనాయా స్తవ న యుక్త మితి భావః.

౧౫ మఱియు, నేను శ్రీరామునకు దాసుఁడను. నన్ను నీవు వరించిన నీవు దాసివి కాఁగలవు. కులీనురాలగు స్త్రీ కెన్నడును దాసీపదవి తగినది కాదు.

౧౬ ఇంతియే కాక, ఇతరకారణము లనేకములుగలవు. అధికముగఁ జెప్పి యేమి లాభము? సారాంశమును జెప్పుచున్నాను వినుము. కామమెక్కడ! తపస్సెక్కడ! ఈరెంటికిని బద్ధవిరోధము. తపస్సనందాసక్తులగు వారలు కామవార్తల వినుటను గూడ దూరముగఁ ద్యజింపుచున్నారు. ఓ సుందరి! అట్టి తాపసవర్త్మావలంబి యగు నేను నీవు చెప్పినటుల నెట్లుచేయ యత్నింపుదును?

---

యుండినచో నప్పుడు వనవాసముకూడ నధికమగు దోషము కాదు గదా! యను నాశంక కలుగు నని నేను పట్టి నేలమీదఁ బరుండు వాఁడ నను దానిచే నదియును లేదని చెప్పుచున్నాఁడు. ఇట్లు చెప్పుటచే మధుర పదార్థములను భుజించుట మొదలగువాని కనువగు నీకు మహా వైభవములతో నొప్పువాఁడును, లోకాతీత గుణుఁడునగు పురుషుఁడే ప్రేమపాత్రుఁ డగునుకాని నేను ప్రేమపాత్రుఁడను గానని యు వ్యంగ్యమగుచున్నది. మఱియు "నెవనియం దనురాగముండునో వాఁడే గ్రహింపఁదగినవాఁడు" అను న్యాయముచే నీయం దనురాగ ముదయించెను, అను రాగ మెన్నడును బాహ్యము నపేక్షించి యుండదు. అట్లే పెద్దలచేఁ జెప్పఁబడినది. "ప్రేమయెన్నడును బాహ్యోపాధుల నపేక్షింపదు" అను నాశంకకు సమాధానముగా నేను నీకుఁ దగినవాఁడను గానని చెప్పఁబడినది. నేను నీకుఁ దగనను దాని యంతరార్థ మేమనగా— నేను విష్ణుస్వరూపుఁడగు శ్రీరాముని భక్తుఁడగుటచే మిగులఁ బవిత్రుఁడను. ఇట్టి విష్ణుభక్తుని నీవు వరించుట శునకము అందోళికను (పాలకీని) నెక్కుటకుఁ గోరినటుల దుష్కులీనురాలవగు నీవు నన్ను వరించుట కూడనిపని యని భావము.

తత శ్శూర్పణఖా వాక్యం ప్రాహేదం లక్ష్మణం ప్రతి,
యదుక్తం భవతా వాక్యం సత్యమారతయా స్థితమ్,
*భ్రాతా తే భార్యయాసాకం వనే౽స్మి న్వసతిస్మ యత్,
తచ్ఛ్రుత్వా వచనం ప్రాహ సౌమిత్రి స్తా మిదం వచః. ౧౭-౧౮

చతుర్దశాబ్దా న్మునిధర్మచారీ వనే నివాసం త్విహ మాచరేయం,
ఇతి ప్రతిజ్ఞా గురుసన్నిధానే భ్రాత్రా సమక్షే చ సతాం కృతా హి. ౧౯

కృత్వా ప్రతిజ్ఞాపరిపూర్తి మార్యో,
దృష్ట్వా జనన్యా స్సహసోదరాంశ్చ,
తతో౽ర్థకామా పరిసేవితుం తు,
యతేత తావ న్న హి సేవతే తౌ. ౨౦

ఉపేక్ష్య కామం సతతం చ ధర్మే,
రతో౽య మాసీ ద్యది జాయయా కిమ్,
ఇతి త్వయా౽౽క్షేపణ ముచ్యతే చే,
త్తస్యా ప్యహం కారణ మద్య వచ్మి. ౨౧

*భ్రాతా తే భార్యయా సాక మిత్య స్యాయ మాశయః- యోగుకునియోగ మంగీకృత్య తపస్విధర్మ మాచరతి సో౽ప్యార్యః ధర్మాధర్మవిచారవా నపి స్వభార్యయా సహ రమమాణ ఏవ వర్తతే. గుర్వాజ్ఞాం వినా భ్రాతృస్నేహా దేవ వనం గతస్య తే మత్పరిగ్రహేణ తపోవిరోధ శ్శంకితుం న శక్య ఇతి భావః.

౧౭-౧౮ * పిమ్మట శూర్పణఖ లక్ష్మణునితో నిట్లుఁ బలికెను. లక్ష్మణా! నీవు చెప్పినమాట లన్నియు సత్యదూరములుగా నున్నవి. (ఏలనన) నీ యన్నయగు శ్రీరాముఁడు భార్యతో గూడియే యీయరణ్యమున నివసించెను గదా! అను శూర్పణఖావాక్యములను లక్ష్మణుఁడు విని యారక్కసితో నిట్లుఁ బలికెను.

౧౯ నా యన్నయగు శ్రీరాముఁడు, దశరథుఁడు, వసిష్ఠుఁడు మొదలగువారి సాన్నిధ్యమునను, మునిధర్మముల నాచరించుచు నరణ్యమందు నేను పదునాలుగు సంవత్సరములు నివసించెదనని ప్రతిజ్ఞ చేసెను.

౨౦ అట్టి ప్రతిజ్ఞ పూర్తియైనపిమ్మట పూజ్యుఁడగు మా యన్న, తల్లులను, సోదరులను, హితులను జూచిన పిమ్మట నర్థకామములను సేవించును. అంతదనుక యర్థకామములను సేవింపడు. మోక్ష ధర్మములను మాత్రమే సేవించును. (భార్యతోఁ గూడియుండియుఁ గామమునందు మనస్సును పోరనీయఁడని భావము)

౨౧ శ్రీరాముఁడు కామము నుపేక్షించి యెల్లప్పుడు ధర్మమునందేయాసక్తుఁడైయుండినచో భార్యతో నేమిపని యనియంటివేని కారణమును జెప్పెదను వినుము.

---

* నీ యన్నయగు శ్రీరాముఁడు భార్యతోఁగూడ నుండెను గదా యను దాని తాత్పర్య మేమనగా—

ఎవరు తండ్రియగు దశరథుని యాజ్ఞానుసారము తాపసధర్మముల నాచరించుచుండెనో, అట్టి ధర్మాధర్మ విచారశీలుఁడగు రాముఁడే భార్యతోఁగూడఁ గ్రీడించుచు సంచరించుచుండెను. గురుజనాజ్ఞ యేమియు లేక సోదరప్రేమచే నరణ్యమున కేతెంచిన నీవు నన్ను గ్రహించుటచేఁ దపోభంగమగు నని శంకించుట నీకుఁ దగదని (తాత్పర్యము.)

* పతివ్రతాయాః పతిసేవనా తు,
ధర్మో న హీతి శ్రుతయో వదంతి,
జాయాపతిభ్యాం సతతం హి కార్యం,
సహైవ కర్మేతి విధి శ్చ సంస్థః. ౨౨
వినాపి కామం భార్యాయా యుక్తా భర్తృంతికే స్థితిః,
తస్మాదహం యత్కరోమి సాపి తత్కురు తేఽత్రహి. ౨౩

తచ్ఛ్రుత్వా వచనం ప్రాహ సంప్రాప్తాఽవసరా చ సా,
నిమేషణేన సౌమిత్రి మాత్మసాత్కర్తు మానసా. ౨౪
ప్రజావతీ యథా భ్రాతు స్స్వాం కర్తుం సమీహితా,
నిరపేక్షా సతీ కామే కేవలం ధర్మ మాశ్రితా,
తథాఽనపేక్ష్య కామం తు కేవలం ధర్మతత్పరా,
పరిచర్యాం కరిష్యామి తవ మా స్త్వత్ర సంశయః. ౨౫-౨౬

---

* పతివ్రతేతి "బాలా త్ప్రభృతి యా నారీ కర్మణా మనసా గిరా, పతివ్రతా భవే న్నిత్యం యావ దాయు స్సమాహితా, సా భర్తృలోకా నాప్నోతి యథైవా ఽరుంధతీ, తథా నాస్తి స్త్రీణాం పృథగ్ధర్మో న వ్రతం నా ప్యుపోషణం, శుశ్రూషతే యద్భర్తారం తేన స్వర్గే మహీయతే" ఇతి స్మృతేః భార్యా భర్తృసమీపే కామానుభవం వినాపి స్థాత వ్యేతి ద్యోత్యతే, పతివ్రతాయాః పతిపరిచరణస్యైవ పరమధర్మత్వాత్. కించ, తయో స్సహైవ ధర్మానుష్ఠానస్య విహితత్వా చ్చ సీతాయాః వినాపి కామానుభవం రామాంతే సంస్థితి ర్యుక్తైవేతి భావః.

౨౨ పతివ్రతయగు స్త్రీకిఁ దనభర్తను సేవించుటకంటె మఱియొక ధర్మము లేదని శ్రుతులు చెప్పుచున్నవి. కర్మ యెప్పుడును దంపతు లిద్దఱును గలసియే చేయవలయు ననియు విధిగలదు.

౨౩ కామాభిరుచి లేకయు భర్తృసన్నిధి నునికి భార్యకుఁ దగినది కాన నేను పరిచర్య చేసినటులనే సీతకూడ నిష్కాముకురాలై రాముని పరిచర్య చేయుచున్నట్లు తెలిసికొనుము.

౨౪ ఇట్లు లక్ష్మణుఁడు చెప్పగా విని శూర్పణఖ పొందఁబడిన యవకాశము గలదియై పరిచర్యచేతనే తానుగూడ లక్ష్మణుని వశము జేసికొన వలయు నను నూహతో నతనితో నిట్లు పలికెను.

౨౫-౨౬ లక్ష్మణా! సీతయెట్లు నీ యన్నయైన శ్రీరాముని నేకామము లేక కేవల ధర్మబుద్ధితో సేవించుచుండెనో, యటులనే నేను గామాభిలాషను వీడి ధర్మాసక్తితోడనే నిన్ను సేవించుచుందును. ఈవిషయమునం దేమాత్రము సంశయింపవలదు.

---

*పతివ్రత యనుదానికి వివరణము.

“ఏ స్త్రీ తనతండ్రిచే దానముచేయఁబడినది మొదలు మనోవాక్కాయ కర్మలచే నెల్లప్పుడును పతికి హితమును గోరుచుండునో, యామె యరుంధతివలె భర్తృలోకమును బొందుననియు, మఱియు “స్త్రీకి బ్రత్యేకముగా ధర్మముగాని, వ్రతముగాని, యుపవాసముగాని వేఱుగ లేదు. భర్తృశుశ్రూషచేతనే యామె స్వర్గలోకమునఁ బూజ్యురాలై యుండగలదు” అను మొదలగు స్మృతివాక్యములచే భార్య కామాభిలాష లేకపోయినను భర్తృసాన్నిధ్యమున నుండఁదగిన దని తెలియఁబడుచున్నది. పతివ్రతయగు స్త్రీకిఁ బతిసేవయే పరమ ధర్మము. దంపతు లిద్దఱును గలసియే ధర్మము నాచరించుట విధివిహితమగుటచేఁ గామపరతంత్రురాలు కాకయే సతి రాముని సన్నిధి నుండుట తగినదేయని భావము.

నను పరిచరణం తపోధనానాం న భవతి ధర్మవిరుద్ధ మార్య! లోకే,
త దగతికమిమం జనం త్వ మద్య, ప్రముదితవ్యా త్తవ సేవనే
గృహాణ. ౨౭

తచ్ఛ్రుత్వా ప్రాహ వచనం సౌమిత్రి స్తాం నిశాచరీం,
అహో తవేదం ముగ్ధత్వం యేన దాస్యం సమీహసే. ౨౮

లోక స్సర్వోపి యతతే యస్య దాస్యస్య నిష్కృతేః,
*భవతీ స్వయమే వాహో దాస్యం త దభివాంఛతి. ౨౯

†యది స్నేహో భవే న్నాస్తి విచారో గుణదోషయోః
కిం భేదస్య ప్రయోగేన దాస్యం చ తవ మే హితమ్. ౩౦

ఇత్యుక్త్వాఽనుసరంతీం తాం దృష్ట్వా నిర్విణ్ణమానసః
స్వమానసతలే త్వేవం చింతయామాస లక్ష్మణః. ౩౧

* అత్రాయ మాశయః- దైవా దుపేతస్య యస్య దాస్యస్య ప్రతిక్రియాం కర్తుం సర్వోపి జనో యతతే, భవతీ తు తాదృశస్య ప్రతిక్రియార్థం న యతతే. కింతు స్వయమేవ త దిచ్ఛసి. తవ మాఢ్య మాశ్చర్యకర మితి భావః.

† యదిస్నేహఇతి - యది స్నేహో భవతి గుణదోషవిచారో నాస్త్యేవ. తథా చోక్తం. పరివ్రాట్కాముకశునా మేకస్యాం ప్రముదాతనౌ, కుణపః, కామినీ, భక్ష్యా, ఇతి తిస్రో వికల్పనాః ఇతి.

౨౭ ఓ పూజ్యుఁడా! లోకములో తపోధనులగు మహాత్ములకుఁ బరిచర్య చేయుట ధర్మవిరుద్ధమైనది కాదు. ఆ కారణమున నిరపర దిక్కులేని నన్ను నీ పరిచర్యకైనను బరిగ్రహింపుము.

౨౮ ఇట్లనఁగా విని లక్ష్మణుఁడు శూర్పణఖతో నిట్లు పలికెను. నీవు దాస్యమును గోరుచుంటివే అహా! ఏమి నీ వెఱ్ఱితనము!

౨౯ *లోకములోఁ బ్రతిమనుష్యుఁడు నే దాస్యమును దొలగింపఁ జేసికొనుటకై ప్రయత్నించునో, యట్టి దాస్యమును నీవు స్వయముగఁ గోరుచున్నావు. ఎంత యాశ్చర్యము.

౩౦ పిమ్మట శూర్పణఖ లక్ష్మణునితోఁ నిట్లు పలికెను. లక్ష్మణా! •ఎచ్చట స్నేహ మంకురించునో, యచ్చట గుణదోషవిమర్శన మెవ్వనికిని నుండదు. కనుక నీ భేద ప్రయోగమువలన నేమియుఁ బ్రయోజనము లేదు. నాకు నీ దాస్యమే హితమైనది.

౩౧ ఇట్లు పలికి మాటాడక వెళ్ళుచున్న తన ననుసరించి వచ్చుచున్న శూర్పణఖను జూచి లక్ష్మణుఁడు నివ్వెఱపోయిన! మనస్సుగలవాఁడై తన మనమున నిట్లు చింతించెను.

---

* దైవవశమున సంప్రాప్తమైన యే దాస్యమునుఁ దొలగించుకొనుటకై లోకులందరు ప్రయత్నించుచుందురో, ఆ దాస్యమును దొలగించుకొనుటకుఁ బ్రయత్నింపక పోగా, నీవిపుడు స్వయముగ నా దాస్యమును గోరుచుండుట మిగుల నాశ్చర్యమును గొలుపుచున్నది యని తాత్పర్యము.

• ఎచ్చట స్నేహమంకురించునో యను దాని వివరణము—స్నేహము కలిగినచో గుణదోష విచార ముండదు. అటులనే చెప్పబడినది. ఒక స్త్రీ శరీరమునందే యనేకము లగు వికల్పములు కలుగుచున్నవి. (ఎట్లన) సన్యాసికి శవమనియుఁ, గామకునకుఁ గామినియనియు, శునకమునకు భక్షింపదగిన వస్తువనియు (వికల్పములు గలుగునని)

అసంభాష్య వ్రజంతం మా మనయా త్యధునా ప్రియం
సామదానే నీచజనే విఫలే హి న సంశయః
దండోపాయః స్త్రీజనే తు నోచితః ఖల్విమా మహాం
కేనోపాయేన సుదతీం వినివర్తయితుం క్షమః. ౩౨

సింహవ్యాఘ్రవరాహకాసరముఖై ర్దుష్టై ర్మృగై స్సేవితం
కించారణ్యక పూరుషై రపి సుదుశ్శక్యం ప్రవేష్టుం వనం
త్వేకాకి న్యబలా కథం హ్యుపగతా సర్వాంగసుందర్యసౌ
నిర్భీకా విచర త్యహో! మమ పున స్త్వేషా పరీక్షాస్పదం. ౩౩

ప్రేషయిష్యా మ్యహం భూయ స్త్వేతాం సామ్మైవ రాఘవం,
ఇతి సంచింత్య మనసి ప్రాహ తాం లక్ష్మణ స్తదా. ౩౪

బాలే! రామస్య దాసోహం యది మాం త్వం వరిష్యసి,
సీతాయా అపి దాసీ త్వం భవితాసి న సంశయః,
తస్మా త్త్వం రామనికటం గత్వా తం వృణుషే యది,
త్వమేవ రాజ్ఞీ భవసి గచ్ఛ శీఘ్రం తదంతికం. ౩౫-౩౬

ఇతఃపరం త్వయా సాకం న సంభాషితు ముత్సహే,
ఇత్యుక్త్వా ప్రియయా దూర మకుర్వ న్భాషణం తు సః. ౩౭

ఏవం తస్మి న్లక్ష్మణే తు సతి వ్రజతి సా పునః,
నిరాశా పరమక్రుద్ధా చింతయామాస చాత్మని. ౩౮

విశ్వాసా ద్యస్య వచసి సౌమిత్రిం ప్రాప్తవ త్యహమ్,
వాణీవ మూఢం త మహం భూయోపి ప్రాప్నువా న్యరం. ౩౯

32 మాటాడుకరయే వెళ్లుచున్న నన్నీమె యిప్పు డనుసరించి వచ్చుచున్నది. నీచులయందు సామోపాయము, దానోపాయము కూడ పనిచేయదు. ఏమియు సంశయము లేదు. స్త్రీలయందు దండోపాయ ముపయోగింపఁదగదు. ఇప్పుడు నే నేయుపాయముచేత నీమెను మరలింపఁగలుగుదును.

33 సింహములు, వ్యాఘ్రములు, ఎనుబోతులు మొదలగు క్రూరజంతువులచేఁ బ్రవేశింప సాధ్యముకాని యీ యరణ్యప్రదేశమున నబలయు, సర్వాంగసుందరియు నగు నీమె యొంటరిగా నే భయములేక యెట్లు తిరుగుచున్నదో మిగుల నాశ్చర్యకరముగ నున్నది.

34 నేను మరల నీమెను సామముచేతనే శ్రీరామునియొద్దకుఁ బంపించెదను. అని లక్ష్మణుఁడు తన మనమునం దాలోచించి శూర్పణఖతో నిట్లుఁ బలికెను.

35–36 ఓ సుందరి! నేను శ్రీరాముని దాసుఁడను. నీవు నన్ను వరియించితివేని సీతకుఁగూడ నీవు దాసురాలవు కావలసివచ్చును. ఇది నిక్కముగాన నీవు శ్రీరామునియొద్దకేగి యాయననే వరియించితివేని నీవే రాణివి కాఁగలవు. శీఘ్రముగ రామునొద్ద కేగుము. నీ హితమును గోరి చెప్పితిని.

37 ఇంతకు నెక్కుడుగ నీతో మాటలాడను - అని తిరిగి లక్ష్మణుఁడు సంభాషింపక దూరముగా వెడలిపోయెను.

38 అట్లు లక్ష్మణుఁడు వెడలిపోగా నా శూర్పణఖయు నిరాశ జెందినదై, క్రోధాతిశయముకలదియై తనలో నిట్లు నాలోచించుకొనెను.

39 ఎవని మాటలయందు విశ్వాసముచే నేను మూఢుని సరస్వతి వలె లక్ష్మణునిఁ బొందవచ్చితినో, యా రామునియొద్దకే, మరల శీఘ్రముగాఁ బోయెదను.

మయాఽధునా ప్యకరుణోఽదక్షిణోఽపూరుషః పునః,
ద్విషా త్స్వసు రయం నూనం వృథా సంప్రతిపాలతః. ౪౦

అహోస్వి దేతావ దేవ భాగధేయం హి తస్య తు,
* ప్రత్యాదిష్టాస్మి యేనాహం రూపశీలసమన్వితా. ౪౧-౪౨
భవ త్స్వస్యాగ్రజం గత్వా సర్వం తస్మై నివేద్య చ,
కరణీయం తు పశ్చాద్వై కరిష్యామి న సంశయః,
ఇత్యాలోచ్య స్వచిత్తే సా దశాననసహోదరీ,
ద్రుత ముత్థాయ నిర్గత్య రామాంతిక ముపాయయా. ౪౩
దృష్ట్వా తాం రాఘవః ప్రాహ కి మువోచ న్మమానుజః,
ఇతి పృష్టా రాఘవేణ సాఽప్యేవం గదతిస్మ తమ్. ౪౪

---

*ఏతావ దేవేతి - యేన త్రైలోక్యనాథస్య రావణస్య సహోదరీ సర్వాభిలషణీయసంబంధ్యహం ప్రత్యాఖ్యాతా, అత స్తస్య లక్ష్మణస్య భాగధేయ మల్ప మేవేతి. అనేనైవంభూత స్తస్యా దురభిప్రాయో గమ్యతే. సర్వథాఽనృతవచనేన మాం వంచితవంతం దురాత్మానం లక్ష్మణ ముద్దిశ్య ప్రతిపరిభవః కర్త్తవ్య ఏవ. స యది ప్రత్యాదేశ ప్రకారనివేదనా త్పూర్వ మేవ క్రియతే తత స్తద్ధేతుకేన కోపేన రామో న మా మంగీకరిష్యతి ఇతి ప్రథమం తన్నివేదన మేవ కర్త్తవ్యం. పశ్చాత్స రామో యది మాం పరిగ్రహీష్యతి, తతః, క్రమేణ వశీకృత్య తయోః పరస్పరం ప్రద్వేష ముత్పాద్య ప్రతిపరిభవం కరిష్యామీతి భావః.

౮౦ నే నిప్పుడు నిర్దయుఁడును, నసమర్థుఁడును, ద్వేషాత్మకుఁడు నగు నితని వ్యర్థముగ వేచియుంటిని.

౮౧-౮౨ పోనిమ్ము - అహ్లాద జనకమయిన రూపము, శీలముగల నన్నితఁడు నిరాకరించెను *ఇతని యదృష్టమింతియే (తనంతట దాను వలచి వచ్చిన రూపశీలాది సంపన్నురాలయిన సుందరి ననుభవింపలేక పోవుట యేయని) కానిమ్ము. ఈతని యన్నయగు శ్రీరాము నొద్దకుఁబోయి యీ జరిగిన చరితమంతయు నాతనికిఁ జెప్పి చేయదగిన పనినిఁ దరువాత నే చేయుదును.

౮౩-౮౪ ఇట్లు శూర్పణఖ తన మనమునం దాలోచించుకొని శీఘ్రముగ నచ్చటనుండి లేచి బయలువెడలి రాముని సమీపమునకు వచ్చెను. ఇట్లు తన సమీపమునకు వచ్చిన శూర్పణఖను జూచి "నా తమ్ముఁడగు లక్ష్మణుఁ డేమనెను." అని ప్రశ్నింపగా శూర్పణఖయు నచట జరిగిన వృత్తాంతమును రామునితో నిటులఁ జెప్పఁదొడఁగెను.

---

* ఇతని యదృష్ట మింతియే యను దానిలోని విశేషాంశము- ముల్లోకముల కధిపతి యగు రావణునకు సహోదరినయి, లోకమంతటిచేతనుగూడఁ గోరదగు సంబంధముగల నేను, ఏ కారణముచే లక్ష్మణునిచేఁ దిరుగ గొట్టబడితినో, యా కారణముననే లక్ష్మణుఁడు స్వల్పమయిన యదృష్టము గలవాఁడని తెలియబడు చున్నది. ఈ కారణమున నామెయొక్క దురభిప్రాయ మిట్టిదియని తెలియబడు చున్నది. ఎన్నివిధములకైనను నసత్యపు మాటలచే నన్ను వంచించు లక్ష్మణునిఁ బరిభవింపవలసినదే కాని, నన్ను లక్ష్మణుఁ డసత్యపు వచనములచేఁ బరిభవించెనని రామునితోఁ జెప్పకపూర్వమే యితనిని నేను పరిభవించినచోఁ దన తమ్మునకుఁ గలిగిన యవజ్ఞను జూచి రాముఁడు నన్నంగీకరింపఁడు. కాన ముందుగ లక్ష్మణుఁడు చేసిన యవమానము నే రామునకు మనవి చేయవలసి యున్నది. అనంతరము శ్రీరాముఁడు నన్నుఁ బరిగ్రహించినచో మెల్లమెల్లగా వశము చేసికొని యా రామలక్ష్మణులకుఁ బరస్పర ద్వేషములు గలిగించి యా లక్ష్మణునకుఁ బ్రతీకారము కావించెద నని భావము.

తపస్విధర్మాచరత్తో మత్తే కిం ను ఫలం భవేత్,
కిం ఫలం స్యా త్త్వయా మేపి తపోభంగస్య హేతునా,
కించ మే రామదాసస్య భార్యా త్వం తు భవే ర్యది,
త్వంతు దాసీ భవే స్తస్మా త్త్వం వ్రజే త్యాహ తేఽనుజః.
౪౫-౪౬

తచ్ఛ్రుత్వా రాఘవః ప్రాహ వచనం తాం నిశాచరీం,
త్వద్విధానా మంగనానాం సపత్నీకజనస్య తు,
పరిగ్రహో దుస్సహ స్స్యాదితి భీత్వా వదామి తే,
భద్రే! పునశ్చ భవతీం నియోక్ష్యామి శ్రమాధ్వని,
పరిశ్రమోఽయం సోఢవ్య స్త్వయా మా భావయాఽన్యథా,
తదంతికం పున ర్గచ్ఛ కార్య మద్య ఫలిష్యతి,
ఇత్యుక్తోభయకూలస్థ శాద్వలభ్రమ గౌ రివ,
ఉభయ ప్రాప్త్యలాభా సా స్వాచి త్తేఽచింతయ త్తదా.
౪౭-౪౮-౪౯-౫౦

స్వజాయా సంస్థితే ర్నూనం న మా మిచ్ఛతి రాఘవః,
మృతై తస్యాం భక్షితాయా మయ మే వోద్వహే త్తు మాం
ఇతి సంచిత్య తాం సీతాం హంతుం వ్యాత్తాననాఽభవత్. ౫౧

తత స్తాం సాంత్వయ న్నాహ వచనం రాక్షసీ మిదం,
చిహ్న మేకం ప్రదాస్యామి దర్శనా దస్య లక్ష్మణః,
కరిష్యతి చ తే కార్యం సఫలం నాత్ర సంశయః,
అసిద్ధా తవ కార్యస్య సమేత్యాఽత్తు మమ ప్రియాం,
ఇత్యుక్త్వా ప్రదదౌ తస్యై స్వనామాంకశరం దృతం.
౫౨-౫౩-౫౪

౪౫-౪౬ ఓ రామచంద్రా! "తాపసధర్మముల నాచరించు నావలన నీ కేమి ఫల మనియు, తపోభంగమునకు మూలమైన నీవలన నాకేమి ఫల మనియు, మఱియు శ్రీరామునకు దాసుఁడనగు నాకు నీవు భార్య వైనచో, సీతకును దాసివి కావలసివచ్చెదవనియు, గాన శ్రీరాముని యొద్దకే పొమ్మనియు" నీ తమ్ముఁడు చెప్పి పంపెను.

౪౭-౪౮-౪౯-౫౦ ఇట్లు చెప్పఁగా విని శ్రీరామచంద్రమూర్తి యా రక్కసిని గూర్చి యిట్టులఁ బలికెను. నీవంటి యుత్తమ స్త్రీకి సవతిపోరాటము దుస్సహమైనది యను దయముచే నేనిట్టులఁ దిరిగి నియోగించుచున్నాను. నీవు మార్గశ్రమను సహింపుము. నన్నన్యథా భావింపకుము. ఆ లక్ష్మణ సమీపమునకే మఱలఁ బొమ్ము. ఈ పర్యాయము నీకార్యము సఫలము కాఁగలదు. అని చెప్పఁగా శూర్పణఖ నదియొక్క రెండు ఒడ్లయందు పచ్చిక యున్నదను భ్రాంతిచే నిటునటు దిరుగుచున్న గోవవలె రెండుచోట్లను లాభము లేనిదై తన మనమునం దిట్టుల నాలోచించెను.

౫౧ శ్రీరాముఁడు తన భార్య సమీపమునందున్న కారణముచే నన్నంగీకరించుటలేదు. నే నీమెను భక్షించినచో నన్నుఁ దప్పక వివాహమాడును. అని యాలోచించి సీతను మ్రింగుటకు నోరుఁ దెఱచి పైకిఁ బోవసాగెను.

౫౨-౫౩-౫౪ పిమ్మట శ్రీరామచంద్రమూర్తి యారక్కసి ననునయించుచు నిట్లనెను. ఓ సుందరి! నేను నీకొక గుర్తు నొసంగెదను. ఆ గుర్తు నాతఁడు చూచిన వెంటనే నీకార్యమును సఫలము చేయును. సంశయింపకుము. అట్లు నీకార్యము సిద్ధింపకుండినఁ దిరిగివచ్చి నాభార్య నప్పుడు భక్షింపుము. అని పలికి రామనామాంకిత బాణము నొక దానిని నామెకు గుర్తుగా నొసంగెను.

పశ్చాచ్ఛూర్పణఖాపి రాఘవవచ స్సత్యం తు మత్వా ద్రుతం
గత్వా లక్ష్మణ మేవ మాహ సుమతే భ్రాతా త వేమం శరం
చిహ్నార్థం తు పరిగృహే తవ దదా వేతం గృహాణేతి తం
దత్వా ప్రాహ మనోరథం తు సఫలం శీఘ్రం కురు త్వం విభో
॥౧౫॥

భూయ స్తే నికటం గతాఽహ మితి మాం సంత్యక్తవాం శ్చేద్భవాన్,
భ్రాతు స్తే భవితా ద్వయో రపి విప త్సత్యం వచో వచ్మ్యహమ్
పూర్వం స్త్రీజనవంచనా ద్దివిపకో భూపాలకా శ్చాపరే
*శప్తా స్త్రాభి రతీవ నాశ మగమ న్సర్వం సమాలోచ్యతాం ॥౧౬॥

మనోరథే మేఽసఫలే భావ్యం కర్మ బ్రవి మ్యహమ్,
భక్షయేయం యువాం నూనం హృతా సీతా భవిష్యతి. ౧౭

---

* శప్తాస్త్రాభి రితి—అత్రేయం పౌరాణికీ కథా ఽనుసంధేయా-పురా మేనకాశాపేన ధనదస్య రూపహీనతా, ఊర్వశీశాపేన దేవవైద్యస్య యజ్ఞభాగాఽనర్హతా, మిత్రకేశీశాపేన వాచస్పతే ర్హృతభార్యతా, మదాలసాశాపేన బలేః రాజ్యభ్రష్టతా, మోహినీశాపేన బ్రహ్మణోఽపూజ్యతా చ సంబభూవు రితి.

౫౫ పిమ్మట శూర్పణఖ రాముని వాక్యములను సత్యమునుగాఁ దలఁచి లక్ష్మణుని దరికేఁగి యతనితో నిట్లనెను. నీ యన్నయగు రాముఁడు నన్ను నీవు పరిగ్రహించుటకై గురుతుగాను నీకుఁ దన బాణము నీయవలసినదిగా దీని నిచ్చెను. దీనినిఁ దీసికొనుము. అని యాబాణమును లక్ష్మణున కిచ్చి నాకోరిక వెంటనే సఫలమును జేయుమని కోరెను.

౫౬ లక్ష్మణా! సరిగ నేను నీదరికి వచ్చితినని నన్ను నీవు విడనాడితివేని నీకును నీయన్నకును మీ యిర్వురకుఁగూడ నాపద సంభవింపగలదు. నిజముగఁ జెప్పుచున్నదానను పూర్వమనేకులయిన రాజులు, నితరులును గూడ స్త్రీలను వంచించుటవలన ననేకములైన యాపదలను బొందిరి. వంచితులైన యా స్త్రీలచే వారలు * శపింపబడి నాశనమును గూడఁ బొందిరి. నేను చెప్పినదంతయు బాగుగ నాలోచించుకొనుము.

౫౭ లక్ష్మణా! నా కోరిక యే సిద్ధింపనియెడలఁ గాదగిన కార్యమును జెప్పెదను వినుము. మిమ్మల నిర్వురను (రామలక్ష్మణులను) భక్షించెదను. సీత నపహరించెదను.

---

* శపింపఁబడి నాశనమునుగూడఁ బొందిరి యనుదాని వివరణము.

ఈ విషయమై పురాణప్రసిద్ధ గాథ ననుసంధానము చేసికొనవలయును. (ఎట్లన) పూర్వము మేనకాశాపముచేఁ గుబేరునకు కురూపము ప్రాప్తించెననియు, సూర్యశీశాపముచే నశ్వినీదేవతలకు యజ్ఞభాగములయం దనర్హత వాటిల్లెననియు, మిత్రకేశీ శాపముచే బృహస్పతికి భార్యావియోగము సంభవించెననియు, మదాలసా శాపముచే బలిచక్రవర్తికి రాజ్యభ్రష్టత చేకూరెననియు, మోహినీ శాపముచే బ్రహ్మదేవున కపూజ్యత కలిగెననియు, పురాణప్రసిద్ధి గలదని తెలియఁదగును.

జ్ఞాత్వా తాం తు నిశాచరీం రఘుపతే ర్భావం చ విజ్ఞాయ తం
సంధాతుం క్షురికోపమం శరవరం శ్రీరామనామాంకితమ్,
సౌమిత్రౌ ప్రియత త్యథాఽసురతనుం ధృత్వా *విచింత్యాత్మని
వ్యాత్తాస్యా ప్రథమే తు హంతుమనసా రామం సమేతిస్మసా. ౫౮

రక్తకేశీం భీమదంష్ట్రామద్రిసన్నిభవిగ్రహాం
సమాపతంతీం వేగేన రాక్షసీం వీక్ష్య భూమిజా
భియాఽలింగ్య పతిం ప్రాహ వారయైనాం ద్రుతం త్వితి. ౫౯

---

* విచింత్యాత్మనీతి. ఏతావంత మహం కాలం దురాశా పరిపీడితా। అన్నాభావం శోచం త్యక్త్వా తన్నివృత్త్యా సుఖం త్వభూత్॥ అస్థిప్రాయాంగ సంయుక్త ఫలమూలాశినాం పునః। పిశితాశనసంజాతనిర్వేదాయా స్తు మేఽధునా స్వాయంతూపనతా వేతౌ సుకుమారౌ నృపాత్మజౌ। భక్ష్యభూతౌ మమ ప్రాప్తౌ దైవా దేత ద్ద్వయాదనాత్। బుభుక్షాపూరణం చాపి నిర్వేదాఽపగమో భవేత్। ఖాదిత్వేమౌ తతస్సీతాంకుర్యాం భ్రాతు రుపాయనం॥ మమ హస్తే శరం దత్వా ప్రేషణా దను జాంతికం। ప్రథమం రాఘవం హత్వా పశ్చాద్ధన్యా మిమాం త్వితి॥

౫౭ ఇట్లు శూర్పణఖ పలుకగా నామెను నిశ్చయముగా రాక్షసినిగా దెలిసికొని, లక్ష్మణుఁడు శ్రీరామచంద్రుని యాశయమును గూడ నతఁడు తనకుఁబంపిన బాణములవలనఁ దెలిసికొనినవాఁడైనందునే మంగలి కత్తివలె మిక్కిలి పదునుగల శ్రీరామ నామాంకితమగు బాణమును గ్రహించి శూర్పణఖను సంహరింపఁ బ్రయత్నింపఁబోవ నామె రాక్షసీరూపమును ధరించి * లోన నాలోచించుకొని నోరుఁదెరచి రాముని ముందుగా భక్షింపఁ బరుగిడసాగెను.

౫౮ అప్పుడు ఎఱ్ఱని వెంట్రుకలు, భయంకరమైన కోఱలు గలిగి పర్వతాకారముగలదియై పైకి దుముకుచున్న యారాక్షసిని సీతాదేవి చూచి భయముచే భర్త నాలింగనముఁ జేసికొని యారక్షసిని వారింపుము, వారింపుము (అని రామునితో సీతపలికెను.)

---

* లోన నాలోచించుకొని యనుదాని వివరణము.

ఇంతవఱకు నేను దురాశాపీడితురాలనై దుఃఖముల పాల్పడితిని. ఇప్పుడా దుఃఖము నివర్తించుటచే సుఖము కలిగెను. ఎముకల పోగులవలె నున్న యవయవములు కలవారును, కందమూల ఫలాశనులు నగు మునుల మాంసమును భక్షించుటచేఁ గలిగిన నిర్వేదముగల నాకు దైవవశముచే నిప్పుడు సుకుమారులగు రాజకుమారులు స్వయముగవచ్చి భక్ష్యములుగా సంప్రాప్తమైరి వీరి నిర్భరను భక్షించుటచే నాయాకలియు నుపశమించును. ఈ నిర్వేదము (విచారము) కూడ నుపశమించును. ఈ శ్రీరామ లక్ష్మణుల నిర్భరను భక్షించి యనంతరము సీత నపహరించి తీసికొనిపోయి నా యన్నయగు రావణునకుఁ గానుకగా సమర్పించెదను. నా చేతికిఁ దన ఖడ్గమునిచ్చి నన్నుఁ జంపించుటకుఁ దన తమ్మునొద్దకు బంపిన రాముని ముందుగఁ జంపి యటుపిమ్మట నీ లక్ష్మణునిగూడఁ జంపెదనని యాలోచించెనని తెలియనగును.

ఇత్యుక్తో రాఘవః ప్రాహ నతు సేయం నిశాచరీ,
న త్వయా దృష్ట పూర్వా కిం ? చిత్రభిత్తౌ పిశాచికా
ఏవం రామే సాంత్వయతి భయభీతాం తు భూమిజాం.
లక్ష్మణేన వినిర్ముక్తో రామనామాంకిత శ్శరః,
నిశాచరీం ఖురనసం విగ్రాం కృత్వా ప్యతృప్తిమాన్.
౬౦-౬౧-౬౨

[1]స్వైరా జాంగలికై రయంత్రితతయా చోద్వేజయంతీ సదా,

సాధూనా మవిభావ్యమానచరణా లోకే న కేనాఽపి యత్,

క్రూరాశీ రతిజింహగాఽపి భవతి ప్రాయో భుజంగప్రియా,

నేయం శ్రోత్రియుగం తదర్హతి కిలే త్యేత చ్చ చిచ్ఛేదసః.
౬౩

*[2]పూర్వ కర్మానురూపం తు తస్మా దేవం ఫలం గతా, ౬౪

* పూర్వకర్మేతి—"పూర్వం శూర్పణఖా కాచిదభవ ద్గరుడాంగనా । స్వర్గలోకే నందనాఖ్యవనే జాతు రమాయుతం।

1 నవ॥ రా॥ 2॥ క॥

౬౦-౬౧-౬౨ ఇట్లు సీత పలుకగా రాముఁడు నామె నోదార్చుచు నిటులఁ బలికెను. ప్రియసీ! ఈమె నిజమైన రాక్షసికాదు. భయపడకుము. ఇదియొక చిత్రభిత్తికా పిశాచము. (అనగా గోడలయందుఁ జిత్తరువుగా వేయబడిన పిశాచరూప మగుబొమ్మ) ఇట్టి దానిని నీ వెప్పుడును జూచియుండలేదా? భయపడకుము, అని యోదార్చుచుండ, లక్ష్మణునిచే విడువబడిన రామనామాంకితమైనబాణము డెక్కవంటి ముక్కుగల యారక్కసిని ముక్కులేని దానినిగాఁజేసె యంతమాత్రమునఁ దృప్తి లేనిదయ్యె.

౬౩ జాంగలికులచేఁ (రాక్షసులచే ననియొక యర్థము, విషవైద్యులచే నని సర్పపక్షమున మఱియొక యర్థము గ్రాహ్యము) నిరోధింపబడనిదియగుటచే స్వేచ్ఛగా సంచరించు నదియును సాధువులను భయపెట్టునదియును, లోకములో నెవ్వనిచేతను దెలియబడని పాద సంచారము గలదియును, క్రూరత్వము గలదియును, మిగులఁ గుటిలముగఁ బ్రవర్తించునదియు నగు శూర్పణఖ భుజంగ ప్రియ కాన (విటులకుఁ బ్రియురాలని ఈయొక యర్థము, ఆడసర్పమని మఱియొక యర్థము) చెవులీమె కుండదగినవి కావను తలంపుతోవలె నా రామబాణ మారక్కసియొక్క చెవులనుగూడ ఛేదించెను. (అనగా సర్పమునకు నేత్రములకంటె వేరుగఁ జెవులుండవు కాన నీ శూర్పణఖ భుజంగ ప్రియ కాన దీనికిఁ జెవులుండుట కూడదను తలంపుతోవలె శూర్పణఖయొక్క చెవులను గూడ ఛేదించెనని భావము. ఇచ్చటఁ బైన చెప్పబడిన విశేషణములన్నియు శూర్పణఖకును సర్పమునకును గూడ సమన్వయించునని తెలియవలయును.)

౬౪ * పూర్వకర్మకుఁ దగినట్టి ఫలమును లక్ష్మణుని వలన నిర్విఘ్నముగ శూర్పణఖ పొందెను.

---

* పూర్వ కర్మకుఁ దగిన ఫలమును దాని వివరణము.

ఈ శూర్పణఖ పూర్వ మొక గరుడాంగనయై యుండెను. స్వర్గలోకమున నొకప్పుడు నందన వనమున విహారార్థమై వచ్చి విష్ణుమూర్తి

శేషే శయానం వైకుంఠం వీక్ష్య సా గరుడాంగనా। పునఃపునః
కామనయా ద్రష్టుమైచ్ఛద్యదా హరిం॥ తదా శేషః ఫణా ఽవృత్యా
చ్ఛాదయామాస కేశవం। యథా ద్రష్టుం న శక్తా స్యా ద్గరుడ
స్యాంగనా పునః॥ తతః క్రుద్ధా గారుడస్త్రీ తస్య శేషస్య కర్ణ
యోః। నాసికాయాం జఘానాఽశు ముష్టిభి ర్బహుశ స్తదా॥
రమా తాం దూషయామాస కామయంతీం హరిం హృది।
ఏతస్మి న్నంతరే తస్యాః పతి రేత్య విహాసినీం॥ స్వజాయాం
గారుడీం వీక్ష్య నిర్భర్త్స్య చ విశేషతః। త్వయి చే న్నతు దోష
స్స్యా త్కథం త్వాం దూషయే ద్రమా॥ తస్మా ద్భూమ్యాం
రాక్షసీ త్వం భవ చేతి శశాప సః। క్రుద్ధా శశాప సా లక్ష్మీం
మన్మూలా త్సంభవే ద్ధ్రువం॥ భర్త్రా తవ వియోగ స్తు
కాలాంతర వశా ద్రిమే। యత స్త్వన్మూలతో మేఽద్య
వియోగోఽభూ ద్ద్వయో స్తు నౌ॥ సైవ శూర్పణఖాఽభూ
ద్దైత్యే శేషోఽభూల్లక్ష్మణోఽధునా। యస్మిన్ యస్మిన్ స్థలే పూర్వం
ముష్టిఘాతం చకార సా॥ తస్మిం స్తస్మి న్స్థలే శేషభూత సౌమిత్రి
రప్యయం। తాం జఘానేతి విజ్ఞేయం పూర్వకర్మఫలం త్వియం॥
అను భూతవతీ జ్ఞేయా దశాననసహోదరీ॥ ఇతి శ్రీరామేణ
సీతాయాః వియోగోపి పూర్వగారుడస్త్రీ శాపా దేవేతి జ్ఞేయం.

లక్ష్మీదేవితో నచ్చట శేషశయ్యపైఁ బవళించి యుండ శేషశాయియు వైకుంఠ నాథుఁడునగు శ్రీ మహావిష్ణుని నొక గరుడాంగన చూచి యభిలాషతోఁ దిరిగి తిరిగి యా విష్ణుమూర్తినిఁ జూచుచుండ దాని యాశయమును గ్రహించి శేషుఁడు శ్రీమహావిష్ణుఁ జూచుచున్న గారుడస్త్రీకి విష్ణుమూర్తి కన్పడకుండ నుండునట్లు తన పడగల చే నడ్డుపెట్టగా నా గారుడస్త్రీ మిక్కిలి కోపముతో నా శేషుని చెవులయందును ముక్కునందును తన పిడికిటి పోట్లతోఁ బొడిచెను. అప్పుడు లక్ష్మీదేవి తన భర్తను ప్రేమించుచు జూచుచున్న, శేషుని మోదుచున్నట్టి యా గరుడాంగనను దూషించుచుండెగా నా గారుడాంగన యొక్క భర్తయు నింతలో నచ్చటకువచ్చి లక్ష్మీదేవితో వివాదపడుచున్న తన భార్యను గాంచి యామె నధికముగఁ గోపించి తన భార్య నిట్లు శపించెను. "నీ యందు దోషము లేకుండిన లక్ష్మీదేవి నిన్ను దూషింపదు గాన నీవు దోషము కలదానవే. కాన నీవు భూమియందు రాక్షసివిగాఁ బుట్టుము" అని శపించగా నందుచేఁ గ్రోధము కలదియై యా గరుడాంగన లక్ష్మీదేవి నిటుల శపించెను. ఓ లక్ష్మీదేవి! నీ మూలమున నాకిపుడు భర్తృవియోగము తటస్థించెను గాన కాలాంతరమున నీభర్తతో నీకును నావలన వియోగము కలుగగలదు. (అని శపించెను) ఆ గరుడాంగనయే యిప్పుడీ శూర్పణఖయని తెలియదగును. ఆ శేషుఁడే యిప్పుడు లక్ష్మణుఁడు కానఁ బూర్వమే యే స్థలములయందు గరుడాంగన శేషునిఁ బిడికిలి పోట్లతో మోదెనో, ఆ స్థలములయందే శేషాంశ సంభూతుఁడగు లక్ష్మణుఁడు శరముతోఁ గొట్టెననియుఁ దెలియదగును. మఱియు సీతారాములకు గానున్న వియోగముకూడ నా గరుడాంగనాశాపమూలకమే యనియుఁ దెలియవలయును. (ఇట్లు పూర్వకర్మకు దగిన ఫలమును శూర్పణఖ యనుభవించినదని తెలియదగును.)

విచ్ఛిన్ననాసికాకర్ణయుగాంతర నిరర్గళం
దూషితా నిర్గళ ద్రక్తధారయాఽనంగబాధయా,
పీడితా సా ద్వివిధయా పునరు క్తవికారశుక్
సబాహ్యాభ్యంతరమాక్రోశం కుర్వంతీ చ పలాయితా,
జనస్థానస్థితం చాత్మభ్రాతరం శరణం గతా
నిపాత్య పాదయో స్తస్య పరిభూతినిదానకం
అపదానం దాశరథ్యో రానుపూర్వ్యా దువాచ తమ్.
౬౪-౬౫-౬౬-౬౭

వైరూప్యే తు కృతేఽపి కామవివశా తాభ్యా ముభాభ్యా మపి
స్వాంతే సంస్థిత మేవ భావ మధునా ప్యాహాఽనుజం సా పున
స్తౌ దృష్ట్వా దాశరథీ సమానవయసౌ రూపే బలే సన్నిభౌ
పద్మాక్షౌ వజినాంబరౌ సుతపసౌ జేతుం త్వశక్యౌ ధ్రువమ్.
౬౮

సంభూయానుజ! భూమిజాం ప్రతి సముద్దిశ్యైవ తాభ్యామహం,
వైరూప్యం గమితాఽగతి స్సవగతాఽభూవం సమీపం ద్రుతం
తౌ దృష్ట్వా దండకకాననం గతభయం కర్తుం సమేతౌ ధ్రువం
సాంబో మే తనయోపి తద్ద్వయహతః కిం వచ్మి దౌష్ట్యం తయోః
౬౯

చారచక్షుర్విహీన స్త్వం కథం రాజా భవిష్యసి,
యది త్వం కులజాతోఽసి వీరోఽసి జహి తౌ రిపూ. ౭౦

తద్రక్తపానకామాఽహం మత్కామం సఫలం కురు,
అనాథాయా స్తు మే నూనం భవానేవ గతి ర్భవ. ౭౧

౬౪-౬౫-౬౬-౬౭ శూర్పణఖ కోయబడిన ముక్కు, చెవులుగలది యగుటచే దానినుండి స్రవించుచున్న రక్తధారలచేతను, మన్మథ తాపముచేతను ద్వివిధముగ బాధపడుచున్నదియై యంగవికారమువలన గలిగిన దుఃఖము నా బాధలను ద్విగుణీకృతము చేయుచుండ, రెండుచేతులు పైకెత్తి బిగ్గరగ నేడ్చుచు, నున్మత్తురాలివలెఁ బరుగులిడుచు జనస్థానమునకు వచ్చి యచ్చటనున్న తన సోదరుఁడగు ఖరుని శరణుపొంది యతని పాదములపైఁబడి నిజ పరాభవ మూలకారణమయిన శ్రీ రామలక్ష్మణవృత్తాంతము నంతను ఊసగ్రుచ్చిన ట్లతనికిఁ జెప్పెను.

౬౮ ఆ రామలక్ష్మణు లిద్దరిచేఁ దన కంగవికారము కలిగినను, కామవశురాలై యున్న యా శూర్పణఖ తన మనోగతమైన యభిప్రాయమునకుఁ దగినట్టుల నిట్టుల వర్ణించుచు జెప్పఁదొడగెను. ఓ సోదరా! దశరథపుత్రులైన యా రామలక్ష్మణు లిద్దరును సమాన వయస్కులును, రూపమునను బలమునను గూడ నొక్క పోలికగల వారును పద్మములవంటి గుండ్రని ముఖముగలవారును, నారచీరలను ధరించిన వారలును, మంచి తపోబలము గలవారును, పరులకు జయింప నశక్యులునై యుండిరి.

౬౯ ఓ సోదరా! వార లిద్దరునుగలసి సీత నిమిత్తముగా నన్ను వికారరూపిణిగాఁ జేసిరి. నేను దిక్కులేనిదాననై శీఘ్రముగ నీ సమీపమునకు వచ్చితిని. వా రిద్దరును దండకారణ్యమున రాక్షసభయము లేకుండఁ జేయుటకై వచ్చిరి. ఇది నిక్కువము. నా కుమారుఁడగు సాంబుఁడుకూడ వా రిద్దరిచేతనే చంపఁబడెను. వారి శౌర్యమింకేమి చెప్పుదును?

౭౦ రాజుల కుండదగిన గూఢచారు లనెడి నేత్రములులేని నీవు రాజవెట్లగుదువు? నీవు సత్కులమునఁ బుట్టినయెడల వెంటనే యా శత్రువులను బరిమార్చుము.

౭౧ వారి నెత్తురు త్రాగవలయునని గంపెడాశతో నుంటిని. నాకోరికను నెరవేర్ప నీవే సమర్థుఁడవు. దిక్కులేని నాకు నీవే దిక్కు వయితివి.

నోచే దద్య తవాగ్రత స్త్వహ మసూం స్త్వత్సామి నిస్సంశయం,
శత్రుత్వా త్తపరాభవం త్వహ మితః పశ్చా న్నసోఢుం క్షమా,
సోయం మే నహి కేవలం పరిభవః కింతు ప్రకృష్టస్య నో,
వంశస్యైన భవేదితి త్వ మనుజ స్వాంతే సమాలోచయ. ౭౨

తచ్ఛ్రుత్వా వచనం ఖరో౽పి నితరాం ఖిన్న స్సమాశ్వాస్య తా
మేకస్మా న్మనుజా త్స్వసుః పరిభవం సంభావ్య శూలం హ్రదః
ఆహూయ ద్రుతమాశరాం శ్చ నిఖిలాన్ప్రాహ ప్రయాణాయ ధే,
సర్వే యూయ మరం విధ త్త చ జనస్థానం వినిర్గచ్ఛత. ౭౩
ఏవ మాదిశ్య రక్షాంసి సహస్రాణి చతుర్దశ,
దూషణత్రిశిరోయుక్త స్సోపి గంతుం సముద్యతః. ౭౪

ఇత్యాశ్చర్య రామాయణే అరణ్యకాండే నవమ స్సర్గ
స్సమాప్తః.

---

## దశమ స్సర్గః



[1]తతః ప్రహానుజం రామ స్స్వసమీపా౽గతం పునః,
యుక్తం కృతం త్వయా దండో వధస్థానే స్త్రియో హ్యయమ్. ౧
కింతు శూర్పణఖా నామ వసంతీ దండకే వనే,
ఖరదూషణయో ర్జ్యేష్ఠా రావణస్య కనీయసీ,
ఇతి పూర్వం శ్రుతా సైషా భవ త్యేవ న సంశయః. ౨౪

1 కు.

౪౨ నీవు నేను చెప్పినటుల శత్రువులను సంహరింపనిచో నీ యెదుటనే
ప్రాణములను విడచెదను. సందియము లేదు. ఇటుపైని శత్రువులచేఁ
గలుగఁజేయబడిన పరాభవ దుఃఖమును సహింపజాలను. ఈ పరాభవము
నా కొకదానికే కాదు. సుప్రసిద్ధమైన మన రాక్షసవంశమున కంత
కును గాఁగలదు. సోదరా! నేను జెప్పిన విషయమును నీవుకూడ
బాగుగ మనమునం దాలోచింపుము.

౪౩ ఇట్లు శూర్పణఖ చెప్పగా విని ఖరుఁడును మిగుల దుఃఖించి, యామె
నోదార్చి, యొక మనుజునిచేఁ గలిగిన పరాభవమును దన హృదయ
శల్యమునుగా భావించి, తన యనుచరు లయిన పదునాలుగువేల
రాక్షసులను రావించి, యుద్ధమునకు సన్నద్ధులై బయలుదేరుఁడని
యానతిచ్చెను.

౪౪ ఈ విధముగఁ బదునాలుగువేల రక్కసులను సమరమునకై పంపి
దూషణ త్రిశిరులతోఁ గూడ నా ఖరుఁడును యుద్ధప్రయాణోన్ముఖుఁ
డయ్యెను.

అరణ్యకాండమున తొమ్మిదవసర్గము

స మా ప్త ము.

---

## ద శ మ స ర్గ ప్రా రం భ ము.

---

౧ అనంతరము శ్రీరామచంద్రమూర్తి తనయొద్దకు వచ్చిన తమ్మునితో
నిట్లనెను. స్త్రీయగు శూర్పణఖకు వధస్థానములో నీవుచేసిన దండనము
చాల యుక్తముగ నున్నది.

౨ ఈ దండకాటవియందు ఖరదూషణులకు సోదరియు, రావణాసురు
నకు చెలియలునగు శూర్పణఖయను పేరుగల రాక్షసిగలదని యిదివఱకే
వినియుంటిని. ఆమెయే ఈమెయై యుండనోపు. సంశయము లేదు.

స్త్రీసామాన్యా త్త్వయా త్వేషా పరిభూతా యత స్తతః,
అత్యంతజాగరూకేణ స్థాతవ్యం భవతా మయా. 34

యద్యస్యా స్తర్జనం వాపి భర్జనంవా కృతం త్వయా
భారితా౽స్యాః కాలవశతో విస్మృతం చ భవే దిదమ్. 44

వైరూప్యకరణం త్వాత్స్వభగిన్యా రావణేన హి,
నిత్యం ద్రష్టుం శక్యతే౽తి స్తద్దర్శనసముద్భవా,
వైరానువృత్తి రస్మాక మవశ్యంభావినీ ధ్రువమ్,
ఇతః పరం కార్యకస్య విశ్రమోపి న సంభవేత్. 7-64

ఏవం రామవిభా వద త్యనుజనిం కోలాహల స్తు శ్రుతో
మాతంగాశ్వశతాంగప త్తినిచయవ్యా ప్తస్య దూరే తదా
కుంతవారిసపరశ్వధాశుగగదాని స్త్రింశసంశోభిన
స్స్వర్ణోజ్జ్వలవారవాణవిధృతః క్రవ్యాదసైన్యస్య వై. 24

కుర్వంతీ మివ దుర్దినం దిన మపి స్వస్యోపరిష్టా చ్ఛమూ
మాయాంతీం కిలరక్షసాం రఘుపతి స్సంవీక్ష్య చాహా౽నుజమ్,
సౌమి తే౽సురవాహినీ తు మహతీ యోద్ధుం సమేతి ధ్రువం
సీతాం త్వద్రిగుహాం భవా న్నయిత మతో నీత్వా౽వతా
త్సర్వథా. 94

౩ ఈమె రక్కసి యని యెఱుఁగక సామాన్య స్త్రీయని నీచే నీమె పరిభవింపబడినది. గాన నిక మన మిద్దఱము మిక్కిలి జాగరూకులమై మెలఁగవలయును.

౪ నీ వీమను తర్జనభర్జనలు మాత్రమే చేసియుండినయెడల నా సోదరుఁడా విషయమును కొలఁదికాలము గడచిన మఱచియుండెడివాఁడు.

౫-౬ తన చెలియలి యీ మాఱురూపము రావణునిచే ననుదినము చూడబడుచుండును. గాన, నా వైరూప్యమును జూచుటచేఁ గలిగినయీ రావణ వైరానువృత్తి మనకు తప్పనిదే యగును. నిజము. ఇప్పటినుండి ఘనున్ననుకూడ విశ్రాన్తి యుండదు.

౭ ఇట్లు ప్రభువగు శ్రీరామచంద్రుఁడు తన తమ్మునితో మాటలాడుచుండగనే, ఏనుఁగులు, గుఱ్ఱములు, రథములు, సేనానివేశములతో వ్యాప్తమయి నటువంటిన్ని, కుంతములు, ప్రాసములు, గండ్రగొడ్డళ్లు గదలు, ఖడ్గములు, బాణములతో నొప్పునట్టిన్ని బంగారు కవచముల ధరించిన రాక్షససైన్యముయొక్క కోలాహలధ్వని వినఁబడెను.

౮ బాగుగ సూర్యుఁడు వెలుగుచున్న పగటిని కూడ దుర్దినముగాఁ జేయుచు తనమీదికి వచ్చుచున్న రాక్షససేనను జూచి తమ్మునితో నిట్లనెను. ఓ తమ్ముఁడా! నిజముగ గొప్పది యగు రాక్షససేన యుద్ధమునకై వచ్చుచున్నది. ఇటనుండి నీవు సీతను కొండగుహవద్దకు తీసుకొని వెళ్లి రక్షింపుము.

గత్వాఽహం క్షణమాత్రత్తోఽసురచమూం కృత్వా వినష్టాం పున
శ్శీఘ్రం త్వరితం సమేష్యే రాక్షసజనాఽనీకా ద్భయం నాస్తి మే
మాయారూపధరా శ్చరేయు రసురా స్త్వం జాగరూకో భవే
స్సిద్ధే దితి భవా న్నయాతు చ భవా న్భ్రాత్రాఽపి సీతాం
త్యజన్. ౯

ఇత్యాఽదిశ్య ధరాత్మజాఽవనకృతే సౌమిత్రి మత్యుత్తమం,
కృత్వా పాణితలే శరాసనశరానీకం త్వభేద్యం తదా
ధృత్వాఽంగే చ తనుచ్ఛదం జపమణిస్రగ్బద్ధకేశ స్తతో
నిష్క్రాంతోఽభిముఖం నిశాచరగణా న్స్వాగచ్ఛతో రాఘవః.
౧౦

[1]అష్టావింశసహస్రికై రపి కరై ర్వ్యాప్తాని తై ర్నేకదా.
నృష్టాత్మా ఖరసైనికైః ప్రహారణా న్యాయోధనే రాఘవః
ప్రాప్తైః ప్రాగల మచ్ఛిన త్క్రూరయుగోత్సృష్టైః పృషత్కైః క్షణా
దాదిత్యా నసకృచ్ఛరా నపి పున ర్వివ్యాధ తా నవ్యథః. ౧౧

[2]తస్మి న్సమయే సురాశ్చ మునయో హ్యాయోధనం వీక్షితుం
సంప్రాప్యాఽంబర మాస్థితా రఘుపతే ర్దేహే తదా యుద్ధ్యతః
రుద్రాంశాం స్త్రి పినాకశూలడమరూ న్ఖట్వాంగం చ ఘంటాం తథా
పశ్యంతః పరశుం చ భీతి మగమ న్ఖడ్గం చ పాశాంకుశం. ౧౨

---

1 నశ॥ రా॥ 2 కవి॥

౯౪ నేనిప్పుడే వెడలి క్షణకాలములోనే యీ రాక్షససేన నంతను నశింపఁజేసి వచ్చెదను. నాకు రాక్షససేనలవలన భయ మేమియు లేదు. రాక్షసులు మాయామాయారూపముల ధరించి తిరుగుచుందురు. నీవు జాగరూకుఁడవయి యుండవలయును. సీతను విడిచి నీవు యెక్కడకును పోవలదు. ఇక్కడనే యుండుము.

౧౦౪ ఇవ్విధముగ సీతారక్షణ విషయమై ఉత్తముఁడగు లక్ష్మణు నాజ్ఞాపించి, ఇతరు లెవరుచేతను ధరింపరాని ధనుస్సును, బాణమునుకూడ, చేతఁ దీసికొని శరీరమునకు కవచమును తొడిగి, యెఱ్ఱని జపా పుష్ప మాలికచేఁ గట్టఁబడిన కేశబంధము కలవాఁడై తన కెదురు వచ్చుచున్న రాక్షస సమూహమునకు ఎదురుగ బోయెను.

౧౧౪ పదునాలుగువేల రాక్షససైనికులు సవ్యాపసవ్యహస్తముల రెంటిచే బాణముల బ్రయోగించుచు నొక్కొక్కపర్యాయ మిరువదియెనిమిది వేల బాణములు వర్షముగ రామునిపైఁ గురిపించుచున్నను నాబాణములు తన మీఁదఁ బడకముందే ధీరుఁడైన శ్రీ రామచంద్రమూర్తి తన రెండుచేతులచే విడువబడిన బాణములచే వారి యాయుధముల నన్నిటిని ఖండించుటయే కాక వారలు తిరిగి బాణము గ్రహించు లోపల నొక క్షణములో ననాయాసముగ నందరకు నన్నిరూపములతో వలె నా రాక్షసుల నందరను ఖండించెను.

౧౨౪ ఆయుద్ధము జరుగు సమయమున దేవతలును, మునులును మొదలగు వార లాయుద్ధమును జూచుటకై వచ్చి యాకసమున నుండి, యుద్ధము జేయుచున్న యా శ్రీరామచంద్రుని శరీరమునందు, పినాక, శూల, పరశు, ఘంటా, ఖడ్గ, పాశ, డమరుక, అంకుశ మొదలగు రుద్రాంశములు కన్పడఁగఁ జూచి భయమునొందిరి.

యావంతి రక్షాంసివసంతితత్ర తావంతి రూపాణి విధృత్య రామః
యుధ్యన్నివాఽయం ప్రతిరాక్షసస్య పురస్థితో దృశ్యత ఏవ
చిత్రం ॥౧౩॥

దేవా స్త్వంబరసంస్థితా రఘుపతే ర్భీమాం నిరీక్ష్యాఽకృతిం,
భీతా దూర ముపాగమ న్మునివరా శ్చాన్యే పునః కిం పునః,
ఆకాశం తు ససూర్య మప్యథ శరై ర్గాఢాంధకారం పునః,
కుర్వన్రుద్ర ఇవాఽబభౌ రఘుపతి ర్ద్రష్టుం త్వశక్యో యుధి. ॥౧౪॥

1ఆవృత్యాఽథ సమంతత శ్చ వివిధా న్యస్త్రాయుధా న్యస్యతా,
మేకైకం శతధా తథా శకలిత గ్రీవోరు బాహూదరమ్,
భిందానో నిశితై శ్శరై రఘుపతిః క్షిప్రం సహస్రాణ్యపి,
క్రవ్యాదాం సమరే చతుర్దశ తదా స ప్రాపయ త్పంచతామ్.
॥౧౫॥

కాష్ఠా స్స్వైకధురీణతా మిహ వహ న్నష్టాసు దిగ్దంతినాం,

కుర్వా న్నిర్వృతి మేష చేదధిగత శ్శ్రేష్ఠై స్త్రిభిః పంచతామ్

1 నక॥ రా॥

౧౩౪ ఆయుద్ధప్రదేశమున నెందరు రాక్షసు లుండిరో, యన్ని రూపములను శ్రీరాముఁడు ధరించి ప్రతిరాక్షసునెదుట నున్నవాఁడై యాశ్చర్యము గొలుపునట్లు కన్పించెను.

౧౪౪ ఆకాశ మందున్న దేవతలు శ్రీరాముని భయంకరాకారమును జూచి భయమునొందినవారలై దూరముగఁ బోయిరి. దేవతలే యిట్లు భీతి నొందఁ యిఁక మునీశ్వరులవిషయము నితరులవిషయము నేమి చెప్ప వలయును? సూర్యుఁడు ప్రకాశించుచున్నను నాకాశమును బాణ వర్షముచే గాఢాంధకారయుతముగఁ జేయుచు యుద్ధమందు శ్రీరామ చంద్రమూర్తి యరుణునిఁబోలి ప్రకాశించెను

౧౫౪ రాక్షసులంతటను మట్టడించిబాణములను వర్షించుచుండ శ్రీరామ చంద్రమూర్తి యుద్ధములోఁ దన పదునైన బాణములచే నొక్కొక రాక్షసుని నూరేసి ముక్కలగునట్లు మెడలు, తొడలు, బాహువులు మొదలగు నవయవముల ఖండించి రాక్షసులను బదునాలుగువేలను పంచత్వమును (పంచసంఖ్యను) బొందించెను. (ఒక్కొక్కని నూరు వ్రక్కలు చేసినట్లయిన పదునాలుగు వేలనుబదునాలుగు లక్షలనుగా జేయవలయునుగాని పంచత్వమును నైదింటినిగా) జేయుట విరోధ ముగా గన్పడును. దాని పరిహార మేమనగా (పంచత్వమన మరణ మనెడి యర్థమున్నందున మరణమునుఁ బొందించెనని భావము )

౧౬౪ పర్వతశిఖరమువలె నున్నతములైన మూడుశిరములతో గూడిన త్రిశి రునిఁ బంచత్వమును (పంచసంఖ్యనని యొక యర్థము, మరణము నని మతి యొక యర్థము). బొందించినచో నష్టదిక్కుల భారమును నీ త్రిశిరుడే వహింపఁగలఁడని యు, నందువలన నెనిమిది దిగ్గజములకు భారము తగ్గుటచే సంతోషము కలుగుననియుఁ దలంచినటె రాముఁ డా త్రిశిరుని తన శరములచే యుద్ధమునందు రెండుగాఁ జీల్చి నందున నష్టోత్తమాంగుఁడై త్రిశిరుఁ డయ్యెను. (రాముఁడు త్రిశిరుని బాణములచే రెండుగా జీల్చినప్పుడు త్రిశిరుఁ డారుశిరస్సులుగలవాఁడు కావలెఁగాని యష్టోత్తమాంగుఁడు(అనగా నెనిమిది తలలుగలవాఁడు,

శృంగోచ్చైరితి చింతయన్నివ శరై శ్ఛిత్వా త్రిమూర్ధం, ద్విధా
వీర స్తామథ రాఘవో యుధి నయ న్నష్టోత్తమాంగం వ్యధాత్.
౧౬

ఆలోక్యాఽభిహతాం నిశాచరచమూం తాం దూషణో రోషణః
త్వేళారావ సతీక్ష్ణచాపనినద స్తత్రాఽభ్యమిత్రీణతామ్
ఆజౌ నిర్జరదుర్జయ స్సమయతే యావ త్ససీతాపతి
స్తావ న్నిత్రకులే మహత్యపి భవ న్నాసీ త్తదీయా సుహృత్. ౧౭

[1]పశ్చా ద్రాఘవవిక్రమాగ్నిశలభా న్దృష్ట్వాఽత్మబంధూ న్బహూ
న్క్రోధావేశజ వీరవాదముఖరః ప్రాప్తః ఖర స్సంగరమ్
సాక్షేపై ర్వచనై స్తదాత్మకలుషం కుర్వ న్స్ఫులింగత్విషా
ఆత్మీయేన తు చక్షుషా రఘుపతిం తస్థా దిదృక్షు న్నివ. ౧౮
ఏవ మేత్య ఖరోప్యాశు ప్రకాండైః కాండసంచయైః
ఖండయామాస కోదండం కాకుత్స్థస్యాశయమండనమ్. ౧౯
పశ్చా ద్రామోఽపి కోపేన ప్రదత్తం కుంభయోనినా
శరాసనం తు జయదం గృహీత్వా సందధే శరాన్ ౨౦

1 క పు.

ఎట్లగునను నా క్షేపమునకు సమాధానమేమనగాఁ జేర్చినందున నష్టోత్తమాంగుఁ డనునపుడు జేర్చినందునఁ, అష్టోత్తమాంగుఁడని పదమును విడదీయకుండగ జేర్చినందున, నష్టోత్తమాంగుఁడు అని పదమును విడఁదీసినచోఁ జేర్చినందున నష్టోత్తమాంగుఁడు (నష్ట) నష్టమైన (ఉత్తమాంగుఁడు) శిరస్సులు గలవాఁ డయ్యెనని, అనగా త్రిశిరుఁడు చచ్చెనని తాత్పర్యము.)

౧౭౪ త్రిశిరునితోఁ గూడ రాక్షససైన్యమంతయు నష్టమైనట్లు తెలిసికొని దూషణుఁడు రోషముతో సింహనాదము చేయుచు, ధనుష్టంకారము చేయుచు శత్రువగు రాముని నెదుర్కొనునంతలో రాముఁడు మిత్రకులములో బుట్టినను వానికి నసుహృత్తయ్యెను. అనగా బాణములచే వానిని జంపెనని పర్యవసానము. (మిత్రకులములో బుట్టినవాఁడనగా సూర్యవంశమునందు బుట్టినవాఁడనియు, స్నేహితకులములోఁ బుట్టినవాఁడనియు శ్లేషార్థము గ్రాహ్యము. ఇట్లే వానికి నసుహృత్తయ్యెనను నప్పుడును (వానికిఁ) వానికి (అసుహృత్) మిత్రుడు కానివాడయ్యెనని యొక అర్థము. (అసు) ప్రాణములను (హృత్) హరించిన వాఁడయ్యెనని మఱియొక అర్థము గ్రాహ్యము.)

౧౮౪ పిమ్మట ఖరుఁడు తనబంధుగులందరును రామపరాక్రమమను నగ్నిలో మిడుతలవలె నగుటఁ జూచి క్రోధావేశముచే మిక్కిలి వేగముగ యుద్ధమునకు వచ్చి వచింపరాని వాక్యములతో రాముని దిట్టుచు నగ్నికణములవలె నొప్పుచున్న నేత్రములచే శ్రీరాముని దహింపజేయువాఁడువలె మండిపడుచు యుద్ధము చేయ నారంభించెను.

౧౯౪ ఖరుఁడు కొంతసేపు తీవ్రముగ యుద్ధము చేసి తీక్ష్ణమైన, శీఘ్రమైన బాణములచే శ్రీరాముని చేతియందలి ధనువును ఖండించెను.

౨౦౪ అంతట రాముఁడు మిగుల కోపముగలవాఁడై యగస్త్య మహర్షిచేఁ దన కీయబడిన, జయశీలమైన వైష్ణవధనుస్సును వెంటనే గ్రహించి బాణము నెక్కుపెట్టెను.

అస్త్రాస్త్రప్రధనే ప్రదర్శ్య సుచిరం నైపుణ్య మప్యాత్మన
స్సోఽత్రాప్యస్త్రై ర్దుర్ముఖరః ఖరః ఖరతరే కృత్తే నిజే కార్ముకే
వ్యాదత్త స్త్యభినిష్పత న్నభిముఖం యావ జ్జిఘత్సు ర్ముఖం
తావ త్తస్య శిరోహర న్నపి శరై రామో వయస్యత్వ మైత్
౨౧౪

ఏవం రామేణ నిహతా స్త్రిశిరోదూషణః ఖరః
త్రయస్తే *రామసాయుజ్య మగమ న్శాపముక్తితః
రామేణ నిహతా స్సర్వే రాక్షసా అపి సంయుగే
దుర్లభాం తాపసానాం చ లోకా న్ప్రాపు రనుత్తమాన్.
౨౨-౨౩౪

---

*శాపముక్తి రితి-పురా ఖరదూషణత్రిశిరసః కే? కస్మా త్కేన తే శప్తాః ఇతి చే దత్రేయం పౌరాణికీ గాథాఽనుసంధేయా. "యాజ్ఞవల్క్యమహర్షేస్తు ద్వే భార్యేఽవసతాం పురా। జ్యేష్ఠా నామ్నా చ మైత్రేయీ కాత్యాయన్యభిధా పరా॥ జ్యేష్ఠా జ్యేష్ఠైవ విజ్ఞానే ద్వితీయా చాద్వితీయకా। సురూపే స ముని స్తస్యాం ద్వితీయాయాం రతోఽభవత్॥ మైత్రేయ్యాం చ విరక్తోఽభూ త్తథాఽప్యేషాజహా న తం। సదా పరిచరంతీ సా సపత్న్యా సహితం పతిం॥ పుత్రీమివ సపత్నీం చ పతిం జామాతరం యథా। పశ్యంతీ సాపి మైత్రేయీ న్యవస ద్భర్తృసన్నిధౌ॥ కస్యచి త్త్వథ కాలస్య కాత్యాయన్యాస్త్రయస్సుతాః॥

౨౧౪ కొంతసేపు అస్త్రశస్త్రగ ప్రవర్తించిన యుద్ధములో తన నైపుణ్యమును జూపించి యాటహాసము చేయుచు వదరుచు నున్న యా ఖరాసురుని చేతిలోని ధనుస్సును రామచంద్రమూర్తి విరుగ గొట్టగా నతఁడు భక్షించుటకై నోరు తెరచి తన పైకి వచ్చునంతలో వాని శిరస్సును రాముఁడు తనబాణములచే ఛేదించియు, నతని వయస్యత్వమును బొందగలిగెను. (అతని శిరస్సును ఛేదించినపు డతనికి వయస్యుఁడు (మిత్రుఁడు) అయ్యెనంటే విరోధము వచ్చెను. దానికి పరిహార మేమనగా వయస్యత్వమును (నాశకత్వమును) బొందెనని యర్థము చెప్పుకొనినచో నతనికి నాశకుఁడయ్యెనని భావము వచ్చును.

౨౨౪-౨౩౪ పై విధముగ శ్రీరామునిచే ఖరదూషణత్రిశిరసులు చంపబడిన వారై * శాపవిముక్తులై శ్రీరామ సాయుజ్యమును బొందిరి. ఇతర రాక్షసులందరు గూడ రామునిచే హతులై యుత్తమలోకములను బొందిరి.

---

* శాపవిముక్తులై యనుదాని వివరణము.

పూర్వము ఖరదూషణత్రిశిరసు లెవ్వరు? వీరెవ్వరిచే నే కారణమున శపింపఁబడిరి! అను విషయమున నీక్రింది పురాణగాథ ననుసంధానము చేసికొనవలయును. "పూర్వకాలమున యాజ్ఞవల్క్యుఁడను మహర్షి యొకఁడుండెను. అమ్మహర్షికి యిద్దరు భార్యలుండిరి. వారిరువురిలోఁ బెద్ద భార్యపేరు మైత్రేయి. రెండవ భార్యపేరు కాత్యాయని. పెద్దభార్య జ్ఞానమునఁ బెద్దది, రెండవభార్యయు నందములోఁ బెద్దదిగా నుండెను. అందుచే నా మహర్షికి ద్వితీయ భార్యయందే ప్రేమాతిశయము మెండుగా నుండెను. పెద్దభార్య యందంతయనురాగము లేనివాడై యుండినను నామె (మైత్రేయి) యమ్మహర్షిని విడిచిపోకుండ నటనుండుటయే కాక, తన సవతి యగు కాత్యాయనినిఁ గొమరితనుగాను, భర్తను అల్లునిగాను జూచుకొనుచు, సవతిని భర్తనుగూడ సేవించుచు భర్తృసమీపముననే నివసించుచుండెను. ఇట్లుండఁ గొంతకాలమునకు రెండవభార్య

చంద్రికాంతమహామేధ విజయాఖ్యా స్సు జజ్ఞిరే । మైత్రేయీ తత్సుతాం శ్చాపి స్వాత్మజా నివ పశ్యతీ॥ తా స్లాలయంతీ ధాత్రీవ పతిగేహేఽవస చ్చిరం॥ యాజ్ఞవల్క్యసుతాః పశ్చా న్మహాదేవస్య దూషణాత్॥ రాక్షసా ఘోరయా పాశ్చ తచ్ఛాపా త్త్వాభవం శ్చ తే। ఖరశ్చ దూషణ శ్చాపి త్రిశిరా శ్చ తఏవ హి॥ ముక్తాశ్శాపా ద్రామహస్తా ద్విముక్తింప్రాపు రవ్యయామ్। చతుర్దశసహస్రాణి రక్షాం స్యపి మునీశ్వరాః॥ యాజ్ఞవల్క్యసుత చ్ఛాత్రా స్సశిష్యా స్తే త్రయః పునః। మహాదేవేన సంశప్తాః రాక్షసత్వం గతాః పునః। రామహస్తా ద్విముక్తా శ్చ బభూవు రధునా తు తే"ఇతి. కిం చైతస్మి న్విషయే శేషధర్మేఽపి ద్రష్టవ్య మిత్యలం విస్తరేణ. నను మహర్షిజనదుర్లభం రామసాయుజ్యం కథ మత్రిదుష్టరక్షసాం సంబభూవేతిచేన్న "ద్వావిమౌ పురుషౌ లోకే సూర్యమండలభేదినౌ। పరివ్రాడ్యోగయుక్తశ్చ రణేచాభిముఖోహతః" ఇత్యాదినా యుద్ధే హతానాం న ర్యేషా మపి వీర స్వర్గప్రాప్తి స్సర్వవీరసామాన్యభూతా శ్రూయత ఏవ. పరం తు శ్రీరామేణయుద్ధే నిహతానాంతుమోక్షప్రాప్తి రేవ వక్తవ్యా. కుత ఇతి చేదాసన్న మరణానాం భగవద్దర్శన తచ్చింతనాది

యయిన కాత్యాయనికి మువ్వురు పుత్త్రులు కాలక్రమముగఁ బుట్టిరి. వారికే చంద్రకాంతుఁడని, మహామేఘుఁడని విజయుఁడని పేర్లు యున్నవి. ఆపిల్లలను దనపిల్లలనుగానే చూచుకొనుచు ధాత్రివలె (పెంపుడు కత్తెవలె) వారలను లాలించుచు ధర్మ్య గృహమునందే యామైత్రేయి నివసించెను.

యాజ్ఞవల్క్యుని పుత్త్రులు మువ్వురును గ్రమముగఁ బెద్దవారలై యొకప్పుడు మహాదేవుని దూషించిరి. తనను దూషించిన సంగతిని మహాదేవుఁడు తెలిసికొని వారలను మువ్వురను "మీరలు శిష్యసహితులై" రాక్షసులు గండని శపియించెను. వారలు మువ్వురును మహాదేవుని శాపముచే రాక్షసులై పుట్టి ఖరదూషణ త్రిశిరసులను పేర్లతో నొప్పుచు నిప్పుడు శ్రీరామచంద్రునిచేఁ జంపబడినవారలై యాక్షయమగు ముక్తినొందిరి. పదునాలుగువేల రాక్షసులుకూడఁ బూర్వము యాజ్ఞవల్క్య పుత్త్రుల శిష్యులైన మహర్షులేయై యుండిరి. శిష్యసహితముగఁ బై మువ్వురు శపింపబడుటవలన వారితోఁబాటు వీరలును రాక్షసులయి రామునిచేతిలో హతులై ముక్తులయిరని తెలియదగను. ఈ విషయము శేషధర్మము నందును జూడదగును.

ఇచ్చట నొకయాశంక కలుగును.

మహాతపస్వులకుఁగూడ లభ్యముకాని శ్రీరామ సాయుజ్యము నీకుష్టులెట్లు పొందగలిగిరి? అను దానికి సమాధాన మీ క్రింది విధముగఁ దెలిసికొన దగియున్నది. "లోకమున సూర్యమండలమును భేదించుకొని వెళ్లువారు రెండు తెగలుగా నుండిరి. 1 యోగానుసంధానముచేయు పరివ్రాజకుఁడును, 2 యుద్ధమున వెన్నుఁజూపక మరణించువాఁడును" అను నభియుక్తవచనముచే యుద్ధమునఁ జచ్చిన వారలకు వీరస్వర్గము కలుగుట సర్వవీరసామాన్య విషయము. ఇచ్చట విశేష మేమనగా, శ్రీరామచంద్రునిచేత యుద్ధమునందుఁ జంపబడిన వారలగుటచే వీరికి మోక్షము కలిగనని చెప్పుట సమంజసమే యగును. (ఏలనన) మరణ మాసన్నమైన వారలు భగవన్నామోచ్చారణ మొకపర్యాయము చేసినంతనే మోక్షము వచ్చునని శాస్త్రము

సాధన సంపదస్సద్భావా దితి వేద్యం. కించ "యంయం వాపిస్మర న్భావం త్యజత్యంతే కళేబరం తంతమేవైతి కౌంతేయ సదా తద్భావభావిత" ఇతి భగవద్వచనేనాపి తేషాం తద్భావ భావితత్వా త్తత్సాయుజ్య ముపపన్న మేవ భవేత్.

పరమ భక్తేరివ పరమవైరస్యాపి సాయుజ్యహేతుత్వం శ్రూయతే, తథాహి.

"యేన కేనా ప్యుపాయేన మనః కృష్ణే నివేశయే" దితి.

అత ఏవ 'రామవిద్ధా నిశిచరా బాణై ర్మర్మసు తాడితాః రామ మాసాద్య సమరే సాయుజ్యపదవీం గతా' ఇతిస్కాంద పురాణవచనం సంగచ్ఛతే. వస్తుత స్తు యుద్ధే నిహతానా మపి తత్తత్కర్మభేదేన లోకభేద శ్శ్రూయతే. మహాభారతే యథా.

"యై ర్హుతాని శరీరాణి హవ్యాప్తైః పరమసంయుగే। దేవ రాజసమా న్లోకా న్గతా స్తే సత్యవిక్రమాః॥ నే త్వహ్యప్తేన మనసా మర్తవ్య మితి భారత। యుధ్యమానా హతా న్సంఖ్యే గాంధర్వై స్సహ సంగతాః॥ యే చ సంగ్రామభూమిస్థా యాచమానాః పరాఙ్ముఖాః॥ శస్త్రేణ నిధనంప్రాప్తా గతా స్తే గుహ్యకా న్ప్రతి॥ పాల్యమానాః పరై ర్యే తు హీయమానా నిరాయుధాః॥ హ్రీనిషేవా మహాత్మానః పరాసభిముఖా రణే। భిద్యమానా శ్శితై శ్శస్త్రైః క్షత్రధర్మపరాయణాః॥ హతా స్తే బ్రహ్మసదనం గతా వీరా స్సువర్చసః" ఇతి.

చెప్పుచుండ మరణకాలమున సాక్షాద్భగవద్దర్శనము చేయుచు ప్రాణములను విడిచిపెట్టిన యీ రాక్షసులకు ముక్తిగల్గుటకు సందియ మేమియున్నదియని తెలియదగును.

మఱియు "అంతకాలమున ఏయే భావమును స్మరించుచు శరీరమును విడుచునో, యతడు తద్భావమునే పొందును" అను భగవద్వచనమును విచారించినను వా రాక్షసులకు నిరతము తద్భావభావన వలన శ్రీరామసాయుజ్యరూపమగు ముక్తి గలిగెననుట సమంజసమే యగును

మఱియు, "గొప్పభక్తిచేతను వలె గొప్పశత్రుత్వముచేతను గూడ సాయుజ్యము కలుగును. "ఏ యుపాయముచే నైనను శ్రీకృష్ణుని యందు మనమును నిల్పుము" అను నభియుక్తవచనమును మనము వినుచునే యుంటిమికదా! కనుకనే "రాక్షసులు యుద్ధములో రాముని బాణములచే మర్మస్థలములయందుఁ గొట్టబడిన వారలై రామసాయుజ్యమును బొందిరి" అను స్కాందపురాణవచనము గూడ నుపపన్నమగుచున్నది.

యథార్థము విచారించినచో యుద్ధమునందు హతులైన వారికిని వారి వారి కర్మభేదముచేతను, భావభేదముచేతను లోకభేదము కలుగుచున్నట్లు మహాభారతమునఁ జెప్పబడియున్నది. "యుద్ధములో సంతోషపూర్వకముగఁ దమశరీరమును విడిచిపెట్టిన వారలకు దేవేంద్రలోకము వచ్చుననియు, సంతోషము లేనివారలై తప్పనిసరి యని యుద్ధము చేయుచు యుద్ధమున మడసిన వారలకు గంధర్వలోకము వచ్చుననియు, యుద్ధములో శత్రువుల నభయము యాచించి పరాఙ్ముఖులై పోవుచున్నప్పుడు బాణముల దెబ్బతగిలి హతులైన వారలకు యక్షులలోకము కలుగుననియు, ఎవరు నిరాయుధులయ్యు శత్రువులకు వెన్నుఁజూపక క్షాత్రధర్మాసక్తులై శత్రుబాణములచే భేదింపబడియెదరో వారలకు బ్రహ్మలోకము కలుగుననియు (భారతమునఁ జెప్పబడినది యని తెలియదగు.)

[1]ఖరాదీ నసురా న్హత్వా దండకా న్వీతకంటకాన్,
కృతవంతం రాఘవం తం స్తువంతిస్మ మహర్షయః. ౨౪౫

[2]కాకుత్స్థాఖిలకారణేహ కరుణాసింధో మహాజోరణే,
సీతాంతఃకరణారవిందతరణే ధర్మాత్మనాం ధారణే
నాకామిత్రవిదారణేఽహితతమ శ్యామిత్ర ముచ్చైరణే
నాశ్చర్యం భవతి ప్రపన్నశరణే త్వ య్యాశిషాం పూరణే.
౨౫౫

శాంతానాం విజితాత్మనా మిహా జనస్థానేఽన్యథా నిరుజాం
క్రవ్యాదాః కిల దుర్మదా స్సమభవ న్నార్తిప్రదా స్తే గదాః
ఓజోభేషజసేవనా దుపగతే ష్వేషు క్షయం తే క్షణా
న్నాసత్యాపితసంవిదాఽద్య భవతో శ్లాఘ్యాః కృతా స్తే వయమ్
౨౬౫

దృష్ట్యామో భువనత్రయీ గురుశిరోభాగోపకంఠే సదా
స్థిత్వోర్వీజయుతం ప్రసార్య చ బహి ర్వ్యాహారసజ్ఞా ముహుః
ధూ ర్తస్యాస్య దశాస్యభీమభుజగస్యాఽపి క్రమా న్నిగ్రహా
దోర్జస్వి న్నహితుండికేన భవతాఽ పాసిష్యతే సా చ భీః ౨౭౫

[3]ఏతస్మి న్సమయే దివోఽతి ముదితా దేవా స్తథా చారణాః
నిఘ్నంతో బహుదుందుభీ న్సుమచయాసారం తు రామోపరి
వర్షంతో రఘురామ మేవ మవద న్నాక్షై తదర్థం పురా
ప్రాహ శ్రీశరభంగనామకమునే రింద్ర స్తమే త్యాశ్రమమ్.

1 క॥ 2 నక॥ రా॥ 3 శవి॥.

౨౪ ఖరుఁడు మొదలగు రాక్షసులను సంహరించి దండకమును రాక్షసభయ రహితమును గాఁ జేసిన రామచంద్రమూర్తిని మహర్షులివ్విధముగ స్తోత్రము చేసిరి.

౨౫ ఓ సకల ప్రపంచ కారణభూతా! ఓ దయా సముద్రా! ఓ యజ్ఞాన తమస్సంహారకా! ఓ సీతా మనోరవింద ప్రభాకరా! ధార్మికుల కాధార భూతుఁడవును, రాక్షస సంహారకుఁడవును, శరణాగత రక్షకుఁడవును, ఆశీఃపూరకుఁడవునగు నీవు యుద్ధములో శత్రువులను నశింపఁ జేసితివని గొప్ప యాశ్చర్య విషయ మేమియు లేదు.

౨౬ ఓ రామచంద్రా! ఈ జనస్థానమునందు శాంతచిత్తులై తపము చేసికొనుచున్న వారును, తత్త్వవేత్తలును, మఱియొక విధముగ నెట్టి రోగములు లేనివారు నయిన యీ మహర్షులకు రాక్షసులే రోగతుల్యులైరి. నీ పరాక్రమ మనెడి యౌషధముచే మాకుండిన రాక్షసులనియెడి రోగములు నశించిన హేతువుచే సత్యప్రతిజ్ఞుఁడవగు నీచే మేము రోగవిముక్తులము చేయబడితిమి.

౨౭ ఓ రామచంద్రా! తన బాహువులనియెడి నాలుకలను దెరచి లోకముల నల్లకల్లోలము చేయుచున్న ధూర్తుఁడగు రావణుఁడను సర్పమును గూడ విషవైద్యుఁడు వలెనున్న నీవు నిగ్రహించి త్వరలో వాని వలని భయమును గూడ మాకు లేకుండఁ జేయుగలవని నమ్ముచున్నాము.

౨౮ ఈసమయమున దేవతలు, చారణులు మొదలగు వార లాకాశమునుండి రామునిపైఁ బుష్పవర్షము సంతోషమునఁ గురిపించుచు దుందుభులను మ్రోగించుచుఁ బిమ్మట రామునితో నివ్విధముగ విన్నవించిరి. 'ఓ జగన్నాథా! దేవేంద్రుఁడు పూర్వము శరభంగాశ్రమమునకు వచ్చినది యమ్మహర్షి ద్వారా నీకుఁ జెప్పించి నిన్నిచ్చటకు రావించి రాక్షస సంహారమును నీ చేతఁ జేయించఁగలందులకే యని తెలిసికొనుము'

ఆసీత్తో౽సి తతో భవా న్మునిజనై ర్దేశం త్విమం తు క్రమాత్
కార్యం నో భవతా కృతం రఘుపతే త్వన్మాలతో౽తః పరమ్
సర్వే తాపసపుంగవా స్సుఖతరం ధర్మం చరిష్యం త్యమీ
నాథా౽హో! భవదీయదాక్ష్య మతులం విష్ణో ర్యథా దృశ్యతే. ౨౯ ॥

శ్రీరామా౽త్ర భవాం శ్చతుర్దశసహస్రా న్యాశరాంస్తు క్షణే
సంహర్తా౽సి భవత్కృతం త్విద మహో కర్తుం న శక్యం పరైః
సంస్తుంత్త్యైవ మథా౽౽నతిం రఘుపతే స్సంప్రాప్య సర్వే బుధా
స్స్వంస్వం స్థాన ముపాగమ న్రఘుపతేః కర్మ స్తువంతో౽ద్భు
తమ్. ౩౦ ॥

నివాసార్థం జనస్థానం మహర్షీణాం వితీర్య సః
రామ స్తదాజ్ఞాం సంప్రాప్య నిరగా ల్లక్ష్మణాంతికమ్. ౩౧ ॥

ఆగచ్ఛంత మవేక్ష్య రాఘవ మరం సౌమిత్రి రద్రి ర్బిలా
దానీయా౽వనిజాం నిజాశ్రమ మగా ద్రామో ప్యుపేత స్తదా
సీతా౽౽లింగ్య పతిం విముక్తకవచం సందృశ్యమానవ్రణం
రక్షోనాశకృతం మునీంద్రసుఖదం స్తౌతిస్మ తం నైకధా. ౩౨ ॥

౨౯ క్రమముగ నీ విచ్చుటకు మహర్షులచేఁ దీసికొని రాబడితివి. ఓరామచంద్రా! మాకుఁ గావలసిన రాక్షససంహార రూపమగు కార్యము నీమూలకముగఁ బూర్తి యయ్యె. నీ దయవలన నిటుపిమ్మటఁ దాపసులందరును సుఖముగ ధర్మముల నాచరించి కొనియెదరు. ఓనాథా. నీసామర్థ్యము మిక్కిలి యాశ్చర్యకరమైనది. విష్ణు సామర్థ్యమువంటిది యనియే నీసామర్థ్యము చెప్పనొప్పును.

౩౦ ఓ రామచంద్రా! నీవు పదునాలుగువేల రాక్షసులను క్షణకాలములో సంహరించితివి. నీవు చేసిన పని నితరు లెవ్వరును జేయ నసమర్థులు'' అని యిట్లు దేవతలు రాముని స్తుతించి యతనియనుజ్ఞ నొంది తమ తమ నెలవుల కేగిరి.

౩౧ పిమ్మట రామచంద్రమూర్తియు నాజనస్థానమును మహర్షులకు నివసించుట కొసంగి వారియనుమతి నొంది యట నుండి సీతాలక్ష్మణుల సమీపమునకు వచ్చుచుండెను.

౩౨ రామునిరాక కెదురుచూచుచున్న లక్ష్మణుఁడును రాముఁడు వచ్చుచున్నటులఁ దెలిసికొని వెంటనే కొండ గుహనుండి సీతను దీసికొని తమపర్ణశాల కేతెంచెను. రాముఁడు నా సమయమున కచ్చటకు వచ్చెను. కవచము నూడదీసి వేసినందున స్పష్టముగఁ గనబడుచున్న వ్రణములుగల వాఁడును, రాక్షససంహారముచేసి మునులకు సౌఖ్యము నొనగూర్చిన వాఁడునగు రామచంద్రమూర్తిని సీత గాఢముగ నాలింగనము చేసికొని యా వ్రణములను తనచేతితో నిమురుచుఁ గొంత సేపు విచార పడి పిమ్మట రామునిపరాక్రమమున నేకవిధములఁ గొనియాడెను.

నిర్గత్యాఽశు తతోఽసురేంద్రనికటం చాఽకంపన స్సత్వరం,
లంకాం ప్రాప్య దశాననం ప్రతి గత స్సప్రశ్రయం ప్రాఽహ తం
రాజ న్నాత్రిచరా శ్చతుర్దశసహస్రాణ్య స్థితా దండకే,
సర్వే తే నిహతాః ఖరోఽనుజయుత శ్చాభూ ద్ధతః కేనచిత్. 33॥

తచ్ఛ్రుత్వా వచనం సహా న్నివ రుషా ప్రాహాఽథ తం రావణః,
కేనైవం తు పరాసునా కృత మరే! సర్వే కిమర్థం హతాః
కృత్వా మేఽప్రియ మాచరన్సురపతి శ్శ్రీశోఽథ వా వై యమః
ప్రాప్తుం సౌఖ్య మశక్త ఏవ వద మే తద్ఘాతకం సత్వరం. 34॥

భీతోఽకంపన ఏవ మాహ వచనం తం రాక్షసేంద్రం పున,
ర్మహ్యం దేహ్యాభయం తతోఽసురపతే సర్వంవదిష్యామ్యహం
ఇత్యుక్త్వా ప్రథమం తతోఽభయవరం సంప్రాప్య చాఽకంపనః
ప్రాహాఽథో రఘురామవృత్త మఖిలం తచ్ఛౌర్యధైర్యాదికం. 35॥

తచ్ఛ్రుత్వా వచనం త్వకంపన మథ ప్రాహాఽసురేంద్రః క్రుధా,
నిరత్యాఽర ముపేత్య దండకవనం రామం హనిష్యా మ్యహమ్
ఇత్యుక్తే పున రేవ మాహ వచనం సోఽకంపనో రావణం
రాజ న్వచ్మి తదీయవిక్రమ మహం శ్రుత్వా సమాలోచయ. 36॥

౩౩ పదునాలుగువేల రాక్షసులు చావగా మిగిలిన యకంపనుఁడను రాక్షసుఁడు జనస్థానమునుండి బయలుదేరి రావణున కీ వార్తకయురును జెప్పుటకై తొందర తొందరగ లంకకేగి రావణుని దర్శించి, చేతులు జోడించి యిట్లు విన్నవించెను. ఓ రాజా! నాకుఁ జెప్పుటకు నోరాడకుండ నున్నది. ఏమి చెప్పుదును. జనస్థాన మందున్న పదునాలుగువేల రాక్షసులను, ఖరదూషణ త్రిశిరసులను నొక మనుష్యమాత్రుఁడు చంపివేసెను.

౩౪ ఆ మాటవిని రావణుఁడు భగ్గున మండిపడి యకంపనునితో నిటులఁ బలికెను. ఓరీ యకంపనా! ఆయువు మూడినవాఁడెవ డింతపని చేసెను? ఎందులకై వాఁడు రాక్షసులను జంపెను? ఇంద్రుఁడైనను, లేక యుపేంద్రుఁడైనను, లేక యముఁడైనను నెవ్వఁడు కాని నా కప్రియమును చేసి సుఖముగ నుండగలఁడా? అట్టి స్థితిలో నెవ్వ డింత పని చేసెనో శీఘ్రముగఁ జెప్పుము.

౩౫ ఇట్లు రావణుఁ డడుగగా వాని పేరు ముందుగ జెప్పుటకు, వాని పరాక్రమమును వర్ణించి చెప్పుటకును రావణునివలన భయపడి రావణుని నిటులఁ బ్రార్థించెను. 'నాథా! నా కభయ మొసంగితివేని వాని వృత్తాంతమును సమగ్రముగఁ జెప్పెదను.' అని పలుకఁగా రావణుఁడును వాని కభయ మొసంగగాఁ బిమ్మట నకంపనుఁడు రావణునితో రాముని వృత్తాంతమును, వాని శౌర్యధైర్యములను జూసినట్లు సమగ్రముగఁ జెప్పెను.

౩౬ ఇట్ల కంపనునిచేఁ జెప్పబడిన రామ వృత్తాంతము నంతను విని రావణుఁడు మిక్కిలి కోపావేశముతో నిర్వ్యథముగ నకంపనునితోఁ బలికెను. ఓరీ యకంపనా! నే నిప్పుడే యచటి కేగి రామునిఁ జంపి వచ్చెదను. అని పలుకగా నారావణుని మాటలను విని యకంపనుఁడు తిరిగి యా రాక్షస రాజుతో నిటులఁ బలికెను. ఓ రాజా! నీ మాట కెదురు చెప్పుచుంటినని నీవేమియుఁ దలంపకుండెనిచో నతని పరాక్రమమునుఁ దిరిగి మఱియొకమారు చెప్పెదను. విన్నపిమ్మట బాగుగ నాలోచించి యేపనినైనఁ జేయుము.

రామః క్రోధ ముపేయివా న్యది నదీవేగం శరై స్సంహరేత్ ,
కించ తృష్ణాన్వితఖాఽవసాదనకృతౌ శక్తో భవే ద్రాఘవః
కిం చోద్ధర్తు మసౌ క్షమోపి భవితా మజ్జన్మహీం రాఘవః
సంహర్తుం భువనత్రియం పున రసౌ స్రష్టుం సమర్థో భవేత్. 324

సంగ్రామే నహి శక్యతే రఘుపతి ర్జేతుం సురై ర్వాఽసురై
స్స్వర్గః పాపజనై రివాఽసురపతే సత్యం బ్రవీ మ్యాద్య! తే
కిం త్వత్యుత్తమ రూపశీలసహితా తస్యాస్తి జాయా విభో!
నో తాదృ శ్వమరీషు కిన్నరవధూ ష్వన్యాసు వా దృశ్యతే. 384

౩౭౪ ఓ రాక్షసరాజా! రామునకుఁ గోపము వచ్చెనేని పొంగి పొరలి వచ్చుచున్న నదీప్రవాహమునైనను బాణములచే రాకుండఁ నిలుపగలఁడు. మఱియు, నతఁడు కోపించెనేని నక్షత్రములతోఁ గూడిన యాకాశమునైనను బాణములచేఁ జీల్పఁగలడు ఇంకను నతఁ డాగ్రహించెనేని సముద్రమున మునిగిపోవుచున్న భూమినిగూడఁ బైకి నుద్ధరింపఁగలఁడు. అతఁడు ముల్లోకములను సృజించుటకును దలంచినచో వానిని లయము చేయుటకునుగూడ సమర్థుఁడగును. (ఆకాశమునైన జీల్పగల డనుటచేఁ త్రివిక్రమావతారము, భూమి నుద్ధరింపగలఁడనుటచే వరాహావతారము, నదీవేగమును సంహరింపగలఁడనుటచేఁ కృష్ణావతారము సూచింపబడినవని తెలియదగును.) సృష్టిస్థితి సంహారములను జేయువాఁడుకూడ నతఁడేయని చెప్పటచే పరబ్రహ్మ యని చెప్పబడినది యగుచున్నదని తెలియదగును.

౩౮౪ ఓ రాజా! యుద్ధములో రాముని జయించుటకు నీకు శక్యముకాదు. మహాప్రభూ! సత్యము చెప్పెదను. నీ వొకఁడవేకాదు, రాక్షసులందరు నేకమైనను నతనిని జయింపలేరు. దేవత లందరు నేకమైనగూడ జయింపలేరు. దేవదానవు లందరు కలిసినను జయింపలేరు. ముమ్మాటికి సత్యము. ఇంద రేకమైనను నెటుల జయింపలే రనియెదవేమో చెప్పెదను. పాపు లెందరుకలిసినను స్వర్గమును జయింపలేనట్లు (చేర లేనట్లని భావము) ఎందఱు రాక్షసులు కలిసి వచ్చినను నతనిని జయింపలేరు సుమా! కావున రాముని నీవు చంపదలచిన నే నొక యుపాయము చెప్పెదను. ఆ రామునకు సీతయను భార్య కూడ వెంట నున్నది. ఆమె సౌందర్యమువంటిసౌందర్య మెచ్చటను లేదు. అట్టి స్త్రీ దేవతా స్త్రీలలోగాని, కిన్నర స్త్రీలలోఁగాని, యితర స్త్రీలలోఁగాని కనపడదు.

*తజ్జాయాపహృతే ధ్రువం రఘుపతిః కామీ వ్యసన్యప్యభూచ్చ
స్త్వంగత్వాఽపహరాఽద్య! తస్య యువతిం సీతాభిధాం సుందరీమ్
ఇత్యుక్తం వచనం తు తస్య మధురం ప్రసిద్ధశాస్యస్య త,

---

*నను పూర్వకర్మ పరిపాకవశా ద్రామే మహత్త్వ బుద్ధిమతాఽకంపనేన దశముఖం ప్రతి కథ మేవం దురాలోచన ముక్త మితి చేన్న "యథా రాజా తథా ప్రజా" ఇతి న్యాయేన రాజ్ఞ ఇవ తద్భృత్యస్యాఽపి స్థితౌ న కిమప్యాశ్చర్యం భవేత్ స్వయం గుణవతో పృథగ్దాసత్వేన స్వప్రభో రనుకరణం యుక్త మేవ. తదనుకూలతయా త్వసంభాషణే తదనుగ్రహ భాజన మయం న భవేత్.

అపిచ యది దశముఖ స్తేన యోద్ధుం గత స్తదా తేన ధ్రువ మయం నిహతో భవేత్. తతః కుంభకర్ణస్య పానమత్తత్వేన తేన వినా మేఘనాదాదయ స్తు స్వపితృహనన రోషావిష్టాః రామేణ యుద్ధ్వా తేఽపి తేన సంహృతా భవేయుః. ప్రథమ మేవ రావణో యోద్ధుం గత శ్చే దేవం మూలచ్ఛేదో భవేత్. ఇత్యాలోచ్య రావణస్య స్త్రీవ్యసనాసక్తత్వాత్తదభీష్టవచన ముక్తవాన్. తస్యాఽయ మాశయః. సీతాపహరణే రామస్య కాముకత్వేన, తదాసక్త మనస్త్వేన చ భార్యావియోగదుఃఖేన రాఘవోఽపి మృతో భవేత్. అత

౩౯౪ ఆమెను నీ వపహరించి తెచ్చితివేని యామె యందు విశేషకామము గల రాముఁడు తద్వియోగ దుఃఖముచేఁ బ్రాణముల విడుచును. కావున వెంటనే వెళ్ళి సీతయను * రామునిభార్య నపహరించి తెమ్ము. ఇ ట్లకంపనుఁడు చెప్పుట తోడనే యా వచనములు రావణునకు బాగుగ రుచించెను. (తేరగా స్త్రీదొరకుట, యుద్ధ మక్కరలేకయే శత్రువు చచ్చుట, రెండు శ్రేయస్సులు గలుగును గాన వీని యాలోచన రావణునకు రుచించెను)

---

* పూర్వకర్మపరిపక్వవశముచే రాముఁడు పరమాత్మయని తెలిసికొనిన యకంపనుఁ డిట్టి దురాలోచనము రావణునితో నెట్లు చెప్పెను? అను నాశంక పొడమును. ఇందునకు సమాధాన మిటులఁ దెలిసికొన దగినది.

“యథా రాజా తథా ప్రజాః” అను న్యాయము ననుసరించి రాజెటువంటివాఁడో రాజసేవకులు నట్టివారగుటలో నాశ్చర్యము లేదు.

ఇదియునుంగాక, తా నెంత గుణవంతుఁడైనను దా నర్హదాసుఁ డగుటచేఁ దనప్రభువు కనుకూలముగ మాట్లాడక పోయినచో నతని యనుగ్రహమునకుఁ బాత్రుఁడు కాఁడు కాన, నతని ననుకరించుట యుక్తమే యగు. ఇంతియే కాక, రావణుఁడు తలంచినటుల నతఁడు యుద్ధమునకు వెళ్ళినచోఁ దప్పక రామునిచే రావణుఁడు హతుఁడగు ననియు, కుంభకర్ణుఁడు తాఁగుబోతు, ఇక నింద్రజిత్తు మొదలగు వారలు తమతండ్రి పగఁ దీర్చుకొనుటకు యుద్ధమునకుఁబోయి రామునిచే వారలుకూడ హతు లగుదురు. రావణుఁడు ముందుగ యుద్ధమునకు వెళ్ళినచో నిట్టి మూలచ్ఛేదము గలుగుటయే కాక తన కూటిలో మట్టి పడునని యాలోచించి రావణుఁడు స్త్రీ వ్యసనాసక్తుఁడు గాన నీవచనము రుచించునని వాని కభిమతముగనే చెప్పెను.

వాని యభిప్రాయ మీ క్రిందివిధముగఁ దెలిసికొనఁదగినది. సీత నపహరించినచో రాముఁడు కాముకుఁడును తదాసక్తమనస్కుఁడును గాన భార్యావియోగదుఃఖముచే రాముఁడుకూడ మృతినొందునని

స్సీతా మపహరేత్యకంపన స్త ముక్తవా నితి వేద్యమ్. నన్వేవ మపి తస్య కాముకత్వేపి "దేశే దేశే కళత్రాణి" త్యనేన అన్యకళత్రసంభవే పూర్వవిచారోఽపగతో భవేత్, "భార్యాదుఃఖం పునర్భార్యా" ఇతి న్యాయేన కించిత్కాల మేవ పూర్వవిచారస్య సద్భావాత్. కించ, స్వభార్యాఽపహరణే తద్ధననేఽల్పోఽపి వా యతేత. నహి మర్తుం ప్రయతేత. ఏవం స్థితే రాఘవ స్స్వభార్యాపహరణమాత్రేణ కథం మ్రియతే? కించ, రావణాక్షేపకామనయా తే నైవ ముక్తం, ముత తద్వాంచ నార్థమితి విచారితే స త్యాత్త్రక్షేమస్య తత్త్వేమాఽఽయత్త త్వేన తద్వాంచనార్థమితి నైవ వక్తుం శక్యతే. ఏవం స్థితే కథ మత్రాఽకంపనే నాసమీచీనో య ముపాయః కథిత ఇతి చే దిద మత్ర సమాధేయం.

"ఉత్పత్తిస్థితిసంహారకారిణీ సర్వదేహినాం సీతా భగవతీ జ్ఞేయా" ఇత్యాద్యుపనిషద్వచనేన "లక్ష్మ్యా సహ హృషీకేశో దేవ్యా కారుణ్యరూపయా" ఇతి వచనేన చ కారుణ్యరూపాయా, శ్రీరూపాయా, శ్చ సీతాయా అభావే రామస్య తేజ ఏవ నాస్తి. తస్మైవ రామ శ్శ్రీమా నభూత్. ఇదానీం రావణ శ్శ్రీమా న్భవే త్స త్వశ్రీమా న్భవేత్. తదా మృతప్రాయ ఏవ భవేదిత్యాశయే నోక్త మితిసమాధేయమ్.

నిశ్చయముగ దలంచియే సీత నపహరింపు మని చెప్పెనని తెలియ దగును.

ఇందుపై నొకయాశంక కలుగును. (ఏమననగా) రాముఁడు కాముకుఁడైనను "దేశే దేశే కళత్రాణి" (భార్య లెచ్చట బడితే నచ్చట నే దొరకును.) అని రాముఁడే చెప్పెను గాన నింకొక వివాహము చేసికొనిన నా భార్యా సౌఖ్యము కలుగుటలోఁడనే పూర్వవిచారము తొలుగును కదా! "భార్యాదుఃఖం పున ర్భార్యా" (భార్యాదుఃఖము తిరిగి భార్య వచ్చువరకే) యని శాస్త్రము చెప్పుచుండ నింతమాత్రమునకే రాముఁడు చచ్చిపోవునని యకంపనుఁ డెట్లు చెప్పెను. మఱియు లోకములోఁ దన భార్య నెవ్వఁడయిన నెత్తుకొని పోయినచో నపహరించినవానిని సంహరించుట కెంత స్వల్పజనుఁడైనను బ్రయత్నించును గాని తాను జచ్చుట కెవ్వఁడును బ్రయత్నింపఁడుగదా! ఇంకను విచారింతుము. అకంపనుఁడు రావణుని క్షేమముఁ గోరియా యాలోచనము చెప్పెనా? లేక వానిని వంచింపఁజేయు నూహతో నిటులఁ జెప్పెనా? అని విచారించిన తన క్షేమము రావణుని క్షేమమును బట్టి యుండును గాన వంచనార్థమై చెప్పెనని తలంపఁ గూడదు. ఇట్టి స్థితిలో నకంపనుఁ డిప్విధముగ నయోగ్యమైన యుపాయ మెట్లు చెప్పెనని యాశంకకు సమాధాన మేమనగా, "శ్రీరామ సాన్నిధ్య వశమున సీత జగదాధారయు, సర్వదేహుల యుత్పత్తి స్థితి సంహార కారిణియు, భగవతియు నగుచున్నది" అను నుపనిషద్వచనము చేతను" కారుణ్య రూపిణియగు లక్ష్మిచే నారాయణుఁడు జగద్రక్షకుఁ డగుచున్నాఁడు" అను వచనముచేతను కారుణ్యరూపిణియు, లక్ష్మిరూపిణియు, నగు సీత లేకపోయిన రామునకుఁ దేజస్సే లేదు. లక్ష్మిరూపిణియగు సీత యుండుటచేతనే రాముఁడు శ్రీమంతుఁ డయ్యెను ఇప్పుడు రావణుఁడు శ్రీ రూపిణియగు సీత నపహరించినచో రావణుఁడు శ్రీమంతుఁ డగును; రాముఁ డశ్రీమంతుఁ డగును. (దరిద్రుఁ డగును) అప్పుడు (సీత లేనప్పుడు) రాముఁడు మృతప్రాయుఁడే యగు నని యొడి యభిప్రాయముచే నిట్ల కంపనుఁడు చెప్పెనని సమాధానము చేసికొనదగు.

*త్వం చింత్యాత్మని సర్వథా సముచితం మేనే తదీయం వచః. ౩౯

పశ్చాత్కార్యగతిం విచార్య మనసా తం రాక్షసేంద్రోఽవద
ద్బాఢం తద్భవతా యదుక్త మచిరాద్యాస్యామ్యహం దండకాన్,
లంకాం భూమిసుతాం నయేయ మచిరా ద్రేఽకంపన ప్రాభవం
ద్రష్టవ్యం భవతా మదీయ మనఘ! త్వం గచ్ఛ గేహం నిజమ్. ౪౦

---

*సంచిత్యాత్మనీత్యస్య—సనత్కుమారవాక్యం స్మృత్వే త్యర్థః. తథాహి—సనత్కుమార మాసీనం రావణో వాక్యమబ్రవీత్ । దేవదానవరక్షాంసి యే హతా స్సమరేఽరయః॥ కాం గతిం ప్రతిపద్యంతే కేన తే హరిణా హతాః॥

సనత్కుమారః—యే యే హతా శ్చక్రధరేణ రాజన్। త్రైలోక్యనాథేన జనార్దనేన । తే తే గతా స్తన్నిలయం నరేంద్రాః। క్రోధోఽపి దేవస్య వరేణ తుల్యః॥ శ్రుత్వా తత స్తద్వచనం నిశాచర స్సనత్కుమారస్య ముఖా ద్వినిర్గతం। తదా ప్రహృష్ట స్స బభూవ విస్మితః కథం ను యాస్యామి హరిం మహాహవే॥

మునిః—మనసశ్చేప్సితం య త్తద్భవిష్యతి తదా హవే। సుఖీ భవ మహారాజ కించి త్కాలం ప్రతీక్షయ॥ సనత్కుమారా త్తద్వాక్యం చింతయానో ముహుర్ముహుః॥ రావణో ముముదే మోహా ద్యుద్ధార్థీ విచచార హ'' ఇత్యాది వాక్య విచారణే ముక్తార్థం భగవతా రామేణ యేన కేనాపి ప్రకారేణ తద్విరోధం సంపాద్య తస్మా న్మర్తు కాముక ఏవేతి ద్యోత్యతే. శ్రీరామహస్తా ద్వధేచ్ఛుః రావణః సీతా మపహరే త్యకంపనవచన మనుకూలత్వే నాంగీచకారేతి నిష్కృష్టోఽర్థః.

* మనమునం దాలోచించి యకంపనుని వచనమునుఁ దగిన దానినిగాఁ దలచెను.

౪౦౫ పిమ్మటఁ జేయదగిన విషయమును స్వయముగ మనస్సునం దాలోచించి యకంపనునితో నిట్లు చెప్పెను. ఓరీ యకంపనా! నీవు చెప్పిన యాలోచనము బాగుగనే యున్నది నే నిప్పుడే వెళ్ళి సీతను లంకకు దీసికొని వచ్చెదను. నా సామర్థ్యమును నీవే చూచెదవుగాక. నీవు నీయింటికిఁ బొమ్ము.

---

*మనమునం దాలోచించి యనుదానికి—సనత్కుమారుఁడు పూర్వము తనకుఁ జెప్పిన వాక్యమును స్మరించి యని యర్థము. సనత్కుమారుఁ డొకప్పుడు రావణుని సమీపమునకు రాగా, నతఁ డీక్రింది విధముగ బ్రశ్నించెను. ఓ సనత్కుమార మహర్షీ! యుద్ధములో విష్ణుమూర్తిచేతిలోఁ జచ్చిన వారిగతి యేమి యని ప్రశ్నింపగా మహర్షి యిటులఁ జెప్పెను. ఓ రావణా! త్రిలోకాధిపతియగు చక్రధరుని చేతిలో జచ్చినవారికి విష్ణులోకము కలుగుననియు, భగవంతుని క్రోధముకూడ వరముతో సమానమేయనియుఁ జెప్పగా రావణుఁడు సంతోషించి యాయనతో నాకెట్లు యుద్ధము పొసగునని యడుగఁ గొంత కాలము నిరీక్షింపుము. భగవంతుఁడు రాముఁడుగా నవతరించి నపుడు లభింపగలదని చెప్పెను. ఆ సనత్కుమారుని వాక్యమునే స్మరించుచుండెను. అకంపనుఁడు రాముని సంగతి చెప్పుటచే సనత్కుమారవాక్యము జ్ఞప్తికివచ్చి యితఁడు భగవంతుఁడే కాన నితనిచేతిలోఁ జచ్చుట శ్రేయస్కరమే కావున, నకంపనుఁడు చెప్పిన సీత నపహరింపు మనుమాటయును ననుకూలముగానే యున్నదని తలంచెనని పర్యవసానము.

ఇత్యుక్త్వాఽకంపనం సద్యః ప్రేషయిత్వా తదాలయమ్
భావికార్యసమీక్షాకృత్యై రావణ శ్చింతయం స్థితః. ౪౧

ఇత్యాశ్చర్యరామాయణే అరణ్యకాండే దశమ స్సర్గ
స్సమాప్తః

---

## ఏకాదశ స్సర్గః



[1]మారీచాశ్రమ మాగతోఽథ దనుజాధీశో ర్చిత స్తేన తం
ప్రాహైవం యుధి రాఘవేణ నిహతా స్సర్వేఽసురా దండకే
సాంబ స్తేన హతో మునీంద్రనిచయస్యాదా ద్వరం సోఽభయం
నిర్వైరం ఖరదూషణత్రిశిరసో నిహేఽతుత స్సంహృతాః. ౧

తద్భార్యాఽపహృతౌ సహాయమధునా త్వం మే విధేహి ద్రుతమ్
ఇత్యుక్త స్సతు రావణం ప్రతి వచః ప్రాహేద మన్యాదృశమ్
సుప్తో రామమృగాధిపోఽసురమృగప్రాణాపహారీ త్వయా
రాజ న్నద్య వృథాఽ త్మనాశనకృతే కిం బోధ్యతే రావణ! ౨

లంకానాథ! మయి ప్రసీద రమతాం దారే ష్వభీష్టం భవాన్
రక్షోవంశ వినాశనం తు కిమరే! కర్తు భవా నీహతే
శత్రు స్తే సుహృదాత్మనాఽవద దిదం త్వన్మూలసర్వాంకషమ్
త్వత్క్షేమార్థిజనో న కోఽపి కథయో దేవం వ్రజ స్వాం పురీమ్. 3

---

1. శా॥

౮౧ ఇట్లుచెప్పి యకంపనునిఁ బంపి ముందు జేయఁదగినదాని సమీకరణ మునకై రావణుఁడు విచారించుచుండెను.

అరణ్యకాండమున పదియవసర్గము

సమాప్తము.

---

## ఏకాదశసర్గ ప్రారంభము.

---

౧ అనంతరము రావణుఁడు మారీచాశ్రమమునకేఁగి యతనిచే సన్మానితుఁడై వానితో నిట్లు పలికెను. మామా! ఎంతఘోరమైన యాపద సంభవించెనో చూచితివా? రాముఁడు దండకము నందలి రాక్షసులనెల్లఁ బరిమార్చెను. విరోధకారణ మేమియు లేకయే సాంబుని హత మొనర్చెను. ఇంతియే కాక మునుల కెల్ల నభయ మొసంగెను.

౨ కావున రామపత్ని నపహరింప బూనితిని. నీ వీ విషయమున నిశ్చయముగ సహాయ మొనర్పవలయును. ఇట్లు రావణుఁడు చెప్పగా విని మారీచుఁడు తిరిగి రావణునితో నిట్లనెను. నాయనా! రాక్షసులను మృగములను హింసింప నుంకించు రాముఁడను సింహ మెచ్చటనో నిద్రించుచుండ దాని నాత్మనాశమున కేల లేపఁ బ్రియత్నించెదవు!

౩ ఓ లంకేశ్వరా! నా యందనుగ్రహ ముంచి నేను చెప్పినటులఁ జేయుము. నీ భార్యలతో నీవు యథేష్టముగఁ బ్రవర్తింపుము. రాక్షస వంశనాశన మేలఁజేయ సమకట్టెదవు? నీ శత్రు వెవ్వఁడో పైకి మిత్రరూపమున నటించుచు సర్వనాశకర మగు నీ యుపాయమును జెప్పియుండును గాని, నీ క్షేమమును గోరినవాఁ డెవ్వఁడు నిటులఁ జెప్పడు. కాన నింటి కేగుము.

ఇతి సంబోధిత స్తేన రావణోఽపి తథేతి సః
నిగద్య వినివృత్యాఽఽగా ల్లంకాం నిజపురీం ప్రతి. ౪

తతః శూర్పణఖా సాపి ఖరాదివధదుఃఖితా
దక్షిణాం దిశ మాశ్రిత్య జనస్థానా ద్వినిర్గతా. ౫

ఖరాదీనాం రాక్షసానాం యథాఽంతో రాఘవా దభూత్
తథా దశముఖస్యాంతం మన్వానా ద్రుతభావినమ్
అంతకస్య పురం నేతు మివ సా త్వకుతోభయమ్
ద్రుతం గతవతీ చాభూ ల్లంకాం రావణపాలితామ్ ౬-౭

విభ ర్తృకాణాం భువి కామినీనా మేషైవ శిక్షార్హ తమేతి నూనమ్
ప్రబోధయ న్తీ వ నికృ త్తకర్ణ నాసాఽసురీ ప్రాప నిజాం తు
లంకామ్. ౮

యా భూమిజాసుఖలతాళిలవిత్రభూతా,
యా భ్రాతృవంశకుజనాశకుఠారభూతా,
యా రామవిక్రమమణే ర్నికషాయమాణా,
సా సత్వరం దశముఖస్య గృహం వివేశ. ౯

యా భ ర్తృహీనభగినీవచనశ్రుతే స్తు,
స్యా త్సర్వనాశపరిసూచనలక్ష్యభూతా,
సా రాక్షసీ దశముఖస్య సభాలయం తం,
ప్రాప్యాఽహ మంత్రిపరివేష్టితరావణం తమ్. ౧౦

౪ ఇట్లు మారీచునిచే బోధింపబడి రావణుఁడు నీవు చెప్పినటులఁ జేయుదు
నని చెప్పి తన రాజధానియగు లంక కేగెను.

౫ అనంతరము శూర్పణఖయును ఖరదూషణాదులవధచే సహింపశక్యము
కాని దుఃఖముతో జనస్థానమునుండి దక్షిణదిక్కునకు బయలు దేరెను.

౬-౭ ఖరుఁడు మొదలగు రాక్షసులు రామునిచే హతులైనట్లు రావణుఁడు
కూడ హతమగునని యెంచి నిశ్చయముగ యమపురమునకు దీసికొని
పోవుటకు బయలుదేరెనో యనునట్లు దక్షిణపు దిక్కునుఁ బయనమై
రావణపాలితమగు లంకకు తొందరగ వెళ్ళుచుండెను.

౮ ధర్మహీనులగు కాముకురాండ్రకుఁ దనకు లక్ష్మణుఁడు చేసిన విరూప
కరణ రూపమగు శిక్షవంటి శిక్షయే తగినదని ప్రకటన చేయుదాని
వలె కర్ణనాసికా విహీనురాలగు నా శూర్పణఖ యతిశీఘ్రముగ
లంకకు వచ్చెను.

౯ ఎవ్వతె సీతాసుఖలతకు లవిత్రము (కొడవలి వంటిది) అగునో, ఎవ్వతె
సోదరవంశమను వంశమునకు (వెదురు పొదకు) గొడ్డలి వంటిది కాను
న్నదో, ఎవ్వతె రామవిక్రమమను రత్నమునకు నికషోపలము (ఒర
పిడిరాయి) కానున్నదో, ఆ శూర్పణఖ శీఘ్రముగ రావణ భవన
మున కేతెంచెను.

౧౦ ఎవ్వతె విధవ తోబుట్టువు మాటలువినిన సర్వనాశన మగునని సూచిం
చుటకు లక్ష్యభూతమై యగునో, యా శూర్పణఖ రావణ సభా
భవనమున కేఁగి యచ్చట మంత్రి పరివేష్టితుఁడైయున్న రావణునితో
నిర్లక్ష్యముగ నిటులబలికెను.

మూఢ! త్వం సముపాగతం భయమిదం నో బుధ్యసే ద్యాప్యహో!
త్వాం భోగేషు రతం మహీప మపి నో లోకాస్తు సత్కుర్వతే
రాజత్వం కథ మాప్స్యసి త్వ మబుధ శ్చాఽయుక్తచార శ్చలో
గ్రామ్యో భోగచయేఽతిలంపటమనాః కామైకసేవాపరః. ౧౧

వేద్యం చాపి న వేత్సి రావణాహృత స్సాంబో వృథా మే స్తుతిః
సర్వే రాత్రిచరా శ్చతుర్దశసహస్రాణ్య ప్యభూవ న్హతాః
కించ త్వత్సహజా స్త్రయః ఖరముఖా స్త్వేకేన తే సంహృతాః
రామేణైకపదాతినా కృత మిదం చాహం విరూపా కృతా. ౧౨

మునీనా మభయం దత్తం నిర్భయం దండకం కృతమ్
పరిపూర్ణం జనస్థానం నాశితం రాఘవేణ హా. ౧౩

తచ్ఛ్రుత్వా వచనం త్వథాఽహ దనుజాధీశోఽతిక్రుద్ధోఽనుజాం,
రూపం కీదృశ మస్య వీర్య మపి కిం కిం న్వాగతో దండకాన్,
సాహాయ్యం చ కి మస్తి తస్య తు పరం యోద్ధుం తు కిం కారణం,
పృష్టైవం దనుజేశ్వరం ప్రతి తతః ప్రాహాఖిలం సా క్రమాత్. ౧౪

మారాకారసమాకృతి స్సునయన శ్చీరాంబరోఽబ్జాననః,
రామ స్త్వాయత బాహు రీశవినుత ప్రాగల్భ్యశౌర్యాన్వితః
కిం చాఽయం ధనుషి ప్రధానపదవీ మారూఢ ఏవ ధ్రువం
తత్తుల్య స్త్వనుజోఽపి తస్య న పరై ర్జేతుం త్వశక్యా వుభౌ. ౧౫

*

౧౧ ఓ మూర్ఖా! నీకు సంభవించిన మహాభయకారణము నిప్పటికి నీవు తెలిసికొనలేకుండ నుంటివి. ఎంత ఆశ్చర్యము. ఇట్టి నీవు రాజువై నను, భోగలంపటుఁడవై యుండుటవలన లోకము నిన్ను గౌరవింపదు. ఇట్టి మూర్ఖుఁడవును, చపలచిత్తుఁడవును, గ్రామ్యభోగాసక్తుఁడవును, కేవల కామాసక్తుఁడవు నగు నీవు రాజు వెట్లగుదువు.

౧౨ ఓ రావణా! తెలిసికొనఁదగిన విషయమునుగూడ నీవు తెలిసికొన లేకుంటివి. నా పుత్త్రుఁడగు సాంబుఁడా హతము చేయబడె. జనస్థానమునందలి పదునాలుగువేలరాక్షసులు హతము చేయబడిరి. ఇంతియే కాక ఖరదూషణత్రిశిరులు మువ్వురుగూడ హతము చేయబడిరి. ఈ పై పనుల నన్నిటిని జేసినవాఁడు ఒక పాదచారి యయిన రాముఁడై యుండెను. నన్ను విరూపిణిగాఁ జేయించిన వాఁడుకూడ నతఁడే.

౧౩ ఇదియునుంగాక, మునుల కభయదానముకూడ నతఁడు చేసెను. దండకవనమును నిర్భయమునుగా నతఁడు చేసివేసెను. ఆ రాముఁడు జనస్థానము నంతను బరిపూర్ణముగా నశింపఁ జేసెను.

౧౪ ఆ మాటలు విని రావణుఁడు భగ్గునమండిపడి శూర్పణఖతో నిట్టుల బలికెను. అతని రూప మెట్టిది? అతని పరాక్రమ మేపాటిది? దండకవనమున కెందునకై యతఁడు వచ్చెను? అతని కితరసహాయ మేమి యున్నది? అతనికి యుద్ధముచేయవలసిన కారణ మేమి కలిగెను? సవిస్తరముగ వీని నన్నిటినిఁ జెప్పుమని రావణుఁ డడుగగా నా శూర్పణఖయు నతనితోఁ గ్రమముగఁ జెప్పఁదొడగెను.

౧౫ రావణా! ఆరాముఁడు మన్మథునితో సమానమైన వాఁడును, విశాలాక్షుఁడును, నారచీరలను ధరించినవాఁడును, పద్మాననుఁడును, ఆజానుబాహుఁడును, పరమేశ్వరుని చేఁ గొనియాడదగిన శౌర్యముగల వాఁడును, ఇంతియే కాక, ధనుర్విద్యయందుఁ బ్రధానస్థానము నలంకరించినవాఁడునై యుండెను. అతనితో సమానుఁడయిన సోదరుఁడు కూడ నతనివెంట నొకఁడుకలఁడు, వారిద్దరు కూడ శత్రువుల కజేయు లని తెలిసికొనుము.

రామేణైవ ముహూర్తమాత్రసమయే సర్వే హతా దండకే,
భ్రాత్ర స్త్రీవధశంకితేన మనసా రామేణ ముక్తోఽభవమ్,
రామ శ్చే న్మనుతే క్షణేన సకలా న్లోకా న్దహే ద్వై ధ్రువం
తస్యా గ్రే తు భవాన్ధ్రువం దశముఖ స్థాతుం నశక్తో విభో!. ౧౬

తస్యాఽసీ త్సుభగా ప్రియా మృదుతను స్తారుణ్యయుక్తోత్తమా
చంద్రాస్యా కనకచ్ఛవి స్సునయనా సీతాభిధా సుందరీ
గంధర్వామరదైత్యదానవసతీ ష్వన్యాసు వా తాదృశీ
నోదృష్టా న మయా శ్రుతాగ్రజ! పరం జానే శ్రియం తాం
ధ్రువమ్. ౧౭

భ్రాతర్యస్య తు సా కళత్ర మవనౌ స్యా త్కించ సాయంముదా
గాఢాలింగనత స్తు సత్కృతవతీ సోయం పుమా న్రావణ
స్యాల్లోకత్రితయేఽపి పూజితతమో ధన్యః కృతార్థ శ్చ సః
వక్తవ్యం కి మతః పరం ధ్రువ మహం తే వచ్మి సా శ్రీః పరా౧౮

సౌందర్యేణ సువర్చసా చ వయసా శీలేన నాఽన్యాదృశీ
త్రైలోక్యేపి విచారితే నిరుపమా సా జానకీ రావణ
సా తేస్యా దుచితేతి తా మహ మిహ త్వానేతుకామా గతా
తద్భర్త్రా విధృతా హ మీదృశదశాం సంప్రాపితా రావణ౧౯

౧౬ వారిద్దరిలో రాముఁడొక్కఁడే ముహూర్తమాత్రములో దండక వాసులగు రాక్షసుల నందరను హత మొనర్చెను. అన్నా! నేనేమి చెప్పుదును? స్త్రీహత్యాదోషము వచ్చునను భయముచేత నేమో కాని వికారరూపమును బొందించి ప్రాణములతో నన్ను వదలి పెట్టెను. రాముఁడు తలచినట్లయిన లోకముల నన్నిటిని క్షణములో నిశ్చయముగ దహింపఁజేయును. ఓ దశముఖా! నీ వతని ముందు యుద్ధమున నుండుటకు సమర్థుఁడవు. (ఇచ్చట దశముఖా యని సంబోధించుటలో భావమేమనగా నీవు పదితలలు గలవాఁడవే కాని, యతఁడు సహస్రశీర్షుఁడు కాన నీవు జయింపలేవని భావము.)

౧౭ ఆ రామునకు భార్యకూడ సమీపమునందుండెను. ఆమె బహుసుందరియును, శరీరమార్దవము కలదియును, తరుణ వయస్కురాలును, ఉత్తమురాలును, చంద్రబింబము వంటి ముఖముగలదియును, సువర్ణచ్ఛాయ గలదియును, చక్కని నేత్రములు గలదియును, సీత యను నామము గలదియునై యుండెను. అట్టి స్త్రీని దేవగంధర్వ దైత్య దానవస్త్రీలలోఁగూడ జూచియుండలేదు. చూడకపోవుటయేకాక యిట్టి త్రిలోకసుందరి యున్నట్లు వినికూడ యుండలేదు. నిశ్చయముగ లక్ష్మీదేవినిగా నామెను దలచెదను.

౧౮ అన్నా! ఆమె యే పురుషునకు భార్యగానుండునో, మఱియు నామె యే పురుషుని యాలింగనము చేసికొనునో, ఆ పురుషుఁడు త్రిలోకముల యందుఁ బూజనీయుఁడును, ధన్యుడును, కృతార్థుఁడును గాగలఁడు. ఇంకొకం టె జెప్పవలసిన దేమి యున్నది. సాక్షాల్లక్ష్మియేయని నిశ్చయముగఁ జెప్పెదను.

౧౯ అన్నా! ఆ సీత సౌందర్యముచేతను, వర్చస్సుచేతను, శీలము చేతను, ముల్లోకముల గాలించినను నిరుపమానురాలని చెప్పనగును. ఆ చిన్నది నీకుఁ దగినదని తలచి పురుషు లిర్వురు లేకుండఁ జూచి నీ నిమిత్తము తీసికొని రాఁ దలచి వెళ్ళితిని. ఇంతలో నామె భర్తచేఁ బట్టుకొనబడి యిట్టి వికార రూపమును నేను పొందింపబడితిని.

తతః ఖరాదీ నవదం విరూపకరణం త్వహమ్
తే గత్వా రాక్షసై స్సర్వై ర్యుద్ధ్వా తేన హతాః క్షణాత్
యది త్వం కులజాతోఽసి గత్వా పంచవటీం పునః
రాఘవౌ వంచయిత్వా చ సీతా మపహర ద్రుతమ్ ౨౦-౨౧

సీతావియోగదుఃఖేన క్రిమాతోఽపి మృతో భవేత్
ఉపాయోయం సమీచీన ఇతి మే భాతి రావణ. ౨౨

మదుక్తవచసా భ్రాత స్త్వయా న క్రియతా మిదమ్
సమాలోచ్యాఽత్మనా కార్యం భవతా క్రియతా మలమ్. ౨౩
శ్రుత్వా తన్ముఖత స్సమ స్తమథ తామాశ్వాస్య చోత్థాయసః,
ప్రవిశ్యాఽత్మీయగృహాంతరం బహువిధం చాచింతయ త్స్వేహృది,
ఏకే నైవ ఖరః కథం ను సబలో నష్టోఽథవా శ్రీహరి
స్సాక్షా ద్రఘువరూపధృ చ్చ సబలం మాం హంతు మాగా
ద్ధ్రువమ్. ౨౪

తేనాఽహం యదిసంహృతో ధ్రువమలం ధన్యోభవేయం తదా,
నోచే త్తం తు నిహత్యతస్యయువతిం నేష్యామ్యహం స్వాం పురీమ్,
* ఏవం దోషగుణౌ విచార్య మనసా నిశ్చిత్య కార్యం తత
స్సౌవర్ణం రథ మాశ్రితోఽసురపతి ర్మారీచ మాగా త్పునః.
౨౫

---

*దోషగుణౌ విచార్యేతి- తస్యాయ మాశయః స్వేన
చికీర్షితం సీతాపహరణరూపం కార్యం కిం పౌరుషేణ సుకర

౨౦_౨౧ పిమ్మట నేను జనస్థానమున కేగి ఖరుడు మొదలగు వారితో నివ్వి
షయము చెప్పగా వారలు మువ్వురు పదునాలుగు వేల రాక్షసు
లతో యుద్ధమునకు నతనిమీదికి వెళ్ళి క్షణమాత్రమున వారలందరును
రామునిచే హతము చేయబడిరి. నీవు గొప్పకులమునందుఁ బుట్టినవాడవే
యయిన యెడలఁ బంచవటికి వెళ్ళి రామలక్ష్మణులను వంచించి
శీఘ్రముగ, సీత నపహరింపుము.

౨౨ సతీలోలుడైన యా రాముడు సీతా వియోగ దుఃఖముచేఁ గ్రమ
ముగ నతడే మృతినొందును. రాముడు హతుడగుట కంతకంటె
మంచి యుపాయము లేదని నాకుఁ దోచుచున్నది

౨౩ అన్నా! నేను చెప్పితినని నీవు చేయకుము. నీవు కూడ బాగుగ నాలో
చించుకొని నీకు సమ్మతమైనచో నేను చెప్పినట్లు చేయుము.

౨౪ శూర్పణఖ చెప్పిన మాటలను విని యామె నోదార్చి యచ్చటినుండి
లేచి తన గృహములోని కేగి తన మనస్సునఁ దీ క్రింది విధముగ
నాలోచించుచుండెను. పదునాలుగువేల రాక్షసులతోగూడ ఖర
దూషణాదుల నొక్క పాదచారి యగు రాము డెట్లు చంపగలిగెనో
యాశ్చర్యముగా నున్నది. ఇతడు మానవుడుగా గన్పడుట లేదు. ఇక
నేమన సాక్షాత్ శ్రీహరియే రామరూపము నొంది నన్ను, నామూల
బలమును సంహరించుట కిట్లు వచ్చినట్లు నిశ్చితమగు చున్నది.

౨౫ అట్లు శ్రీహరియే రాముడుగా నవతరించిన నతనిచేతిలో నేను
చచ్చుట నిశ్చయమే యైన యెడల నేను ధన్యాత్ముడనే. లేక
రాముడు సామాన్యమానవుడే యైన పక్షమున నతనిని సంహరించి
యతని భార్యను లంకకుఁ దీసికొనివచ్చెదను. ఇట్లు రావణుడు *
గుణదోషములను మనస్సునందు విచారించుచుఁ దుదకొక విధముగ
నిశ్చయించుకొని యా రాత్రియంతయు గడపి ప్రాతఃకాలమున
బంగారు రథమునెక్కి మారీచుని యాశ్రమమునకు వచ్చెను.

---

* గుణదోషములను విచారించి యనుదాని విమర్శనము.

తనచేతఁ జేయనిశ్చయింపబడిన సీతాపహరణరూపమగు కార్యము
పౌరుషముచే సాధింప సుకరమైనదా! లేక చౌర్యముచేత సాధింప

మారీచం త మథాహ వాక్య మసురాధీశ స్తు సామాన్వితం,
ఆర్తోఽస్మ్యద్య భవా న్పురాగతి రభూ దార్తస్య మే మాతుల,
సర్వే దండకకాననేఽసురవరా రామేణ తే సంహృతా
స్తస్యప్రత్యపకర్తు మద్య భవతా త్వం మే సహాయో ద్రుతమ్. ౨౬

తజ్జాయా మహ మానేతుం లంకా మిచ్ఛామి మాతుల,
భవా న్హేమమృగో భూత్వా జానక్యాః పురత శ్చర. ౨౭
అపూర్వరూపం త్వాం వీక్ష్య సీతా జాతకుతూహలా,
త్వా మానయేతి భర్తారం యాచేత నహి సంశయః. ౨౮
వినిర్గతే త్వాం మృగరూప మాప్తుం రామే సుదూరం గమితే
త్వయార్య! హా లక్ష్మణేతి దృఢ ముచ్చర త్వం సీతాపతే
ర్వాక్యనిభం తు వాక్యమ్. ౨౯
జానక్యా ప్రేరిత స్తద్వ ల్లక్ష్మణోఽపి వినిర్గతః
విచిన్వ న్రాఘవం దూర మాగమిష్యతి చ ధ్రువమ్. ౩౦

---

మాహోస్విచ్ఛాద్మికేన కర్తవ్య మితి కతరస్మి న్పక్షే దోషా ల్పత్వం గుణభూయస్త్వ మితి తత్పౌరుషేణ కర్తు మశక్యం ఖరాదియుద్ధే రామస్యాచింత్యపరాక్రమత్వేన శ్రుతత్వాత్ ఉపాయపరికల్పిత చౌర్యాశ్రయణే తాదాత్వికదోషా న లక్ష్యంతే, సీతారహితేన తద్వ్యసనినా రామేణ కాపి హాని ర్నసంభావ్యతే, తస్మాదయ మేవ పక్ష స్సమ్యగితి నిశ్చిత్య ప్రావర్తతేత్యర్థః.

౨౬ అనంతరము రావణుడు మారీచునితో సామపూర్వకముగ నిట్లు బలికెను. మామా! నేను చాలగ నాపదలో నుంటిని. ఇట్టి నాకు నీవుతప్ప వేఱుగతి యెవడును లేడు. ఏమియాపద యనియెదవేమో చెప్పెద వినుము. దండకవాసులగు పదునాలుగువేల రాక్షసులను ఖరదూషణాదుల రాముడు సంహరించెను. అట్టి రాక్షస నిర్మూలకుడగు రామునకు బ్రత్యపకారము చేయుటకు నీవు శీఘ్రముగ సహాయపడవలయును.

౨౭ సహాయముచేయవలసినది యెట్లన జెప్పెదను వినుము. నేను రామపత్నిని హరించి లంకలోఁ బెట్టుకొనుటకుఁ గోరికగలదు. నీవు బంగరులేడివై సీతపురోభాగమున సంచరింపుము.

౨౮ అపూర్వమైన నిన్నుఁ జూచి సీత కుతూహలము కలదై నిన్ను దెమ్మని భర్తను యాచించును. ఇందులకు సందియముండదు.

౨౯ అప్పుడు రాముడు బయలుదేరి నిన్నుఁ బట్టుకొనుటకు దూరముగా వెళ్లుటతోడనే నీవు "హా! లక్ష్మణా! హా! ప్రేయసి!" యని బిగ్గరగ రాముడు పిలచినట్లు పిలువుము.

౩౦ రాముడు పిలిచినటుల నీవు పిలుచుటతోడనే యా మాటలను సీత విని తన భర్త కేదియో యాపద సంభవించెనని తలచి లక్ష్మణునిఁ బ్రేరేపించి పంపును. ఆతడు రాముని వెదకుచుఁ జాలదూరము వచ్చును.

---

శక్యమైనదా! ఏ పక్షమునందు గుణబాహుళ్యము, దోషాల్పత, యున్నవి యని విచారించెను. యుదకుఁ పౌరుషముచేఁ జేయుటకు శక్యము కాదని నిశ్చయించెను. ఎందువల్ల ననగా ఖరాదులతో యుద్ధము చేయుటలో రాము డచింత్యపరాక్రము డని వినబడుట వలన నని తెలియుదగును. ఉపాయముచేఁ గల్పింపబడు చౌర్యము నాశ్రయించుటలో ప్రస్తుతదోషము లేమియు గన్పడవు. సీతారహితుడును, తద్వ్యసనియు, నగు రామునివలన నపాయమేమియు రాదని కూడ నూహింపబడెను. అందువలన నీ పక్షమే మంచిదని నిశ్చయించి ప్రవర్తించెను.

తయో ర్ద్వయో ర్దూరతరస్థయో రహం
సీతాం సమాదాయ నిజాం పురీం సుఖం
ప్రజేయ మస్మిన్విషయేఽసదుత్తరం
న వాచ్య మాలోచ్య మయోక్త మేవ తత్. ౩౧

ప్రియావియోగదుఃఖేన పరితప్తశ్చ రాఘవః,
స్వయమేవ మ్రితం ప్రాణా న్సంత్యక్షే న్నాత్ర సంశయః. ౩౨

తచ్ఛ్రుత్వా వచనం తదీరిత మలం నిశ్చేష్టతాం ప్రాప్తవాన్,
మారీచః పురతః స్థితం దశముఖం పశ్య న్వ్యథాద్వై యమన్,
శుష్యంత్వోష్ఠయుగం లిహన్ననిమిషో భూత్వా ముహూర్తస్త్వథా
పశ్చా న్మంద మువాచ ధైర్యసహిత స్తం రాక్షసేశం పునః.
౩౩

రాజ న్భూమితలే ప్రియంవదజనా నైకే వసేయు ర్ధ్రువమ్,
నైకోఽప్యప్రియపథ్యబోధకజన స్సందృశ్యతే భూతలే
తచ్ఛ్రుత్వాపి న తిష్ఠతి ప్రభువర! త్వాం ప్రార్థనాపూర్వకం;
యాచేఽహం త్వసదుద్యమా ద్విరమ, తే క్షేమాయ వచ్మి
ధ్రువమ్. ౩౪

సీతాగ్ని శ్శిఖయా సమాహి భవతా స్ప్రష్టుం న సా శక్యతే,
శస్త్రజ్వాల మపూర్వరైవతధను శ్శుష్కేంధనం సంయుగే;
శ్రీరామానల మధ్య కిం ప్రవిశసి వ్యర్థం భవన్మ్మలత
స్సర్వం రాక్షసమండలం చ భవితా నష్టం ధ్రువం సత్వరమ్. ౩౫

పూర్వం గాధిసుతాశ్రమే పరిభవం ప్రాప్తోస్మి రామా చ్ఛిశోః,
కించాథో మృగరూపధృ ద్రఘుపతిం హంతుం గతోఽహం వనమ్,

౩౧ వారిద్దరును దూరమునం దుండుదురుగాన నా సమయమున నేను సీతను బలాత్కారముగఁ దీసికొని సుఖముగ లంక కేగుదును. నీవీ విషయములో బాగుగ నాలోచించి చెప్పవలెకానఁ దిరిగి ప్రతికూల మగు సమాధాన మేమియు నీవు చెప్పఁగూడదు.

౩౨ ఇట్లు భార్యావియోగ దుఃఖముచేఁ బరితప్తుడై రాముడు స్వయముగనే మరణించును. ఇందునకు సందియములేదు.

౩౩ ఇట్లు రావణుడు చెప్పినమాటలను మారీచుడు విని కొంతసేపు నిశ్చేష్టుడయ్యెను. తనముందరనున్న రావణుఁ డొక యముడువలెఁ గన్పడెను. మారీచుని పెదవులు తడిలేని వయ్యెను. చావుకు సిద్ధమైనవాడు గుడ్లు తేలవేసినట్లు గుడ్లు తేలవేసెను. ఇట్లు మారీచుడు కొంత సేపుండి యనంతరము కొంచెము ధైర్యము తెచ్చుకొని మెల్లగ రావణునితో నిటులఁ బలికెను.

౩౪ ఓ రావణా! భూమిలోఁ బ్రియమైన మాటలను జెప్పువా రనేకులు కలరు. అప్రియమును, పథ్యమును జెప్పువాడును, వినువాడును గూడ భూమిలో నుండరు. కానఁ బ్రార్థనాపూర్వకముగ నిన్ను యాచించున దేమనగా నీవు దుష్ప్రయత్నమునుండి మరలుము. నీ క్షేమమునకై చెప్పుచున్నాను వినుము.

౩౫ సీత యగ్నిశిఖతో తుల్యమైనది కాన నీవు స్పృశింప శక్యముకాదు. శస్త్రమను జ్వాలలతోను, దేవధనుస్సను శుష్కేంధనములతోను నొప్పుచున్న రాముడను నగ్నిలో వ్యర్థముగ నేలఁ బ్రవేశించెదవు? నీ మూలకముగ రాక్షసమండల మంతయు నిశ్చయముగఁ దొందరలో నశింపఁగలదు.

౩౬ నేనుచెప్పు మాట లన్నియు ననుభవముతోఁ జెప్పుచున్నాను వినుము. పూర్వము రామునివలన విశ్వామిత్రాశ్రమమున నేను పరిభవమును బొందియుంటిని. (పరిభవ మనగా విశ్వామిత్ర యాగరక్షణార్థమై

తత్రత్త్యై రితరైర్బాణై స్సహాచర న్న్యక్షేన రామేణ తు
త్యక్త్వా చాన్యమృగాన్ శరేణ నిహతః ప్రాణావశిష్టోఽభవం. ౩౬

సోఽహం త్వత్త్రి తదాదియోగివదలం సంన్యస్య సర్వం విభో,
ధ్యాయ న్నేవ మలం వసామి నితరాం త్యక్త్వాఽసురీం దుర్మతిమ్;
రామా త్పూర్వభయాధునా ప్రతికుజం సందృశ్య తే రాఘవ
స్సర్వం రామమయం చ కానన మిదం మే భాతి నూనం విభో
౩౭

రామో నామ న మానుషః పున రసౌ సాక్షా ద్రమేశో
ధ్రువమ్
మాయామానుషవేషధృ ద్రఘుపతి స్త్యాగా ద్వనం దండకమ్
భూభారస్యపనోదనాయ దనుజా న్సంహృత్య జాతో హరి
స్తస్మాన్మే వచనం నిశమ్య మహాత్మా రామేణ వైరం త్యజ. ౩౮

శ్రుత్వా మే వచనం తాత రక్ష, రక్షఃకులం మహత్
ఆత్మానం రక్ష మాం రక్ష రామా ద్రక్షఃకులాంతకాత్. ౩౯

రామమేవ సతతం విభావయే భీతిభీతఇవ భోగరాశితః,
రాజరత్నరమణీరథాదికం శ్రోత్రయో ర్యది గతం భయం
భవేత్. ౪౦

తదాశ్రమమునకు రాముడురాగా నేను యాగవిఘాతము చేయబోవ బాల్యావస్థలోనున్న యితడు బాణమెక్కు-పెట్టి కొట్ట శతయోజన దూరమున సముద్రములో బడుటయను పరిభవమని తెలియదగు) ఇది యునుంగాక, పిమ్మట రాముడు దండక వనమునకు వచ్చినట్లు తెలిసి మృగరూపముతోఁ రాముని జంపుటకు వన్యమృగములతోఁ గలిసి నేను తిర్గగా నచ్చటనున్న యితర మృగములను వదలి రాముఁడు నన్ను బాణముతోఁ గొట్టగాఁ జచ్చుటకు సిద్ధమైతిని.

౩౭ అట్టి నేను రాక్షసకృత్యములను మాని యిచ్చట నొక యాశ్రమమును గల్పించుకొని యోగివలె సర్వసంగపరిత్యాగినై దేవుని మాత్రము ధ్యానించుచు నుండుచుంటిని. రాముని వలని భయముచే నిప్పటికిని నే వృక్షమును జూచినను రాముఁడేమో యను భ్రాంతి కలుగుచుండును. ఈయరణ్యమంతయు రామమయముగానే నాకుఁ దోచుచుండును.

౩౮ రావణా! రాముఁడనగ సామాన్యమానవుఁడని తలంపకుము. నిశ్చయముగ నితఁడు విష్ణుమూర్తి యని తెలిసికొనుము. భూభారమును దొలగించుటకును రాక్షససంహారమునకును నవతరించిన శ్రీహరియే యితఁడైనందున నా మాట విని నీవు మహాత్ముఁడగు రామునితో విరోధమును విడిచిపెట్టుము.

౩౯ నాయనా! నామాట విని గొప్పదియైన రాక్షసవంశమును గాపాడుము. నిన్ను రక్షించుకొనుము. రాక్షసవంశ నిర్మూలకుఁడగు రామునివలన నన్నుఁ గాపాడుము.

౪౦ రావణా! నేను వానిచేతి దెబ్బ తినినప్పటినుండియు భోగములకు భయపడిన వానివలె నైహికము నంతను వదలి యెల్లప్పుడు రామునే ధ్యానించుచుందును. మఱియు, రాజ, రత్న, రమణీ, రథ మొదలగు రకారమాది యందుగల పదములు చెవులకు వినబడినచో నెచ్చటిలేని భయము నాకుఁ గలుగును.

రామ ఆగత ఇహేతి శంకయా బాహ్యకార్యమపి సర్వమత్యజమ్
నిద్రయా పరివృతో యదా స్వపే రామమేవ మనసాఽను
చింతయన్. ౪౧

అహ మశేష మిదం మునివాక్యతోఽశృణువ మాదియుగే
పరమేశ్వరః,
బ్రహ్మణాఽర్థిత ఉవాచ తం హరిః కిం తవేప్సిత మహం
కరవాణి తత్.

బ్రహ్మణోక్త మరవిందలోచన త్వం ప్రయాహి భువి
మానుషం వపుః, దశరథాత్మజభావ మరం గతో జహి
రిపుం దశకంధర మాశరమ్. ౪౨-౪౩

తస్మాదయం రఘుపతి ర్నహి మానుషోఽయం
సాక్షా ద్ధరి ర్భవతి రావణ వచ్మి నూనమ్,
రక్షోవినాశనకృతే త మవేహి జాతం క్రోధం విముంచ
కరుణాకరరామచంద్రే. ౪౪

ఇత్యుక్తో రావణః క్రుద్ధో మారీచం ప్రత్యువాచ సః,
త్వదుక్తరీత్యా శ్రీరామ స్సాక్షా న్నారాయణో యది,
భూభారవ్యపనోదాయ జాతో యది తదా పునః,
సత్యంకల్పోఽచిరాదేవ మాం హనిష్యతి చ ధ్రువమ్,
తస్మా జ్జాయాం హరిష్యామి రామస్యాఽహం ప్రయత్నతః,
పశ్చాన్మాం హంతి చేద్రామః ప్రాప్నువా న్యుత్తమాం గతిమ్,
అథవా తం హనిష్యామి యది పాస్యామి జానకీమ్.
౪౫-౪౬-౪౭

౪౧ ఎప్పటికప్పుడు రాముడు వచ్చె ననియెడి సందియముతో బాహ్య కార్యముల నన్నిటిని విడిచి పెట్టితిని. పరుండినను స్వప్నములోఁ గూడ రాము నే కలవరించెదను.

౪౨-౪౩ కృతయుగమున బ్రహ్మచేఁ బరమేశుఁ డగు శ్రీహరి సంస్తుతుఁడై నీ యభీష్టమేదియో చెప్పుమని శ్రీహరి యడుగ బ్రహ్మదేవుఁడు శ్రీహరితో నిటులఁ జెప్పెను, ఓ పుండరీకాక్షా! రావణుఁడు మొదలగు దుష్టరాక్షసుల బాధను భూమి సహింపలేకుండ నుండెను. నీవు మానుష రూపమును ధరించి దశరథపుత్త్రుఁడవై జనించి లోక కంటకుఁడగు నా రావణుని సమూలకముగఁ బరిమార్చుమని బ్రహ్మ శ్రీహరినిఁ గోరెను. సాక్షాచ్ఛ్రీహరియే నిన్ను సంహరించుటకై రాముఁడుగా నవతరించెను. ఈ సంగతి యంతయు నారదుని వలన నేను వినియుంటిని.

౪౪ అందువలన నీరాముఁడు మనుష్యమాత్రుఁడుగాడు సాక్షాచ్ఛ్రీహరియై యుండెను. నిన్ను భయపెట్టుటకుఁ జెప్పు విషయముకాదు. నిశ్చయముగ జెప్పుచున్నాను. అతఁడు రాక్షసవంశ నాశనమునకై యవతరించినవాఁడు. కావున దయాసముద్రుఁడగు రామునివిషయమై క్రోధమును విడువుము.

౪౫-౪౬-౪౭ ఇట్లు మారీచుఁడు చెప్పగా విని రావణుఁ డతిక్రుద్ధుఁడై మారీచునితో నిటులఁ బలికెను. ఓ మారీచా! నీవు చెప్పినటుల నతఁడు సాక్షాన్నారాయణుఁడేయైన పక్షమునను, భూభారమును తొలగింపుటకే పుట్టినవాఁడే యైన పక్షమునను సత్యసంకల్పుఁడగు నా పరమేశ్వరుఁడు నన్నెటులనైనఁ జంప నేచంపును. నిశ్చయము. అందువలన రాముని భార్యను బ్రియత్నపూర్వకముగ నెటులనైన హరించి తీరుదును. పిమ్మట నన్నుఁ జంపినచో ను త్తమగతుల నేను బొందెదను. ఒక పక్షమున నే నేవానినిఁ జంపగలిగినచో నాకు సీత లభించును.

మయా కరిష్యమాణేఽస్మిన్ దోషో వాస్తి గుణోఽస్తి వా
ఇతి త్వా మిహ మారీచ నాహం ప్రష్టుం సమాగతః
మయా యదుచ్యతే తోషా త్క్రియతే త త్త్వయా యది
రాజ్య మర్ధం చ దాస్యామి ముదా తే నాత్ర సంశయః.
౪౭-౪౯

భవతా కార్యమేత స్మి న్నకృతం చే ద్బలా దహమ్,
త్వయైవ కారయిష్యామి నాత్ర కార్యా విచారణా. ౫౦
బలాదపి త్వం న కరోషిచే న్మే కార్యం మదీయం శృణు మ
ద్వచ స్త్వం;
అద్యైవ చాత్రైవ నిహన్మి నూన మహం మదీయేన శరేణ
తు త్వామ్. ౫౧
తచ్ఛ్రుత్వా వచనం చి త్తే మారీచ స్స్వ త్వచింతయత్,
మరణం మే ధ్రువం హ్యద్య రామాద్వా రావణా దపి,
తదా రామా న్మృతి శ్శ్రేయో న దశాస్యా న్మృతి ర్ధ్రువా
౫౨-౫౩
ఇత్యాలోచ్య దశాస్యం తం మారీచో వాక్య మబ్రవీత్,
త్వదభీష్టం కరిష్యామి నిర్గచ్ఛ త్వరితం విభో
ఇత్యుక్తో రావణ స్తుష్టో నిరగా త్తేన దండకాన్ ౫౪

ఇత్యాశ్చర్యరామాయణే అరణ్యకాండే
ఏకాదశ స్సర్గః.

౪౭-౪౯ ఓ మారీచా! నేను చేయబోవుపనిలో దోషమున్నదా? గుణమున్నదియా? అని నిన్నడుగుటకు నేను నీయొద్దకు వచ్చియుండలేదు. కాన నా పనిలోని మంచిచెడుగులను నీవు చెప్పవలసిన పని లేదు. నేను చేయబోవు పనిలో నీవు సాయపడితివేని నేను జెప్పిన పనిని సంతసముతోఁ జేసితివేని నా రాజ్యములో నర్ధరాజ్యమును గూడ సంతోషముతో నీకీయదలచితిని. ఈ విషయమున సందేహము లేదు.

౫౦ నేను చెప్పిన పనిని సంతోషపూర్వకముగ నీవు చేయకపోయినచో బలాత్కారముగనైనను నీచేతఁ జేయించి తీరెదను. ఈ విషయమై యాలోచన మెంతమాత్రము లేదు.

౫౧ నా కార్యమును నీవు బలాత్కారముగ గూడఁ జేయకపోతివేని నా మాటవినుము. ఇక్కడనే యిప్పుడే నా చంద్రహాసముచే నీశిరమును దుత్తునియలఁ జేసెదను.

౫౨-౫౩ రావణుని వాక్యములను విని మారీచుఁడు తన మనమునం దిట్టుల నాలోచించుకొనెను. రామునిచేతిలోఁ గాని, రావణునిచేతిలోఁ గాని యిప్పుడు మరణము మాత్రము నాకు నిశ్చితము. ఎట్లో చావు తప్పని యప్పుడు దురాత్ముఁడగు రావణునిచేతిలోఁ జచ్చుటకంటె రాముని చేతిలోఁ జచ్చుటయే నాకు శ్రేయస్కరము.

౫౪ ఇట్లాలోచించుకొని మారీచుఁడు రావణునితో నిటుల బలికెను. ఓ రావణా! నీ యభీష్టమును నెరవేర్చెదను. త్వరితముగ బయలుదేరుము, అని చెప్ప రావణుఁడు మిగుల సంతోషించి మారీచుని గొనియాడి యచ్చటినుండి దండకవనమునకు బయలుదేరెను.

అరణ్యకాండమున

పదునొకండవ సర్గము

సమాప్తము.

## ద్వాదశస్సర్గః

---

1తత్ర రామో దుర్నిమిత్తదర్శనా త్ప్రాహ భూమిజామ్,
వామాక్షి వామబాహు శ్చ స్ఫుర త్యద్య పునఃపునః. ౧
అనిష్టం కించి దస్మాక మతోఽవశ్యం భవిష్యతి,
స్వర్గంగతే దశరథే దూరస్థే మయి శత్రుభిః, ౨॥

మత్వా బాలం తు భరతం కిం న్వాక్రాంతా శ్చ కోసలాః,
పత్యు ర్వియోగేన చ మే విప్రవాసేన మాతరః,
* ప్రతిక్షణం వర్ధమానా ద్దుఃఖా త్స్వర్గంగతాః కిము. ౩॥
ఇత్యుక్త్వా జానకీ ప్రాహ రాఘవం వినయాన్వితా,
అమంగళానాం సర్వేషాం తప స్తే స్యా న్నివారకమ్. ౪॥

ఇత్యుక్తాం రాఘవః ప్రాహ భూమిజాం వచనం మిథః,
గోప్య మేక మహం వచ్మి త్వయా కార్యం తదైవ తత్. ౫॥

---

1 కవిః.

* బాలస్య భరతత్వే ప్యశక్తి ర్నహి శంకితుం శక్యతే. అస్మాకం వనం గతానాం చతుర్దశ సంవత్సరేషు ద్విత్రా ణ్యేవా వశిష్యంతే. అత ఇదానీం భరతస్య బాలత్వ మప్యపగత ప్రాయ మేవ. అస్మాకం చ రాజ్యప్రవేశకాలోఽచిరేణైవ వర్తిష్యతే. అతః పరై రిదానీ ముత్తరకోసలాఽక్రమణే చింతాపి న క్రియేతేతి మన్యమానో మాతృస్నేహానాఽన్య దనిష్ట మాశంకతే పత్యు ర్వియోగ ఇతి.

## పం త్రిం ద వ స ర్గ ప్రా రం భ ము.

౧ ఆపర్ణశాలలో రాముఁడు తనకు దుశ్శకునములు గోచరింప సీతతో నిట్టులఁ బలికెను. ఓ ప్రేయసీ! నా యెడమ కన్ను మాటి మాటికి నదరుచున్నది

౨½ ఇందువలన మనకేదియో యనిష్టము శీఘ్రములో రానున్నదని తలచెదను. దశరథుఁడు స్వర్గస్థుఁ డగుట చేతను నేను దూరస్థుఁడ నగుట చేతను భయములేని వారై శత్రువులు భరతుఁడు బాలుఁడని తలంచి కోసలదేశములను నాక్రమించియైన నుండవచ్చును.

౩½ * లేక తమ భర్తయగు దశరథుఁడు స్వర్గస్థుఁ డగుటచేఁ దద్వియోగ దుఃఖమువలనను నేను పరదేశములో నుండుటవలనను బ్రతిక్షణము వృద్ధి నొందుచున్న దుఃఖమువలన నా తల్లు లయిన కౌసల్యాదులలో నెవ్వరైన మృతి నొంది యయిన నుండవచ్చునని తలంచెదను.

౪½ ఇట్లు రామచంద్రమూర్తి చెప్పుటతోడనే సీతయు వినయముతో భర్తను జూచి యిట్టులఁ బలికెను. నాథా! అమంగళము గలుగునని సంశయింపఁ బనిలేదు (ఏలనన) సమస్తమైన యమంగళములను మీరు చేయు తపస్సే నివారింపఁగలదు.

౫½ ఇట్లు చెప్పుటతోడనే రామచంద్రమూర్తి సీతతో రహస్యముగ నిట్లు చెప్పెను. ఓ ప్రేయసీ! నేను నీకొక రహస్యవిషయమును జెప్పెదను. నీ వా విధముగ నాచరింపవలయును.

---

* భరతుఁడు బాలుఁడైనను నతని కర్తృత యూహింప శక్యము కాదు. మనము వనమునకు వచ్చికూడఁ బదునాలుగు సంవత్సరములకు స్వల్పకాలమే మిగిలియున్నది. మన మయోధ్యలోఁ బ్రవేశించు కాలముకూడ శీఘ్రములో రానున్నది; కాన భరతునకు బాల్యమనుటకు గూడ వలనుపడదు. కాన, శత్రువులు కోసల దేశము నాక్రమించిరను సంశయము నొందుట యుక్తముగా లేదని మాతృప్రేమచే నితరమైన యనిష్టమును, "భర్తృవియోగదుఃఖముచే తల్లులు మృతి నొందిరేమో యను దానిచే" జెప్పుచుండె నని తెలియదగును.

ప్రేయస్యద్య దశానన స్తు భవతీ సాన్నిధ్య మేష్య త్యరం,
త్వచ్ఛాయాం త్వ మిహాఽఽశ్రమే మ్రితతరం సంస్థాప్య వై తామసీమ్,
త్వం సాత్త్వి క్యనలే వసాఽబ్ద మనఘే పంక్త్యాస్య నాశావధి,
త్వం పశ్చా దనలా త్సమాగతవతీ భూయోఽపి మాం ప్రాప్స్యసి ౬॥

ఏవం రామే జనకతనయాం బోధయ త్యంతరేఽస్మి,
న్నగ్నిర్విప్రాకృతి ముపగతో రాఘవం ద్రష్టు మేత్య,
ప్రాహైవం తం ప్రభువర బుధైః ప్రేషితోఽహం తు వహ్ని,
ర్నాహం విప్రోఽసురపతి రిమాం భూమిజాం హర్తు మేతి. ౭॥

తస్మా న్మయి స్థాపనీయా భూమిజా భవతాఽధునా,
దశాననవినాశాంతే దాస్యా మీమాం పున శ్చ తే. ౮॥

ఇత్యుక్త్వా రాఘవం పశ్చా త్తదంగీకారయుతోఽనలః,
సమానరూపాం తచ్ఛాయాం తామసీం తత్ర కల్పయన్
సమాదాయ మహీజాం తాం తత్రైవాంతర్హితోఽభవత్. ౯-౧౦

ఏతద్వృత్తం లక్ష్మణోఽపి న వేదాఽన్య స్తు కింపునః,
తమోమయీ భూమిజాఽపి తద్దైవాసీ త్తదాశ్రమే,
పశ్చా దుపేత సౌమిత్రి స్త్రయ స్తే సుఖినః స్థితాః ౧౧॥

౬½ (అది యేమనగా) ప్రియసీ! యిప్పుడు రావణుఁడు నిన్నపహరించుటకై నీసన్నిధికి శీఘ్రములోనే రాఁగలఁడు. కాన, తమోగుణ ప్రధానమైన నీఛాయనుమాత్ర మిచ్చట నుండునట్లు చేసి సాత్వికాంశమగు నీ వగ్నియందొక సంవత్సరము రావణసంహారమగు వఱకు నుండవలయును. పిమ్మట నగ్నినుండి బయటికి వచ్చి తిరిగి నన్నుఁ బొందఁగలవు.

౭½ ఇవ్విధముగ రాముఁడు సీతకు రహస్యముగ బోధించుచుండ నగ్నిహోత్రుఁడు దేవతలచేఁ బంపబడి బ్రాహ్మణవేషముతో రాముని సన్నిధికి వచ్చి యారామునితో నిట్లుఁ బలికెను. ఓ రామచంద్రా! నేను దేవతలచేఁ బంపబడిన యగ్నిహోత్రుఁడను. సామాన్యబ్రాహ్మణుఁడను కాను. రావణుఁడు సీత నపహరింప వచ్చుచుండెను.

౮½ కావున సీతను నాయందు రావణసంహారమగు వఱకు గోప్యముగా నుంచుము. పిమ్మట నీ మెను నీకు సమర్పింపగలను.

౯-౧౦ ఇట్లు రామునితోఁ జెప్పి యనుమతినిఁ బొంది తమోగుణ ప్రధానురాలైన సీతయొక్క ఛాయ నచ్చటనుంచి యగ్నిహోత్రుఁడు నిజమైన సీతను గ్రహించి నిజరూపముతో నచ్చటనే యంతర్ధాన మయ్యెను. (సీత సత్వరజస్తమోగుణాత్మిక కానఁ దమోగుణ ప్రధానురాలిని మాత్రమే యిచ్చట నుంచెనని తెలియదగును).

౧౧½ ఈ సంగతిని లక్ష్మణుఁడుగూడ నెఱుఁగఁడైన నితరుల విషయము చెప్పనదేమి? తామసియగు సీతయును నిజసీతవలె నాశ్రమములోఁ జక్కఁగ మెలఁగుచుండెను. పిమ్మట లక్ష్మణుఁడు నెచ్చటనుండియో వచ్చెను. వారలందరును సుఖముగ నుండిరి.

మారీచ స్యాశ్రమా త్తేన సహితో రథ మాస్థితః,
రావణ స్సారథిం ప్రాహ వచనంతు తతః పరం
జీవ త్యేవ మయి ప్రాప్తా సోదర్యా మే విప త్త్వరా
అపమృత్య పతిం సీతాం హర్తుం గచ్ఛామి సారథే
తత శ్శూర్పణఖా చాపి శీఘ్రం త్యజతు వై శుచం
తస్మా త్త్వంచవటీస్థానం చోదయా౽ద్య హయా న్ద్రుతం
ఇత్యుక్త స్సారథి శ్చాపి తథైవ కృతవాం స్తతః
పశ్చాద్దశాస్య స్తం ప్రాహ చోదయంతం శనై ర్హయాన్
౧౨-౧౩-౧౪-౧౫

జాన న్నేవ భవా న్నవం పరిభవం మందం తురంగా నిమా,
న్కస్మా చ్చోదయసి త్వ మత్యతితరాం మూఢో యథా దృశ్యసే
శీఘ్రం చోదయ సారథే౽ద్య తురగా న్కార్యా నుసృత్యా వదం
ఇత్యుక్త స్సతు సారథి ర్దశముఖం సప్రశ్రయం తం వచః. ౧౬

అహం కార్యగతిం వేద్మి మూఢో౽హ మపి నాథవమ్,
బలాత్సంచోదయా మ్యద్య తురగాం స్తాడయామి చ
వాయువేగాతిగా శ్చామీ పశ్చా ద్గచ్ఛంతి వాజినః
మమాక్షి వామం స్ఫురతి గమనే తవ రావణ
దుర్నిమిత్తాని జాయంతే కారణం జ్ఞాయతే నహి. ౧౭-౧౮-౧౯

సర్వరాక్షససైన్యేన గత్వా త్వం రాఘవం రణే,
హత్వా తతో జానకీం తా మాహ రేతి మతం మమ
ఏకస్య గమనం తే౽ద్య న మతం మమ రావణ. ౨౦

౧౨-౧౩-౧౪-౧౫ ఇచ్చట వీరలిట్లుండ రావణుడు మారీచాశ్రమమునుండి రథారూఢుఁడై మారీచునితోఁ గూడ బయలువెడలి సారథితో నిటులఁ బలికెను. ఓ సారథీ! నేను బ్రతికియుండగనే నా సోదరి యగు శూర్పణఖ కెంత యాపద వచ్చెనో నీకుఁ దెలిసియున్న విషయమే. ఇప్పుడా రాముని వంచించి సీతను హరింప దండకవనమున కేగుచుంటిని నే నిటులఁ జేసినచో శూర్పణఖయొక్క దుఃఖము తొలగగలదు. అందువలన నీవు రథమును పంచవటి యొద్దకుఁ బోనిమ్ము. ఇట్లు చెప్పగా సారథియు నటులనే రథమును దోల మొదలిడెను. పిమ్మట రావణుఁడు నెమ్మదిగ గుఱ్ఱములను దోలుచున్న సారథిని గూర్చి యిటులఁ బలికెను.

౧౬ ఓరీసారథీ! నాకుఁ గ్రొత్తగా సంభవించిన పరిభవమును నీవు తెలిసికొనికూడ మెల్లగా గుఱ్ఱములను దోలుచుంటివేమి! నీవు మూఢునివలెఁ గన్పడుచుంటివి. గుఱ్ఱములను తొందరగ నదలింపుము. కార్యము ననుసరించి యిట్లు చెప్పుచుంటిని అని యట్లు రావణుఁడు పలుకగా సారథియు చేతులు జోడించి రావణునితో నిటులఁ బలికెను.

౧౭-౧౮-౧౯ మహాప్రభూ! నేను కార్యావసరమును గుర్తెరింగినవాఁడనే కాని మూఢుఁడను గాను. నా శక్తికొలఁది గుఱ్ఱములను దోలుటయే కాక కొట్టుచుంటిని. కాని యెందుచేతనో వాయువేగముగ వెళ్ళు గుఱ్ఱములు వెనుక కడుగు వేయుచున్నవి. ఇంతియేగాక నా యెడమకన్నుకూడ నదరుచున్నది రావణప్రభూ! నీప్రయాణములో దుశ్శకునములు మెండుగాఁ గలుగుచున్నవి. కారణమేదియో తెలియబడుట లేదు.

౨౦ కావున నీవు సర్వరాక్షస సైన్యముతో బయలుదేరి యుద్ధములో రామునిఁ జంపి పిమ్మట సీతను లంకకుఁ దీసికొని పోవుట నా యభిమతము. నీ వొక్కఁడవు నిప్పుడు రాముని యాశ్రమమునకు వెళ్ళుట నాకు సంమతముగ లేదు.

ఇత్యుక్తః ప్రాహ తం వాక్యం రావణః కాలచోదితః
హత్వా రామ మహం త్వాదా తజ్జాయాం తు బలా త్తతః
యది గృహ్ణామి సా భ ర్తృశుచా త్యక్ష్యతి జీవితమ్. ౨౧-౨౨
కించ దేవా న్విజయిన శ్లాఘ్యా మే బాహవో హ్యమీ,
మానుషావశగం రామం వధిష్యంతి కథం హి ప్రియా,
తస్మా ద్రామం వంచయిత్వా హరిష్యామి చ భూమిజామ్.
౨౩

ఇతి తద్వచనం శ్రుత్వా రావణం ప్రాహ సారథిః,
న సామాన్యమనుష్యోఽయం కింతు సాక్షా జ్జనార్దనః
మానుషం రూప మాపన్నో రక్షోనాశాయ రాఘవః,
ఇతి శ్రుతం మహారాజ ముంచ కోపం మయి ప్రభో.
౨౪-౨౫

ఇత్యుక్తో రావణః ప్రాహ వచనం సారథిం పునః,
తస్మా దేవాఽధునా మాయామృగ మాస్థాయ సారథే
గచ్ఛామ్యహం రాఘవస్య వంచనార్థం తు మాతులమ్
శీఘ్రం సంచోదయాఽశ్వాం స్త్వం విలంబం మా కురుష్వచ
ఇత్యుక్త స్సారథి శ్చాపి చోదయామాస తా న్ద్రుతమ్.
౨౬-౨౭-౨౮

ఆగచ్ఛ న్నసురాధిపో రథవరం త్వారుహ్య చైవం తదా
మారీచేన సహాంతరే బహువిధా న్గ్రామా న్పురీ శ్చాటవీః
పశ్య న్పంచవటీసమీప మచిరా ద్దేత్యాఽధిప్రాప్తే తదా
సంస్థాప్యాఽత్ర రథం తతోఽవద దముం మారీచ మేతద్వచః.
౨౯

౨౧-౨౨ ఇట్లు చెప్పుటతోడనే రావణుఁడు కాలచోదితుఁడై సారథితో నిట్టులఁ బలికెను. ఓ సారథీ! రాముని ముందుగఁ జంపి పిమ్మట సీతను నేను హరించినచో నామె భర్తృవియోగ దుఃఖముచే వెంటనే ప్రాణములను విడిచిపెట్టగలదు.

౨౩½ ఇదియునుంగాక దేవతలను జయించిన నా బాహువులు తుచ్ఛ మనుష్యుఁడగు నీరామునిఁ జంప నెట్లు పూనొప్పును? అందువలన రాముని నెట్టులనైన వంచించి సీతను హరించుటయే కర్తవ్యము.

౨౪-౨౫½ ఇట్లు రావణుఁడు చెప్పగా విని సారధి రావణునితో నిట్టుల బలికెను ఓ రాక్షసరాజా! ఈరాముఁడు సామాన్యమనుష్యమాత్రుఁ డని తలంపకుము. సాక్షాచ్ఛ్రీహరియే యని తెలిసికొనుము. రాక్షస నాశనమునకై శ్రీహరియే యిట్లు మానుషరూపమును ధరించెనని నేను వినిన సంగతిని జెప్పితిని. నీవు నాయందుఁ గోపింపకుము.

౨౬_౨౭-౨౮ ఇట్లు చెప్పగా రావణుఁడు సారథితోఁ దిరిగి యిట్టులఁ జెప్పెను. నీవు చెప్పినసంగతి నిజముకూడఁ గావచ్చును. అందువలననే సకల మాయాగురువగు మామను (మారీచుని) గూడ వెంటఁ దీసికొని వెళ్లుచుంటిని. ఇతఁడు రాముని నెట్టులైనను మోసగించి దూరముగఁ దీసికొని పోఁగలఁడు. ఆసమయముననే సీతనపహరించెదను. నీ వాలస్యముచేయక శీఘ్రముగ గుఱ్ఱములను దోలుము, అని రావణుఁడు చెప్ప సారథియు జేయునది లేక గుఱ్ఱములను దొందరగ దోలెను.

౨౯ రావణుఁ డివ్విధముగ రథారూఢుఁడై మారీచునితో బయలుదేరి వచ్చుచు మధ్యమార్గములో ననేక పట్టణములను గ్రామములను నదులను వనములను దాటుచు స్వల్పకాలములోనే దండకవనమునందలి పర్ణశాల సమీపమునకు వచ్చి తత్సమీపముననున్న యొక పర్వతము వెనుకభాగమున దన రథమును రావణుఁడు నిలిపి మారీచునితో నిట్టులఁ బలికెను.

యదర్థ మాగతా హ్యత్ర వయ మద్య తు మాతుల
తత్కార్యం తు భవా న్కృత్వా భవతా త్సత్కృతో మయా.
30

ఇత్యుక్తో ఽసురనాయకేన తు తథే త్యుక్త్వాఽ సుర స్స్వపరం
సౌవర్ణం మృగరూప మేత్య విపినే రామాశ్రమ స్యాంతికే
క్రీడ న్నన్యమృగై రివాథ విచరం స్తస్థౌ వనం శోభయన్
సీతా ప్రత్యయనాయ తత్ర బహుధా చేష్టాస్తు సందర్శయన్.
31

భ్రాంతః కిన్ను వనం త్విదం తు మహతా సందీప్యతే తేజసా,
దావాగ్నిద్యుతివిద్యుదాదివిలసద్దీప్త్యా యథాఽకారణమ్
ఇత్యేవం వదతి ప్రభాసురతను స్స్వర్ణమాయామృగః
ప్రత్యక్షీ విష యోఽభవ ద్వనభువం సంశోభయం స్తాం తయోః.
32

రాఘవ స్తం మృగం దృష్ట్వా త్వపూర్వం రౌప్య బిందుకం,
సౌవర్ణవర్ణం ప్రాహేదం వచనం జానకీం ప్రతి. 33

పశ్య ప్రేయసి దూరతః స్థిత మహో సౌవర్ణవర్ణం మృగం,
దేహాభ్యంతరసంస్థరత్నవిలసద్బిందుం త్వపూర్వం చ తమ్
ఇత్యుక్త్వా జనకాత్మజాఽపి ముదితా దూరే. ప్రసార్యాక్షిణీ
దృష్ట్వా తన్మృగమాశు విస్మయ మలం సంప్రాప మోహం చ సా.
34

౩౦ మామా! మారీచా! మన మిచ్చటకు నెందులకై వచ్చితిమో, ఆపనిని నీ వక శీఘ్రముగ నెఱవేర్చి నావలన సత్కారమును బొందుము.

౩౧ ఇట్లు రావణుఁడు చెప్పగా నటులనే చేయుదు నని మారీచుఁడును చెప్పి వెంటనే తన మాయా బలముచే బంగరు లేడియై పర్ణశాలకు సమీపమున నితర వన మృగములతో నాడుచున్నట్లుండినదై తన దేహ కాంతిచే వనము నంతను బ్రకాశింప జేయుచున్నదియై సీతకు నమ్మకము కలుగుటకై లేడి చేష్టలను బహు విధములుగ గనపఱచుచు నిటు నటు సంచరించుచుండెను.

౩౨ ఇట్లుండ లక్ష్మణుఁడు నూతనమైన వనరామణీయకమును జూచి రామునితో నిటులఁ బలికెను. అన్నా! ఎందుచేతనో కాని యీవనము నూతనమైన ప్రకాశముతో నొప్పుచున్నది. దావాగ్ని కాని మెఱుపుకాని సంభవించినపుడు చెట్లన్నియు నొకవిధముగఁ బ్రకాశించినటుల నకారణముగ వనమంతయుఁ బ్రకాశించుచుండెను. అని యిట్లు లక్ష్మణు డనుచుండగనే బంగరులేడియు తన కాంతిచే వనమును బ్రకాశింపఁజేయుచు రామలక్ష్మణులకు గోచర మయ్యెను.

౩౩ రాముఁడు బంగారపు వర్ణము గలిగి మధ్యమధ్య వెండి చుక్కలు రత్నపు డెక్కలు గలిగి ప్రకాశించుచున్న యాక్రొత్తలేడిని జూచి సీతతో నిటులఁ బలికెను.

౩౪ ఓ ప్రియసీ! దూరముగఁ గన్పడుచున్న యాబంగరులేడిని జూడుము. శరీరమం దచ్చటచ్చట రత్న రౌప్య బిందువులతో నొప్పుచున్నది. ఇట్టిదాని నెప్పుడు చూచి యుండలేదు, అని చెప్పగా సీతయు నేత్రములను దూరమునందుఁ బ్రసరింపఁజేసి యా మృగమును జూచి యాశ్చర్య మోహములను బొందెను.

దైవయోగేన జానక్యా స్తద్దర్శనవశా దభూత్
అతిలోభో మృగే తస్మి న్మాయికే తు హిరణ్మయే. ౩౫

పశ్చా త్ప్రాంజలి రబ్రవీ ద్రఘుపతిం సీతా విభో త్వా మహం
ప్రష్టుం వాంఛతి మే మనః ప్రియతమం వస్త్వేక మార్యాఽధునా
దాస్యామీతి భవాన్వదే ద్యది తతో వక్ష్యామి మేఽభీప్సితం
నోచే త్స్వాంతగతం న వచ్మి విషయం బ్రూషే త్వ
మత్రాఽర్య కిమ్. ౩౬

ఇత్యుక్తో రాఘవః ప్రాహ భూమిజా మాదరేణ సః,
యదుచ్యతే భవత్యా త ద్ధ్రువం కుర్వే వద ద్రుతమ్. ౩౭

ఇత్యుక్త్వా జనకాత్మజా రఘుపతిం సప్రశ్రయా ప్రాహ తం,
హైమం తన్మృగ మద్య మే యది దదాన్యానీయతుష్యామ్యహం
ధన్యాహం భవితాస్మి తేన దివసా న్నేష్యామి శేషా న్సుఖం
ధర్తుం నక్షమసే యదిత్వమసుభి ర్యుక్తం మృగం తం విభో. ౩౮
హత్వా వా తం సమానీయ దేహి మే నాథ సత్వరమ్
తచ్చర్మ కంచుకం కృత్వా ధారయిష్యా మ్యహం ముదా. ౩౯

కించ తచ్చర్మ నీత్వాఽహ మయోధ్యాం బంధు సంతతేః,
దర్శయిష్యామి తం జీవం నిర్జీవం వా నయ ద్రుతమ్
క్రీడార్థం మే మృగం చేమం ధృత్వా దేహి రఘూత్తమ. ౪౦

ఇత్యుక్తో రాఘవో గంతు ముద్యుక్తోఽభూ త్తదా పునః
సౌమిత్రిః ప్రాహ రామం తు సప్రశ్రయ మిదం వచః. ౪౧

౩౫ దైవయోగముచే నా మృగమును జూచుటవలన నామాయికమగు నా బంగరు లేడియందు లోభము (ఆశ) కూడ గలిగెను.

౩౬ అనంతరము చేతులు జోడించి సీత భర్తతో నిట్లుఁబలికెను. నాథా! నిన్నిప్పుడొక దాని నడుగవలయునని మనమునందుఁ గోరికగలదు. ఇచ్చెదనని నీవు చెప్పినచో నాయభిమతమును బయలుపఱచెదను. లేక పోయినచో నేను చెప్పదలచలేను. ఇవ్విషయమున నీవేమి చెప్పెదవు?

౩౭ ఇట్లు చెప్పుటతోడనే సీతతో రాముఁడిట్లు చెప్పెను. ఓ ప్రియసీ! నీ మనస్సులో నున్న విషయమును జెప్పుము. తప్పక నేను జేసెదను.

౩౮-౩౯ ఇట్లు చెప్పుటతోడనే సీతయు రామునితోఁ జేతులు జోడించి యిట్లుఁ బలికెను నాథా! ఆబంగరు లేడినిఁ దీసికొనివచ్చి నాకిచ్చితివేని నేను మిక్కిలి సంతోషించెదను అది నాయొద్దనున్నచో నేను గడు ధన్యాత్మురాల నగుదును. మిగిలిన వనవాసకాలమును గూడ సుఖముగ గడపెదను. సజీవముగ నున్న యాలేడినిఁ బట్టుకొనుటకు నీకు వీలు గలుగనిచో నాథా! దానినిఁ జంపియైనను దీసికొనిరమ్ము. దానిచర్మము కూర్చుండుటకుఁ బనికివచ్చుటయేకాక రవికలుగా కుట్టుకొని నేను ధరించెదను.

౪౦½ నాథా! ఆ చర్మమును దీసికొనివెళ్ళి వనవాసాంతమున నయోధ్యలో నున్న మన బంధుగు లందరికిఁ జూపించిన వారలు సంతసించెదరు. జీవించిన దానినైనను నిర్జీవమును నైనను దీసికొనిరమ్ము. జీవముతో నుండినచో నేను దానితో నాడుకొనుచుఁ గాలక్షేపము చేసెదను.

౪౧½ ఇట్లు చెప్పుటతోడనే రాముఁ డా మృగము ననుసరింప నుద్యమింప నంతలో లక్ష్మణుఁడు రామచంద్రమూర్తితో నిట్లుఁ బలికెను.

భ్రాత స్సర్వం విజానాసి తథాపి స్మారయా మ్యహమ్,
యః కశ్చిద్రాక్షసో నూనం మృగరూపం సమాశ్రితః
అస్మా న్వంచయితుం చాగా దితి మే స్ఫురతి ధ్రువమ్
నోచే దేతాదృశ స్సత్యం మృగః కుత్ర వసే ద్వద. ౪౨-౪౩॥

ఇత్యు క్తః ప్రాహ సౌమిత్రిం రాఘవః ప్రహస న్నిదమ్,
త్వదు క్తవచనం సత్యం భవ త్యనుజస త్తమ
తథాపి హత్వా తం శీఘ్రం సమేష్యామి తవాంతికం
తావ త్త్వమేతాం తు యత్నేన రక్షేమాం సర్వథా ఽనుజ.
౪౪-౪౫॥

ఇత్యుక్త్వాఽథ ధనుర్బాణౌ ధృత్వా రామో మృగం పునః,
ధర్తుకామో ఽనుసృత్యాశు సుదూరం తు గతోఽభవత్ ౪౬॥

సాచీకృత్య నిజగ్రీవాం మృగో హేమమయ స్తదా,
అనుయాంతం రాఘవం తం పశ్య న్ధావతి కాననే. ౪౭॥

జిహ్వాఽగ్రేణ నవం తృణం పునరసౌ సంస్పృశ్య వై ధావతి,
శ్రీరామే గ్రహణార్థ మాశు యతతి యాతి భ్రమ న్సర్వతః
రామోఽథో నివస త్యతేత యది తం ధర్తుం తదోచ్చై వసేత్
ఏవం దూరతలం నినాయ నితరాం రామం కురంగ స్తదా. ౪౮॥

౪౨-౪౩½ అన్నా! నీకు సర్వము తెలిసియే యున్నది. నేను నీకు చెప్ప నంతటివాఁడను కాను. కాని కొంచెము జ్ఞాపకము చేసెదను. ఈ మృగము సత్యమైనదిగా నాకుఁ దోచుటలేదు. ఎవ్వఁడో రాక్షసుఁ డీ మృగరూపమును ధరించి మనలను మోసగింపవచ్చెనని నేను తలంచెదను. లేకపోయిన నిట్టి మృగ మెచ్చటనైన నుండునా! చెప్పుము.

౪౪-౪౫½ ఇట్లు లక్ష్మణుఁడు చెప్పుటలోపనే రాముఁడు నవ్వుచు నిట్లుఁ బలికెను. లక్ష్మణా! నీవు చెప్పినది సత్యముకాదనను కాని, యొక పక్షమున రాక్షసుఁడేయైనచో వెంటనేచంపి నీయొద్దకు వచ్చెదను. అంతదనుక నీ వీ సీతను సర్వవిధముల నతి ప్రయత్న పూర్వకముగఁ గాపాడవలయును సుమా!

౪౬½ ఇట్లు లక్ష్మణునితోఁ జెప్పి రామచంద్రమూర్తి ధనుర్బాణములను జేతపట్టి యా బంగరులేడి ననుసరించెను. ఆ లేడియును రాముఁడు వచ్చుచున్నట్లు గ్రహించి దూరముగఁ బారిపోవుచు రాము నాకర్షించు చుండెను.

౪౭½ బంగరులేడి తన మెడ నడ్డముగా ద్రిప్పి తనను వెంబడించి వచ్చుచున్న రాముని జూచుచు నడవిలోఁ బరుగులిడుచుండెను.

౪౮½ ఆ మృగము జిహ్వాగ్రముచేఁ దృణాంకురములను గొరుకుచున్నట్లు నటించి పరుగిడుచుండెను. రామచంద్రమూర్తి తనను బట్టుకొను టకు బ్రయత్నించుచుండఁగా నంతటఁ దిరుగుచుండెను. రాముడు క్రిందుభాగమున నుండి పట్టుకొన ప్రయత్నింప నామృగము ఉన్నత ప్రదేశమునఁ గన్పడును. ఇవ్విధముగ నా బంగరులేడి రాముని జాల దూరము తీసికొని వెళ్లెను.

వ్యర్థే తద్గ్రహణార్థ మాత్మ్నయతనే రామే తతోఽతిక్రుధా,
తత్సంహారకృతే ధనుష్యథ శరం సంధాయ చాకర్షతి
తత్కాలే తు తిరోహిత శ్చ భవతి క్షిప్రం కురంగో వ్యహో
రామే గంతు మన స్స్వయం పున రలం దూరే తు సంవృశ్యతే. ౨౯ ॥

రామ స్సుదూరం గమిత స్తథైవం,
మృగేణ సంచింత్య తతోఽసురం తమ్
జ్ఞాత్వా చ సంధాయ శరం చ చాపే
జఘాన మాయామృగ మాశు పశ్చాత్. ౩౦ ॥

ఏవం రఘూత్తమశరార్దితతత్కురంగ
స్త్యక్త్వా మృగాకృతి మథో నిజరూప మేత్య
హా లక్ష్మణేతి దృఢ ముచ్చరతిస్మ రామ
వాచేవ సోఽథ విగతాసు రభూ త్కురంగః. ౩౧ ॥

మారీచోఽపి మృత శ్చైవం రామ హస్తా త్తదా పునః
రామసాయుజ్య మగమ త్సర్వదా తత్స్మృతేః పునః. ౩౨ ॥

రామోఽథ చింతయామాస మ్రియమాణోఽసురాధమః
హా లక్ష్మణేతి మద్వాక్య మనుకుర్వ న్మమార హి. ౩౩ ॥

శ్రుత్వా మద్వాక్యసదృశం వాక్యం సీతా కిం దుఃఖితా
భవే దితి విచారేణ రాఘవోఽరం న్యవర్తత. ౩౪ ॥

౪౯ ఆ మృగమును బట్టుకొనుటకై తాను చేసిన ప్రయత్నమంతయు విఫలముకాగా, నప్పుడు రామచంద్రమూర్తి యా లేడిని సంహరించుటకు ధనుస్సునందు బాణమును సంధించి యాకర్షించుచుండ నంతలో నా మృగము కన్పడకుండ నంతర్ధాన మయ్యెను. కన్పడలేదని రామచంద్రమూర్తి వెదకబోవుచుండ నంతలో నా మృగము దూరమునం గన్పడును.

౫౦ ఇట్లా మృగముచే రామచంద్రమూర్తి మిక్కిలి దూరము పొందింపబడినవాడై తన మనమునం దిట్లు చింతించెను. ఈ మృగము సత్యమయిన మృగము కాదు. రాక్షసుఁడెవ్వఁడో యిట్టుల మాయామృగరూపము ధరించెనని తలచి ధనుస్సునం దమోఘమైన బాణమును సంధించి యా మాయామృగమును గొట్టెను.

౫౧ ఇట్లు రామబాణముచేఁ గొట్టఁబడి యా మృగము మృగరూపమును విడిచి వెంటనే రాక్షసరూపమును ధరించి "హా లక్ష్మణా! చచ్చితి నని" రాముఁడఱచినట్లు బిగ్గరగ నఱచి వెంటనే ప్రాణములనుగూడ విడిచెను.

౫౨ మారీచుఁడు రామహస్తముతోఁ గొట్టబడి మృతినొందినందునను నెల్లప్పుడు భయముచేతనుగాని క్రోధముచేతనుగాని రాముని స్మరణమే యితనికిఁ గలిగినందున నితనికి (మారీచునకు) రామసాయుజ్యము కలిగెను.

౫౩ రాముఁడు ననంతరమిట్లు తన మనమునందు విచారించెను. ఈ రాక్షసుఁడు ప్రాణములను విడుచు సమయమున "హా లక్ష్మణా!" యని నేను పిలిచినట్లు పిలిచి చచ్చెను.

౫౪ నావాక్యములతో సమానమైన "హాలక్ష్మణా!" యను మారీచుని వాక్యమునువిని సీత యేమి దుఃఖించునో, అని విచారపడుచు నచ్చట నుండి మరలెను.

సీతా దేవర మాహ లక్ష్మణ తవ భ్రాతు స్త్వనర్థోఽభవ,
న్నోచే త్త్వాం తు వృథా కిమర్థ మధునా హా లక్ష్మణేత్యాహ సః
దీనం తద్వచనం తవ శ్రుతవత్యో ప్యేవం స్థితి ర్నోచితా
శీఘ్రం గచ్ఛ తదంతికం మమ భయం సంజాయతే లక్ష్మణ. ౧౫॥

తచ్ఛ్రుత్వా జనకాత్మజాం ప్రతి వచ స్సౌమిత్రి రప్యాహ తాం,
భ్రాతా మే తవ రక్షణార్థ మిహ మా మాజ్ఞాప్య యాతోఽనఘే
దేశే స్మి న్భవతీం నిశాచరవృతే దుష్టై ర్మృగై స్సేవితే
త్యక్త్వైకా మిహ తు ప్రజేయ మధునా చాహం కథం త్వాం వద. ౧౬॥

కించ త్వం శృణు మద్వచోఽవనితలే తం వంచితుం కః క్షమః
హంతుం వా భువనత్రయే ప్యవనిజే రామం తు కోఽప్యక్షమః
తస్మా త్సంత్యజ తద్విచార మనఘే వ్యర్థం కిమర్థం భయం
త్వస్థానే లభసే తదాపది తదా ప్రాణా న్నరా మ్యద్య తే. ౧౭॥

యః కశ్చి ద్దనుజోఽబ్రవీ ద్వచ ఇదం హ్యాసన్న మృత్యు ర్ధ్రువం
క్రుద్ధ స్స్యా ద్యది రాఘవోఽఖిలజగన్నాశం చ కర్తుం క్షమః
తాదృ గ్దీనవచాంసి రాఘవవిభు ర్భాషేత రామః కథం
తస్మా త్త్వం పున రద్య సంత్యజ భయం రామప్రమాదా ద్ధ్రువమ్. ౧౮॥

౫౫౪ సీత "హా లక్ష్మణా!"యని వాక్యమును విని తన మరదియగు లక్ష్మణునితో నిట్లు బలికెను. లక్ష్మణా! మీ యన్న గారి కేదియో యనర్థము వాటిల్లిన ట్లున్నది. లేక పోయినచో "హాలక్ష్మణా" యని వ్యగ్రముగ నేల బిలుచును. నీవిట్టి దీనవచనమును విని కూడ నిట్లుపేక్షించియుండుట తగదు. కాన నీవు వెంటనే మీయన్న సమీపమునకు వెళ్లుము. నాకు భయము కలుగుచున్నది.

౫౬౪ ఆ మాటలు విని లక్ష్మణుఁ డవ్యగ్రముగ సీతనుగూర్చి పలికెను. నా యన్నయగు రామచంద్రమూర్తి నిన్నుఁ గాపాడుమని నన్ను నియోగించి వెళ్ళెను. ఈ ప్రదేశము, రాక్షస సంచార భూయిష్ఠమును, దుష్టమృగసేవితమునై యున్నది. ఇట్టి ప్రదేశములో నిన్నొక్క దానిని విడిచి యెట్లు వెళ్ళుదును? నీవే చెప్పుము.

౫౭౪ ఇదియునుగాక నేను చెప్పెడి విషయమును బాగుగ వినుము. రాముని వంచించుటకు భూమిలో నెవ్వఁడును సమర్థుడు కాడన నతనిని సంహరించుట కెవ్వడు సమర్థుడగును? కావున మాయన్న కేదైన ప్రమాదము గలుగునను విచారమును విడువుము. వ్యర్థముగ నీ వెందునకు భయపడియెదవు? మా యన్న కేమైన యాపద సంభవించు పక్షమున నా ప్రాణమును నీకు బలి యిచ్చెదను. ఇందునకు సందియము లేదు.

౫౮౪ ఎవ్వఁడో రాక్షసుఁడు మరణ మాసన్నము కాగా మనలను మోసగింప నిట్లు పలికెను గాని వేరు కాదు. రాముఁడు కోపగించినచో ముల్లోకములను క్షణములో భస్మము చేయును. అట్టి సమర్థుడగు రాముఁ డిట్టి దీన వాక్యముల నెటుల బలుకునని తలంచితివి. ఆ కారణముచే రామునకుఁ బ్రమాదము గలుగునను భయమును విడిచి పెట్టుము.

తచ్ఛ్రుత్వాఽవనిజా* క్రుధాఽఽహ వచనం శోకాతిరేకాన్వితా
దుర్బుద్ధ్యాఽగ్రజమాశ్రిత స్త్వమితి నోవేదాఽహ మద్యాఽవధి
శ్రీరామవ్యసనార్థి కైకయసుత స్త్వాఽప్రేషయ ద్వా వనం
సాశ్చర్యం న భవేద్భవాదృశి జనే పాపాత్మనీదం పునః. ౫౯

నష్టే రామే భవాన్నూనం ప్రాప్తుం మాం సముపస్థితః,
దుర్బుద్ధే తవ కామోఽయం సఫలో న భవిష్యతి. ౬౦

త్యక్త్వా రామ మహం క్షణం క్షితితలే జీవా మ్యహం నో ధ్రువం
పీత్వా వా విష మద్య బంధనవశా ద్వాఽగ్నిం ప్రవిశ్యాఽథవా
గోదాయాం పతనేన వా ద్రుతమహం ప్రాణాం స్త్యజేయం ధ్రువమ్,
స్ప్రష్టుం పాద నఖేన వాఽన్యపురుషం నేచ్ఛామి రామం వినా. ౬౧

కించాఽథో జనకాత్మజాఽఽహ వచనం సౌమిత్రి మేవం పునః,
తస్య క్షేమ మలం విచారితు మిహ త్వం నాగతోఽసి ధ్రువమ్,
జానా మ్యద్య భవంత మగ్రజవిపత్సందర్శనార్థాగతం
భ్రాతృద్రోహమతే స్తవాస్య మవనౌ ద్రష్టాఽపి పాపీ భవేత్. ౬౨

పయోముఖాంతరవిషం నావిదం త్వాం ఘటం యథా,
ఘాతయిత్వాఽగ్రజం ప్రాప్తుం మాం సమేతో వనం భవాన్. ౬౩

౫౯। ఆ లక్ష్మణుని వాక్యములను విని సీత మిక్కిలి దుఃఖము గలదై కోపముతో నిట్లుఁ బలికెను. ఓ లక్ష్మణా! నీవు దుర్బుద్ధితో నిట్లు మీ యన్న నాశ్రయించి తిరుగుచుంటివని యిప్పటివరకుఁ దెలిసికొనలేక పోతిని. రామచంద్రమూర్తికి కష్టము సంభవింపవలయునని కోరిక గల భరతుఁడే నిన్ను రాముని వెంటఁ బంపెనని తలంచెదను. నీవంటి పాపాత్ముల విషయమై యిదియొక గొప్ప యాశ్చర్యమైన విషయముగాదు.

౬౦। ఓరీ దురాత్మా! రాముఁడు నష్టమైలే నన్నుఁ బొందు నూహతో నీవు వచ్చిన ట్లున్నది. కాని నీకోరిక మాత్రము సఫలము కానేరదు.

౬౧। రాముని విడచి క్షణకాలమైనను భూమిమీద జీవితమును నేను ధరింపను. ఇది నిశ్చయము. విషపానము చేసికొనికాని, యురిపోసికొని కాని, యగ్నిప్రవేశము చేసికాని, గోదావరిలోఁబడి కాని ప్రాణములను విడిచిపెట్టుదును కాని, రాముని విడిచి యన్యపురుషుని కాలి గోటితోనైనను స్పృశింపనని తెలిసికొనుము.

౬౨। మఱియు లక్ష్మణుని నిట్లు దూషించెను. ఓ లక్ష్మణా! నీవు రాముని క్షేమమును విచారించుటకై యిచ్చటకు వచ్చినవాఁడవు కావు. మీయన్న కేమైన యాపద సంభవించునేమో చూచి సంతోషించుటకై వచ్చితివని తెలిసికొంటిని. ఇట్టి భ్రాతృద్రోహియగు నీ ముఖమును జూచిన వానికిఁగూడ పాపము సంభవించును.

౬౩। నీవు పయోముఖ విషకుంభమువంటి వాఁడవని యెఱుఁగుదును. అన్న నెట్లయిన జంపించి నన్నుఁ బొందు నూహతోనే వచ్చితివి.

ఇతి బ్రువంత్యాం పరుషం తు తస్యాం
పిధాయ కర్ణౌ తు నిజౌ శుచా సః
పశ్చాత్తు దుర్వాక్యశ్రవణోత్థపాప
మపోహితుం ప్రాహ శివేతి భూయః. ౬౪౫

అవివేక మనావేక్ష్య మదాక్షిణ్య మనూర్జితమ్,
ధిగహం జన్మ నారీణాం యన్మా మేవం ప్రభాషసే- ౬౫౫

తచ్ఛ్రుత్వా వచనం ప్రాహ సౌమిత్రిం జనకాత్మజా,
మూర్ఖ త్వం శృణు మే వాక్యం లక్ష్మణాఽహం తవాఽగ్రతః,
మరిష్యేఽద్యైవ పశ్చాత్త్వం భ్రాతరం గచ్ఛ నిస్స్పృహః. ౬౬౫-౬౭౫

ఇత్యుక్తః ప్రాహ సౌమిత్రి ర్బాష్పమిశ్రం ప్రతి దుఃఖితః
ఏవం నిష్ఠురభాషణా త్ఫల మరం త్వం భోక్ష్యసే దేవి మే
వాక్యం తు శృణుయా మ్యహం త్వదవనే రేఖాం ధనుష్కోటితః
కృత్వా కంఠగతై రపి త్వ మసుభి స్తాం మా సముల్లంఘయ
మాచాగచ్ఛ బహిర్న మో స్త్వితి వద న్రేఖాంచకారాఽథ సః ౬౮౫

తతో దేవ్యై నమస్కృత్య లక్షణాస్తు వినిర్గతః
విచిన్వ న్రాఘవం దూరం గతవా న్కాననాంతరే. ౬౯౫

అరణ్యకాండే
ద్వాదశ స్సర్గ స్సమాప్తః.

---

౬౪। ఇట్లు పరుషముగ నామె మాట్లాడుచుండ లక్ష్మణుఁడు చెవులు మూసికొని పిమ్మట దుర్వాక్య శ్రవణమువలన గలిగిన పాప ముప శమించుటకై శివశివ యని పలుమా రుచ్చరించెను.

౬౫। పిమ్మట లక్ష్మణుఁడు కోపముతో సీతను గూర్చి యిట్లు పలికెను. నన్నిట్లు మాట్లాడుచుండుటవలన అవివేకము గలిగినట్రియు దాక్షిణ్య రహితమైనట్రియు, దూరాలోచనము లేనట్రియు, స్త్రీజన్మ పాడు జన్మమని నేను తలంచెదను.

౬౬-౬౭। ఆమాట విని సీత లక్ష్మణునితో నిటులఁ బలికెను. ఓరి మూర్ఖా! లక్ష్మణా! నీ ముందరనే నే నిప్పుడే మరణించెదను. పిమ్మట నీయన్న యొద్దకు నిస్పృహుఁడవై వెళ్లగలవు. ఇట్లు పలుక లక్ష్మణుఁడు దుఃఖి తుఁడై సీతతో నిట్లు తిరిగి పలికెను

౬౮। నీవు నన్ను కారణముగ నిట్లు పరుషముగ మాట్లాడిన ఫలితమును వెంటనే యనుభవించెదవు. నేను జెప్పుమాటను వినుము. నేను పర్ణశాల చుట్టును ధనుస్సుతో నొక రేఖను గీచి వెళ్లెదను. ప్రాణములు కంఠ గతములైనను నీవుమాత్రి మాగీటును దాటి బయటికి రాకుము. నీకొక నమస్కారమని చెప్పి తన ధనుస్సుతో నొక రేఖను జుట్టూ గీచెను.

౬౯। పిమ్మట లక్ష్మణుఁడు సీతకు నమస్కరించి యచ్చటనుండి బయలు దేరి యరణ్యములోపల రాముని వెదకుచు దూరముగ వెళ్లెను.

అరణ్యకాండమున పండె్రండవ సర్గము

సమాప్తము.

## త్రయోదశ స్సర్గః.



[1]పశ్చాత్సోఽపి దశాననోఽతిరుచిరం వేషం యతే స్సంశ్రితో,
వృద్ధ స్సంచల దంగయష్టి రమలచ్ఛత్రీ శ్శిఖాసంయుతః,
వామాంసే తు దధ త్కమండలు మహోయష్టిం శనై రాగతో
భ్రాతృభ్యాం రహితాం నిరీక్ష్య మహిజాం క్రూరాద్ధృదాఽ
చింతయత్. ౧

పూర్వం దిగ్విజయే మయాసురుచిరా నైకాస్త్రియస్త్వాహృతాః,
కిం చేంద్రాణ్యపి వీక్షితా దివి మయా దృష్టాశ్చవారాంగనాః
అద్రాక్షం బహువార మద్రితనయాం సర్వాసు తాస్వీదృశం
సౌదర్యం నహి వీక్షితం జనకజా సౌందర్యతుల్యం మయా. ౨

అహో రూప మహో రూప మహో తారుణ్య మద్భుతః,
న కుత్రచి న్మయా దృష్ట మీదృశం రూప మద్భుతమ్. ౩

సీతాసౌందర్యపీయూషపానా న్నేత్రపరంపరా
పరాం తృప్తి మవాప్తా మే మన స్సంతుష్టి మాప చ
కింతు మే బాహవోఽప్యస్యా స్తనుం పల్లవకోమలామ్
సమాలింగ్య సుసంతృప్తిం కదానుప్రాప్నువం త్యమీ
ఇతి సంచింతయ న్నాగా ద్రావణ స్తు తదంతికమ్. ౪-౫

---

1. కవిః.

## పదమూడవ సర్గ ప్రారంభము.

౧ పిమ్మట రావణుఁడు ముదుసలి సన్యాసివేషమును ధరించి వణుకుచున్న యవయవములుగలవాఁడై ఛత్రము, కమండలవు, దండము మొదలగునానిని ధరించి మెల్లగవచ్చుచు రామలక్ష్మణులు లేకుండగ నొంటరిగా నున్న సీతను దూరమునుండి చూచి తన మనమునం దిట్లులఁ జింతించెను.

౨ పూర్వము నేను దిగ్విజయమునకై బయలు వెడలినపుడు సౌందర్యము గల స్త్రీలను వెదకి తీసుకొని వచ్చితిని. స్వర్గమున కేఁగినపుడు దేవేంద్రుని భార్యను జూచితిని. యింతియే కాక దేవవేశ్యలను జూచితిని. మఱియు ననేకసర్యాయములు కైలాసమునందలి పార్వతినిఁ గూడఁ జూచితినికాని, యిట్టి సీతా సౌందర్యమువంటి సౌందర్యము నా కెవరియందుఁ గూడ గన్పడలేదు.

౩ ఓహో! ఏమిసౌందర్య మేమి సౌందర్యము? ఆ లావణ్యమేమి? ఇట్టి యద్భుతరూపమును నే నెచ్చటను జూచియుండలేదు.

౪-౫ సీతా సౌదర్యమను రసాయనమును పానముజేయుటచే నా నేత్రపరంపర సంతృప్తి నొందెను. మనస్సుకూడ సంతృప్తినొందెను. చిగురుటాకువంటి యీ సీతాదేహమును గౌఁగలించుకొని నా బాహువులు కూడ నెన్నడు సంతృప్తినిబొందునో కదా అని యాలోచించుకొనుచు మెల్లగ రావణుఁడు సీతను సమీపించెను.

శ్రీరామా ర్త్వవచ శ్రుతే రుదితయా యుక్తాం శుచా భూమిజాం,
బాహ్యాభ్యంతరయో రలం విరహితాం స్వాస్థ్యేన చైకాకినీమ్,
శ్రీమత్పర్ణగృహాంతరస్థితవతీం సంప్రాప్తవా న్నారదః,
స్తామేవం త్వవిద న్నివాఽహ వికలస్వాంతాం కృపాళు ర్వృథా. ౬౪

ఆగంతుం త్విహ దేవతా అపి జనస్థానేఽసురాణాం పదే,
బిభ్యత్యేవ కథం న్విహాఽగతవతీ చైకాకినీ త్వం తు హా,
కా త్వం కస్య కిమర్థ మాగతవతీ చైకా కథం తిష్ఠసి,
త్వం త్వేత ద్విపినం నిశాచరజనస్థానం న జానాసి కిమ్. ౭౪

కా త్వం శ్రీ రథవాఽప్సరా స్సువదనే నోచే ద్రతి ర్వా వద,
నైవం రూపయుతాఽమరాదియువతి ష్వన్యాసు వా దృశ్యతే,
నో త్వాదృ శ్యవనా స్థితేతి చ మయా పూర్వం శ్రుతా భామిని,
త్వం తావ ద్విపినే తు కింను వసతిం ప్రాప్నోషి భీమే మృగైః. ౮౪

పృష్టైవం జనకాత్మజాయతిధియా ప్రాహాఽఽత్మవృత్తం తదా,
భర్తా మే పితృవాక్యపాలనకృతే సాకం మయా సాఽనుజః,
కైకేయ్యా త్వతివంచితో వనభువం త్యాగా ద్యతే సానుజ,
సోఽయం కార్యవశా ద్గతోఽద్య పున రత్రైతి క్షణం త్వం వస. ౯౪

౬౪ శ్రీరాముని యార్తనాదమును వినుటచే విచారగ్రస్తురాలై బాహ్యాభ్యంతరములయందు స్వాస్థ్య మేమాత్రము లేక యొంటరిగఁ బర్ణశాలలో మనో వైకల్యముతో నున్న సీతయొద్దకేగి యేమియు తెలియని వానివలె నామెను దయాళుఁడువలె నిటులఁ బ్రశ్నించెను.

౭౪ ఓ తరుణీ! రాక్షస నివాసభూతమగు నీ యరణ్య ప్రదేశమునకు దేవతలుకూడ వచ్చుటకు భయపడుచుందురు. ఇట్టిస్థితిలో నీవొక్కదాన విచ్చట కెట్లు వచ్చితివి? నీ వెవ్వతెవు? ఎవని భార్యవు? ఎందులకై యిచ్చటకు వచ్చితివి? ఒక్కతె వెట్లుంటివి? ఈ యరణ్యము రాక్షస జనస్థానమని యెఱుగవా?

౮౪ ఓ తరుణీ! నీవు లక్ష్మివా? లేక యప్సరసవా? లేక రతీదేవివా? చెప్పుము. నీవంటి సౌందర్యవతిని దేవతా స్త్రీలలోఁగూడ నేను చూచియుండలేదు. నీవంటి సౌందర్యవతి లోకము నందొక్కతె యున్నదనికూడ నేను వినియుండలేదు. ఇట్టి భయంకర మృగసేవితమైన యరణ్యమున నెందులకై యుంటివో తెల్పుము.

౯౪ ఇట్లు రావణుఁ డడుగుటతోడనే సీతయు నతఁడు యతియని తలంచి తన వృత్తాంతము నిట్లు చెప్పఁదొడగెను. ఓ యతివర! నా భర్త పితృవాక్యపాలనమునకై యిట్లు నాతోడను, సోదరునితోడను గూడ నరణ్యమునకు రావలసి వచ్చెను. సవతితల్లియగు కైకచే వంచితుఁడై యిట్లడవులపాలయ్యెను. కార్యాంతరమువలన సోదరులిద్దఱు నెచ్చటకో యేగిరి. ఇప్పుడే తిరిగి నా భర్త వచ్చును గాన క్షణకాలము వచ్చుదనుక నుండుము.

తచ్ఛ్రుత్వాఽహ దశాననోఽపి పరుషం వాక్యంమహీంజాం ప్రతి,
త్వం మాం విద్ధి దశాననం దివి సురా స్సంత్రాసితా యేన వై,
సౌవర్ణాకృతి మత్ర వీక్ష్య భవతీం దారే ష్వహం నో రత,
స్సర్వాసాం సముపేత్య పట్టమహిషీ స్త్రీణాం మమ త్వం భవ.
౧౦

లంకా నామ సముద్రవేష్టితతలా త్వాసీ త్త్రికూటోపరి,
త్వం చేన్మాం వృణుషే తదా మమ పున ర్జాయాశ్చ దాస్యోపి మే
నిత్యం తావకపాదసేవనకృత స్సత్యం భవిష్యంతి చ,
దృష్ట్వా త్వం భవితాసి గౌరవపురస్కారేణ నూనం మయా.
౧౧

భుంజానా భవతీ తు దివ్యవిభవం భోగాం శ్చ రామం తతో,
విస్మృత్య క్రమశ స్సుఖేన భవితా స్యేవ ధ్రువం భూమిజే
ప్రత్యాఖ్యాయ సమాగతం స్వయ మిహ త్వం మాం తత
స్తప్స్యసి పూర్వం తాప మగాత్పురూరవస ముజ్ఝిత్య
దివోర్వశీ. ౧౨

1రాజ్యభ్రష్టేన దీనేన తాపసేన గతాయుషా,
*కిం కరిష్యసి రామేణ మానుషేణాఽల్పతేజసా. ౧౩

---

* వాస్తవికార్థ స్తు—(రాజ్యభ్రష్టేన) రాజ్యా ద్భ్రష్టాః రిపవః యస్మా త్తేన, (దీనేన తాపసేన గతాయుషా) దీనానా మినః తాపసానా మినః తాదృశ స్స న్గతం ప్రాప్తం ఆయుః

---

1. వా॥ రా॥

౧౦౪ సీతావాక్యములను విని రావణుఁడు పరుషముగా నిట్లు పలికెను. ఓ సుందరీ! ఏ రావణునిచే స్వర్గమునందలి దేవత లందరు భయపెట్ట బడిరో, ఆ రావణునిగా నన్ను దెలిసికొనుము. బంగరువంటి శరీర చ్ఛాయగల నిన్ను జూచినది మొదలు నాభార్యలయందుగూడ నిచ్ఛ తగ్గిపోయెను. నాకుండిన స్త్రీ లందరిలో నిన్నుఁ బట్టమహిషినిగాఁ శేయుదును.

౧౧౪ చుట్టును సముద్రముచేఁ బరివేష్టింపబడిన లంకయను నా రాజధాని త్రికూట పర్వతశిఖరమున నుండెను. నీవు నన్ను వరించినయెడల నా భార్యలును, దాసీలును నిత్యము నీపాదపద్మములను సేవించెదరు. ఇంతియేకాక నేనుగూడ నిన్ను గడు గౌరవించెదను.

౧౨౪ నీవు మిక్కిలిగ నైశ్వర్యమును, భోగములను ననుభవించు తరి క్రమముగా రామునిసంగతి మఱచి సుఖముగ నుండెదవు స్వయముగ నీ యొద్దకువచ్చి నిన్నుగోరుచున్న నన్ను దిరస్కరించితివేని బూర్వము తననుఁ బ్రేమించిన పురూరవ చక్రవర్తిని ధిక్కరించి పిమ్మట పరితాపమును బొందిన యూర్వశివలె నీవును పిమ్మటఁ బరితాపమునుఁ బొందగలవు.

౧౩౪ *రాజ్యభ్రష్టుఁడును. దీనుఁడును, తాపసుఁడును, విగతాయువును, అల్పతేజస్కుఁడును, మానవుఁడు నగు రామునివలన నీ కేమి ఫల ముండును.

---

విశేషార్థము

*(రాజ్య భ్రష్టేన) ఎవనివలన శత్రువులు రాజ్యమునుండి భ్రష్టులగుదురో, అతఁడు రాజ్యభ్రష్టుఁడని యర్థము (అనగా శత్రువులను రాజ్యమునుండి భ్రష్టులనుగా శేయువాఁడును, (దీనేన తాపసేన గతాయుషా) (దీన) దీనులకు (ఇన) ప్రభువైనవాఁడును (తాపస) తాపసులకు (ఇన) ప్రభువైనవాఁడునై, (గతాయుషా)

అంగుళ్యా మమ సన్నిభో తవపతి ర్యద్ధే ధ్రువం నో భవేత్,
దృష్ట్వామాంద్య మిదంవనం తవపతిం తాతో వ్యనైషీద్ధ్రువమ్.
ఏవం స్వీయసమాగమార్థ మఖిలం నామాత్మనోఽన్వయం,
ప్రోవాచాఽవనిజాం తదాత్మచరితం సర్వం చ తద్భీతయే. ౧౪

*శ్రుత్వా రావణ మాహ భూమితనయా కృత్వాంతరే తు తృణం
యేషాం త్వం పతి రీదృశోఽతికలుష స్వాంతః ఖలో దుర్మతిః,
సర్వే తే తవ మూలతోఽసురజనాః ప్రాప్స్యంతి నాశం ధ్రువమ్,
శ్రీరామస్య సతీం తు మా మపహర స్త్వంచాఽపి నాశం వ్రజేః.
౧౫

---

ఏకాదశసహస్రపరిమితం యేన తేన దీనానాం తాపసానాం రక్షణార్థం చావతీర్ణే నేత్యర్థః. (మానుషేణ) మనుష్యరూపేణాఽవతీర్ణేన (అల్పతేజసా) అల్ప మిత రేషాం తేజః యస్మాత్తేన "త మేవ భాంత మనుభాతి సర్వం తస్య భాసా సర్వ మిదం విభాతీతి శ్రుతేః" (రామేణ కిం) ఏతాదృశం పరమపురుష ముద్దిశ్య కిమర్థం విలాపః క్రియతే.

* తృణ మంతరే కృత్వేత్యనేన తృణభక్షిపశుప్రాయ స్త్వ మితి, రామస్య పురత స్త్వం తృణప్రాయ ఇత్యర్థో గమ్యతే. కించ పతివ్రతానాం పరపురుషభాషణస్య నిషిద్ధత్వేన చ తృణ మంతరే కృత్వా భూమిజా రావణేన సంబభాష ఇతిచ వేద్యం.

౧౮ు ఓ సుందరి! నీ భర్త యుద్ధములో నా బొటనవ్రేలికిఁ గూడఁ బోలఁడు. నీ భర్త ప్రాప్తుఁడైనచో తండ్రి యీ యరణ్యమున కేల కొడుకును వెళ్లగొట్టును? (కాన నతని మాంద్యమును జూచియే తండ్రి వెడలఁగొట్టెనని భావము) ఇట్లు రావణుఁడు సీతకు భయమును గొల్పుటకై తన కులగోత్రములను, తన పేరును, తన చరిత్రను చెప్పి తన యభిమతమునుగూడఁ దెలియఁజేసెను.

౧౯ు ఆ మాటలు విని సీత యొక్క *తృణమును మధ్యనుంచి రావణునితో నిటులఁ బలికెను.

ఓ రావణా! ఇట్టి పాపాత్ముఁడవును, దురాత్ముఁడవును, దుర్బుద్ధివి యునగు నీవు రాక్షసులకు రాజవగుటవలన నా రాక్షసు లందరును నిర్మూలకముగ నశింపగలరు. వారలు నశించుటయే కాక రామ పత్ని యగు నన్ను నీ వపహరింప దలచినందున నీవును నశింపగలవు. ఇది నిశ్చయము.

---

పదునొకండువేల సంవత్సరముల పర్యంత మాయుః పరిమితి గల వాఁడును, (అనగా దీనులను, తాపసులను రక్షించుట కవతరించిన వాఁడని భావము) (మానుషేణ) మనుష్య రూపముతో నవతరించిన వాడును, (అల్పతేజసా) ఎవనికంటె నితరుల తేజ మల్పమో, అట్టి వాఁడును, (అనగా గొప్ప తేజస్సు గలవాఁడని భావము) ఎవఁడు ప్రకాశించుచుండ నతని ననుసరించి సర్వము ప్రకాశించుచుండునో, ఆ పరమేశుని తేజస్సు చేతనే సర్వము ప్రకాశించుచున్నది. అను శ్రుతి వలన నని తెలియదగును. అట్టి పరమ పురుషుఁడగు రాముని గూర్చి విచార పడియెడ వేలయని భావము.

* తృణమును మధ్యనుంచి యనుదాని వివరణము.

తృణమును రావణుని ముందు పడవేయుటవలన "రావణా! రాముని ముందు నీవు తృణప్రాయుఁ డవనియు, మఱియు, తృణమును ముందుంచుటచే తృణమును భక్షించు పశువుతో సమానుఁడవు నీ వనియు భావము వ్యంగ్య మగుచున్నది. మఱియు, పతివ్రతలకు పర పురుషునితో సంభాషణము కూడదు కాన తృణమును వ్యవధానమును గా నుంచి మాట్లాడె ననియు వ్యంగ్య మగుచున్నది.

హర్తుం రావణ యత్త్వ మిచ్ఛసి బలా న్మా మద్య నూనం ఖలా,
దాదాతుం స్వకరేణ కృష్ణ మురగం వాంఛ న్యథా దృశ్యసే,
కించ త్వం కిల కాలకూటగరళం పీత్వా సుఖేన స్థితిం
వాంఛ స్యబ్ధి మపార మిచ్ఛతి భవాం స్తర్తుం కరాభ్యాం పునః. ౧౬॥

రే మూర్ఖ శృణు మత్పతే స్తవ పున స్త్వద్వర్తతే చాంతరం,
హర్యక్షస్య యదంతరం తు శునక స్యాసీ త్తథా తస్య తే,
మాతంగస్య యదంతరం తు మశక స్యాసీ ద్ద్వయో రంతరం
రామ స్యాస్తి తవాంతరం య దభవ ద్ధేమ్నశ్చ లోహస్య చ. ౧౭॥

రేరే శక్రసతీం కదాచన భవా న్స్మృత్వాఽపి వా మోక్ష్యసే,
హృత్వామా మమృతాశినోఽపితవ నో మోక్షోఽభ వేద్రాఘవాత్,
సద్య స్త్వం ఫల మాప్స్యసి ధ్రువమతోఽసత్కర్మణో రావణ,
త్వం కాలేన తు చోదితోఽసి విరమ త్వస్మా దసద్భాషణాత్. ౧౮॥

ఇత్యుక్త స్స దశాననోఽథ భయకృ ద్రూపం నిజం త్వాశ్రితః,
పశ్చా త్స్వీయకరేణ * భూతల మలం భిత్త్వా త దాదాయ సః,
శీఘ్రం త్వాత్మరథాంతికం వ్యుపగత శ్చారోప్య తాం భూమిజాం,
తస్మి న్గచ్ఛతి చాంతరిక్షపథి సా చుక్రోశ చైవం తదా. ౧౯॥

* "చైత్రేమాస్యసితే పక్షే త్వష్టమ్యాం విందనామని। ముహూర్తే రావణ స్సీతాం జహారాత్మవినాశకే। ఇత్యనేన చైత్ర బహుళాష్టమ్యాం విందముహూర్తే రావణ స్సీతాం జహారేతి

౧౬౪ ఓరావణా! నన్ను నీ వపహరింప గోరుట, కన్నములోనుండి చేతితో కృష్ణసర్పమును బయటికిలాగ గోరుటయే యగును. నీవు కాలకూటవిషమును పానముచేసి సుఖముగ నుండ దలంచు చుంటివి. నీ వీ పని చేయ బూనుట యపారమైన సముద్రమును చేతులతో నీది దాటుటకుఁ బ్రయత్నించుట వంటిదే యగును.

౧౭౪ ఓరీ మూఢా! నా భర్తయగు రామునకును నీకును నెంత యంతర మున్నదియో చెప్పెదను వినుము. సింహమునకును, గ్రామసింహము నకును (కుక్కకును) ఎంత యంతర ముండునో రామునకు నీకు నంత యంతర ముండెను. మఱియు ఏనుగునకును, దోమకును, బంగారము నకును లోహమునకును, నెంత యంతరమో యంత యంతర ముండెను.

౧౮౪ ఎప్పుడైనా యొకప్పుడు దేవేంద్రుని భార్య నపహరించి యైనను నీవు విముక్తుఁడవై తే కావచ్చునేమో కాని, నన్నపహరించిన యెడల నీ వమృతపానము జేసినను రాముని చేతిలో మరణము నిశ్చితము. ఓరావణా! నీవు తలపెట్టిన దుష్కర్మయొక్క ఫలమును నీవు వెంటనే పొందగలవు. నిశ్చయము. నీవు మృత్యుచోదితుఁడవై యిట్లు ప్రేలుచుంటివి. ఇప్పుడైనను దుర్భాషణమును విరమింపుము.

౧౯౪ * సీత యిటుల దూషించుటతోడనె రావణుఁడు భయంకరమైన నిజ రూపమును ధరించి వెంటనే చేతితో గడ్డను బెల్లగించి సీతతో గూడిన యా గడ్డను రథమునొద్దకుఁ దీసికొనివచ్చి యా సీతను రథమునం దెక్కించి రావణుఁ డంతరిక్షమార్గమున వేగముగ బోవు చుండ సీత యీ క్రిందివిధముగ విలపించెను.

---

*“చైత్రబహుళ మం దష్టమీదినమున వింద యను దుష్ట ముహూర్తమునం దాత్మనాశనమునకై సీత నపహరించెనను వచనముచే చైత్ర బహుళాష్టమియందు వింద యను దుష్ట ముహూర్తమున సీత

హా రామ ! హా రమణ ! హా జగదేకవీర !,
రాత్రించరోఽయ మపహృత్య దశాననో మామ్,
లంకాం నయ త్వర ముపేత్య భవా న్దశాస్యం,
సంహృత్య మా మవతు నాన్యగతి ర్వినా త్వామ్. ౨౦

కైకేయి! త్వదభీప్సితం తు సఫలం చాభూ ద్ధృతాఽహం యతః,
పంక్త్యాస్యేన యశస్వినీ రఘుపతే ర్జాయాఽసురేణాఽధునా,
సౌమిత్రే యదహం త్వహేతుక మలం త్వాఽదూషయం
తత్ఫలం, సద్యో భుక్త మిహాఽధునైవ హి మయా విస్మృత్య
తత్పాహిమామ్. ౨౧

భో భో కాననదేవతా మృగగణా భోః కర్ణికారా ద్విజా,
స్సర్వేభ్యోఽపి నమోఽస్తు మా మపహృతాం లంకేశ్వరే
ణాఽధునా,
శీఘ్రం మత్పతయే నివేద్య సుకృతం సర్వే లభంతా మితి,
ప్రోక్త్వా చాథ వనస్పతిస్థ మవద త్పక్షీంద్ర ముద్దిశ్య సా. ౨౨

---

వేద్యమ్. అత్ర మాయా సీతైవాఽపహృతా. స్వయ మగ్నా వంతర్హితా. అత ఏవ మాయా సీతాయా మగ్నిప్రవిష్టాయాం నిజసీతాయా ఉత్థాన మితి వేద్యమ్. నిజసీతా త్వగ్నౌ ప్రవిష్టే త్యత్ర ఆధ్యాత్మానందరామాయణాదిషు, కూర్మపురాణాదిషు ద్రష్టవ్యమ్.

౨౦౪ హా నాథా! హా రామా! హా జగదేకవీరా! ఈ రావణుఁడు నన్నపహరించి లంకకుఁ గొనిపోవుచుండెను. శీఘ్రముగ నీవి రావణుని సంహరించి నన్ను రక్షింపుము. నీవు తప్ప వేఱుదిక్కు నాకు లేరు.

౨౧౪ ఇట్లు సీత రామచంద్రుని దలంచి విలపించి పిమ్మట కైక నుద్దేశించి యిటులఁ బలవించెను. ఓ కైకయి! యశస్వినియు, రామపత్నియునగు నన్ను రాక్షసుఁ డపహరించుటచే నీకోరిక సఫలమయిన దని విలపించి పిమ్మట లక్ష్మణు నుద్దేశించి యిటుల విలపించెను. ఓ లక్ష్మణా! నిష్కారణముగ నిన్ను దూషించిన ఫలమును నేను వెంటనే యనుభవించితిని కావున దానిని నీవు మఱచి నన్ను రక్షింపుము.

౨౨౪ ఓ వనదేవతలారా! ఓ మృగసంఘమా! ఓ కర్ణికారవృక్షములారా! ఓ పక్షులారా! మీ కందరకు నమస్కరించెదను. నన్ను రావణుఁ డపహరించి దీసికొని పోవుచున్నట్లు నా భర్తకు మీరలు తెలియజేసి సుకృతము సంపాదింపుకొనుడు. ఇట్లు వానిని గురించి విలపించుచు చెప్పి పిమ్మట గొప్ప వృక్షాగ్రమున గన్పడుచున్న జటాయువును జూచి సీత యిటుల విలపించెను.

---

నపహరించెనని తెలియదగు. మాయాసీతయే యపహరింప బడినదనియు, నిజ సీత యగ్నియం దంతర్ధానమైనదనియు తెలియనగును. కనుకనే మాయాసీత యగ్నిప్రవేశము చేయుట యను మిషతో నిజ సీత యగ్నినుండి బయల్వెడలెనని తెలియదగును.

నిజసీత యగ్నియందు ప్రవేశించి దాగబడి యున్న దనుటలో అధ్యాత్మ రామాయణము, ఆనంద రామాయణము మొదలగు రామాయణముల యందును, కూర్మపురాణము మొదలగు పురాణముల యందును జూడదగును.

శ్రీరామాయ సలక్ష్మణాయ వదతా త్వక్షీంద్ర మాం రక్షసాం,
నాథేనాఽపహృతాంభవానితి తయా ప్రోక్తః ఖగేంద్రోఽవదత్
మాత స్త్వం న బిభేహ్యుపైహి దనుజాఽధీశం నిహత్య క్షణే.
సీత్వా త్వాం రఘురామసన్నిధి మహం నేష్యా మ్యరం
భూమిజే. ౨౩

ఇత్యేవ మభయం వాక్యం వద న్ఖగపతిః పునః,
ఉత్ప్లుత్య చ నగా త్తూర్ణం రథమార్గం నిరుధ్య సః,
దశానన మువాచేదం వచనం భీషయం స్తదా. ౨౪

1రే రే భోః పరదారచోర కిమరే ధీరం త్వయా గమ్యతే,
తిష్ఠాఽధిష్ఠితచందనాచలతటః ప్రాప్తో జటాయు స్స్వయమ్,
ముంచైనాం పతిదేవతాం న ఖలు చే న్మచ్చండ తుండాహతి,
క్రూరారావస్ఫురణప్రవణాస్ర ఘురసః పాస్యంతి గృధ్రాస్తవ. ౨౫
రే రే లోకపతేః కళత్రమపహృన్నో లజ్జసే త్వం కథం
యాగే మంత్రపవిత్రి తాజ్యహృ దివ శ్వా తిష్ఠసి త్వం ఖల,
త్వం తు బ్రహ్మకులోద్భవోఽపి కురుషే కర్మాతి నీచం కుతః,
దుర్బుద్ధిం త్యజ దూరత స్త్వ మధునా వేమాం విముంచ
ద్రుతమ్, ౨౬

సామ్నైవం ప్రతిబోధితోఽపి దనుజ స్తత్యాజ నో తాం యదా,
క్రుద్ధో గృధ్రపతి స్తదాత్మచరణవ్యాఘాతత స్తద్రథమ్
చూర్ణీకృత్య హయా న్విదార్య చ నఖై స్తుండాసినా తస్య తు,
ఛిత్వా వామభుజా న్విరాజ చ పున స్తే వ్యుద్గతా బాహవః.
౨౭

1 అయ మన్య కృతః.

౨౩ ఓ గృధ్రరాజమా! నన్ను రావణుఁ డపహరించినట్లు రామలక్ష్మణులకుఁ జెప్పుమనగా నా జటాయువు సీతతో నిట్లభయవాక్యములఁ బలికెను. తల్లీ! నీవు భయపడకుము. నేను వచ్చుచుంటిని. ఈ రాక్షసుని క్షణములో సంహరించి నిన్నుఁ దీసికొనివెళ్ళి రాముని సన్నిధానమునఁ జేర్చెదను

౨౪ ఇట్లభయవాక్యములను జెప్పుచునే జటాయువు చెట్టునుండి పైకెగిరి రావణుని రథము నడ్డగించి వానిని భయపెట్టుచు నిటుల నా రావణునితోఁ బలికెను.

౨౫ ఓరీ పరదారచోరా! ఇంత పనిచేసి ధైర్యముగా వెళ్ళుచుంటివి? ఉండుముండుము. చందనాద్రియందు నివసించెడి జటాయువువచ్చెను. పతివ్రతయగు నీమెను నిప్పుడైనను విడువుము. నీవు విడిచిపెట్టక పోయినచోఁ దీక్ష్ణమైన ముక్కుతో నీ వక్షస్థలమును జీల్చి చెండాడి యా రక్తమును గృధ్రములచేఁ బానముఁ జేయించెదను.

౨౬ ఓరీ రావణా! లోకేశుని కళత్రము నపహరించి యేల సిగ్గునొందవు! యజ్ఞమునందు మంత్రపూతమైన పురోడాశమును కుక్క ముట్టుకొనినట్లున్నది. నీవు బ్రహ్మవంశములో బుట్టియు నెందువలన నిట్టి నీచపు పనినిఁ జేయ నుద్యమించుచుంటివి? దుర్బుద్ధిని దూరముగ విడువుము. ఇప్పుడైనను నీ వీమెను విడిచిపెట్టినచో బ్రతుకుదువు.

౨౭ ఇట్లు జటాయువు సామముచేతఁ జక్కపడు నేమో యని యనేకవిధముల బోధించెను. కాని యా దురాత్ముఁ డామెను విడువక పోయినందున మిక్కిలి కోపముతో నప్పుడా జటాయువు తన పాదఘట్టనములతో వాని రథమును జూర్ణమునుగా జేసియు, కాలి గోళ్ళతో గుఱ్ఱములను జీల్చివేసియు, తన కత్తివంటి ముక్కుతో రావణుని వామభుజములను భిన్నభిన్నములనుగాఁ జేసి వైచెను. కాని వరప్రభావముచే రావణుని భుజములు వెంటనే మొలచెను.

పశ్చా ద్భూమిసుతాం విసృజ్య చ శరైః క్రోధా ద్దశాస్య స్త్రిభి
ర్విద్ధ్వాథ ద్విజరాజ మద్భుతతమం చోడ్డీయ భూయః ఖగః,
పక్షాభ్యాం చ పదద్వయేన చ నఖై ర్బద్ధ్వా దశాస్యేన స
క్రాంతోఽభూ దవకాశవా న్దశముఖ శ్ఛిచ్ఛేద పక్షౌ తతః. ౨౮

విచ్ఛిన్నపక్షః పక్షీంద్రః పపాత ధరణీతలే,
అర్ధప్రాణో నిర్నిమేషః రామాఽఽగమనకాంక్షయా,
తద్భక్త్యా తద్వివక్షు స్తు న మమార ఖగోత్తమః. ౨౯-౩౦

పశ్చా దాదాయ తాం సీతాం లంకాం ప్రతి వినిర్యయౌ,
జటాయుషం భూపతితం నిరీక్ష్య జనకాత్మజా,
తదర్థం విలపంతీ సా నీయమానా చ రక్షసా,
కంచి న్నాథ మపశ్యంతీ మార్గమధ్యే గిరౌ స్థితాన్,
వానరా న్వీక్ష్య వైదేహీ శుభాభరణసంయుతం,
కౌశేయ ముత్తరీయం తు తన్మధ్యే ప్రాక్షిప త్తదా. ౩౧-౩౨-౩౩

సంపాతిపుత్త్రరుద్ధోఽయం మార్గమధ్యే దశాననః,
సాంత్వయిత్వా తు తం తూర్ణం లంకాం ప్రాప యథా సుఖమ్ ౩౪

౨౪౭ పిమ్మట రావణుఁడు సీతను భూమియందు విడిచి కోపముతో వాడి గల మూఁడు బాణములతో జటాయువును గొట్టెను. ఆ దెబ్బ లనికూడ వెనుకకు మరలక జటాయువు పైకి యెగిరి యాశ్చర్యకరమగు నటుల దిరిగి రెక్కలతోడను పాదములతోడను గోళ్లతోను రావణునిఁ బీడితునిగా జేయుచు యుద్ధము చేసి చేసి యలసటను జెందగా నా యవకాశమును జూచి రావణుఁడు తన చంద్రహాసముచే నాతని రెక్కలను ఛేదించెను.

౨౯-౩౦ ఇట్లు రావణునిచేఁ దెగఁగొట్టబడిన రెక్కలు గలవాఁ డైనందున జటాయువు వెంటనే భూమియందుఁ బడియు, అర్ధప్రాణముతో గుడ్లు తేలవేసి రెప్పపాటులేక రాముని రాక కెదురు చూచుచు రామునియందలి భక్తిచే జరిగిన వృత్తాంతము నంతను రామునికిఁ జెప్పఁదలచి మృతి నొందలేకుండ నుండెను.

౩౧-౩౨-౩౩ పిమ్మట రావణుఁడు భూమినుండి సీతను గ్రహించి లంకకు బయలు దేరెను. సీతయు భూమియందు దనకై యుద్ధముచేసి పడి పోయిన జటాయువును జూచి దుఃఖపడుచు నా రావణునిచేఁ గొంపోవబడుచుఁ దనకు దిక్కెవ్వరిని గానక మధ్యమార్గమున నొక పర్వతమునందు గన్పడుచున్న సుగ్రీవాది వానరులను జూచి వెంటనే తన యుత్తరీయమునఁ దన యాభరణములను మూటగట్టి యా మూటను వారి మధ్యను బడవేసెను.

౩౪ సీత నపహరించి తీసికొని పోవుచున్న రావణుని మధ్యమార్గమున సంపాతిపుత్త్రుఁడు నిరోధింపగా నతనితో యుద్ధము చేయ వెఱచి యతనిని బతిమాలుకొని యుద్ధము లేకుండగఁ దప్పించుకొని లంకకు సుఖముగఁ జేరను.

గత్వైవం రావణో లంకా మనిక్షిప్యాఽఽత్మనో గృహే,
తా మశోకవనే తూర్ణం స్థాపయామాస భీతితః,
నలకూబరశాపాచ్చ బ్రహ్మశాపా చ్చ రావణః,
యస్మాత్రస్పృష్టు మశక్తస్తాం రక్తాం కర్తుం తథా కరోత్. ౩౫-౩౬-౩౭

అశోకవనసంపత్తిం దృష్ట్వా రక్తా భవే దితి,
పశ్చా ద్వరిష్యతీ త్యేవం మత్వా తస్మి న్న్యవేశయత్. ౩౮
నిక్షిప్తా చే దాత్మగేహే భూమిజా సర్వదా త్మనా
దృశ్యతే హి తత శ్చిత్తవిభ్రమో జాయతే ముహుః
తత స్తత్స్పర్శసంప్రాప్తి స్తత స్స్వస్య వినాశనం
*పూర్వశాపవశా త్తూర్ణం భవితేతి భియా పునః
విధాతు మనురక్తాం తా మశోకే తు వ్యనిక్షిపత్
ఏవం కృత్వా దశాస్య స్తు స్వం కృతార్థ మమన్యత. ౩౯-౪౦

---

పూర్వశాపౌనామ నలకూబర బ్రహ్మశాపౌ, తత్ర
నలకూబర శాపః.

*వ్యా—"అద్యాఽఽరభ్య దశాస్య స్తు విరక్తాం స్త్రియ ముత్తమామ్ । హఠా ద్భోక్ష్యతి చేత్తర్హి క్షణమాత్రా న్మరిష్యతి॥ ఇతి శాపం రావణోఽపి క్రిమా చ్ఛ్రుత్వా మృతే ర్భయాత్ । అనిచ్ఛంతీం తదాఽఽరభ్య స్త్రియం నాఽధర్ష యచ్ఛసః" ఇతి-

౩౫-౩౬-౩౭ ఇవ్విధముగ రావణుఁడు లంకకుఁ జేరి సీతను దన గృహమునం దుంచకుండగ నశోకవనమున నొక యశోకవృక్షము క్రింద నుంచెను. తన గృహమునందుంచక పోవుటకుఁ గారణ మేమనగా, నలకూబరశాపము, బ్రహ్మశాపము తన కుండినందున నా శాపములవలన భయముచే నామెను స్పృశించుటకు వలను పడనందున నామెను నెట్లైనను దనయందనురాగముకలదానినిగాఁ జేయదలఁచి యశోక వనమునం దుంచెను. అశోకవనసంపదను జూచినచో కాముకురాలై తనయందనురాగము కలది యగునని తలంచి యచ్చట నుంచెను.

౩౮-౩౯-౪౦ తన గృహమునందు సీత నుంచినచో నామెను మాటి మాటికిఁ జూచుట సంభవించుననియు, నందుచేఁ దనకుఁ జిత్త చాంచల్యము కలిగి యామెను స్పృశించుట, బలాత్కరించుట సంభవించుననియు, నందుచేఁ దనకుండిన * పూర్వశాపములవలన బలాత్కరించుటచే నాశనము కలుగును గాన నామె నెట్లైనను ననురక్తురాలనుగా జేసికొనఁ దలచి యశోకవనమునం దుంచి తనను గృతార్థునిగా దలంచుకొనెను.

---

*పూర్వశాపము లనగా నొకటి నలకూబర శాపము, రెండవది బ్రహ్మశాపము వానిలో నలకూబర శాపము—

ఒకప్పుడు నలకూబరుని సమీపమునకు వెళ్లుచున్న రంభను రావణుఁడు బలాత్కరించి భోగింపగా నామె పిమ్మట నలకూబరునితోఁ దనకుఁ జరిగిన పరాభవమును జెప్పగా నతఁడిట్లు రావణుని శపించెను. "ఇది మొదలుకొని తనయందనురాగము లేని స్త్రీని రావణుఁడు బలాత్కరించి భోగించినచో నతఁడు వెంటనే మృతి నొందుఁగాక" యని శపించెను. ఆ శాప వృత్తాంతమును రావణుఁడు విని యది మొదలు మరణభయముచే తనయం దిచ్ఛలేని స్త్రీని బలాత్కరించుట మానెను.

బ్రహ్మశాపః

"పితామహస్య భవనం గచ్ఛంతీం పుంజికస్థలాం। చంచూర్యమాణా మద్రాక్షం మాకాశేఽగ్నిశిఖా మివ॥ సా ప్రసహ్య మయా భుక్తా కృతా వివసనా తతః॥ స్వయంభూ భవనం ప్రాప్తా లోళితా నళినీ యథా।అథ సంకుపితో దేవో మా మిదం వాక్య మబ్రవీత్। అద్య ప్రభృతి యా మన్యాం బలా న్నారీం గమిష్యసి। తదా తే శతధా మూర్ధా ఫలిష్యతి న సంశయః" ఇతి-

నన్వేవం సత్యేతయో ర్నలకూబరపితామహశాపయో ర్మధ్యే కస్య ప్రాథమికత్వ మంగీక్రియతే. యది నలకూబర శాప స్యైవ ప్రాథమికత్వ మంగీక్రియతే తదా పుంజికస్థలాస్పర్శన ప్రసక్తే రభావా ద్బ్రహ్మశాప వచనాఽ ప్రసక్తిః. యది బ్రహ్మశాపస్యైవ ప్రాథమికత్వం తదా రంభాసంభోగనిర్బంధ ప్రయుక్తనలకూబరశాపస్య న కాపి ప్రసక్తిః - ఇత్యాక్షేపే సతి సమాధీయతే - నలకూబరశాప స్యైవ ప్రాథమికత్వ మంగీకర్తుం న్యాయ్యం. తస్య పతివ్రతా స్త్రీ మాత్రసంభోగనిషేధే వినియోగః. (ఉత్తరకాండే 26 సర్గే) తేన నిస్సీమతాం ప్రీతే రావు స్సర్వాః పతివ్రతాః।నలకూబర నిర్ముక్తం శాపం శ్రుత్వా తతః పరం॥ ఇతి.

తతః పుంజికస్థలాయా అప్సరస్తయా తస్యా స్సంభోగే న కాపి క్షతి రితి మన్వానేన రావణేన తస్యాం బలవ ద్భుక్తాయాం స్త్రీసామాన్యబలాత్కారనిషేధార్థం బ్రహ్మ శాప ప్రవృత్తి రితి వేద్యమ్.

బ్రహ్మ శాపము.

ఒకప్పుడు బ్రహ్మలోకమునుగూర్చి వెళ్లుచున్న పుంజికస్థలయను నొక యప్సరసను రావణుఁడు చూచి దానిని బలాత్కరించి విగత వస్త్రనుగా జేసి భోగింపఁ బిమ్మట నా దేవవేశ్య బ్రహ్మ సమీపమున కేఁగి రావణుఁడు తనకుఁ జేసిన పరాభవమును జెప్పికొనగా బ్రహ్మ కోపించి రావణుని నిటుల శపించెను. నేటి దినము మొదలు ఏ యితర స్త్రీనైనను బలాత్కరించి భోగించినచో నా రావణుని శిరము నూరు వ్రక్కలగు గాక యని.

ఇందుపై నొక యాశంక కలుగును. ఏమన నలకూబరశాప బ్రహ్మశాపములలో నేది మొదటిది యని యంగీకరించవలయును. నలకూబర శాపము మొదటిది యనినచో నప్పుడు పుంజికస్థలను రావణుఁడు స్పృశించు ప్రసక్తియే సంభవింపదు. కాన బ్రహ్మశాపమునకుఁ బ్రసక్తియే యుండదు. గాననలకూబరశాపము మొదటి దనఁగూడదు. బ్రహ్మశాపమే మొదటిది యనినచో రంభాసంభోగ ప్రసక్తియే లేనందున నలకూబరుఁడు శాపమిచ్చుటకుఁ గూడ ప్రసక్తియే యుండదు ఇట్లాక్షేపము రాగా సమాధానము చెప్ప బడుచున్నది. నలకూబరుని శాపమే మొదటిదని యంగీకరింపవలయును. ఆ నలకూబరశాపము పతివ్రతా స్త్రీ మాత్ర సంభోగమును నిషేధించుట యందు మాత్రము తాత్పర్యము గలదియని చెప్ప నొప్పును. కనుకనే, ఉత్తరకాండమున "నలకూబరశాపమును వినినంతనే పతివ్రతలు సంతోషమును బొందిరి" అని చెప్పినది కూడ సంగత మగును.

పిమ్మట, పుంజికస్థల యప్సరస యయినందునను పతివ్రత కానందునను రావణుఁ డామెను బలాత్కరించి భోగించుట సంభవింపగా బ్రహ్మ పిమ్మట రావణుఁ డే స్త్రీని గాని బలాత్కారముగ ననుభవించిన మరణించునను బ్రహ్మశాపము స్త్రీసామాన్య బలాత్కార నిషేధము ప్రయోజనముగా గలది యని తెలియఁదగును.

దశానన స్తత స్సీతారక్షణాయ నిశాచరీః,
బహ్వీ ర్నియుజ్య తాః ప్రాహ రహస్యేవం వచః పునః,
యూయం సీతాం బోధయత యథా సా మాం వరిష్యతి,
యద్యదస్యాస్తు ప్రియం తస్యా స్తత్తద్దేయం యదృచ్ఛయా,
ఇత్యాదిశ్య గృహం గత్వా కర్తవ్యం చింతయం స్థితః. ౪౧-౪౨

అరణ్యకాండే త్రయోదశ స్సర్గ
స్సమాప్తః.

---

## చతుర్దశ స్సర్గః.

1 (శ్రీ) రామో హరిణం నిహత్య కనకం నిర్గత్య తద్దుర్వచో
ధ్యాయ న్నైవబహుధా వ్రజన్పథి పునర్దృష్ట్వాఽనుజం లక్ష్మణమ్
స్వాత్మన్యేవ మచింతయ జ్జనకజాం మాయామయీం లక్ష్మణో
నో వేత్త్యేవ తథా ప్యహం తు నితరాం శోచా మ్యవిద్వా
న్యథా. ౧

జానకీమార్గణమిషా త్తత్ర తత్ర చర న్నహమ్
క్రమా ల్లంకా మనుప్రాప్య కరవా ణ్యసురక్షయమ్. ౨
ఇత్యాలోచ్యాఽథ తం ప్రాహ లక్ష్మణం రాఘవ స్తతః
కిమేత దాగతోఽసి త్వం కిమర్థం భూమిజాం త్యజ 3
ఏకాకినీం తత్ర భవా న్కథం త్యక్త్వా సమాగతః
దనుజై ర్భూమిజా నూనం హృతా వా భక్షితా భవేత్. ౪

1 ఈ. దశమద్వాదశ శ్లోకా వపహాయ సర్వేఽపి శర్కృతా ఏవ

౪౧-౪౨౫ పిమ్మట రావణుఁడు సీతారక్షణమునకై యనేక రాక్షస స్త్రీలను నియమించి వారలతో రహస్యముగా నిట్లు చెప్పెను. మీర లందరును సీతకు బోధించి నన్నుఁ బ్రేమించునట్లు చేయుఁడు. ఆమె కిష్టమయిన వస్తువులను మీరు గనిపెట్టి తీసికొని వచ్చి యీయ వలయును. ఇట్లాలోచించి గృహమునకేగి కర్తవ్యము నాలోచించు చుండెను.

అరణ్యకాండమున పదుమూఁడవ సర్గము
సమాప్తము.

---

## పదునాల్గవ సర్గ ప్రారంభము.

౧ శ్రీ రామచంద్రమూర్తి బంగరు లేడినిఁ జంపి యచ్చటనుండి బయలు వెడలి, "హా లక్ష్మణా!" యని తన వాక్కుతో సమానముగ నుచ్చరించిన మారీచుని వాక్యమునే మనమునందు ధ్యానించుచు వచ్చుచుండ మధ్యమార్గమున లక్ష్మణుఁడు కన్పడగాఁ దనమనము నం దిట్లు చింతించు కొనెను. మాయాసీత సంగతి లక్ష్మణుఁడు గుర్తెఱుఁగఁడు. అయినను నేను ప్రాకృతుఁడు వలె మిక్కిలి దుఃఖించెదను.

౨ సీతను వెదకుటయను మిషచే నచ్చటచ్చట సంచరించుచు నేను క్రమముగ లంకకేఁగి రాక్షస ప్రళయమును జేసెదను.

౩-౪ ఇట్లు మనమునందు రాముఁ డాలోచించుకొని పిమ్మట లక్ష్మణునిఁ గలిసి యిట్లు ప్రశ్నించెను. సోదరా! ఇది యేమి? నీవు సీతను విడచి యేల యిట్లు వచ్చితివి? అచ్చట నీ వామె నొక్కదానిని నిట్లు విడిచి వచ్చితివి? ఇప్పటికే సీతను రాక్షసులు హరించుటయో, లేక, భక్షించుటయో జరిగియుండును.

ఇత్యుక్తః ప్రాఽఽహ తం రామం లక్ష్మణ స్తు యథాక్రమమ్
భ్రాత స్త్వద్వచసా తుల్యం లక్ష్మణే త్యనురేరితం. ౫-౬-౭
శ్రుత్వా మాం గచ్ఛ గచ్ఛేతి త్వరయామాస జానకీ
తథాఽపి నిర్గతో హం నో యదా మాం బహ్వదూషయత్
అవాచ్యవాదా నవద ద్వక్తుం శక్యాం శ్చ తా నహం
అసంమతో ద్రుతం త్వత్ర సమాగా మగ్రజ! ధ్రువమ్. ౭

తచ్ఛ్రుత్వాఽఽహ రఘూత్తమోఽనుజ మిదం వాక్యం తదా నిందకమ్

సౌమిత్రే! భవతా యదుక్త మఖిలం సత్యం తథాఽప్యద్య తామ్
త్యక్త్వా స్త్రీవచనం ప్రమాణ విషయం మత్వా చ తేఽత్రాగతి
ర్యుక్తా నేతి వదామి తే ధ్రువ మహం వక్ష్యంతి సర్వే జనాః. ౮
ఏవం సౌమిత్రిణా సాకం భాషమాణో రఘూత్తమః
క్షిప్రగ త్యోటజం ప్రాప చింతయ న్భూమిజాం ముహుః. ౯

తత్ర ప్రేమనిధిః ప్రియాం సతు తదాఽపశ్య న్నథోత్కంఠితో
హా సీతే! దయితే! క్వ వాసి పున రిత్యాఽఽక్రుశ్య ముహ్యన్ముహుః
నిశ్వస్యాఽనుగిరం తరో రపి తరుం సంధావ్య నద్యా నదీం
పశ్య న్వీక్షిత ముచ్చర న్నిగదితం చోన్మత్తవ ల్లక్షితః. ౧౦

స్నాతు మిచ్ఛావతీ దేవి! గతా కిం త్వం నదీం ప్రతి,
మాం పరీక్షితు ముద్యుక్తా లీయసే కిం నికుంజకే,
ఫలా న్యానేతు ముద్యుక్తా గతా కిం త్వం వనాంతరమ్. ౧౧౪

౫-౬-౭ ఇట్లు పలుకుట తోడనే లక్ష్మణుఁడు జరిగిన వృత్తాంతము నంతను గ్రమముగా నిట్లురామునితోఁ జెప్పఁదొడగెను. అన్నా! నీవు పిలిచినట్లు హా లక్ష్మణా! యని రాక్షసుఁడు పలుకగా విని ఎతె నన్ను నీవద్ద కేఁగుమని త్వర పెట్టెను. అయినను నేను నీయొద్దకు బయలు దేరకపోగా నామె విశేషముగా దూషించెను. ఇంతియేకాక వచించుటకు వీలులేని మాటలను బలుకగా వానిని వినుచు నచ్చట నుండుట కిష్టములేక శీఘ్రముగ నిచ్చటకు వచ్చితిని. అన్నా! ఇది నిశ్చయము.

౮ ఆ వాక్యములను విని రాముఁడు నిందాపూర్వకముగ నిట్లు లక్ష్మణునితోఁ బలికెను. ఓ లక్ష్మణా! నీవు చెప్పినది నిజమైతే కావచ్చును గాని,మావదినె నొకదానిని విడిచి, యాఁడుదాని మాటను బ్రమాణముగాఁ దలచి నీ విచ్చటకు వచ్చుట యుక్తముగాలేదని నే నొక్కఁడనే చెప్పుటయేకాక వినిన వారందరును గూడఁ జెప్ప గలరు.

౯ ఇవ్విధముగ లక్ష్మణునితో మాటలాడుచు రామచంద్రమూర్తి సీతనుగూర్చి చింతించుచు వేగముగఁ బర్ణశాలను సమీపించెను.

౧౦ రామచంద్రమూర్తి ప్రియురాలిని నచ్చటఁ గానక విచారపడుచు "హా సీతా! హా ప్రేయసి! ఎచ్చట నుంటివి? అని మొఱపెట్టుచు మాటిమాటికి మోహమునుఁ జెందుచు, నిట్టూర్పును విడుచుచు, ప్రతి పర్వతమునుగూర్చి, ప్రతి వృక్షమునుగూర్చి, ప్రతి నదినిగూర్చి, పరుగు లిడుచు, చూచిన దానినే చూచుచు, మాట్లాడినదానినే మాట్లాడుచు నున్మత్తుఁడువలెఁ గన్పడుచుండెను.

౧౧౪ మఱియు నిట్లు విలపింపసాగెను. ఓ దేవి! నీవు స్నానమునకై నది కేగితివా? లేక నన్ను బరీక్షించుట కే పొదలో నైనను దాగి యుంటివా? లేక ఫలములను దెచ్చుటకై మఱియొక కాననమున కేఁగితివా? (అని రాముఁడు విలపించుచుండెను)

హంసా యచ్చరణావధూతగతయో జాతా స్సరోగా భృశం,
మాధ్వీకాఽప్యథ యత్క్వణే త్యధరితా కాంతారకత్వం గతా,
సౌదామన్యపి యత్ప్రభాఽపహసితా చాస్తే సకంపం ఘనే,
సా కిం వా విరమే ద్ద్విష న్నిహ బహూ న్వ్యర్థేత కో వా చిరమ్.
౧౨॥

నానావృక్షా న్లతాం శ్చాపి గత్వాఽపృచ్ఛ న్ముహు ర్ముహుః.
ఉన్మత్త ఇవ కాంతారే భ్రమతి స్మ రఘూత్తమః. ౧౩॥

దృష్టా దూరేఽద్య సీతే త్వం వంచితుం కిం ప్రధావసి,
భూరుహాఽంతరితా త్వం మాం కి మర్థం నతు భాషసే. ౧౪॥

హా ప్రియాసి గతా కుత్ర హా సీతేతి ముహు ర్ముహుః,
* విలప న్రాఘువ స్తూర్ణం పరిధావంశ్చ భూరుహాన్,

---

*విలపన్నితి — నను విష్ణ్వవతారభూతస్యాఽస్య కథం శోకమోహౌ సంభవత ఇతి.

సంభవత ఏవ పురుషధౌరేయస్య, యది వా లోకోత్తరగుణవిశిష్టవస్తునాశేఽపి తౌ న స్యాతాం, స కథం పురుషధౌరేయ స్స్యాత్, తచ్చ కథ మతిసుందరం స్యాత్, తయో రుభయో ర్నమస్కార ఏవ స్యాత్. ఇత్యాశంకాయాం పరదుఃఖాసహిష్ణుత్వేన రామస్య శోక ఇతి సమాధేయం. వక్ష్యతి మహాపురుషగుణవర్ణన ప్రకరణే "వ్యసనేషు మనుష్యాణాం భృశం భవతి దుఃఖితః" ఇతి.

౧౨½ ఓ ప్రియసి! హంసలు నీపాదగతిచే ధిక్కరింపబడిన గమనము
గలవై సరోగములు (మానస సరస్సులో దాగియున్నవియని యొక
అర్థము, రోగముతో గూడినవని మఱియొక అర్థము గ్రాహ్యము)
మఱియు. నీవాజ్మాధుర్యముచే మధువు (తేనె) తిరస్కృతమై
యడవిలోఁ బొదలలో (తేనె పట్టులలో) నుండెను. మెఱుపు నీశరీర
కాంతిచే నపహసింపబడి మేఘ మండలమున దాగెను. ఇన్నిటిని
జయించి వానితో విరోధము పెట్టుకొనిన నీవు నశించితివా! లోక
ములో బహుజన ద్వేషి విశేషకాలము జీవింపడుగదా!

౧౩½ అనేక వృక్షములను, లతాకుంజములను సమీపించి రామచంద్ర
మూర్తి మాటి మాటికి వాని నడుగుచు నున్మత్తుఁడువలె నటు నిటు
తిరుగుచుండెను.

౧౪½ మఱియు నిట్లు సంభాషించును. ఓ ప్రియసి! నీవు దూరమునందు
గనబడి నట్లుగానే యుండి నన్ను వంచించుటకై పరుగు లిడుదువేల!
ఓ ప్రియసి! చెట్లచాటున దాగియుండి నాతో మాట్లాడవేల!

౧౫ హా ప్రియసి! హా జానకి! ఎచ్చటకుఁ బోతివి? అని మాటిమాటికి
రామచంద్రమూర్తి * విలపించుచుఁ జెట్టుచెట్టుకుఁ బరుగులిడుచు

---

* విలపించుచు ననుదాని వివరణము.

విష్ణ్వంశసంభూతుఁడగు రామచంద్రమూర్తికి శోక మోహములు
సంభవించినట్లు వర్ణించుట యిచ్చట నుపపన్నముగా లేదనియు,
లోకోత్తర గుణవిశిష్టమైన వస్తువు నశించినప్పుడును మహాపురుషులకు
నవి సంభవింపవనియే చెప్పవలయుననియు, అశోక మోహము లుండిన
నతఁడు మహాపురుషుఁడు కానేరఁడనియు, అది దోషము యందముగ
నుండు ననియును! శోక మోహముల కంటికిని నమస్కారము చెప్ప
వలయుననియు నాశంకకు సమాధానమే మనగా ఇతరదుఃఖమునుఁ
జూచి రాముఁడు సహింపలేనివాఁడు గాన సీతాదుఃఖమును దలంచి
కొని రాముఁడు దుఃఖించెను. కాని వేఱు కాదని తెలియదగు.

* హేత్వంతరవశా త్సీతా ముద్దిశ్య విలలాప సః. ౧౫-౧౬
న హి జీవితు మిచ్ఛామి భూమిజేఽహం త్వయా వినా
ఏకైవ మమ భీ ర స్తి మరణేఽపి త్వమూలతః
మృతస్య మమ తల్లోకే భవే త్త్విత్త్రి సమాగమః
స తు మాం నిందయే దేవం రాఘవ త్వం కథం న్విహ
సమాగతో స్యను త్తీర్య ప్రతిజ్ఞాం తు పురాకృతామ్
ధి క్త్వాం తవ ముఖం నాహం పశ్యామి వ్రజ దూరతః
౧౭-౧౮-౧౯

న హీదృశ మభాగ్యం తు దృశ్యతే కుత్రచి ద్భువి
రాజ్యనాశో వనే వాసో వియోగో భార్యయాఽపి మే. ౨౦

ఇత్యేవం బహుధా రామో విలప్య తు తతఃపరం,
ప్రాహైవం లక్ష్మణం వాక్యం జీవితే నిస్పృహో యథా. ౨౧
అద్యైవ మృతి మేష్యామి భరతం తు భవా న్వదేత్
అనుజ్ఞాతోఽసి రామేణ రాజ్యం త్వం పాలయే త్యరమ్. ౨౨

---

*హేత్వంతరవశా దితి—రావణ శ్చారమార్గేణ పశ్య తీతి మనీషయా । స్త్రీలౌల్యం దర్శయ న్నేవ రాఘవోఽను శుశోచ హ॥ ఇత్యాదినా రావణప్రేషితగూఢచారాః గుప్త రూపేణ సమాగత్య రామస్య స్థితిం పశ్యంత స్తత్ర తత్ర సంచ రంతిస్మ. ఆత్మన స్త్రీలౌల్యం విశేషతోఽస్తీతి తద్వియోగేనాఽ యం మరిష్యతీతి రావణగూఢచారాణాం ద్యోతనాయ తథా నటతిస్మేతి.

సీతనుద్దేశించి * కారణాంతరమున మధ్యమధ్య విలపించుచు వనమునందు గ్రుమ్మరుచుండెను.

౧౭-౧౮-౧౯ మఱియు సీత నుద్దేశించి రాము డిటులఁ బలవించెను. ఓ ప్రేయసి! నిన్నువిడిచి యొకక్షణమైనను నిఁక జీవింపలేను. మరణమును బొందెద ననినను మా తండ్రివలన నచ్చట నొకభయము కలదు (అది యేమన) నేను మృతిని బొందినచోఁ బరలోకమున మా తండ్రిగారితోఁ గలిసికొనుట సంభవించును. అపుడు మాతండ్రి యిటుల నన్నుదూషించును "నీవు వనవాస ప్రతిజ్ఞను సమాప్తిచేయక యిచ్చట కెట్లు వచ్చితివి. నీముఖము చూడఁగూడ"దని మా తండ్రి దూషించు ననియెడి భయ మొకటి కలదు.

౨౦ లక్ష్మణా! నావంటి నిర్భాగ్యుఁడు భూమియం దెచ్చటను మఱి యొకఁడు వెదకినను గన్పడఁడు. ఎందువలన ననగా, రాజ్యభ్రష్టతయు, నరణ్యావాసము, ఈ రెండిటికిఁ దోడుగ భార్యా వియోగముకూడ సంభవించెనుగదా!

౨౧ ఇట్లు రామచంద్రమూర్తి యనేకవిధములుగఁ బలవించి జీవితాశ లేనట్లు నటించుచు లక్ష్మణునితో నిటుల బలికెను.

౨౨ లక్ష్మణా! నేనింక బ్రతుకఁజాలను. నీవు భరతున కొకవాక్యమును జెప్పుము. (అది యేమనగా) మీయన్నయగు రాముని యనుజ్ఞయయి నందున నీవు రాజ్యమునుఁ బరిపాలించు కొనుమని (చెప్పుము)

---

* కారణాంతరమున ననుదాని వివరణము.

రావణుఁడు సీతను లంకలోఁ బ్రవేశపెట్టిన పిమ్మట రాముని స్థితి యెట్లున్నదో తెలిసికొని రండని రాక్షసగూఢచారులను బంపగా వారలు కడు రహస్యముగ సూక్ష్మరూపములతో రాముని స్థితిని గనిపెట్టుచుండిరి. రాముఁ డాసంగతి తెలిసికొని తాను స్త్రీలోలుఁ డని స్త్రీవియోగముచే రాముఁడు మృతినొందునని రావణుఁడు లోగడ వినినదానికి సరిపోవునట్లు సీతను గూర్చి విలపించినట్లు నటించిన నది నిజమని రావణునకు గూఢచారులు చెప్పుదురని తలంచి సీత నుద్దేశించి మధ్య మధ్య యీకారణముచే విలపించెనని తెలియదగు.

కౌసల్యాద్యా జనన్య స్తు త్వయా రక్ష్యా విశేషతః
ఇతి బ్రువన్ రాఘవోఽభూ దనుజేన తు సాంత్వితః. ౨౩

తథాఽపి రామో బహుధా విలపన్నేవ సానుజః
విచిన్వ న్భూమిజాం భూమౌ పతితం వీక్ష్య తం రథమ్
హతాం స్తురంగమాంశ్చాపి విస్మయాన్వితమానసః
కించిద్దూరం గతోఽపశ్య త్క్షతజార్ద్రం జటాయుషమ్
రామ నామ జపంతం తం శనై ర్మనసి భాషితుం
అశక్తం రుధిరం చాస్యా ద్వమంతం వీక్ష్య రాఘవః
దుఃఖిత స్తత్సమీపం తు గత్వా తన్మూర్ధ్ని చాశ్రునః
నిక్షిప్య హస్తం ప్రాహేదం వచనం తం జటాయుషమ్.
౨౪-౨౫-౨౬-౨౭

మిత్రభూతస్య తే త్వీదృ గవస్థా కి ముపాగతా
ఇతి పృష్టోఽవద న్మందం వచనం విహగాధిపః. ౨౮

ముమూర్షు ర్నహి శక్నోమి బహు భాషితు మప్యహమ్
తథాఽపి వక్ష్యే సంక్షేపా చ్ఛ్రుత్వా కురు యథోచితమ్. ౨౯

రామచంద్ర నమస్తేఽస్తు ముషిత్వా వనిజాం రథే
స్థాపయిత్వా వ్రజంతం తం రావణం వీక్ష్య సత్వరమ్
నిరుధ్యాఽహం తద్రథాశ్వాం శ్చూర్ణీకృత్య చ తద్భుజాన్
ఛిత్వా తుండేన పాదాభ్యాం శ్రాంతోఽహ మభవం యదా
తదా స్వచంద్రహాసేన పక్షౌ చిచ్ఛేద మే ఖలః
తత స్సీతాం సమాదాయ ప్రయాతో దక్షిణాం దిశమ్.
౩౦-౩౧-౩౨

౨౩ ఓ లక్ష్మణా! కౌసల్య మొదలగు తల్లులను నీవు విశేషముగ రక్షింపవలయును, అని యిట్లు చెప్పుచున్న రాముని లక్ష్మణుఁ డనేక విధముల నోదార్చెను.

౨౪-౨౫-౨౬-౨౭ ఇట్లు లక్ష్మణుఁ డోదార్చినను రాముఁ డనేక విధముల విలపించుచునే లక్ష్మణ సమేతుఁడై సీతను వెదకుచు నొక్కచోట భూమియందుఁ బడియున్న రథమును, ఛిన్న భిన్నము లయిన గుఱ్ఱములను జూచి, యాశ్చర్యము గలవాఁడై మఱికొంతదూర మేఁగ భూపతితుఁడైన జటాయువు కన్పడెను. అతఁ డా సమయమున రక్తముచేఁ దడుపఁబడిన శరీరము గలిగి రామ నామమును లోపల మెల్లగ నుచ్చరించుకొనుచు పైకి మాట్లాడుటకు నసమర్థుఁడై నోటినుండి నురుగతోఁ గూడిన రక్తమును వెలిఁ గ్రక్కుకొనుచుండెను. ఇట్టి జటాయువును రామచంద్రమూర్తి చూచి మిగుల దుఃఖించుచు నతని సమీపమున కేఁగి యా జటాయువు తలమీఁదను తన చేతి నుంచి నిమురుచు నిట్టులఁ బలికెను.

౨౮ ఓ పక్షీంద్రా? నాకుఁ బరమమిత్రభూతుఁడవగు నీకిట్టి మరవస్థ యెందువలనఁ గలిగెను? ఎవనివలనఁ గలిగెను? అని ప్రశ్నింపగా నా జటాయువు మెల్లగ నిట్లు రామునితోఁ జెప్పఁదొడఁగెను.

౨౯ రామచంద్రా! మరణాసన్నుఁడనైయున్న నేను నెక్కువగ మాట్లాడఁజాలను. కాని సంక్షిప్తముగఁ జెప్పెదను. విని తగినట్టులఁ జేయుము.

౩౦-౩౧-౩౨ రామచంద్రా! నీకు నమస్కారము. రావణుఁడు సీత నపహరించి రథమునందుంచుకొని వెళ్లుచుండ నేను జూచి యతని నడ్డగించి యుద్ధముచేసి యతని రథమును, గుఱ్ఱములను, సారథినిఁ జూర్ణము చేయుటయే కాక యతని వామబాహువులను గూడ ఛేదింపఁ గల్గితిని. గోళ్లతోను, పాదములతోను, ముక్కుతోడను గూడ యుద్ధము చేసి కొంత శ్రమను జెందగా నాయవకాశమును జూచి నా రెక్కలనుఁ దన చంద్రహాసముచేఁ దెగగొట్టె నేనిట్లు పడి చచ్చుటకు సిద్ధపడియు నీరాకకై ప్రాణములతో నుంటిని. రావణుఁడును పిమ్మట సీతను దిరిగి గ్రహించి దక్షిణదిక్కుగా వెడలి పోయెను.

ఇత్యుక్త్వా రామ మాహేదం భూయోఽపి వచనం ఖగః
రామచంద్ర నిరర్థోఽహం యదహం భూమిజాం తవ
న సమర్పిత వా న్కించ హత్వా న్నాహ మాశరమ్
తవాఽహం దాసభూతోఽపి నోపకర్తాఽభవం తవ
తథాపి కృపయా రామ సంముఖే వసతా తష్ణామ్
పశ్య న్భవంతం చక్షుర్భ్యాం త్యజా మద్య కళేబరమ్.
౩౩-౩౪-౩౫

ఇత్యుక్తో రామచంద్ర స్తు విలపం స్తస్య మస్థితిమ్
సంస్పృశ్య పాణినా తస్య శరీరం ప్రాహ తం ఖగమ్
*మదర్థం మ్రియమాణ స్త్వం మల్లోకం ప్రాప్స్యసే ధ్రువమ్
ఇతి బ్రువతి తం రామే తత్ప్రాణా స్సర్వమూలతః
గృధ్రో గతవ్యథః పశ్య న్రాఘవం సంముఖే తదా
ప్రాణాం స్తత్యాజ తం దృష్ట్వా వ్యలప ద్రాఘవో ముహుః
పశ్చా ద్రామ స్స్వయం గృధ్రం దగ్ధ్వా కాష్ఠచయై స్తతః
హత్వా మృగా న్వనే రామ స్తన్మాంసం పక్షిణాం పునః
గృధ్రరాజస్య ముక్త్యర్థం జలం చ ప్రదదా క్రమాత్.
౩౬-౩౭-౩౮-౩౯ ౪

---

* మదర్థ మితి - ఆగ్నేయపురాణేఽప్యేవ మేవ ప్రతిపాదితం - తథాహి - విష్ణోః కార్యం సముద్దిశ్య దేహత్యాగో యతః కృతః। తతో వైకుంఠ మాసాద్య ముక్తో భవతి మానవః॥ ఇతి- అశ్వమేధికేఽప్యేవ మేవ భగవద్వచనం సమ్యగ్దృశ్యతే- "ప్రాణాం స్త్యజతి యో మర్త్యో మాం ప్రపన్నోఽపి మత్కృతే। బాలసూర్యప్రకాశేన వ్రజే ద్యానేన మద్గృహ మితి."

33-34-35 ఇట్లు చెప్పి జటాయువు తిరిగి రామునితో నిటులఁ బలికెను. రామచంద్రా! నీదాసుఁడనగు నేను ప్రభువగు నీ క్షేమము నుపకారము చేయలేక పోతిని గదా? రావణుని జంపి సీతను నీకు సమర్పింపలేనందున నిరర్థకుఁడనైతి నని విచారపడుచుంటిని అయినను దాసుని యందు దయయుంచి తుదకాలము నాకు సమ్ముఖుఁడవై యుండినచోఁ గండ్లార నిన్ను జూచుచు నింక శరీరమును విడచెదను.

36-37-38-39 ఇట్లు జటాయువు పలుకగా నతని దుస్థితినిగూర్చి రాముఁడు కడు విలపించి తన హస్తముతో నతని దేహము స్పృశించి నిమురుచు నిటులఁ బలికెను. ఓ పక్షీంద్రా! * నా నిమిత్తమై మృతిని బొందుచున్న నీకు నా లోకము ప్రాప్తించును. ఇది నిశ్చయము. ఇట్లు రాముఁడు చెప్పుచుండగనే శ్రీరామ కర స్పర్శమున సర్వబాధలు తొలగి జటాయువు వ్యక్తతతో రామునిఁ బ్రత్యక్షముగఁ జూచుచు బ్రాణముల విడచెను. మృతుఁడైన యా జటాయువును జూచి రాముఁడనేక విధములఁ బలవించెను. పిమ్మట రామచంద్రుఁడు తాను స్వయముగఁ గట్టెలను దెచ్చి యా జటాయువునకు దహన సంస్కారము చేసి పిమ్మట మృగములను వేటాడి యా మాంసమును దెచ్చి పక్షులకు జటాయుప్రీతికై వాని ముక్తికై బలివేసి నివాపాంజలుల (తర్పణముల) గూడ నిచ్చెను

---

* నా నిమిత్తమై యను దానివివరణము:—

ఆగ్నేయ పురాణమునఁగూడ నిటులనే చెప్పబడినది. "విష్ణుకార్యము నుద్దేశించి యెవఁడు దేహత్యాగము చేయునో, అతఁడు వైకుంఠము నొందగల డని". మఱియు, అశ్వమేధ పర్వమునఁగూడ భగవద్వచన మిటులనే కన్పడును.

"నా నిమిత్తమై యెవఁడు ప్రాణములను విడచునో, అతఁడు బాలసూర్యుని సరిగ ప్రకాశించు విమానము నధిరోహించి నా గృహమున కేఁగు నని". కాన నాలోకమున కేఁగెదవను రామవచనము యుక్తమయినదని తెలియఁ దగును.

దివ్యరూపధరః పశ్చా ద్విమాన మధిరుహ్య సః,
శంఖచక్రగదాపద్మకిరీటవరభూషణైః
ద్యోతయ న్పీతవసనః స్తూయమానో మహర్షిభిః,
కృతాంజలిపుటో భూత్వా తుష్టావ రఘునందనమ్. ౨౦-౨౧

పరధనపరదారవర్జితానాం
పరగుణభూతిషు తుష్టమానసానామ్,
పరహితనిరతాత్మనాం సుసేవ్యం,
రఘుపతి మంబుజలోచనం ప్రపద్యే. ౨౨
రతిపతిశతకోటి సుందరాంగం
శతపథగోచరభావనావిదూరమ్,
యతిపతి హృదయే సదా విభాంతం,
రఘుపతి మార్తిహరం ప్రభుం ప్రపద్యే. ౨౩
ఇత్యేవం స్తువత స్తస్య ప్రసన్నోఽభూ ద్రఘూత్తమః,
ఉవాచ గచ్ఛ భద్రం తే మమ విష్ణోః పరం పదమ్,
ఇత్యుక్తః పక్షిరాజోఽపి రామం నత్వా తదాజ్ఞయా,
విమానేన యయౌ దివ్యం వైకుంఠం * శాపమోక్షవాన్,
తం దృష్ట్వా సాధుశబ్దం తు సర్వేఽకుర్వ న్మహర్షయః.
౨౪-౨౫-౨౬

---

*శాపమోక్షవానితి—పూర్వం జటాయుర్నామ కః కస్మై శాపం కః కిమర్థం దత్తవా నిత్యాశంకా సముదేష్యతి. అత్రైవం సమాధేయం. జటాయుషః పూర్వజన్మవృత్తాంతః— “బ్రహ్మదత్తాఖ్యరాజన్యనికటం గౌతమః పురః, గత్వా తత్ర

౪౦-౪౧½ పిమ్మట జటాయువు దివ్యరూపము ధరించి తన నిమిత్తమై వచ్చియున్న విమానము నధిరోహించి శంఖ చక్ర గదా పద్మ కిరీట భూషణాదులచే దిక్కులను బ్రకాశింపజేయుచు పీతాంబర ధారియై సాక్షాద్విష్ణు సదృశమైన యాకారము గలిగి మహర్షులచే స్తోత్రము చేయబడుచు తాను జేతులు జోడించి శ్రీరామునకు నమస్కరించి యిట్లు స్తుతించెను.

౪౨½ ఓ రామచంద్రా! నీవు పరధన పరదారాభిలాషలేనివారలకును, పరులగు సంపదలను జూచి సంతోషించు వారలకును, సేవ్యుడవై యుంటివి. అట్టి నిన్ను శరణు పొందుచున్న వాడను.

౪౩½ ఓ రామచంద్రా! నీవు శతకోటి మన్మథులతో సమానమైన యందముచే నొప్పుచున్న వాడవును, శతపథ బ్రాహ్మణాది వేదముల యందు జెప్పబడిన మహిమగలవాడవును, భావనా మూర్తిడవును, మునుల హృదయ పుండరీకముల భాసించువాడవును, లోకనాయకుడవును, భక్తబాధానివారకుడవునై యుంటివి. ఇట్టి నిన్ను శరణు పొందుచున్న వాడను.

౪౪-౪౫-౪౬ ఇట్లు జటాయువు దివ్యరూపధరుడై స్తోత్రము చేయుచుండ రామచంద్రమూర్తి ప్రసన్నుడై యతనితో నిటుల బలికెను. "నాయనా! నీకు శుభము గలుగుగాక. శాశ్వతమైన నా వైకుంఠ లోకమునకు బొమ్ము" అని చెప్పగా పక్షీంద్రుడును రామునకు నమస్కరించి సెలవు గైకొని * శాపముక్తుడై విమానములో వైకుంఠమున కేగెను. విమానారూఢుడై వెడలుచున్న యా జటాయువును మునులు చూచి యనేకవిధముల స్తుతిజేసిరి.

---

* శాపముక్తుడు:-పూర్వము జటాయు వెవ్వడు? అతనికి శాపము నెవ్వ డెందులకై యిచ్చెను, అనియెడి యాశంక కలుగును. దానికి సమాధాన మీ క్రిందివిధముగ జూడదగినది. (జటాయు పూర్వ జన్మ వృత్తాంతము.) బ్రహ్మదత్తుడను రాజు పూర్వ మొక డుండెను.

అహో! యద్యోగినాం యోగై ర్దుష్ప్రాపం రామదర్శనమ్
నైవం దశరథస్యాపి పితు ర్భాగ్య మభూ దహో!,
యదభూ ద్గృధ్రరాజస్య మృత్యుకాలే మహాసుఖమ్,
క్వ రామః క్వచ గృధ్రోఽసౌ తథా ప్యస్యౌర్ధ్వదైహికమ్,
చకార స్వయమేవాఽతో భక్తి రేవహి కారణమ్,
ఇతి స్తువంతో మునయో ప్యాశ్రమా న్ప్రాపు రాత్మనాం॥
౪౭-౪౮-౪౯

---

చిరం స్థిత్వా భుక్త్వా సుఖ మువాస సః, షష్ట్యుత్తరశతం వర్షాణి బుభుజే తతో గౌతమః, ఏకదా భోజనే మాంసం దృష్ట్వాఽసౌ క్రుద్ధమానసః గృధ్రో భవేతి తం శప్త్వా పున స్తత్ప్రార్థనావశాత్, శాపముక్తిం దదౌ రామహ స్తస్పర్శా త్తవేతి వై, సఏవాఽయం జటాయుశ్చ రామస్పర్శా ద్విముక్తి మాప" ఇతి. కించ "ముఖం పవిత్రం యదిరామనామ్నా హస్తౌ పవిత్రౌ కురుతేచ దానం, పాదౌ పవిత్రౌ కురుతేచ యాత్రా మనఃపవిత్రం కురుతే చ నిష్ఠా" ఇత్యనేన రామనామ్నా తన్ముఖస్య పవిత్రత్వేన తస్య శ్రీరామకృపాపాత్రతా త్వస్త్యే వేతి వేద్యమ్.

ఆశ్చర్యరామాయణే అరణ్యకాండే
చతుర్దశ స్సర్గ స్సమాప్తః.

---

౪౭-౪౮-౪౯ పిమ్మట మహర్షులు జటాయువు నిట్లు స్తోత్రము చేయ మొదలిడిరి. ఏమి యాశ్చర్యము, యోగులకు గూడ దుర్లభమైన రామదర్శనము గృధ్రరాజునకు మృత్యుకాలమున గలిగెను. ఇతని పుణ్య మగణ్య మైనది. రాముఁ డెక్కడ. పక్షి యెక్కడ, అట్లయినను నీ పక్షిరాజునకు దహనసంస్కారమును రామచంద్రమూర్తి స్వయముగఁ జేసెను ఇట్టి యదృష్టము తండ్రియగు దశరథునకు లేక పోయెను. భక్తియే కదా దీని కంతకును కారణ మని మునులు స్తోత్రములఁ జేయుచుఁ దమ తమ యాశ్రమముల కేగిరి

---

అతని సమీపమునకు గౌతమమహర్షి వెళ్ళి యతనిచే గౌరవింపబడి కొంతకాల మచ్చట సుఖముల ననుభవించుచుండెను. అచ్చట గౌతముఁడు నూట యిరువది సంవత్సరము లుండెను. ఒకప్పుడు భోజనములో మాంసమును వడ్డింప నా గౌతముఁడు కోపగించి "నీవు గద్ద వగుమని" రాజును శపింపగా నత డనేకవిధముల గౌతముని బ్రార్థింపగా గౌతముఁడు కనికరించి శాపముక్తినిఁ జెప్పెను. 'ఓ రాజా! నీవు గృధ్రరూపముతో నుండుచుండ నెప్పుడు శ్రీరాముని హస్తస్పర్శము నీకు గలుగునో, అప్పుడు ముక్తి నొందెదవు. శాపవిముక్తి కలుగును' అని చెప్పెను. ఆ బ్రహ్మదత్తుఁడే యీ జటాయు వయ్యెను. ఇప్పుడు రాముని హస్తస్పర్శముచే ముక్తి నొందెనని తెలియదగును. మఱియు, "రామనామముచే ముఖము పవిత్రమగుననియు, రామకార్యమునుగూర్చి దానము చేసినచో హస్తములు పవిత్రము లగుననియు, రామాలయమునుగూర్చి ప్రయాణముచేసిన పాదములు పవిత్రమగుననియు, రామునియందు ధ్యాన నిష్ఠవలన మనస్సు పవిత్రమగుననియు చెప్పబడియుండుటచే రామనామముచే జటాయుముఖము పవిత్రమయ్యె. కాన నితఁడు రామానుగ్రహపాత్రుఁ డగుట యాహా–మేయని తెలియదగును.

అరణ్యకాండమున పదునాల్గవ సర్గము

సమాప్తము.

## పంచదశస్సర్గః.



పశ్చా ల్లక్ష్మణసంయుతో రఘుపతి స్తస్మా ద్వినిర్గత్య సః
సీతాన్వేషణ మాచర న్నదనదీవృక్షాదిగుల్మే ష్వథ
ప్రాహైవం త్వనుజం వచో ఽన్యవిపినే త్వం మార్గయ త్వం గత
స్సీతాన్వేషణ మాచరామి విపినే త్వస్మిం స్తథాత్వం కురు. ౧

ఏవం కృతం చే ద్రావాభ్యాం మార్గణం చ ద్రుతం భవేత్
ఇత్యుక్త స్తు తథే త్యుక్త్వా యయౌ వన్య ద్వనం తు సః. ౨
రామోఽపి విలప న్భూయో గుల్మా ద్గుల్మం తు సంచరన్
అన్వేషణం భూమిజాయాః కృతవాం స్తద్వనే పునః. ౩
ఏతస్మి న్నంతరే రుద్ర స్సమారుహ్య వృషం నిజమ్;
పార్వత్యా సహితః ఖే తు సంచర న్వీక్ష్య రాఘవమ్
ననామ తస్మై గిరిజా పప్రచ్ఛ గిరిశం తతః. ౪½
యస్మై నమసి కో వాఽయం మహ్యాం బ్రూహీతి జాయయా,
పృష్టః ప్రాహ గిరిశోఽపి రామవృత్తం యథాక్రమమ్.
౫½

రామ స్సాక్షా త్పరం బ్రహ్మ రాఘవో మమ దైవతమ్,
జహార రావణ స్తస్య భార్యాం తన్మూలతోఽధునా,
విలప న్భూమిజాం దేవీం తత్రతత్ర చ మార్గయన్,
పరిభ్రమతి దేవ్యద్య కాననేఽస్మిం ఛుచాన్వితః. ౬-౭½

## పదునైదవసర్గ ప్రారంభము.



౧ అనంతరము రామచంద్రమూర్తి లక్ష్మణసమేతుఁడై యచ్చటనుండి బయలువెడలి నదులు, నదములు, పర్వతములు, వృక్షములు, పొదలు మొదలగువానిలో సీతను వెదకుచు లక్ష్మణునితో నిట్లు పలికెను. నీవును, నేనును నిచ్చటనే యొకచోటనే వెదకుటచే నాలస్యమగును గాన, నీవు మఱియొక యరణ్యమునకు వెడలి సీతను వెదకుము. నేనీ యడవిలో వెదకెదను. నీవు నేను జెప్పినట్లు చేయుము.

౨ మన మిర్వురము సీత నిటుల వెదకినచో శీఘ్రముగ వెదకుట యగును. అని యిట్లు చెప్పుటతోడనే యట్లనే చేయుదునని లక్ష్మణుఁడు సమీపారణ్యమున కేఁగెను.

౩ రాముఁడును దిరిగి సీతనుగూర్చి విలపించుచుఁ బ్రతిపాదపమునొద్ద కేగుచు సీతను నవ్వనమునందు వెదకుచుండెను.

౪ ఈ సమయమున శంకరుఁడు వృషభారూఢుఁడై పార్వతితో గూడి విలాసముగా నాకాశమున సంచరించుచుఁ గ్రిందిభాగమున నరణ్యమున సీతను వెదకుచున్న రాముని జూచి నమస్కరింపగాఁ బార్వతి యిట్లు శంకరునిఁ బ్రశ్నించెను

౫ నాథా! నీవెవ్వని నమస్కరించితివో యతఁడెవ్వఁడు? నాకుఁ జెప్పుము. (లోకవంద్యుఁడవగు నీచేఁగూడ నమస్కరింపదగిన వాఁ డెవ్వఁడుండెనని సందేహముతో నడిగెను). ఇట్లు పార్వతిచేఁ బ్రశ్నింపబడి శంకరుఁడు రామవృత్తాంతము నంతను జెప్పి మఱియు నిట్లు చెప్ప దొడఁగె.

౬-౭ ఓ పార్వతి! రాముఁడను సాక్షాత్పరబ్రహ్మము, నా కభీష్టదైవము. ఈ రాముని భార్యను రావణుఁ డపహరించెను. అందు మూలమున నిప్పుడు సీతనుగూర్చి విలపించుచు నచ్చటచ్చట వెదకుచు నీ యరణ్యమున దుఃఖాక్రాంతుఁడై తిరుగుచుండెను.

ఇత్యుక్త్వా సా పతిం ప్రాహ నాథాయం రాఘవః పునః,
పరబ్రహ్మైవ చేదస్య దుఃఖం కిం వద మేఽనఘ,
ఇత్యుక్త శ్శంకరః ప్రాహ గత్వా త్వం తు పరీక్ష్య తమ్,
సమాగచ్ఛ త్వహం తావ ద్వసేయ మిహ పార్వతి. ౭-౯॥

ఇత్యుక్త్వా గిరిజా గత్వా సీతావేషధరా తతః,
కాననే గుల్మమధ్యాత్సా హసంతీ చ సమాగతా,
రాఘవం ప్రాహ కి మిదం కి మర్థం త్వ మిహాగతః,
మదన్వేషణకారీవ దృశ్యసే త్వ మిహాఽఽవ్రజ,
ఇత్యాహూతో రాఘవోఽపి ప్రాహేదం వచనం తు తామ్.
౧౦-౧౧-౧౨॥

త్వా మహం వేద్మి గిరిజాం త న్నైత ద్వేషధారణం,
న యుక్త మితి మన్యేఽహం గచ్ఛ భర్త్రంతికం ద్రుతమ్,
ఇత్యుక్త్వా నిజరూపం తు దర్శయామాస రాఘవః।
తత స్సా విస్మితా నత్వా రామం సంస్తుత్య నైకధా,
తదాజ్ఞాం ప్రాప్య గిరిజా నిజరూపధరా పునః
సమాజగామ గిరిశం లజ్జయాఽవనతాననా. ౧౩-౧౪॥
నిరీక్ష్య తాం శివః ప్రాహ త్వయా కింను పరీక్షితః,
రాఘవ స్త్వితి పృష్టా సా నోత్తరం ప్రాహ లజ్జయా
తదా ప్రాహ శివో జాయాం యత స్త్వం భూమిజాఽఽకృతిం
ధృత్వా మోహయితుం రామం గతవ త్యసి భామిని
తత స్త్వం గచ్ఛ తం రామం యతోఽన్యాం త్వ మకామయః
ఇత్యుక్త్వా సాఽపి గిరిజా నత్వా శంకరమాహ సా. ౧౫-౧౬-౧౭॥

౮-౯½ ఇట్లు చెప్పినతోడనే పార్వతికి సంశయము కలిగి శంకరునితో నామె యిటులఁ బలికెను. నాథా! నీవు చెప్పిన విధముగ నీ రాముఁడు పరబ్రహ్మమే యైనచో నిటుల దుఃఖింపఁ గారణమేమి? (అనగా పరబ్రహ్మకు, శోక మోహము లెట్లుండును?) అని ప్రశ్నింపఁగా శంకరుఁడు పార్వతితో నిటులఁ బలికెను. ప్రియసి? నీకట్టి సందేహ ముండినచో వెళ్ళి యతనిని పరీక్షించి రమ్ము. నీవు వచ్చు దనుక నే నిచ్చటనే యుండెదను. సంశయింపకుము.

౧౦-౧౧-౧౨ ఇట్లు చెప్పుటతోడనే రాముని పరతత్త్వమును బరీక్షింపఁ దలచి శంకరుని యనుజ్ఞ నొంది యరణ్యమున కేఁగి యొకపొదనుండి సీతా వేషముతో నవ్వుకొనుచు రాముని సమీపించి 'ఇది యేమిటి? ఇట్లు వచ్చితిరేల? నన్ను వెదకుచున్నట్లుంటిరి. ఇటు రండు'. అనెను ఇట్లు పిల్వబడి రాముఁడు నామెతో నిటులఁ బలికెను.

౧౩-౧౪½ ఓ దేవి! నీవు పార్వతి వని నాకుఁ దెలియును. నీ కీ వేషధారణము కూడని పనియని తలంచెదను. శీఘ్రముగ నీభర్తయొద్దఁ కేగుము. ఇట్లు చెప్పి యామెకుఁ దన నిజరూపమును సందర్శింపఁజేసెను. పిమ్మట నా దివ్యరూపమును జూచి యాశ్చర్యము నొంది రామునకు నమస్కరించి యనేకవిధముల స్తుతించి వాని యనుజ్ఞ నొంది నిజ రూపమును పార్వతి తిరిగి ధరించి శివునియొద్దకు వచ్చి సిగ్గుచే దల వంచుకొని నిలువబడెను.

౧౫-౧౬-౧౭½ పరమేశ్వరుఁ డామెను జూచి "రామునిఁ బరీక్షించితివా? అని ప్రశ్నింపగా నామె సిగ్గుచే సమాధాన మీయనందున శివుఁడు గ్రహించి యిటులఁ బలికెను. ఓ ప్రియసి! నీవు సీతావేషమును ధరించి రామునిఁ బరీక్షింప నేగితివి. నీవితరుని గోరి వెళ్లితివి కాన నీ వచ్చుటకే యోగము, అనుటతోడనే పార్వతి శంకరునితో నమస్కార పూర్వకముగా నిట్లు పలికెను.

త్వయైవ ప్రేషితా రామం పరీక్షితు మహం గతా
జిజ్ఞాసయా పరం త్వస్య నతు కామనయా వ్రజమ్
కథ మేవం ధిక్కురుషే ప్రసీద పరమేశ్వర
ఇత్యుక్త్వా సాంత్వయిత్వా చ వృష మారుహ్య పార్వతీ
శంకరాయ తతో రామమాహాత్మ్యం కథయం త్యగాత్ .
౧౮-౧౯-౨౦

మార్గయిత్వా చ సౌమిత్రి ర్భూమిజాం తత్ర తత్ర తామ్,
సమేత్య భ్రాతృనికటం లక్ష్మణః ప్రాహ రాఘవమ్. ౨౧
రావణేన హృతా సీతే త్యవాదీ ద్విహగాధిపః,
కిమత్ర మార్గణే నావాం దక్షిణాశాం వ్రజావ తత్
ఇత్యుక్త స్స రాఘవోఽథ లక్ష్మణేన సమన్వితః,
క్రమా ద్వనా న్యతిక్రమ్య బహూని చ తతః పరమ్
కృష్ణానదీం చ తీర్త్వాఽసౌ ప్రయయౌ దక్షిణాం దిశమ్.
౨౨-౨౩½

ఏవం రామ స్ససౌమిత్రి ర్నిర్గతో దక్షిణాం దిశమ్,
బాలకృష్ణాతుంగభద్రాసంగమస్థల మాగతః,
* సంగమేశస్తు యత్రాసీ ద్దళిత్రిణా సుప్రతిష్ఠితః,
తత్ర గత్వా జలే స్నాత్వా స్తుత్వా నత్వా చ శంకరం,
తదనుగ్రహ మాసాద్య విశ్రమ్య నిరగా త్తతః. ౨౪-౨౫½

---

* అస్మి న్విషయే పౌరాణికీ గాథా ప్యేవం దృశ్యతే.
"భూమిజాం విచర న్రామ స్స సౌమిత్రి ర్వనే చరన్ । సంగమ
స్థల మాగా త్తద్దృష్ట్వా ప్రాహాఽనుజోఽగ్రజమ్ ॥ భ్రాత
శ్శోభాయమానేఽస్మిం స్తుంగభద్రానదీతటే । అనేకశాఖా

౧౮-౧౯-౨౦ నా థా! పురుషు లెంతకైనను సాహసులు. మీరేకదా రాముని పరీక్షించి రమ్మని పంపి యిట్లు మాట్లాడుచుండిరి. రాముని పరత్త్వమును పరీక్షింపగోరి వెళ్ళితిని గాని కామునచే వెళ్ళినదానను గానని తెలిసియు నిట్లు ధిక్కరించుట న్యాయమా? ఓపరమేశ్వరా! అనుగ్రహింపుము, అని వేడికొని వృషభారూఢురాలై శంకరునితోఁ దిరిగి కైలాసమున కేఁగు నపుడు తాను స్వయముగ జూచిన రాముని మహత్త్వమును ముచ్చటించుచు నేఁగెను.

౨౧ లక్ష్మణుఁడు నచ్చటచ్చట నితరవనమున సీతను వెదకి వేసారి రాముని సమీపమునకుఁ దిరిగి వచ్చి రామునితో నిటులఁ బలికెను

౨౨-౨౩ అన్నా! రావణుఁడు సీత నపహరించెనని మనకు జటాయువు చెప్పినపుడు మన మిచ్చట వెదకుట నిష్ప్రయోజన మని తలచెదను. దక్షిణదిశ కేఁగుదము ఇట్లు పలుకగా రాముఁడును నట్లే యేఁగుదము. అని లక్ష్మణునితో గూడ బయలుదేరి యనేకారణ్యముల నతిక్రమించి క్రమముగ కృష్ణాతీరమునకు వచ్చి యానదిని దాటి యచ్చట నుండి దక్షిణదిశకు బయలుదేరెను.

౨౪-౨౫ ఇవ్విధముగ రామచంద్రమూర్తి లక్ష్మణసమేతుఁడై దక్షిణముగ * నడుచుచు నగస్త్యమహర్షిచేఁ బ్రతిష్ఠింపబడిన సంగమేశ్వరుని క్షేత్రమగు బాలకృష్ణా తుంగభద్రా సంగమస్థలమునకు వచ్చి యచ్చట స్నానమాచరించి సంగమేశ్వరుని నభిషేకించి స్తుతించి నతులొనర్చి శివానుగ్రహమును సంపాదించుకొని కొంచె మచ్చట విశ్రమించి పిమ్మట నటనుండి బయలుదేరెను

---

* ఈ విషయమున నితర పురాణగాథ కూడ నీ క్రిందివిధముగ గన్పడుచున్నది. (ఎట్లనగా)

"రామచంద్రమూర్తి లక్ష్మణ సమేతుఁడై వనమున గ్రుమ్మరుచు సంగమస్థలమునకు రాగా లక్ష్మణుఁడీ క్రింది విధముగ రాముని బ్రశ్నించెను. అన్నా! సకల శోభాయమాన మగు నీ తుంగభద్రా

సహితో నివాసః పక్షిణాం తథా॥ యాత్రికాణాం మునీనాం
చ వాసభూతో వట స్తరుః । చకాస్తి తేన సహితం క్షేత్ర
మేత న్మనోహరం॥ అత్ర విశ్రాంతి మాసాద్య పశ్చా దావాం
వ్రజేవహి । కించైత త్క్షేత్రనామాఽధిదేవ తే శ్రోతు మప్యహమ్
వాంఛామి కృపయా బ్రూహి త్యేవం పృష్టోఽనుజేన సః॥
ప్రాహైవం రామచంద్రోఽపి త త్క్షేత్రవిషయం పునః । పురా
ప్రసంగవశతః కేనచి న్మునినా మమ । యదుక్తం వచ్మ్యహం
త త్తే శృణుతా క్షేత్రసంగతిమ్.

ఏత త్క్షేత్రస్య నాథోఽభూద్విశేషః కారణాంతరాత్, కాశీవిశ్వేశ్వరో హ్యత్ర సమేత్యాసీ దితి శ్రుతమ్॥

తతోఽత్రిమునినా భ్రాత శ్శివలింగం ప్రతిష్ఠితమ్। బాల కృష్ణా తుంగభద్రా సంగమస్థలహేతుతః। సంగమస్థలనామాఽఽ సీదేత త్క్షేత్రస్య చాఽనుజ.

క్షేత్రేస్మి న్మునయః కేచి త్పురా కృత్వా తపోనృపాః। ముక్తిం చ దుర్లభాం ప్రాపు ర్గర్గో నామ నృప స్త్విహ॥ తప స్తప్త్వా సంగమేశప్రసాదం ప్రాప్య వై తతః ॥ కైలాసం ప్రాప్తవా న్కించ దేవస్వామీ నృపోత్తమః । వంగదేశాధిపః కించ సఖా తస్య ద్విజోత్తమః॥ జనస్వామీతి విప్రశ్చ సంగమేశస్య పూజనాత్ ॥ కైలాసే ప్రమథేషు ద్వావగాతాం చ ప్రధానతామ్। కిం చైతస్మిం ఛుభక్షేత్రే సంగమేశప్రసాదతః॥ పరం పద మవాపు శ్చ బహవో మానవాః పునః।

నదీతీరంబున ననేక శాఖా సమన్వితమై మృగ పక్షి సంతానముల పెక్కింటికి నివాసస్థానమై యాత్రికులకును మునులకును నిలయమై యొప్పు నీ మహోన్నత వృక్షముతోఁ గూడిన యీ క్షేత్రము చాల మనోహరముగా నున్నది ఇచ్చట గొంత తడవు విశ్రమించి తదుపరి ప్రయాణోన్ముఖుల మయ్యెదము గాక!

మఱియు, ఈ క్షేత్ర మెద్దియో, దీని కధినాథు డెవ్వడో విన కుతూహలముగా నున్నందున నాయందు దయ యుంచి తెల్ప వేడుచున్నాను, అని లక్ష్మణుఁ డడుగ శ్రీరాముఁడిట్లు పలికెను. నీయిష్టము చొప్పున క్షేత్రనాథుని దర్శించి యిచ్చట గొంచెము విశ్రమించి విశ్రాంతి గైకొందము గాక

లక్ష్మణా! ఈ క్షేత్రము సంగమేశ్వర క్షేత్రము. దీని మాహాత్మ్యమును గురించి యొక మహర్షి ప్రసంగవశమున నుడివెను. దానిని సవిస్తరముగా జెప్పెదను వినుము.

ఈ క్షేత్రమున కధినాథుఁడు విశ్వేశ్వరుఁడు- కొండొక కారణమున కాశీ విశాలాక్షుఁడే నిచటి కేతెంచెననియు తదుపరి అత్రి మహర్షిచే నీ శివలింగము సపరివారముగ ప్రతిష్ఠింపబడెననియు, బాలకృష్ణా తుంగభద్రానదుల సంగమస్థల మగుటవలన నీ క్షేత్రము సంగమేశ్వర క్షేత్రమనియు చెప్పఁబడుచున్నది.

ఇంకను దీని మాహాత్మ్యమును జెప్పెదను వినుము. ఈ క్షేత్రమున ననేక మహర్షులు, రాజులు సంగమేశ్వరుని దర్శించి తపస్సుచేసి మోక్షము నొంది యున్నారు గదమహారాజును నీ క్షేత్రమున దపముచేసి సంగమేశుని ప్రసాదమువలన కైలాసమును బొందెను. వంగదేశాధిపతియగు దేవస్వామి యను రాజును, అతని స్నేహితుఁడగు జనస్వామియను బ్రాహ్మణుడును నిచ్చటను వచ్చి సంగమేశ్వరునిఁ బూజించుటవలన శంకరుఁడు ప్రత్యక్షమై యా భక్తుల నిర్వురను విమానమున తన లోకమునకు దీసికొనిపోయి తన ప్రమథగణములలో ముఖ్యులనుగాఁ జేసెను. ఇంక ననేకులు ఈ క్షేత్రమున సంగమేశుని యనుగ్రహమునొంది పరమపదము నొందిరి.

నిర్గత్యైవం రాఘవోఽపి లక్ష్మణేన సమన్వితః,
భూమిజాన్వేషణం కుర్వ న్సంచచార వనాంతరే. -౨౬-౪

---

కించ దృష్ట్వా వటతరు స్తత్ర ఫేనిలభూరుహః॥ పురా తాలధ్వజో నామ సింహకేతుః క్రమా ద్ధ్రువమ్। ప్రారబ్ధకర్మవశత స్స్వభూతాం చ తరూ ఇమౌ॥ ఏతౌ కలియుగాంతం చ స్థిత్వైవం తు తతః పరమ్॥ ప్రయాతౌ శివసాయుజ్యం భవేతాం మనుజ ధ్రువమ్.

దేవమీఢ శ్చంద్రవంశ్య స్తప స్తప్త్వాఽత్రి సిద్ధిమాన్। తస్మా ద్దేశ త్పుణ్యాతీర్థం వర్ణితుం కః క్షమోఽవనౌ॥ దర్శనా త్సంగమేశస్య తథా తే భక్తిమానవాః। బాలకృష్ణాతుంగభద్రాజలస్నానేన హి ద్రుతం॥ పున రావృత్తిరాహిత్యం ప్రాప్స్యంతీతి వదం స్తతః। లక్ష్మణేన వినిర్గత్య రామ స్తద్వటసన్నిధౌ। ప్రవిశ్య శీతచ్ఛాయాయాం క్షణం విశ్రమ్య వై తతః। స్నాత్వా సంగమతీర్థే తు సంగమేశ్వరసన్నిధిమ్॥ గత్వాఽభిషిచ్య సంపూజ్య సంగమేశం తు భక్తితః.

సంగమేశప్రసాదం చ ప్రాప్య భూయో వటం ప్రతి। సమాగత్య చ తస్యాథ చ్ఛాయాయా ముపవిశ్య చ। విశ్రాంతిం ప్రాప్య చ తతో నిరగా త్పశ్చిమాం దిశమ్॥ ఇతి. బ్రహ్మకైవర్తపురాణాంతర్గత తత్స్థలపురాణే విశేషతః ద్రష్టవ్యం. ఏత త్క్షేత్ర మిదానీం గర్తపురీ తెనాలిగ్రామద్వయాంతరాళీయధూమశకటమార్గమధ్యస్థసంగమదేవస్థాన మితి వదంతి. తత్ర పూర్వోక్త లక్షణసద్భావా దిత్యలం విస్తరేణ.

౨౬౪ ఇవ్విధముగ రామచంద్రమూర్తి లక్ష్మణసమేతుఁడై యచ్చటనుండి బయలువెడలి మఱియొక వనమున సీతాన్వేషణమును జేయుచు దిరుగుచుండెను.

---

మఱియు, పూర్వకాలమున తాళధ్వజుఁడు, సింహకేతుఁడు, అను రాజులిర్వురుండిరి. వారిరువురును ప్రారబ్ధకర్మవశమున క్రమముగ నీ వటవృక్షముగను, ఫేనిలవృక్షముగను (కుంకుడు చెట్టుగను) జన్మించిరి. ఈవృక్షములు రెండును కలియుగాంతము దనుక నిట్లుండి పిమ్మట శివసాయుజ్యమును బొందగలవు. నిశ్చయము.

మఱియు దేవమీఢుఁడను చంద్రవంశపురాజు నిచ్చటఁ దపము చేసి సిద్ధిఁబొందెను అందువలననే యీ పుణ్యక్షేత్రము వర్ణింప నశక్యము. భక్తజను లీసంగమేశ్వరుని దర్శించుటవలనను, బాలకృష్ణా తుంగభద్రానదుల సంగమస్థలమునందలి జలమున స్నానముచేయుట వలనను పునరావృత్తి రహితు లగుదు రని చెప్పుచు లక్ష్మణునితోఁ గూడ రామచంద్రమూర్తి బయలుదెడలి వటవృక్షముయొక్క నీడయందుఁ బ్రవేశించి క్షణకాలము విశ్రమించి పిమ్మట నచ్చట సంగమతీర్థమున స్నానము చేసి సంగమేశుని సన్నిధి కేగి స్వామి నభిషేకించి సంగమేశ్వరునిఁ బూజించియు నద్దేవుని వరప్రసాదములను బొంది తిరిగి వటవృక్షమును సమీపించి దాని నీడను గూర్చుండి విశ్రమించి పిమ్మట దక్షిణదిక్కును గూర్చి వెళ్లెను. అని–ఈ విషయము బ్రహ్మకైవర్తపురాణమునందు గల తత్స్థల పురాణమందు విశేషముగ గానవగును. ఇప్పు డీ క్షేత్రము తెనాలి గుంటూరురైలు మార్గమధ్యముననున్న సంగమేశ్వర స్థానము (సంగంజాగర్లమూడి) అని చెప్పుచున్నారు. అచట నిపుడు పూర్వము చెప్పిన లక్షణము లన్నియు గలవు.

కాచి త్తత్ర వికారరూపసహితా లంబోదరీ రాక్షసీ,
శైలాకారయుతా కరాళరదనా దంష్ట్రాన్వితాఽయోముఖీ
దృష్ట్వా లక్ష్మణ మాగతా ద్రుతతరం చాలింగ్య తం ప్రాహ సా,
భర్తా మే భవతా ద్భవా న్థ్రివ మహాం తేఽర్హా మమార్హో
భవాన్. ౨౮॥

పశ్చా ద్రాత్రిచరీ శ్రుతిద్వయ మసౌ తన్నాసికాం లక్ష్మణో
వక్షోజద్వయ మాశుగై స్త్రిభిరలం క్రుద్ధోఽచ్ఛిన త్తాం తతః
రక్తాత్యుక్షితకాయయు గ్ద్రుతగతి స్తూర్ణం ప్రధావ్యాఽపత
ద్భూమ్యాం సా పున రుత్థితాఽన్యవిపినం వవ్రాజ శోకాఽ
న్వితా. ౨౯॥

పశ్చా ద్రామోఽనుజయుతః పశ్చిమాం దిశ మాశ్రితః
విపినాని త్వనేకాని సమతిక్రమ్య కించన
భయంకరం మహారణ్యం ప్రవిశ్య వ్రజతిస్మ సః. ౨౯-౩౦
తత్రాసీ దద్భుతాకారః కబంధో నామ రాక్షసః,
వక్షస్యేవ మహావక్త్ర శ్చక్షురాదివివర్జితః,
సర్వప్రాణివధోద్యుక్తః యోజనాయతబాహుయుక్. ౩౧॥

తద్బాహుమధ్యదేశే తౌ చరంతౌ రామలక్ష్మణౌ,
అపశ్యతాం మహాసత్వం తద్భుజద్వయవేష్టితౌ. ౩౨॥

౨౭ ఆ వనమునందు వికృతాకారము గలదియును, లంబోదరియును పర్వతమువలె గొప్పశరీరము గలదియును, భయంకరమైన దంతములు, కోరలు గలదియు నగు నయోముఖియను నొక రాక్షసి లక్ష్మణుని జూచి తొందరగఁ గౌఁగిలించుకొని యిట్లు పలికెను. ఓ పురుష శ్రేష్ఠా! నీవు నాకు భర్తవు కమ్ము. నిశ్చయముగ నీకుఁ దగిన దానను నేను, నాకుఁ దగినవాఁడవు నీవు నయి యుంటిమి. మన యిర్వురకు దాంపత్యము బాగుగా నున్న దనియెను.

౨౮ పిమ్మట లక్ష్మణుఁడా రాక్షసియొక్క ముక్కును చెవులను వక్షోజములను గూడ వాడిగల మూఁడు బాణములచే ఛేదించెను. పిమ్మట నా రాక్షసి రక్తముచేఁ దడుపబడిన శరీరము గలదైయై పరుగులిడుచుండఁ దొట్రుపాటుచే నేల బడిపోయి వెంటనే లేచి దుఃఖించుచు మఱి యొక యడవి కేగెను.

౨౯-౩౦ పిమ్మట రాముఁడు సోదరయుతుఁడై యాచటునుండి పడమరగఁ బోవుచు ననేక వనముల నతిక్రమించి భయంకరమైన యొక మహారణ్యమునఁ బ్రవేశించి పోవుచుండెను.

౩౧ అచ్చట నద్భుతాకారముగల కబంధుఁడను రాక్షసుఁడొకఁడుండెను. ఆ రాక్షసుఁడు వక్షస్థలమునందే గొప్ప ముఖముగలవాఁడును నేత్రములు, శిరము మొదలగునవి వేఱుగ లేనివాఁడును, సర్వభూతహింసకుఁడును, ఆమడ పొడవుగల బాహువులు గలవాఁడునై యుండెను.

౩౨ అట్టి కబంధుని బాహువులమధ్య రామలక్ష్మణులు సంచరించుచు నా బాహువులలో చిక్కుకొని మహాభూతమువలె నున్న కబంధుని జూచిరి.

పరిహాస న్రాఘవః ప్రాహ పశ్య లక్ష్మణ రాక్షసమ్,
శిరః పాదవిహీనో౽య మస్య వక్షసి చాననమ్,
బాహుభ్యాం లభ్యతే యద్య త్త త్తద్భక్షిష్యతి ధ్రువమ్,
ఆవా మప్యేతయో ర్బాహ్వో ర్మధ్యే సంకలితౌ ధ్రువమ్,
గంతు మన్యత్ర మార్గో౽పి దృశ్యతే నహి లక్ష్మణ
కిం కర్తవ్యమితో౽స్మాభి రావా మద్యైవ భక్షయేత్.
౩౩-౩౪-౩౫॥

తచ్ఛ్రుత్వా రాఘవం ప్రాహ సౌమిత్రి స్తు విషాదవాన్,
విధాయ మాం భూతబలిం కురుతా త్త్వం పలాయనమ్. ౩౬॥

తచ్ఛ్రుత్వా ప్రాహ సౌమిత్రిం రాఘవ శ్శోకవిహ్వలః,
త్వాం వినా జీవితం నూనం నేచ్ఛామి చ కదాచన,
మహాఘోర మరణ్యం తు ప్రవిష్టా వనుజ ధ్రువం;
ఆవాంతు జీవితాంతాయ కష్టా త్కష్టతమం త్విదమ్. ౩౭-౩౮॥

దశాస్యప్రేషితా శ్చారా స్సూక్ష్మరూపధరా వనే,
చరంతో దదృశూ రామవిలాపం భూమిజాం ప్రతి
కించాద్య రాఘవౌ వీక్ష్య కబంధభుజమధ్యగౌ
మృతౌ వేవేతి నిశ్చిత్య గత్వా లంకాం తు సత్వరమ్
కబంధభక్షితౌ తౌ ద్వౌ రాఘవా వితి రావణమ్
గత్వాప్రాహు స్తతసో౽పి చారా న్ప్రేషయత్పునః. ౩౯-౪౦॥

౩౩-౩౪-౩౫ పిమ్మట రామచంద్రమూర్తి మందహాసముతో నిట్లు లక్ష్మణుని గూర్చి పలికెను. లక్ష్మణా! ఈ రాక్షసుని జూడుము. శిరస్సు, పాదములు లేక మొండెముగా నుండి రొమ్మునందే ముఖము గలవాడై యుండెను. ఇతనికి ఆమడపొడవుగల చేతు లుండుటవలన ఆ చేతుల కేది దొరికిన దానిని భక్షించుచుండును. మన మిద్దరము నితని చేతులలో జిక్కుకొంటిమి. తప్పించుకొనిపోవుటకు వేఱు మార్గము కన్పడదు. ఏమి చేయుటకుం దోచుటలేదు ఈ రాక్షసుడు మనలను దప్పక భక్షించును.

౩౬ రాముని వచనములను విని లక్ష్మణుడు ఖేదము గలవాడై యన్నతో నిట్లుల బలికెను. అన్నా! నన్ను నీ వీ భూతమునకు బలిగా నిచ్చి నీ వెట్లైన తప్పించుకొని పారిపొమ్ము.

౩౭-౩౮ ఇట్లు లక్ష్మణుడు చెప్పగా విని రామచంద్రమూర్తి మిక్కిలి దుఃఖితుడై లక్ష్మణునితో నిట్లుల బలికెను. తమ్ముడా! నీవు లేకుండగ నేను నిశ్చయముగ బ్రతుక జాలను. ఈ ఘోరాటవిని మన మిద్దరము జీవితాంతమునకే ప్రవేశించితిమి. ఇది కష్టములలో కెల్ల మహాకష్టముగ సంభవించెను.(రామచంద్రమూర్తి యిట్లు మాట్లాడుటను రావణునిచే పంపబడిన గూఢచారులు సూక్ష్మరూపములతో సంచరించుచున్నందున వారలు విని రావణునితో జెప్పగలందులకు కబంధుని చేతులలో జిక్కినట్లుగా మాట్లాడుచుండెనని తెలియదగు).

౩౯-౪౦-౪౧ రావణునిచే బంపబడిన గూఢచారులగు రాక్షసులు సూక్ష్మరూపములతో రాముని వెంట సంచరించుచు రాముడు సీతను గూర్చి పలవించుటను జూచుచుండిరి. మఱియు నిప్పుడు రామలక్ష్మణు లిద్దరును కబంధుని చేతులలో జిక్కుటను జూచి కబంధుని చేతిలో జిక్కినవాడు తిరిగి బ్రతుకుట దుర్లభ మని తలచి వీర లిద్దరును చచ్చిన వారలే యని నిశ్చయించుకొని తమ ప్రభు వగు రావణున కీ శుభ వర్తమానము చెప్పుటకై యా రాక్షస గూఢచారులు తొందరగ లంక కేగి రావణునితో నిట్లుచెప్పిరి. ఓ మహాప్రభూ! రామలక్ష్మణు లిరువురును కబంధునిచే భక్షింపబడి రని చెప్ప సంతోషించి తిరిగి గూఢచారులను బంపుట రావణుడు మానుకొనెను.

లక్ష్మణ స్తమువాచాఽథ కిం విచారేణ రాఘవ,
ఆవామేకైక మవ్యగ్రౌ ఛింద్యావ రక్షోభుజౌ ధ్రువమ్
ఇత్యుక్త్వా లక్ష్మణో వామం చిచ్ఛేద భుజ మంజసా
రామోఽపి దక్షిణం బాహుమచ్ఛినచ్చాసినా తతః. ౪౨-౪౩½

పశ్చా ద్విస్మయ మాపన్నః కబంధః ప్రాహ రాఘవౌ,
కౌ యువాం నరశార్దూలౌ మద్బాహుచ్ఛేదకౌ పునః
దివి వా భువి వాఽన్యైస్తు న దృశ్యం తే వినా యువామ్. ౪౪-౪౫

తతోఽబ్రవీ ద్దస న్నేవం రామో రాజీవలోచనః,
అయోధ్యాధిపతి శ్శ్రీమా న్రాజా దశరథో మహాన్
రామోఽహం తస్యపుత్రోఽసౌ భ్రాతా మే లక్ష్మణ స్సుధీః
మమ భార్యా జనకజా సీతా త్రైలోక్యసుందరీ
ఆవాం తు మృగయాం యాతౌ హృతా కేనాపి రక్షసా
సీతాం సీతాం విచిన్వంతౌ చాఽఽగతౌ ఘోరకాననే
బాహుభ్యాం వేష్టితా వత్ర తవ ప్రాణాదిరక్షయా
ఛిన్నౌ తవ భుజౌ త్వం చ కో వా వికటరూపధృత్

ఇతి రామేణ సంపృష్టః కబంధః ప్రాహ రాఘవమ్,
పురా గంధర్వరాజోఽహం బ్రహ్మణో వరదానతః
కేనాఽప్యవధ్య స్త్వహాస మష్టావక్రం మునీశ్వరమ్
రక్షో భవేతి శప్తోఽహం మునినా ప్రాహ మాం పునః ౫౦½

౪౨-౪౩½ పిమ్మట లక్ష్మణుఁడు విచారములోనున్న రామచంద్రమూర్తితో నిటులఁ బలికెను

అన్నా! ఏల నీ వింత విచారపడియెదవు. మన మిర్వురము ఈ రాక్షసుని చేతుల నొక్కొక్క దానిని దెగగొట్టి పారవేసి పోవుదమని చెప్పి వెంటనే లక్ష్మణుఁడు కత్తితో వాని యెడమ చేతిని నఱకివేయుచుండ నా సమయముననే రామచంద్రమూర్తియు వాని కుడిచేతినిఁ దెగనరికెను.

౪౪-౪౫ పిమ్మట కబంధుఁ డాశ్చర్య విషాదముల నొంది రామలక్ష్మణులతో నిటులఁబలికెను. మానవోత్తములారా! మీర లెవ్వరు? నా బాహులను ఛేదించువారలు మీరలు తప్ప నితరు లెవ్వరును భూమియందుగాని, స్వర్గమునందుగాని యింతవరకు గన్పడక పోయిరి.

౪౬-౪౭-౪౮-౪౯ ఇట్లు కబంధుఁడు పలుకగా రామచంద్రమూర్తి నవ్వుచు నిట్లు పలికెను. ఓ రాక్షసా! నా వృత్తాంతమును జెప్పెదను వినుము. అయోధ్యాపురమునకుఁ బ్రభువైన దశరథుఁడను మహారాజొకఁడుండెను. నేనాదశరథుని జ్యేష్ఠపుత్త్రుఁడనైన రాముఁడను. ఇతఁడు నా సోదరుఁడైన లక్ష్మణుఁడు. త్రిలోకసుందరియగు నా భార్యయయిన సీతను నెవ్వఁడో యపహరింపగా మే మిర్వురము నామెను వెదకుచు నీయరణ్యములో నీ బాహువులలో జిక్కికొని పోతిమి. మా ప్రాణములను రక్షించుకొనుటకై నీభుజములను దెగకొట్టవలసి వచ్చెను. నీ వెవ్వఁడవు? వికృతరూపములో నుండుటకుఁ గారణ మేమి? అని రామచంద్రమూర్తి ప్రశ్నింపగా కబంధుఁడు తన వృత్తాంతము నిట్లు చెప్పఁదొడగెను.

౫౦½ ఓ పురుషోత్తమా! నేను పూర్వ మొక గంధర్వరాజునై యుంటిని. బ్రహ్మవరప్రసాదముచే నే నెవనిచే దేనిచే, గూడ వధింపబడని వాఁడనై యుండినందున నిర్లక్ష్యముగా సంచరించుచు నొకప్పుడు అష్టావక్రమహర్షినిఁ జూచి నవ్వగా నతఁడు నన్ను రాక్షసుఁడ వగుమని శపించెను. నేనమ్మహాషినిఁ బ్రార్థింపగా నిట్లు నన్ను గూర్చి తిరిగి చెప్పెను.

త్రేతాయుగే యదా రామలక్ష్మణౌ యోజనాయతౌ,
ఛేత్స్యత స్తే మహాబాహూ తదా శాపా ద్విమోక్ష్యసే.
తతో రాక్షసదేహోఽహ మింద్ర మభ్యద్రవం రుషా
సోఽపి వజ్రేణ మాం రామ! శిరో దేశే త్వతాడయత్
తదా కుక్షౌ శిరః పాదయుగళం చ గతం క్షణాత్
బ్రహ్మదత్తవరా న్మృత్యు ర్నాభూ న్మే వజ్రతాడనాత్
ముఖాభావే కథం జీవే దయ మిత్యమరాధిపః
తదా మాం ప్రాహ కృపయా జఠరే తే ముఖం భవేత్
బాహూ తే యోజనాయామౌ వద్య శీఘ్రం భవిష్యతః
తదారభ్యాఽత్ర బాహుభ్యాం లబ్ధం తద్భక్షయా మ్యహమ్.
౧౧-౧౫॥

దహ్యతాం భవతా రామ! మదంగం త్వగ్నినా ద్రుతమ్
సంప్రాప్తవా న్పూర్వరూపం వచ్మ్యహం భూమిజాస్థితిమ్.
౧౬॥

తతో రామోఽపి కృత్వాఽశు చితాం ప్రజ్వాల్య దూరతః
జగామ సోఽగ్నిదగ్ధోఽభూత్కబంధోఽపి శనైః క్రమాత్. ౧౭॥

కోటికందర్పసంకాశః విమానే సంస్థిత స్తతః
దివ్యమాల్యాంబరయుతో దివ్యరూపధర స్తదా
నత్వా రామ మిదం ప్రాహ కబంధో నిజరూపధృత్
అంతరిక్షగతః పూర్ణభక్తియుక్తో వచోఽనఘః. ౧౮-౧౯॥

౫౧-౫౨-౫౩-౫౪-౫౫ త్రేతాయుగమున రామలక్ష్మణులు యోజన
పరిమాణముగల నీ బాహువుల నెప్పుడు ఛేదించెదరో, అప్పుడు నీవు
శాప ముక్తుఁడ వగుదు వని చెప్పెను. పిమ్మట రాక్షస దేహముగల
వాఁడనై యతిగర్వముతో దేవేంద్రునిమీఁదికి యుద్ధమునకేగగా నతఁడు
తన వజ్రాయుధముచే నా శిరమును గొట్టగా నేను బ్రహ్మవరముచే
నవధ్యుఁడను గాన నా దెబ్బచే చావులేక నా శిరము పొట్టలో
నణగి పోయెను. రెండు పాదములు విరిగిపోయెను. మొండెము మాత్ర
ముండెను. వజ్రాయుధప్రహారముచే గూడ మృత్యువు బ్రహ్మ
వరముచే గలుగక పోయెను. శిరస్సు, ముఖము లేకపోయిన వీఁడెట్లు
జీవించు నని దయగలిగి యా యింద్రుఁడే నా పొట్టలోనే ముఖ
ముండునట్లు వర మిచ్చెను. మఱియు, ఆమడపొడవు గల చేతులు
కలుగునట్లును వర మిచ్చెను. అది మొదలు నా చేతులకు జిక్కిన
దానిని భక్షించుచు నిట్లు జీవించుచుంటిని.

౫౬ ఓ రామచంద్రా! నీవలన శాపవిముక్తి నేటి కయ్యెను. కాన నా
శరీరమును నీవు దహింపజేయుము. నేను నిజరూపమును బొంది సీత
లభించు నుపాయమును జెప్పెదను.

౫౭ అనంతరము రామచంద్రమూర్తియును వెంటనే కబంధుని సమీపమున
జితిని చేర్చి యగ్నినిఁ బ్రజ్వలింపజేసి దూరముగ నేగెను. కబంధుఁడు
క్రమముగ మందముగ నగ్నిదగ్ధుఁ డయ్యెను.

౫౮-౫౯ అనంతరము కబంధుఁడు కోటి మన్మథులతో సమానమైన దివ్య
రూపముఁగలవాఁడై యంతరిక్షమున విమానారూఢుఁడై దివ్యమాల్యాం
బరములచే సంశోభితుఁడై పాపరహితుఁడై రామునకు నమస్కరించి
యిట్లు పలికెను.

రామచంద్ర నమ స్తుభ్యం య ద్రూపం శంకరాదయః
నిత్యం ధ్యాయంతి మనసి తత్స్తోతుం ప్రభవే చ్చ కః
సర్వదా రక్ష మాం దేవ త్వన్మాయా నాఽఽవృణోతు మామ్
జానామి పరమాత్మానం త్వా మహం లోకనాయకం.
౬౦-౬౧

శిష్యా త్వగ్రే మతంగస్య మునే స్తు పరిచారికా
శబరీ తత్ర గచ్ఛ త్వం సర్వం తే కథయిష్యతి. ౬౨

ఇత్యుక్త్వా రాఘవం నత్వా స్తుత్వా చ బహుధా తు సః,
తదనుజ్ఞా మవాప్యాఽఽశు విమానేన యయౌ దివమ్,
తత స్తద్వచసా రామో సౌమిత్రిసహితః పునః,
శబర్యా స్త్వాశ్రమం ప్రాప్తుం నిరగా త్తుష్టమానసః. ౬౩-౬౪
తచ్ఛ్రుత్వా శౌనకాద్యా స్తు మునయో రోమహర్షణమ్,
పప్రచ్ఛు ర్వినయోపేతా శ్శబరీవృత్త మాదితః,
సూతోఽపి శబరీవృత్తం సమగ్రం వక్తు ముద్యతః. ౬౫-౬౬

ఇత్యాశ్చర్యరామాయణే అరణ్యకాండే
పంచదశ స్సర్గ స్సమాప్తః.

౭౦-౭౧ ఓ రామచంద్రా! నీకు నమస్కారము. ఏ నీ దివ్యరూపమును శంకరుఁడు మొదలగువారును నిరంతరము మనస్సునందు ధ్యానించె దరో, అట్టి నీ దివ్యరూపమును స్తుతించుటకు నెవ్వఁడు సమర్థుఁడు? ఎల్లప్పుడు నన్ను రక్షింపవలయును. నీ మాయ నన్ను నావరింపకుండ నుండున ట్లనుగ్రహింపుము. నీవు సకలలోకేశ్వరుఁడ వనియు, పరమాత్మ వనియు తెలిసికొంటిని.

౭౨ ఇచ్చటకు సమీపముననే మతంగమునిపరిచారికయగు శబరియొక్క యాశ్రమ మున్నది. నీ వచ్చటి కేగినచో సీత లభించు నుపాయ మంతయు నామె తెలియ జేయగలదు.

౭౩-౭౪ ఇట్లు చెప్పి యా కబంధుఁ డా రామునకు నమస్కరించి యనేక విధముల స్తుతించి యా రాముని యనుజ్ఞను గూడ నొంది వెంటనే విమానముతో స్వర్గమున కేగెను. రామచంద్రమూర్తి నటనుండి లక్ష్మణునితోఁగూడ శబరియాశ్రమమునకు వచ్చుటకు సంతోషముతో బయలుదేరెను.

౭౫-౭౬ ఇట్లు సూతుఁడు చెప్పిన వృత్తాంతమును మునులు విని యా శబరి మతంగమహర్షి శిష్యురా లెట్లయ్యెనో మొదటనుండి తమకు నామె వృత్తాంతమును విన్పింపుమని వినయముతో నడుగగా సూతుఁడు శౌనకాది మునులకు శబరిచరితమును మొదటనుండియు జెప్పుట కుపక్రమించెను

అరణ్యకాండమున పదునైదవ సర్గము.
సమాప్తము.

---

## షోడశ స్సర్గః.



దండకారణ్యమధ్యే తు మతంగాశ్రమసన్నిధౌ
*శబరస్య సుతా కాచి త్పతిపుత్రవివర్జితా
అరణ్యే నివసంతీ సా ఫలమూలాశనా శుభా
దైవా న్మతంగం త మృషి మేకదా సందదర్శ హ. ౧, ౨
విచారయామాస హృది సేవేయాఽహం కథం మునిమ్
ద్రష్టుం హి సహి శక్నోమి నీచాఽహం కథ మర్చయే
తథా ప్యేతస్య మార్గం తు శర్కరాకంటకాన్వితమ్
సంమార్జయా మ్యహం నిత్యం యేన దృక్ష్యతి నైవ మాం
ఇంధనాని గృహీత్వా చ త దాశ్రమసమీపతః
సంస్థాపయిష్యే రాత్రౌ తు తత స్సేవా భవిష్యతి
ఇతి నిశ్చిత్య మనసా తథా చక్రే దినేదినే. ౩-౪-౫

స్వాస్యాంతే వాసిన స్త్వేవం కుర్వంతీతి మనీషయా
కంచిత్కాలం స్థిత స్తూష్ణీం జ్ఞాత్వా ఛాత్రా నథాఽఽహ సః
కో౽యం మార్గం మార్జయిత్వా దదా త్యత్రేంధనాని చ
విచార్యాఽఽనయత ఛాత్రా శ్శీఘ్ర మేవ మదంతికమ్. ౬-౭

---

*శబరో నామ ప్రతిలోమజాతీయః. తదుక్తం నారదీయే "నృపాణాం వైశ్యజాతో య శ్శబరః పరికీర్తితః। మధూని వృక్షా దానీయ విక్రీణీతే స్వవృత్తయ ఇతి.

# పదునాలవ సర్గ ప్రారంభము.

౧-౨ దండకారణ్య మధ్యమున మతంగాశ్రమ సమీపమున నొక * శబర కన్యక పతి పుత్ర వర్జితురాలై యరణ్యమున నివసించుచుఁ గంద మూల ఫలాదులను భుజించుచు దైవ వశమున నొక దినమున మతంగ మహర్షిని సందర్శించెను.

౩-౪-౫ ఇట్లు మతంగమహర్షిని శబరి చూచి తన మనమునం దిట్లాలోచించుకొనెను. నే నీ మహర్షిని నెట్లు సేవింపఁగలను? నేను నీచజాతి స్త్రీని కదా. అమ్మహర్షిని సందర్శించుటకు గూడ ననర్హురాలనగు నే నెట్లు సేవింప నర్హురాల నగుదును? కాను. అయినను నమ్మహర్షి స్నానమునకు వెళ్ళెడి మార్గమున నుండు ముండ్లను, గులక రాళ్ళను రాత్రి భాగమున దీసివేయుచు నాడ్చిపరిశుభ్రము చేయుచు నమ్మహర్షికిఁ గావలసియుండఁగఁ బ్రతి నిత్యము కట్టెలను మోసికొని వెళ్ళి రాత్రిభాగమున నమ్మహర్షి యాశ్రమ సమీపమున బెట్టి వచ్చుచు నిర్విఘ్నముగ సేవ చేయుచున్నైన దరించెద నని తలంచి ప్రతి నిత్యము ద్వైవిధముగ సేవ చేయుచుండెను. ఈ శబరి యిట్లు చేయు చున్నదని కొంతకాలము దనుక నమ్మహర్షికిఁ దెలియ దయ్యె.

౬-౭ తన శిష్యులే యిట్లు ప్రతి నిత్యము మార్గమును శుభ్రము చేయు చుండిరని తలంచెను కాని, తన శిష్యులు చేయుటలే దనియు నితరు లెవరో యిట్లు చేయుచుండిరనియుఁ దెలిసికొని తన శిష్యులను బిలచి యమ్మహర్షి యిట్లనియెఁ జెప్పెను. ఓశిష్యులారా! ప్రతినిత్యము నేను స్నానమునకు బోయెడి మార్గమును శుభ్రము చేయుచుండెడి వాఁ డెవ్వడో మీరలు విచారించి వానిని నా యొద్దకు శీఘ్రముగఁ దీసికొని రండని యాజ్ఞాపించెను.

---

* శబరుఁడనఁగాఁ బ్రతిలోమజాతీయుఁడు. నారదీయ పురాణమునఁ గూడ నిటులనే చెప్పఁబడినది. "క్షత్రియ స్త్రీయందు వైశ్యునివలన పుట్టినవాఁడు శబరుఁడని చెప్పబడును. చెట్లనుండి లేని తుట్టెలను గొట్టి తేనెను తీసికొనివచ్చి యమ్ముకొనుట శబరుని వృత్తి" యని చెప్పబడినది" అని.

జాగరూకా నిశి ధాత్రౌ శ్శబరీం తు సమానయత్
జగామ చ మునే రగ్రే భీతా భక్తిమతీ సతీ. ౮౫

తాం దృష్ట్వా స మునిః ప్రాహ కిమర్థం త్వింధనాని మే
దదాసి మమ మార్గం చ మార్జయస్యనిశం శుభే
పృష్టైవం తం మునిం ప్రాహ శబరీ భక్తిసంయుతా. ౯-౧౦

నాథాహం శబరీ నీచా భాగ్యహీనా వనే స్థితా
మహర్షే తవ సేవాం తు చికీర్షస్త్వేవ మాచరమ్
యథా మే సద్గతిర్భూయా త్తథా దేహి మమాఽఽశిషమ్ ౧౧

ఇత్యుక్తః ప్రాహ తాం మాని శ్శబరీం ధర్మతత్పరామ్,
ఆశ్రమే తిష్ఠ శబరి ధాత్రీభూతా మమాంతికే,
ఇత్యుక్తా సా స్థితా తత్ర తత్సేవాకారిణీ తతః. ౧౨-౧౩

ఏవం కాలే గతే సర్వే దండకారణ్యవాసినః,
మతంగం ప్రావద న్దుష్టం శబరీసన్నిధానతః. ౧౪

అవదాతం స్వచరితం జాన నోఽపి ముని స్తతః,
నిర్విశంకమనా స్తస్థౌ శబరీం పరిపాలయత్. ౧౫

౮ గుర్వాజ్ఞాప్రకారము మతంగమహర్షి శిష్యులు రాత్రిభాగమున మేలొల్కొని కనిపెట్టియుండి మార్గమును శుభ్రము చేయుచున్న శబరిని మతంగమహర్షి సమీపమునకుఁ దీసికొనిపోవగా భక్తురాలగు నా శబరియు భయపడుచు నామహర్షియొద్ద నిల్వబడెను.

౯-౧౦ ఆ మతంగమహర్షి శబరిని జూచి యిట్లు ప్రశ్నించెను. అమ్మా! నీవు ప్రతినిత్యము మార్గము నంతను శుభ్రము చేయుచు నింధనములను నా యాశ్రమునకు దీసికొని వచ్చి పడవేయుచు నుంటివి. నీవే కోరికతో నిట్టుల నాకుఁ బరిచర్య యివ్విధముగఁ జేయుచుంటివో చెప్పుము. నీకు భయములేదని యడుగగా నా శబరి భక్తియుక్తురాలై యిట్టుల నమ్మహర్షితోఁ జెప్పెను.

౧౧ నాథా! నే నొక శబరకన్యకను. మరదృష్టవంతురాలను. ఈ యరణ్యమునందే నివసించి యుంటిని, ఓ మతంగమహామునీ! నీ సేవచేసి తరింపవలయునని యిట్లు చేయుచుంటినే కాని యొక ఫలము నపేక్షించి చేయుట లేదు. కాన నాకు సద్గతి కలుగునట్లు మీర లాశీర్వదించుచుండుడు.

౧౨-౧౩ ఇట్లు చెప్పగా నమ్మహర్షి యామెయందుఁ గరుణ కలవాడై యిట్లు చెప్పెను. అమ్మా! నీవు కడు ధార్మికురాలవుగా నుంటివి. నా యాశ్రమముననే నీవు కూడ నొక శిష్యురాలవుగా నుండుము. అని చెప్పగా నప్పటినుండియు నమ్మహర్షికిఁ బరిచర్య చేయుచు నా యాశ్రమముననే యుండుచుండెను.

౧౪ ఇట్లు కాలము గడచుచుండగా శబరినిఁ దన యాశ్రమమునం దుంచుకొనెను. గానమతంగ మహర్షి దుష్టుడని దండకారణ్యము నందలి మహర్షు లందరును నమ్మహర్షిని వెలి వేసిరి.

౧౫ మహర్షు లందరును దనను దూషించినను దనప్రవర్తన యం దెట్టి దోషము లేనందున మనస్సందేహము లేనివాఁడై పూర్వమువలె శబరిని దన యాశ్రమమునందే యుంచుకొని పుత్రికాభావనతోఁ జూచుచుండెను.

ఏకదా ప్రాహ శబరీం మతంగోఽపి వచ స్త్విదమ్,
అహం శరీరం త్యక్ష్యామి విషాదం త్యజ సువ్రతే,
రామో దాశరథి స్సాక్షా ద్విష్ణు రేవ సనాతనః,
అవతీర్ణో స్త్వయోధ్యాయా మాగమిష్యతి తేఽంతికమ్,
తస్యాఽతిథ్యం విధాయ త్వం దివం యాస్యసి సువ్రతే,
తావ త్త్వం తస్య రామేతి నామభాషణతత్పరా,
వసాఽత్ర దండకారణ్యే మత్సేవాఫల మస్తు తే
ఇత్యుక్త్వా స ముని ర్దివ్యలోకం ప్రాప విమానగః. ౧౬-౧౯

తదారభ్య ప్రతిదినం శబరీ రామభాషిణీ,
ఫలమూలాశనా నిత్యం రామాగమనకాంక్షిణీ,
కదా గమిష్యతి శ్రీమా న్రామో దాశరథిః ప్రభుః,
ఇత్యేవం చింతయంతీ సా ముహుః పశ్యతి తత్పథమ్ ౨౦-౨౧

ఫలమూలాదికం యత్ర బదరీ తిందుకాదికమ్,
భుంజానా మధురం జ్ఞాత్వా రామాతిథ్యాయ సా త్వధాత్,
ప్రాత రేవ సమాగచ్ఛే దితి సంచింత్య సా నిశి,
విలేపనం కృతవతీ పశ్యం త్యుషసి సా దిశః,
ఏవ ముత్కంఠితాఽరణ్యే శబరీ రామతత్పరా,
శ్రమణీ సంస్థితా కీరా న్రామనామ వదం త్యసా.
౨౨-౨౩-౨౪

౧౬-౧౭-౧౮-౧౯ ఇట్లు చాలకాలము జరిగిన పిమ్మట నొకప్పుడు మతంగమహర్షి శబరిని బిలచి యిట్లు చెప్పెను. పుత్రి! నే నింక శరీరము విడిచిపెట్టెదను. నీ వేమియు విషాదము నొందకుము. నేను నీ కేమియు నుపదేశింప లేదని సందేహింపకుము. నీవు రామమును జేసికొనుచు నిచ్చటనే కాలము గడుపుచు నుండుము. ధర్మసంస్థాపనార్థమై వైకుంఠవాసి యగు శ్రీపతియే యయోధ్యయందు రామచంద్రమూర్తిగా నవతరించి యుండెను. ఆమ్మహాత్ముఁ డొకప్పుడు కొలది కాలముననే నీకు దర్శన మిచ్చును. ఆ రామచంద్రమూర్తికి నీ వాతిథ్యము నిచ్చి ముక్తి నొందగలవు. అంత దనుక రామనామము చేసికొనుచు నిచ్చటనే యుండుము నా సేవాఫలము నీకు లభించును, అని చెప్పి యమ్ముని విమానారూఢుఁడై దేవలోకమున కేగెను.

౨౦-౨౧ అది మొదలుకొని ప్రతినిత్యము రామనామము చేసికొనుచుఁ గందమూలఫలాదులను భుజించుచు నమ్మున్యాశ్రమము నందే యుండి రామచంద్రమూర్తియొక్క రాక కెదురుచూచుచు నా యిష్టదైవమగు రామచంద్రమూర్తి యెప్పుడు వచ్చునో యని యాలోచించుకొనుచు మాటిమాటికి మార్గమువంక జూచుచుఁ గాలము గడపుచుండెను.

౨౨-౨౩-౨౪ రాముఁ డెప్పుడు వచ్చునో యని ముందుగనే రేగుపండ్లు మొదలగు ఫలములను రుచిచూచి తెచ్చి నిలువయుంచుచుండెను. ప్రాతఃకాలముననే వచ్చునేమో యని క్రిందటిరాత్రికాలముననే యింటి నలుకుకొని రంగవల్లులు పెట్టి ప్రాతఃకాలమున లేచి రామునికై దిక్కులు చూచుచు రామునిరాకయందే కుతూహలము గల్గి సన్యాసినిగా నుండి పంజరమునందలి చిలుకలకు రామనామమును జెప్పుచునుండెను.

ఏకదా మునిపుత్రా స్తు శుశ్రువూ రఘునందనం,
సమాగత మరణ్యే సా విదిత్వా సాఽపి మోదితా,
ధావి త్వైత స్తతో మూలఫలా న్యాదాయ మందిరే,
సంరక్ష్య జల మాహర్తుం జలాశయ ముపాగమత్. ౨౫-౨౬

అథ కృష్టో మునిః కోఽపి స్నాత్వా గచ్ఛం స్తదా పథి,
ప్రదక్షిణీకృత్య మునిం భయా ద్దూరాద్వ సా పునః,
అథ తస్యా శ్శరీరస్య ఛాయా మునిపదాంబుజే,
సంలగ్నేతి చుకోపాఽసౌ ముని స్తాం భ ర్త్సయ న్రిపా
పరావృత్య పున స్స్నాతుం జలాశయ ముపాగితః. ౨౭-౨౮

తత్ర గత్వా దదర్శాంభః క్రిమిసంయుత మేవ చ,
కిం జాత మితి తన్మాని శ్చింతయామాస నై హృది,
తథాఽపి మార్జనం కృత్వా సమాయాతో నికేతనమ్. ౨౯-30

శబరీ తు తతః పూర్వం జలం నీత్వా నికేతనమ్
పంజరస్థితకీరాణాం రామనామ తతః పరమ్
శిక్షయంత్యేవ మానంద మనుభూతవతీ స్థితా.
ఏతస్మిన్ సమయే రామ స్సానుజ స్సముపాగతః 3౧

క్వాసాఽ స్తి శబరీ చేతి బ్రువాణోఽంగణ మాగతః
దృష్ట్వా రామం ఘనశ్యామం శబరీ పుష్కరేక్షణమ్
జటామకుటశోభాఢ్యం ధనుర్బాణాధరం తు సా
ననర్తాఽంగణ మాగత్య కరతాళపరాయణా. 3౨-33-3౪

౨౫-౨౬ ఇట్లుండ నొకదినమున మునిపుత్త్రులు రామచంద్రమూర్తి సమీపమునకు వచ్చినట్లు చెప్పుకొనుచుండ నా శబరి విని సంతుష్టురాలై యిటునటు బరుగు లిడుచు ఫలములను కందమూలములను దీసికొని జాగ్రత్తపెట్టి పానీయమును దీసికొనివచ్చుటకై సరోవరమున కేగుచుండెను.

౨౭-౨౮ ఈ సమయమున నొకమహర్షి సరోవరమున స్నానముచేసి వచ్చుచుండ మధ్యమార్గమున శబరి యెదురుగ వచ్చుచుండెను. మునిని జూచి యామె భయముతో దూరముగఁ దొలగెను కాని యమ్మహర్షి యామె యొక్క నీడ తన పాదములకు సోకినదని యామెను దూషించుచుఁ గోపగించుచుఁ దాను మైలపడితి నని భావించుకొని తిరిగి స్నానము చేయుటకై సరోవరమున కేగెను.

౨౯-౩౦ ఆ మహర్షి తిరిగి స్నానమునకై సరోవరమున కేగుసరికి యందలి జలమంతయుఁ గ్రిమి భూయిష్ఠమై యుండుటయేకాక రక్తమువలె నుండెను. ఇంతలోనే యీ జల మిట్లగుటకుఁ గారణమే మని యా ముని మనస్సునం దెంత యాలోచించినను గారణమును గానక యా యుదకముతో మార్జనము మాత్రము చేసికొని తన యాశ్రమమున కేగెను.

౩౧ శబరి రాముని రాకకుఁ బూర్వమే నీటినిఁ దీసికొనివచ్చి యుంచుకొని పంజరములోని చిలుకలకు రామనామమును బోధించుచు నానందము ననుభవించుచుండెను.

౩౨-౩౩-౩౪ ఇట్టిసమయమున రామచంద్రమూర్తియు లక్ష్మణసమేతుఁడై శబరి యాశ్రమమును వెదకికొనుచు వచ్చి శబరి యెక్కడ? శబరి యెక్కడ? అని పిలుచుచు వాకిలిముందుకు రాగా మేఘశ్యాముఁడును, పుండరీకాక్షుఁడును, జటామకుట మండితుఁడును, ధనుర్బాణధారియు, నగు నా రాముని శబరిచూచి బ్రహ్మానందము నొందుచుఁ గరతాళ ధ్వనులను జేయుచు వాకిలిముందు నృత్యము చేయసాగెను

రామం దదర్శ మార్గేణ నాన్య త్కించి ద్బుబోధ సా
పతితం చోత్తరీయం చ పరిధానీయ మప్యహో
తథాపి ననివృత్తా సా నిమగ్నానంద సాగరే. ౩౫

అథ తాం చోదయామాస లక్ష్మణ స్సస్మితాననః
కురు స్వాతిథ్య మద్య త్వం భవ పూర్ణమనోరథా
ఇత్యుక్తా శబరీ నృత్యం త్యక్త్వా భూమౌ పపాత హ
సా స్మృతిం ప్రాపితా భూయో లక్ష్మణేన స్థిరస్మృతిః
ఉత్థాయ రాఘవం స్తోతు ముపచక్రామ వై తతః ౩౬-౩౭
అహో రూప మహో తేజః ప్రేమపాత్రీస్వ మే విభోః
అహో సౌందర్య మప్యేత దహో మంగళవిగ్రహమ్. ౩౮

స్వాగతం తే రామచంద్ర స్వాగతం తే దేవదేవ!
స్వాగతం లోకైకనాథ స్వాగతం మత్స్వామిన స్తే. ౪౦

రామచంద్ర మమ స్వామిం స్తవ సందర్శనా ద్ధ్రువమ్
ధన్యాఽభవ మహం ధన్యో హ్యభూ న్మేచాశ్రమ స్తథా. ౪౧

కృతార్థాహం కృతార్థాహం కృతార్థాహం న సంశయః,
రామ తే దివ్యపాదాబ్జ సందర్శనవశా ద్ధ్రువమ్. ౪౨

త్వద్దివ్యనామామృతసేవనేన తృప్తాస్మి నిత్యం నపరత్ర వాంఛా,
త్వన్నామమాధుర్యసమం తు లోకే నాస్త్యేవ మాధుర్య
మఘాపహారిన్, ౪౩

౩౫ ఆ శబరి రాముని జూచిన సంతోషమున నితరవస్తువులను తెలిసికొన లేకుండెను. తన కట్టుబట్ట తొలగినసంగతి కాని పై యుత్తరీయము తొలగినసంగతిగాని తెలిసికొనలేక బ్రహ్మానందసముద్రమున మునిగియుండెను.

౩౬-౩౭-౩౮ లక్ష్మణుడు నవ్వుకొనుచు నామెకు తెలివి కలుగజేయుచు నిట్లు పలికెను. అమ్మా! నీవు రాముని కాతిథ్య మిచ్చి పూర్ణమనో రథురాల వగుము, అని చెప్పగా నృత్యమును జాలించి భూమియందు సొమ్మసిలిపడి కొంత తడవునకు లక్ష్మణునిచే బోధితురాలై స్మృతి గలదై లేచి రామచంద్రమూర్తిని నీ క్రింది విధముగ స్తోత్రము చేయ మొదలిడెను.

౩౯ నా ప్రభువగు రామచంద్రుని రూప మేమిరూప మేమిరూపము! ఏమి తేజ మేమి తేజము? ఏమి సౌందర్యము? ఏమి దివ్యమంగళ విగ్రహము?

౪౦ ఓ రామచంద్రా! నీకు స్వాగతము. దేవదేవా! నీకు స్వాగతము, లోకైకనాథా! నీకు స్వాగతము, నా స్వామివగు నీకు స్వాగతము.

౪౧ ఓ రామచంద్రా! మత్స్వామిభూతా! నీ సందర్శనమువలన నిశ్చయముగ ధన్యురాల నగుటయేకాక నా యాశ్రమముకూడ ధన్యమయ్యెను.

౪౨ ఓ రామచంద్రా! నీ పాదారవింద సందర్శనమువలన నిశ్చయముగ నేను కృతార్థురాలను, కృతార్థురాలను, కృతార్థురాలను, ఇందుకు సందియము లేదు.

౪౩ ఓ రామచంద్రా! నీ దివ్య నామామృత పానముచే నేను తృప్తురాలయినందున నితరము నందు దేనియందున నిచ్ఛ లేదు, ఓ పాప నాశకా! నీ నామమునందున్న మాధుర్యముతో సమానమైన మాధుర్యము లోకములో దేనియందునను లేదుగదా.

రామ నావసి వాద్య మాం త్వం కారణం మే రామచంద్ర,
పాహి మాం త్వం భక్తకల్పక నో విలంబ మహం సహే,
ఇనకులాగ్రణీ దేవ దేవ త్వం ద్రుతం మాం పాలయ
తావ కారుణచరణ రేణు స్నానభవం భో రాఘవ. ౧౧

ఇతి స్తుత్వా రాఘవస్య పాదప్రక్షాళనం పునః
కృత్వా పీత్వాచ తత్తీర్థం తదర్థే నిహితం ఫలం
దంతైః పరీక్ష్య రామాయ ప్రదదౌ భక్తిసంయుతా. ౧౨॥

తతో రామః ఫలా న్యాశు బుభుజే ప్రశశంస చ,
తతోఽన్యత్ఫల మానాయ సమాఘ్రాయ చ సా పునః,
దదౌ రామాయ భుంక్ష్వేదం మధురం పుష్కరేక్షణ,
ఇత్యుక్త శ్శబరీ హస్తా ద్బుభుజే మధురం ఫలమ్. ౧౩-౧౮॥
అథ సర్వే సమాయాతా శ్శబర్యా శ్చాశ్రమం పునః,
మునయ శ్శబరీవేశ్మ ద్రష్టుం రామం సలక్ష్మణమ్,
మునయః కుశలం పృష్ట్వా దర్శనా దితి తేఽబ్రువన్,
యత్రాస్మిన్నధ్యా త్వరిత్యుక్తో మతంగోఽ స్మాభి రేవ తు
తస్యా ఏవాఽంగణే త్వాం తు స్థితం వయ ముపాస్మహే,
ఇత్యుక్తః ప్రాహ రామోఽపి వినయేన మునీ న్వచః ౧౯-౨౦॥

అహో ధన్యతమా యూయం తపోవ్రతపరాయణాః,
త్యక్త్వా విషయజం సౌఖ్యం వనే వసథ నిస్పృహాః. ౨౧॥

౪౪ ఓ రామా! నన్ను గాపాడవా! నాతండ్రివైన యోరామచంద్రా! నన్ను రక్షింపుము, రక్షింపుము. ఓ భక్తరక్షకా! నేనింక నాలస్యమును సహింపజాలను ఓ సూర్యవంశ రత్నమా! ఓ దేవ దేవా! నీవు తొందరగ రక్షింపవలయును. ఓ రాఘవా! నేను నీపాద రేణువైనను కాకపోతినికదా!

౪౫ ఇట్లు స్తుతించి యా శబరి రాముని పాదప్రక్షాళనము చక్కగ జేసి యా పాదోదకమును సేవించి రామునికై నిలువయుంచిన ఫలములలో నొక్కొక్క ఫలమును దంతములతోఁ గొరికి మధురముగ నున్నవో లేవో యని పరీక్షించి భక్తితో రాముని చేతిలో నుంచుచుండెను.

౪౬–౪౭ రామచంద్రమూర్తియు శబరిచే నర్పింపబడిన ఫలములను ప్రశంసించుచు భుజించుచుండెను ఇట్లే మఱియొక ఫలమును దీసి శబరి వాసన చూచుచు తిరిగి రాముని చేతిలో నీ మధురమైన ఫలమును భుజింపుమని పెట్టబోవుచుండ రామచంద్రమూర్తి శబరిచేతినుండియే యా మధురమైన ఫలమును దీసికొని భుజించుచుండెను.

౪౮–౪౯–౫౦ రామచంద్రమూర్తి శబరి యాశ్రమమునకు వచ్చెనని తెలిసి యచ్చటి మహర్షు లందరును రామచంద్రమూర్తిని జూచుటకు శబరీ పర్ణగృహమునకు వచ్చిరి. పిమ్మట రామచంద్రమూర్తి వారలను కుశలప్రశ్నలు చేయ, నీ దర్శనముచే మేము ధన్యులమైతి మని చెప్పుచుఁ దిరిగి యిట్లు పలికిరి. ఓ రామచంద్రా! ఏ శబరీసాన్నిధ్యము వలన మతంగమహర్షి మాచే పరిత్యజింప బడెనో, ఆ శబరి వాకిలిముందు మేము నిన్ను సేవింపవలసి వచ్చె నన, రామచంద్రమూర్తి యమ్మునులతో వినయముతో నిట్లుఁ బలికెను.

౫౧ ఓ మహర్షులారా! మీరలు తపస్సంపన్ను లగుటచేఁ గడు ధన్యాత్ములరు. మఱియు, మీరలు విషయవాంఛలను విడనాడి నిష్కాములై యివ్వనమునఁ దపముచేసికొను మీరలు కడు కృతార్థులు.

రామ మేకమునిః ప్రాహ జల మస్మి న్జలాశయే,
అకస్మాత్ క్రిమిసంకుష్టం శోణితాభ మభూ త్కుతః,
కథం సమ్యక్ ప్రజాయేత త ముపాయం వద ప్రభో. ౧౨-౧3

ప్రార్థితో మునినా ప్రాహ శబరీం ప్రార్థయంతు భోః,
తస్యా స్స్నానాఽభావా దీదృ గ్జల మభూ ద్ధ్రువమ్ ౧౪

ఇత్యుక్తై స్తైః ప్రార్థితా సా గత్వా స్పృష్ట్వా సమాగతా,
పూర్వతో మధురం జాతం నిర్మలం సరసీజలమ్. ౧౫

తతో లక్ష్మణ మాహేదం వచనం రాఘవః పునః
సౌమిత్రే పశ్య మాహాత్మ్యం శబర్యా భక్తి మ ప్యముమ్. ౧౬
ఇత్యుక్తో లక్ష్మణః ప్రాహ రాఘవం వినయాన్వితః
భక్తి రేతాదృశీ ప్రాప్త రావేనో వా మయా ధ్రువమ్,
న కుత్రాపి మయా దృష్టో హ్యస్యా భాగ్య మహో ధ్రువమ్. ౧౭
రామోఽథ శబరీ మాహ యద్గురో స్తు కృపారసాత్,
ఈదృశీ భక్తి రుత్పన్నా తస్య పూజాం కరోషి కిమ్. ౧౮-౧౯

తచ్ఛ్రుత్వా శబరీ ప్రాహ రాఘవం భక్తిసంయుతా,
తదనుగ్రహమాత్రేన రామచంద్ర భవా న్మనః,
ప్రత్యక్షవిషయోఽ స్యద్య నీచాయా అపి మే విభో. ౨౯-౬౦

౫౨-౫౩ ఇట్లు రామచంద్రమూర్తి మహర్షులను స్తోత్రము చేయుచుండగా
నొక మహర్షి రామచంద్రునితో నిట్లు పలికెను. ఓ రామచంద్రా!
ఇచ్చటి సరోవరము నందలి జలము కారణములేకయే యకస్మాత్తుగ
క్రిమి భూయిష్ఠమై రక్తతుల్యమై చెడిపోయినది. మాకు సరోవర
మొక్కటియే శరణ్యముగా నున్నది. అందలి జలము పరిశుభ్రమై
పానార్హమగు నుపాయము చెప్పవలయు నని ప్రార్థించెను.

౫౪ ఇట్లామున ప్రార్థింపగా రామచంద్రమూర్తి యిట్లు చెప్పెను.
మీరు శబరిని ప్రార్థించినచో నా జలము బాగుపడగలదు. ఆమెను
మీరు నీచముగా జూచుటవలన నిట్లయ్యెను.

౫౫ ఇట్లు చెప్పుటతోడనే శబరి మహాప్రభావముగలది యని గ్రహించి
యామెను మహర్షులు ప్రార్థింపగా నామె సరోవరమున కేగి
యందలి జలమును స్పృశింప నా జలము పూర్వముకంటె మధురమై
నిర్మల మయ్యెను.

౫౬ పిమ్మట లక్ష్మణునితో రామచంద్రమూర్తి యిట్లు పలికెను.
లక్ష్మణా! శబరియొక్క భక్తిని తన్మాహాత్మ్యమును జూచితివి కదా.

౫౭ ఇట్లు పలుకుటతోడనే లక్ష్మణుడు రామచంద్రమూర్తితో నిట్లు
పలికెను. అన్నా! ఇట్టి భక్తినిగాని యిట్టి యావేశమునుగాని నే
నింతదనుక నెచ్చటను జూచియుండ లేదనెను.

౫౮ అనంతరము రామచంద్రమూర్తి శబరితో నిట్లు పలికెను. ఓ శబరి!
నీవే గురుప్రసాదమువలన నిట్టి భక్తురాల వైతివో, అట్టి గురు
వర్యుని పూజించుచుంటివా?

౫౯-౬౦ ఆ వాక్యములను విని శబరి భక్తితో రామచంద్రునిగూర్చి యిట్లు
పలికెను. రామచంద్రా! ఆ గుర్వనుగ్రహము చేతనే నీచురాల
వయినను నాకు నీవు ప్రత్యక్ష మైతివి.

యాగవేది రియం తస్య మద్గురో రేవ రాఘవ,
సప్తేమే సాగరాశ్చాగు ర్మద్గురో ర్మజ్జనాయ చ,
సంకల్పమాత్రా ద్దేవేమే సమాగు స్సప్తసాగరాః,
తాదృ గ్గురుప్రసాదేన మమైషా భక్తి రాగతా. ౬౧-౬౨

మత్పుణ్యావశత స్తేఽద్య దర్శనం సమభూ దహో,
భవ దాగమనా త్స్వర్గతుల్యోఽభూ దాశ్రమో మమ. ౬౩
త్వయ్యేక మపచారం తు కృతవ త్యస్మి సాంప్రతమ్,
కష్టకాలే స్థిత స్యాద్య సత్కారకరణం తవ,
యుక్తం వాఽయుక్త మిత్యాదా వవిచారా త్కృతం మయా. ౬౪

కీదృ క్కష్టం మజ్జనన్యా స్సంబభూ వేతి భూమిజామ్,
స్మృత్వా సా మూర్ఛితా భూమౌ పతితా పున రుత్థితా. ౬౫

తత స్సా శబరీ ప్రాహ రామం రాజీవలోచనమ్,
త్వదాగమన కాంక్షంతీ త్వాహ మాసం ప్రభో భువి
సఫలం జన్మ దేహం తు త్యజేయ మితి తత్క్షణమ్
రామం హృది వినిక్షిప్య తత్యాజాఽశు కళేబరమ్
శ్రీరామ స్స్వయమేవాఽస్యా శ్చితిం కృత్వా దదాహ తామ్. ౬౬-౬౭-౬౮

తృణా న్నిర్ధూత మఖిల మవిద్యాకృతబంధనమ్,
రామప్రసాదా చ్ఛబరీ మోక్షం ప్రాపాఽతిదుర్లభమ్. ౬౯

౩౦-౩౧ శ్రీరామచంద్రా! ఈ యజ్ఞవేదిక మా గురువర్యుని దియై యుండెను. నా గురువర్యుఁడు స్నానముచేయుటకై సంకల్పమాత్రముచే సప్త సాగరముల నిచటకు రప్పించెను. అట్టి గురుప్రసాదముచే నిట్టి భక్తి నా కుదయించెను.

౩౨ ఓ రామచంద్రా! నా పుణ్యవశమున నీ దర్శనము నాకు సంభవించినది. నీ రాక వలన నా యాశ్రమము స్వర్గతుల్య మయ్యెను.

౩౩ రామచంద్రా! ఏ విషయమైన నే నేక యుపచారమును జేసితిని. కష్టకాలములో నున్న నీ కిపుడు నే నీ సత్కారము చేయుట యుక్తమా యయుక్తమా యను విచారణము లేకుండగ జేసితిని.

౩౪ రామచంద్రా! మా తల్లి యగు సీతమ్మ కెంత కష్టము వచ్చినది, యని సీతను స్మరించుచు మూర్ఛితురాలై భూమియందుఁబడి కొంత తడవునకుఁ దిరిగి లేచెను.

౩౫-౩౬-౩౭ పిమ్మట శబరి రామునితో నిట్లు లఁ బలికెను. ఓ రామచంద్రా! నీ రాకకై నిరీక్షించుచు నింతదనుక భూమియందు సజీవురాలనై యుంటిని. నా జన్మము సఫల మయ్యెను. ఇంక నేను భూమియందుండ వలసిన పని కన్పడదు. కాన శరీరమును విడిచి పెట్టెదను, అని చెప్పి వెంటనే రామచంద్రమూర్తిని హృదయ పుండరీకమున ధ్యానించుచు శరీరమును విడచెను. శ్రీరామచంద్రమూర్తి స్వయముగ నామెకు దహన సంస్కార మొనర్చెను.

౩౮ క్షణములో నవిద్యాబంధములను ఛేదించుకొని శబరి యోగులకుఁ గూడ దుర్లభమగు మోక్షమును బొందెను.

కిం దుర్లభం జగన్నాథే శ్రీరామే భక్తవత్సలే,
ప్రసన్నేఽధమజన్మాఽపి శబరీ ముక్తి మాప సా. ౨౦

దివ్యరూపధరా దేవీ రామం నత్వాఽవద ద్వచః
దేవ జానాసి సర్వజ్ఞ సర్వం త్వం విశ్వభావన,
తథా ప్యహం వచ్మి శృణు రాఘవ మద్వచః,
రావణేన హృతా సీతా లంకాయాం వర్తతేఽధునా,
ఇత స్సమీపే రామాఽఽస్తే పంపానామ సరోవరమ్,
ఋశ్యమూకగిరి ర్నామ తత్సమీపే మహానగః,
చతుర్భి ర్మంత్రిభి స్సార్థం సుగ్రీవో వానరాధిపః,
తేన సఖ్యం కురు క్షిప్రం సర్వం సంపాద్యతే తతః.
౨౧-౨౨-౨౩-౨౪

ఇత్యుక్తో రాఘవః ప్రాహ శబరీం దివ్యరూపిణీమ్,
స్నానపానోపయుక్తం తే సర స్త్వేత దితఃపరమ్,
ప్రవాహరూపం సంప్రాప్య త్వన్నామ్నా ప్రథితం భవేత్,
తస్మా చ్చిరంజీవినీ త్వం భవితాఽసి న సంశయః,
కించ గోదానదీ యుక్తా త్వన్నామ్నా ప్రథితా చ సా,
నదీరూపా చ భవతీ గోదాయా అపి పావనీ,
భవితా నాత్ర సందేహ ఇతి తస్యై వరం దదౌ. ౨౫-౨౬

మమాఽనుజ్ఞాం దేహి రామ గచ్ఛామి మితి సా తతః
ఉక్త్వా,నత్వా, స్తుతిం కృత్వా, విమానేన యయౌ దివమ్. ౨౭

౨౦ భక్త వత్సలుడగు శ్రీరామచంద్రమూర్తి ప్రసన్నుడైనపుడు దుర్లభ మేమి యుండును? కాన శబరి నీచజాతి స్త్రీయైనను ముక్తిని బొంద గలిగెను,

౨౧-౨౨-౨౩-౨౪ పిమ్మట శబరి దివ్యరూపమును ధరించి రామునకు నమస్కరించి యిట్లు పలికెను. దేవా! నీవు సర్వజ్ఞుడవై యుంటివి. నీకుఁ దెలియని విషయము లేదు. అయినను నేను చెప్పునది వినుము. సీతను రావణుఁ డపహరించెను. ఇప్పుడు లంకలో నుండెను ఇచ్చటికి సమీపమున పంపాసరోవరము గలదు దానికి సమీపముననే ఋశ్యమూక మను గొప్ప మహిమగల పర్వతమొకటి గలదు. ఆపర్వతమునందు సూర్యపుత్రుఁడైన సుగ్రీవుఁ డను వానరోత్తముఁడు నలుగురు మంత్రులతో గూడి యుండెను. నీ వచటకేగి యా సుగ్రీవునితో స్నేహము చేయుము.

౨౫-౨౬-౩౨ ఇట్లు చెప్పటలోడనే శ్రీరామచంద్రమూర్తి దివ్యరూపిణి యగు శబరినిగూర్చి యిట్లు పలికెను. ఓ శబరి! నీవు స్నానముచేయు యీ సరోవరము ప్రవాహరూపమై యొప్పుచు నీ పేరుతోఁ బ్రసిద్ధి నొందును. కావున నీవు చిరంజీవినివే కాగలవు. ఇదియును గాక ప్రవాహరూపముగా నొప్పుచున్న నదీరూప మగు నీవు గోదావరితో గలసి యమ్మహానదినిగూడ బవిత్రము సేయుదువు, అని యామెకు వరము నిచ్చెను.

౩౫ ఇట్లు చెప్పినపిమ్మట శబరి రామచంద్రమూర్తికి నమస్కరించి యిట్లు పలికెను. రామచంద్రా! నా కనుజ్ఞ నిమ్ము. నేను పోవుదును, అని చెప్పి తిరిగి నమస్కరించి స్తుతించి విమానారూఢురాలై వైకుంఠమున కేగెను,

నాఽసాధ్యం విద్యతే భక్తే స్త్రిషు లోకేషు కించన,
న స్త్రీపుమా న్వా జాతి ర్వా కారణం భక్తి రేవ తు
ఇతి స్తుత్వా మునిగణా నత్వా రామం యయు స్తతః.
౨౫౪-౫౦

తతో రామోఽపి నిర్గత్య లక్ష్మణేన పథి సంస్థితాః,
పశ్య న్ననేకా స్త్వలపిః క్రిమా త్పంపాసరో గతః ౫౧

అరణ్యకాండే షోడశస్సర్గ స్సమాప్తః.
యదక్షర పదభ్రష్టం మాత్రాహీనం చ యద్భవేత్,
తత్సర్వం క్షమ్యతాం దేవ రామచంద్ర నమోస్తుతే.

—• గద్య •—

ఇతి శ్రీరామచంద్రచరణకమలసేవాతత్పరేణ రామాయణ
కేసరీత్యాది బిరుదాంకితేన విశ్వామిత్రగోత్రజేన లక్కా
వఝులవంశముక్తాఫలేన సుబ్బమాంబాజానేస్సుబ్రహ్మణ్య
సిద్ధాంతిన స్తనూజేన వేంకటకృష్ణశాస్త్రిణా విరచితే
ఆశ్చర్యరామాయణే అరణ్యకాండ స్సమాప్తః.
శ్రీభద్రాచల శ్రీరామార్పణ మస్తు.
మంగళమ్.

సాదరం శబరీద త్తఫలమూలాశినే తథా
సౌలభ్యపరిపూర్ణాయ రామచంద్రాయ మంగళమ్.

౨౯-౩౦ ఇట్లు శబరి వైకుంఠమున కేగగా, అచ్చటి మహర్షులు తాము నిట్లు సంభాషించుకొనిరి. ముల్లోకములయందును భక్తికి సాధ్యము కానిది యుండదు. భగవదనుగ్రహమును బొందుటకు స్త్రీ పురుష భేదము కాని, వర్ణాశ్రమ భేదము కాని యవసరముండదు. భక్తియే కారణము, అని శబరిని స్తోత్రము చేయుచు రామానుజ్ఞను బొంది తమతమ నెలవుల కేగిరి.

౩౧ పిమ్మట రామచంద్రమూర్తి లక్ష్మణసమేతుడై యనేక కాననములను జూచుచు క్రమముగా బంపాసరోవరమును సమీపించెను.

అరణ్యకాండమున
పదునారవ సర్గము సమాప్తము

ఓ రామచంద్రా ! వర్ణలోపము పదలోపము మాత్రాలోపము మొద
లగు నా దోషములు ఇందేమియున్నను నీవు క్షమింపుము
నీకు నమస్కారము.

గద్య

ఇట్లు శ్రీరామచంద్ర చరణకమల సేవాతత్పరుండును రామాయణ కేసరీ
త్యాది బిరుదాంకితుడును విశ్వామిత్ర గోత్రజుడును, లక్కావఝుల
వంశజుడును సుబ్బమాంబాసుబ్రహ్మణ్యసిద్ధాంత్యాత్మజుండు
నగు వేంకట కృష్ణశాస్త్రిచే విరచిత మయిన
యాశ్చర్యరామాయణమున, నరణ్యకాండము
సమాప్తము.

ఇయ్యది శ్రీరామార్పణ మగుగాక.
మంగళము.
ఆదరసహితముగ శబరిచే నొసంగబడిన ఫలములను భక్షించిన
సౌలభ్య పరిపూర్ణుడగు రామచంద్రునకు
మంగళ మగుగాక.

## ఫలశ్రుతిః

### తత్త్వసంగ్రహరామాయణే

యో విరాధవధం నిత్యం శృణోతి శ్రావయేత వా,
తస్య సర్వాణి పాపాని లయం యాంతి న సంశయః,
శరభంగాశ్రమగతిం రాఘవస్య మహాత్మనః,
శృణ్వాం స్త్రిదశలోకం వై ప్రాప్నోత్యేవ న సంశయః,
సీతాపహార మారభ్య లంకాయాం స్థాపనాఽవధి,
శ్రవణా చ్ఛాస్త్రవిహితం జ్యేష్ఠా దేవీ విముంచతి,
సీతాన్వేషణ మాకర్ణ్య నైవ లక్ష్మ్యా వియుజ్యతే,
జటాయో స్సంస్కృతిం శ్రుత్వా స్వర్లోకం యాతి మానవః,
శబర్యా స్స్వర్గతిం శ్రుత్వా సతీనాం లోకగో భవేత్,
అరణ్యకాండ మాహాత్మ్యం యే శృణ్వంతి మహీతలే,
శ్రీరాఘవప్రసాదేన విష్ణులోకం వ్రజంతి తే.

---

# ఫలశ్రుతి

తత్త్వసంగ్రహ రామాయణమున నిట్లు చెప్పబడినది.

"విరాధ వధను నిత్య మెవ్వఁడు శ్రవణముచేయునో, లేక వినిపించునో, వానిపాపము లన్నియు నశించుటకు సందియము లేదు. మఱియు రామచంద్రమూర్తి శరభంగాశ్రమమున కేగిన కథ నెవ్వఁడు వినునో, అతఁడు దేవలోకమును బొందు నటకు సంశయములేదు. సీతాపహరణము మొదలు, సీతను లంకలోఁ బ్రవేశ పెట్టినంత పర్యంతముగల కథను శ్రవణము చేసినవానికి దౌర్భాగ్య ముండదు. సీతాన్వేషణ కథను వినినవానిని ధనలక్ష్మి యెడబాయదు. జటాయుసంస్కారకథను వినిన మనుజుఁడు స్వర్గము నొందును. శబరి స్వర్గమున కేగిన కథను వినినవానికి సతీలోకము గలుగును. అరణ్యకాండ మాహాత్మ్య మెవరు వినియెదరో వారలు రామానుగ్రహముచే విష్ణులోకమున కేగెదరు.

---

# తప్పొప్పుల పట్టిక



| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 4 | 14 | న్వస్య | న్వన్య |
| 6 | 11 | రుద్గోషితం | రుద్ఘోషితం |
| 7 | 8 | చెజ్ప | చెప్ప |
| 8 | 3 | సంవీక్ష్యమాణాశ్చతా | సంవీక్ష్యమాణాశ్చతాః |
| 14 | 20 | మోక్షాపేక్షాయా | మోక్షాపేక్షయా |
| 15 | 20 | వినాశద్రోష | వినాశముద్రోష |
| 20 | 11 | తచ్ఛ్రుత్వా హాసతీం | తచ్ఛ్రుత్వా హా సతీం |
| 26 | 8 | మిహాతువా | మిహాతువాం |
| 28 | 6 | పలితేతివా | ఫలితేతివా |
| 32 | 14 | రాజ్యమేవ | రాజ్యమేవా |
| 33 | 5 | వెడలచిపనినచో | వెడలపనిచినచో |
| 37 | 8 | రాక్షశుని | రాక్షసుని |
| 38 | 3 | నిఘనాద్దంతుం | నిఖనాద్ధంతుం |
|  | 15 | స్వంస్తతో | స్వంస్తతః |
| 40 | 18 | నందయాతు | నందయుత్ |
| 55 | 18 | కానమధ్యమాధ్య | కానన తటినికి మధ్యమధ |
| 68 | 5 | వదతద్దురితమ్ | వదత దురితమ్ |
|  | 11 | త్యక్త్వా | త్యక్త్వా |

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 70 | 10 | గ్లోషిం | గ్లోక్షిం |
| 91 | 10 | లైను తరువాత నిది చదువవలయును. అది మొదలుకొని యగస్త్యుఁ డచ్చటనుండి తిరిగి రాకపోయెను. గురుశాప భయముచేతను వింధ్య పర్వతము నొఁగియే యుండెను. (అగ) పర్వతమును (స్త్య) నిరోధించినవాఁడు గాన, అగస్త్యుఁ డనిబిరుదు నామము కలిగెను. | |
| 116 | 8 | సురపదాన్యా | సురపదంసం |
| 120 | 14 | రామస్త్వద | రామస్త్రైద |
| 123 | 3 | ంబుల స్త్య బ్రహ్మసుతుడు పొ | బ్రహ్మసుతుడుపు |
| 136 | 11 | కనిష | కనిష్ఠ |
| 141 | 2 | సతా | సీతా |
| 146 | 22 | నత్యం | సత్యం |
| 164 | 7 | త్వేకఃసర్వే | త్వేకస్సర్వే |
| 174 | 6 | మద్భక్త్ | మద్భక్తే |
| 180 | 2 | దిక్చ్యయం | దిక్చ్యయః |
| 186 | 3 | ఇత్యుక్త్వా | ఇత్యుక్తా |
| 188 | 6 | సాపతిత్రిపం | సాతితత్రిపం |
| 207 | 22 | భక్తుడగుటచే | భక్తుడనగుటచే |
| 210 | 8 | లైను తరువాతగీటు - 12 లైనుతరువాత నుండవలయును. | |
| 211 | 1 | లైను మొదట పుష్పాగుర్తు వుండవలయును. | |

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 211 | 24 | సత | సీత |
| 215 | 7 | లచే: | లచేవ్యాప్తమై యాటవికులచే |
| 218 | 15 | సంచిత్య | సంచింత్య |
| 238 | 1 | శ్చరై | శరై |
| 248 | 7 | సంస్తుంత్యేవ | సంస్తుత్యేవ |
| 250 | 14 | నిరత్యా | నిర్గత్యా |
| 258 | 6 | సంచిత్యా | సంచింత్యా |
| 259 | 11 | యుద | యాద్ధ |
| 260 | 15 | కర్తు | కర్తుం |
| 266 | 2 | భార్యత స్త్రీ | భార్యత స్త్రీసి |
| 267 | 13 | సత | సీత |
| | 24 | ములోకముల | ముల్లోకముల |
| 279 | 16 | ఎట్ల | ఎట్లో |
| 282 | 11 | పశ్చాత్తదంగీ | పశ్చాదంగీ |
| | 15 | ంతద్దైవా | తద్దైవా |
| 284 | 12 | తంవచః | పారిహతమ్ |
| 292 | 14 | శ్రీరామే | శ్రీరామో |
| | 14 | యతతి | యతతే |
| 294 | 17 | సీతాకిం | సీతాతి |
| 293 | 3 | కైకయసుతస్త్వా | కైకయసుతాత్వా |
| 299 | 5 | భరతుడే | కైకయే |

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 300 | 12 | శృణుయామ్యాహం | శృణు యా మ్యాహం |
| | 14 | ధసః | ధసః |
| 302 | 10 | ద్వష్ట | దృష్ట |
| 303 | 14 | సీతాసాదర్య | సీతాసౌందర్య |
| 304 | 6 | బిభ్యతేవ | బిభ్యత్యేవ |
| 308 | 8 | మపహార స్త్వం | మపహారం స్త్వం |
| 309 | 28 | వ్యవధానము | వ్యవధానమనుగా |
| 310 | 4 | మిచ్చతి | మిచ్ఛతి |
| 312 | 5 | ద్ధత్వా | ద్ధృతా |
| 313 | 21 | సిత | సీత |
| 315 | 2 | సితంతో | సీతతో |
| | 11 | నిష్ప్రుఢైనను | నిప్పుడైనను |
| 316 | 4 | శారింతో | శ్యాంతో |
| 325 | 3 | సిత | సీత |
| 326 | 5 | స్నాతాంశ్చాపి | స్నాతాశ్చాపి |
| 328 | 3 | మరణేఽపిత్వ | మరణే పితృ |
| 329 | 21 | సితను | సీతను |
| | 27 | సిత | సీత |
| 332 | 6 | త్యజామద్య | త్యజామ్యద్య |
| 343 | 3 | త్త్వమును | త్వమును |
| 344 | 9 | విశ్లేషః | విశ్వేశః |

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 374 | 5 | తథాప్యహంవచ్మి | తథాప్యహమిదంవచ్మి |
| 376 | 5 | లక్ష్మణేపథిసంస్థితా। | లక్ష్మణేనపథిస్థితా। |
| 372 | 13 | త్వదాగమన | త్వదాగతింతు |

అచ్చుటచ్చుట ద్విత్వలోపము ఛకారమునకు ముద్రణ ప్రమాదముగాఁ దెలియదగు.

